శ్రీమద్ గిరిరాజ సూర్యసింహాసనాధీశ్వర శ్రీశ్రీశ్రీ 1008
శ్రీశైల జగద్గురు ఉమాపతి పండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు





॥శ్రీ మజ్జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు॥

**శుభాశీర్వచనము**

వీరశైవ సిద్ధాంత తత్వములు వేద,ఆగమ,ఉపనిషత్తు,పురాణ ఇతిహాసాది గ్రంథములందు ప్రసంగానుసారముగా అక్కడక్కడ ప్రస్తావించడం కనిపిస్తుంది. శ్రీ శివయోగి శివాచార్యులు పై గ్రంథముల యందు చెప్పబడిన వీరశైవ తత్వములను కూలంకుషముగా అభ్యసించి ఈ సిద్ధాంతమును సరళ భాషలో వ్యవస్థీకరించు ఉద్దేశ్యముతో "శ్రీ సిద్ధాంత శిఖామణి" ని గ్రంథ రచనకు శ్రీ శివయోగి శివాచార్యులు ఉపక్రమించిరి.

అలోక్యశైవ తంత్రాణి కామికాద్యాని సాదరమ్।
వాతులాంతాని శైవాని పురాణాన్యఖిలానితు॥
వేదమార్గ విరోధేన విశిష్టాచార సిద్ధయే।
అసన్మార్గ నిరాసాయ ప్రమోదాయ వివేకినామ్॥
సర్వస్వం వీరశైవానాం సకలార్థ ప్రకాశకం।
అస్పృష్టమఖిలైర్దో వైరాదృతం శుద్ధమానసైః॥
వీరశైవ మహాతంత్రమేకోత్తర శతస్థలం।
అనుగ్రహాయ లోకానామభ్యదాత్ సుధియాంవరః।

సి.శి. 1,25,27, మరియు 30.

పై శ్లోకములు ద్వారా తెలియునది ఏమనగ గ్రంథకర్త శ్రీ శివయోగి శివాచార్యులు కామికాది వాతులాంతాదికములగు 28 శివాగమములను శివ సంబంధములు అయిన సమస్త పురాణములను మరియు వేద భాగమును ప్రేమ పూర్వకముగా అభ్యసించి వైదిక మార్గమునకు విరుద్ధముగా నడవక వీరశైవుల విశిష్ట ఆచారములను ప్రతిపాదించుచూ "శ్రీ సిద్ధాంత శిఖామణి" గ్రంథమును రచించిరి. ఇది వీరశైవులకు సంబంధించిన సమస్త విషయములను ప్రతిపాదించు ఏకైక గ్రంథరాజము అందుకే ఈ గ్రంథములనకు వీరశైవ సర్వస్వము అనియు పేరు గలదు. ఈ గ్రంథము నందు ఏ విధమైన దోషమును లేదు. వీరశైవ సిద్ధాంతము ఈ గ్రంథము నందు నూట ఒక్క విధములుగా (స్థలములుగా) విభజింపబడినది. శ్రీ శివయోగి శివాచార్యులు లోక కళ్యాణమునకై ఈ గ్రంథ రచన చేసియున్నారు.

"శ్రీ సిద్ధాంత శిఖామణి" యందు ప్రతిపాదింప బడిన ఏకోత్తరశత స్థలాత్మక వాదము అయిన ఈ సిద్ధాంతమును మొట్టమొదట శివుడు పార్వతీదేవికి మరియు తన శివగణములకు ఉపదేశించెను. శివుని ద్వారా ఉపదేశమును పొందిన శివాంశ సంభూతులైన రేణుక, దారుక, ఘంటాకర్ణ, ధేనుకర్ణ, విశ్వకర్ణ అను నామధేయములతో భూలోకము నందు క్రమముగా అగస్త్య, దధీచి. వ్యాస, సానంద, దూర్వాస అను పేర్లతో ఉద్భవించి శివాద్వైత సిద్ధాంతమును ఉపదేశించినారు. ఈ శివ గణములలో ఒకరైన జగద్గురు రేణుకాచార్యులు అగస్త్య మహర్షికి ఉపదేశించిన శివాద్వైత సిద్ధాంతమును శ్రీ శివయోగి శివాచార్యుల వారు ఈ "సిద్ధంత శిఖామణి" యందు "రేణుకాగస్త్య" "సంవాదము" పేరుతో రచించినట్లు స్పష్టమగుచున్నది.

## గ్రంథనామ రహస్యము

వీరశైవ సిద్ధాంతమును ప్రతిపాదించుచున్న "సంస్కృతవాఙ్మయము" నందు "శ్రీసిద్ధాంత శిఖామణి" అత్యంత ప్రాచీనమనుటలో సందేహము లేదు. వీరశైవ సిద్ధాంత షట్స్థల సిద్ధాంతము నూటొక్క అవాంతర స్థలముల రూపములందు మొట్టమొదట విశ్లేషించినది శ్రీ శివయోగి శివాచార్యులవారు వీరు నలుబది నాలుగు అంగస్థలములనియు, ఏబదిఏడు లింగస్థలములనియు, సూక్ష్మభాగములుగా విభజించినారు. ఇవి మొట్టమొదటగా శివాగమములు. శైవపురాణము లందు నిరూపింపబడినట్లు వ్యక్తమగుచున్నది.

శ్రీ శివయోగి శివాచార్యులు శ్రీ రేణుకాగస్త్య సంవాదాత్మకమైన ఈ గ్రంథమునకు "శ్రీ సిద్ధాంత శిఖామణి" అని నామకరణము చేసినారు. కామికాది వాతులాంతాది ఇరవైఎనిమిది (28) శివాగమములను సిద్ధాంత ఆగమములు అను పేరుతో రచించుట జరిగినది. ఈ సిద్ధాంత అగమములు ఉత్తర భాగము యందు వీరశైవసిద్ధాంతము నిరూపించబడినది. అట్లే ఈ సిద్ధాంతాగమముల చివరిలో చెప్పబడిన సిద్ధాంతములే ఈ గ్రంథములో సవిస్తారముగా నిరూపింపబడిన కారణముగా ఈ గ్రంథమునకు "సిద్ధాంత శిఖామణి" అను పేరు పెట్టుట (నిర్ణయించుట) జరిగినది.

## శ్రీ శివయోగి శివాచర్యులు.

సర్వేషాం శైవతంత్రాణాముత్తరత్వాన్నిరుత్తరమ్।

నామ్నాప్రతీయతీ లోకేయత్సిద్ధాంత శిఖామణిః

{సి.శి. 1-30. (అని సమర్థించినారు)}

**హిమాలయ శిఖర శ్రేణులందు గౌరీశంకర శిఖరము అత్యుత్తమమైనది. దాని కంటెను ఉన్నతమైన శిఖరము లేనట్లుగానే ఈ గ్రంథమునకు "శిఖర శిఖామణి" అను**

పేరు నిర్ణయించినట్లు ఈ గ్రంథమున నిరూపించబడినది. శివాద్వైత సిద్ధాంతము కన్న మరొక సిద్ధాంతము లేనందున దీనికి "సిద్ధాంత శిఖామణి" అను నామధేయము సార్థకమైనది. వేదాగమములందు ప్రతిపాదింపబడిన వీరశైవ సరణినే ఈ గ్రంథము నందు అనుసరింపబడినది. ఏకోత్తరశత స్థలాత్మకమైన వీరశైవ షట్‌స్థల మార్గముప్రకాశింపజేయు, శ్రేష్ఠమైన తలమానికమువలె ఈ గ్రంథము విరాజమానముగా ప్రకాశించుచున్నది. సూర్యోదయముతో కమలము వికసించునట్లుగా ఈ గ్రంథము జీవాత్మ-పరమాత్మల సంబంధమును తెలియజేయుటలో చింతామణి వలె ఈ సిద్ధాంత శిఖామణి దివ్యమణివలె విరాజిల్లుచున్నది. ఈ గ్రంథమును ఎవరు వ్రాయుదురో, వ్రాయింతురో, వినిపించెదరో, వినుదురో వార ఐహిక సుఖభోగములను పొంది తుదకు ముక్తిని పొందెదరు.

## గ్రంథకర్త కాలనిర్ణయము

ఈ గ్రంథము యొక్క ప్రథమ పరిచ్ఛేదము నందు కవి వంశ వృక్ష వర్ణనము చేయబడినది. 13వ శ్లోకము నుండి 24వ శ్లోకము వరకు గల పన్నెండు శ్లోములలో తన వంశము మరియు వ్యక్తిత్వముల గురించి ప్రస్తావించుట (చెప్పుకొనుట) జరిగినది. గ్రంథకర్త అయిన శివయోగి శివాచార్యులు తమ వంశపు మూలము శివయోగి అను అతనికి మునిమనుమడిగా, ముద్దుదేవయ్యకు మనుమడిగా సిద్ధనాథునకు కుమారునిగా ఉన్నట్లు తెలియుచున్నది:

శ్రీ.ఎన్.ఆర్. కరిబసవశాస్త్రిగారు ఈ "సిద్ధాంత శిఖామణి" గ్రంథమునకు కన్నడ భాషలో "తాత్పర్య దీపిక" అను పేరుతో వ్యాఖ్యానము రచించియున్నారు. మరియు "దాసగుప్త"లవారి విచారమునందు "శ్రీ సిద్ధాంత శిఖామణి" శ్రీ జగద్గురు శ్రీపతి పండితారాధ్యుల కన్నను పూర్వమైనదని చెప్పుటయే యోగ్యముగా ఉండును.

శ్రీ జగద్గురు శ్రీపతి పండితారాధ్యులు తమ శ్రీకర భాష్యము నందు "సిద్ధాంత శిఖామణి"ని ప్రమాణ పూర్వరముగా నుడివియున్నారు. దీనివల్ల "సిద్ధాంత శిఖామణి" శ్రీ జగద్గురు శ్రీపతి పండితారాధ్యుల కన్నను పూర్వమని తెలియుచున్నది. సుప్రసిద్ధ విద్వాంసులు, భారతీయ తత్వశాస్త్ర ఇతిహాసవేత్తలు.కాశీవాసులు అయిన శ్రీ పండిత బలదేవ ఉపాధ్యాయులు "భారతీయ దర్శనము" అను గ్రంథములో 469వ పుటలో శ్రీశైల జగద్గురు శ్రీపతి పండితారాధ్యుల కాలమును క్రీ॥శ॥1060 గా నిర్ధారించినారు. టి.ఎస్.నారాయణశాస్త్రి గారు. ప్రాచీన శిలాశాసన ఆధారముగా శ్రీశైల జగద్గురు శ్రీపతి పండిటారాధ్యుల కాలమును క్రీ॥శ॥1072గా నిర్ణయించినారు. ఈ రీతిగా పండితుల, విద్వాంసుల అభిప్రాయము మేరకు శ్రీకర భాష్యపు కాలము పదకొండవ శతాబ్దముగా

నిర్ణయమైనది.

శ్రీశైల జగద్గురు సూర్యసింహాసనాధీశ్వరులు శ్రీ 1008 లింగైక్య. వాగీశ పండితారాధ్య శివాచార్యమహాస్వాముల వారు "శ్రీ సిద్ధాంత శిఖామణి" "సత్యార్థ ప్రకాశము" అను పేరుతో చిన్న గ్రంథమును ప్రకటించినారు. అందు శ్రీ రేణుక సంప్రదాయమునకు చెందిన శ్రీ శివయోగి శివాచార్యులుతాను బౌద్ధ మతమునకు వ్యతిరేకినని చెప్పుకున్నాడు. ఆది శంకరాచార్యులు మరియు శ్రీ సొన్నలగి శ్రీ సిద్ధరామేశ్వర కాలమునందు శ్రీ రేవణ సిద్ధేశ్వరుల చరిత్రమును "శ్రీ సిద్ధాంత శిఖామణి"లో వర్ణించినందున శ్రీ శివయోగి శివాచార్యుల కాలమును ఇప్పటికి 2000 సం॥ల కన్నను పూర్వమున్నట్లుగా నిర్ణయించవచ్చు. ("శ్రీ సిద్ధాంత శిఖామణి"-సత్యార్థ-ప్రకాశం" పేజి.నం.2)నని తమ అభిప్రాయమును తెలిపినారు.

గురువంశ కావ్యము, శివతత్వరత్నాకరము, మొదలగు గ్రంథములందు శ్రీ రేవణ సిద్ధేశ్వరులను ఆది శంకరాచార్యులకు శ్రీ చంద్రమౌళీశ్వర లింగమును, రత్నగర్భ గణపతులను వొసగిన వివరములు చెప్పబడినవి. శ్రీ శివయోగి శివాచార్యులతో సహా సిద్ధాంత శిఖామణి చివరి భాగము నందు త్రికోటి శివలింగ స్థాపన లీలలను వర్ణించుటతో పాటు ఆది శంకరాచార్యులకు శ్రీ చంద్రమౌళీశ్వర లింగమును వొసగిన విషయములు ప్రస్తావించబడినవి. అయితే పై విషయమును ఇక్కడ ప్రస్తావించినందున శ్రీ శివయోగి శివాచార్యులు ఆది శంకరాచార్యుల కన్నను పూర్వులని తెలియవచ్చుచున్నది. శ్రీ శంకరాచార్యులు ఏడవ శతాబ్దమునకు చెందినవారని చరిత్రకారులు నిర్ణయించినారు. ఈ దృష్టితో "శ్రీ సిద్ధాంత శిఖామణి" కర్తలైన శ్రీ శివయోగి శివాచార్యులు ఏడవ శతాబ్దముకన్న ముందున్నవారిగా భావించుట జరిగినది.

పండిత శ్రీ కాశీనాథ శాస్త్రిగారు రచించిన శ్రీ సిద్ధాంత శిఖామణి నేటికి ప్రసిద్ధముగా విరాజిల్లుచున్నది. ఈ గ్రంథానువాదము శ్రీ సన్నిధి వారి ఆదేశము మేరకు తెలుగు భాషలో సరళముగా డా॥పండిత పెద్దమఠం. రాచవీరదేవరతీర్థ, యం.ఓ.ఎల్.హైద్రాబాదు. వీరు అనువదించినారు. ఆంధ్రులందరు ఈ గ్రంథమును పఠించి ఆచరింతురని ఆశీర్వచనము పలికినారు.

ఈ గ్రంథమును సర్వాంగ సుందరముగా సమయోచితముగా, సకాలములో ముద్రించి ఇచ్చిన శ్రీగరుడా ప్రింటర్స్ మరియు ప్యాకేజర్స్నల్లకుంట, హైదరాబాదు. వీరందరికీ శ్రీ భ్రమరాంబాసమేత మల్లికార్జున స్వామి వారి మరియు జగదాదిజగద్గురు. పండితారాధ్యులు శుభములనొసగుగాక!

ఇత్యాశిషః

# శ్రీ సిద్ధాంత శిఖామణి

## శ్రీ శివయోగి శివాచార్య

కన్నడం: పండిత శ్రీ కాశీనాథ శాస్త్రి భావ ప్రకాశ వ్యాఖ్య

**తెలుగుసేత: డా॥ పండిత శ్రీ పెద్దమఠం రాచవీర దేవర (హిరేమఠ)**
**"తీర్థ" M.O.L.**



ప్రకాశకులు :
**శ్రీశైల జగద్గురు రజత మహోత్సవ పట్టాధికార సమితి**
**శ్రీశైలం, కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్.**

శ్రీ సిద్ధాంత శిఖామణి

| | | |
|---|---|---|
| సంస్కృత మూలం | : | శ్రీ శివయోగి శివాచార్యులు |
| కన్నడం | : | పండిత శ్రీ కాశీనాథ శాస్త్రి |
| తెలుగు సేత | : | డా॥ పండిత పెద్దమఠం రాచవీరదేవర |
| మొదటి ప్రచురణ | : | మే, 2000 |
| ప్రతులు | : | వేయి |
| ప్రాప్తిస్థానం | : | పరమ పూజ్య శ్రీశ్రీశ్రీ జగద్గురువు (1008), సూర్య సింహాసనాధీశులు ఉమాపండితారాధ్య మహాస్వాములవారు, శ్రీశైల పండితారాధ్య పీఠం, దేవస్థానం, శ్రీశైలం, కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్ |
| ప్రకాశకులు | : | శ్రీశైల జగద్గురు రజత మహోత్సవ పట్టాధికార సమితి శ్రీశైలం, కర్నూలు జిల్లా ఆంధ్రప్రదేశ్ |
| ముద్రణ | : | గరుడా ప్రింటర్స్ & ప్యాకేజర్స్ నల్లకుంట, హైదరాబాద్ - 44 |
| గ్రాఫిక్స్ | : | శ్రీ సాహితీ గ్రాఫిక్స్, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ ఫోన్: 040 – 7650686 |
| మూల్యం | : | రూ. 100/- (ఒక వంద రూపాయలు) |

# విషయసూచిక


★ నా అభిప్రాయము: డా॥ పండిత శ్రీ పెద్దమఠం రాచవీరదేవర vi

★ గ్రంథ ప్రశస్తి: శ్రీ ఎం. శంకరయ్య స్వామి viii

★ వీర శైవతత్త్వం సిద్ధాంత శిఖామణి: డా॥ కసిరెడ్డి xii

1. ప్రథమ పరిచ్ఛేదము (32 శ్లోకములు) 1
శివస్తుతి, శక్తిస్తుతి, గ్రంథకర్తృవంశ వర్ణనం, శ్రీ శివయోగీ శివాచార్య వర్ణనం.

2. ద్వితీయ పరిచ్ఛేదము (27 శ్లోకములు) 16
జగత్ సృష్టి విచారము,

3. తృతీయ పరిచ్ఛేదము (72 శ్లోకములు) 21
కైలాస పర్వత వర్ణనము, శివవర్ణనము, శక్తివర్ణనము, దేవతా తతికృత శివ సేవా వర్ణనము, శ్రీ పరమేశ్వరుని రాజ వ్యాపార వర్ణనము, శ్రీరేణుక గణేశ్వర ప్రతి శివాదేశము,

4. చతుర్థ పరిచ్ఛేదము (53 శ్లోకములు) 34
శ్రీరేణుక గణేశ్వరుల లింగావతార వర్ణనము, మలయాద్రి వర్ణనము, అగస్త్యాశ్రమ వర్ణనము, అగస్త్య మహర్షి వర్ణనము, అగస్త్యాశ్రమమునకు వచ్చిన శ్రీ రేణుక గణేశ్వరుల పాదపూజ - అగస్త్య కుశలప్రశ్న, అగస్త్య మహర్షి ప్రార్థన.

5. పంచమ పరిచ్ఛేదము (72 శ్లోకములు) 44
అగస్త్య మహర్షికి తత్త్వోపదేశము, భక్తస్థలము, పిండస్థలము, పిండజ్ఞాన స్థలము, సంసార హేయస్థలము.

6. షష్ఠ పరిచ్ఛేదము (62 శ్లోకములు) 63
గురుకారుణ్య స్థలము, లింగధారణ స్థలము

7. సప్తమపరిచ్ఛేదము (66 శ్లోకములు) 79
భస్మధారణస్థలము, రుద్రాక్షధారణ స్థలము

8. అష్టమ పరిచ్ఛేదము (49 శ్లోకములు) 91
పంచాక్షర జపస్థలము

9. నవమ పరిచ్ఛేదము (94 శ్లోకములు) 100
భక్తమార్గ క్రియాస్థలము, ఉభయ స్థలము, త్రివిధ సంపత్తి స్థలము, ప్రసాద స్వీకార స్థలము, సోపాధిదాన స్థలము, నిరుపాధిదాన స్థలము, సహజదాన స్థలము

10. దశమ పరిచ్ఛేదము (73 శ్లోకములు) 118
మాహేశ్వర ప్రశంసా స్థలము, లింగ నిష్ఠాస్థలము, పూర్వాశ్రయ నిరసన స్థలము, సర్వాద్వైత నిరసన స్థలము, ఆహ్వాన నిరసన స్థలము, అష్టమూర్తి నిరసన స్థలము, సర్వగత్వ నిరసన స్థలము, శివజగన్మయ స్థలము, భక్తదేహి లింగ స్థలము.

11. ఏకాదశ పరిచ్ఛేదము (75 శ్లోకములు) 132
ప్రసాది స్థలము, గురుమాహాత్మ్య స్థలము, లింగ మాహాత్మ్య స్థలము, జంగమ మాహాత్మ్యస్థలము, భక్తి మాహాత్మ్య స్థలము, శరణ మాహాత్మ్య స్థలము, ప్రసాదమాహాత్మ్యస్థలము.

12. ద్వాదశ పరిచ్ఛేదము (47 శ్లోకములు) 146
ప్రాణ లింగిస్థలము, ప్రాణలింగార్చన స్థలము, శివయోగ సమాధి స్థలము, లింగ నిజస్థలము, అంగలింగస్థలము.

13. త్రయోదశ పరిచ్ఛేదము (37 శ్లోకములు) 156
శరణస్థలము, తామస నిరసన స్థలము, నిర్దేశ స్థలము, శీల సంపాదన స్థలము,

14. చతుర్దశ పరిచ్ఛేదము (44 శ్లోకములు) 164
ఐక్యస్థలము, ఆచార సంపత్తి స్థలము, ఏక భాజన స్థలము, సహభాజన స్థలము.

15. పంచదశ పరిచ్ఛేదము (71 శ్లోకములు) 173
దీక్షా గురుస్థలము, శిక్షాగురుస్థలము, జ్ఞాన గురుస్థలము, క్రియాలింగ స్థలము, భావలింగ స్థలము, జ్ఞాన లింగస్థలము, స్వస్థలము, చరస్థలము, పరస్థలము.

16. షోడశ పరిచ్ఛేదము (84 శ్లోకములు) 187
క్రియాగమ స్థలము, భావాగమ స్థలము, జ్ఞానాగమ స్థలము, సకాయస్థలము, అకాయ స్థలము, పరకాయ స్థలము, ధర్మాచార స్థలము, భావాచారస్థలము, జ్ఞానాచార స్థలము.

17. సప్తదశ పరిచ్ఛేదము (78 శ్లోకములు) 202
కాయానుగ్రహ స్థలము, ఇంద్రియానుగ్రహ స్థలము, ప్రాణానుగ్రహ స్థలము, కాయార్పణ స్థలము, కరణార్పణ స్థలము, భావార్పణ స్థలము, శిష్యస్థలము, శుశ్రూషు స్థలము, సేవ్యస్థలము,

18. అష్టాదశ పరిచ్ఛేదము (76 శ్లోకములు) 216
ఆత్మస్థలము, అంతరాత్మస్థలము, పరమాత్మ స్థలము, నిర్దేహాగమ స్థలము, నిర్భావాగమస్థలము, నష్టాగమ స్థలము, ఆదిప్రసాది స్థలము, అంత్య ప్రసాదిస్థలము, సేవ్య ప్రసాది స్థలము.

19. ఏకోనవింశ పరిచ్ఛేదము (86 శ్లోకములు) 231
దీక్షా పాదోదక స్థలము, శిక్షా పాదోదక స్థలము, జ్ఞాన పాదోదక స్థలము, క్రియానిష్పత్తి స్థలము, భావ నిష్పత్తి స్థలము, జ్ఞాన నిష్పత్తి స్థలము, పిండాకాశ స్థలము, బింద్వాకాశ స్థలము, మహాకాశ స్థలము, క్రియా ప్రకాశస్థలము, భావ ప్రకాశ స్థలము, జ్ఞాన ప్రకాశ స్థలము,

20. వింశతితమ పరిచ్ఛేదము (81 శ్లోకములు) 247
స్వీకృత ప్రసాదస్థలము, శిష్టోదన స్థలము, చరాచరలయ స్థలము, భాండస్థలము, భాజన స్థలము, అంగాలేపస్థలము, స్వపరాజ్ఞ స్థలము, భావాభావలయ స్థలము, జ్ఞానశూన్య స్థలము.

21. ఏకవింశతితమ పరిచ్ఛేదము (51 శ్లోకములు) 262
విభీషణాభీష్ట వర ప్రదానము

—* * *—

# నా అభిప్రాయము

శ్రీశ్రీశ్రీ జగద్గురు 1008 జ్ఞాన సింహాసనాధీశులైన పూజ్య శ్రీశ్రీ డా॥ చంద్రశేఖర శివాచార్య మహాస్వాములవారు కాశీ జంగమవాడి మఠాధిపతులు హైదరాబాదు కాచిగూడలోని మా సొంత గృహమునకు సుమారు మూడు సంవత్సరముల క్రితమే విచ్చేసిన సందర్భమున అంతకు పూర్వమే నేను రచించి ముద్రించిన 37 వీరశైవ ధర్మ గ్రంథములను పరిశీలించిన శ్రీవారు వీరశైవ ధర్మమునకు ప్రధాన గ్రంథమైన "సంస్కృతములో కన్నడ వ్యాఖ్యానముతో నున్న శ్రీ కాశినాథ శాస్త్రిగారి చేత ముద్రించబడిన శ్రీ సిద్ధాంత శిఖామణి అను దానిని ఎవరైనా తెలుగులోకి అనువదించిన యెడల మేము దానిని ముద్రించెదమని నన్నాదేశించిరి, అందుకు నేను వారి యాజ్ఞను శిరసా వహించి సుమారు ఒక సం॥ము ఎంతో శ్రమించి యేలనన నా వయస్సు అప్పుడు 78 సం॥ములు. వ్రాయునప్పుడు నా హస్తము కంపిస్తున్నను నిదానముగా వ్రాసి పూర్తిగావించితిని.

ఇటీవలె పూజ్య జ॥ వారు తాండూరు పట్టణమునకు వేంచేసిన తరుణమున నేను నా వ్రాత ప్రతిని దీసికెళ్ళి చూయించగా శ్రీవారు నేను శ్రీశైల సూర్య సింహాసనాధీశులైన పూజ్య శ్రీ జగద్గురు 1008 ఉమాపతి పండితారాధ్యుల వారికి ఈ గ్రంథ ముద్రణకై లేఖ వ్రాసెదను. వారు ఈ గ్రంథమును ముద్రింప చేస్తారని చెప్పిరి. అందుకు నేను సరే అని అంగీకరించితిని. ఇంతలోనే జగద్గురు శ్రీశైల సూర్య సింహాసన పీఠాధీశులైన శ్రీశ్రీ ఉమాపతి పండితారాధ్యులవారు నాకు ఫోన్ చేసి మీరు వ్రాసిన సిద్ధాంత శిఖామణి గ్రంథాన్ని తీసుకొని శ్రీశైల పీఠమునకు రావలసిందిగా ఆదేశించిరి. సరే అని అందుకు అంగీకరించి నేను అక్కడికి వెళ్ళుటకు అసమర్థుడనైనప్పటికిని (వృద్ధాప్యం చేత) ఒకరిద్దరి మిత్రుల ప్రోత్సాహం వలన శ్రీశైల క్షేత్రమునకు నా వ్రాతప్రతి సిద్ధాంత శిఖామణి గ్రంథమును తీసుకువెళ్ళి సమర్పించి వచ్చితిని. శ్రీశైల జగద్గురువుల వారు నాయందున్న కృపచేతను మరియు కాశీజ్ఞాన సింహాసనాధీశులైన పూజ్యశ్రీ శ్రీశ్రీ డా॥ చంద్రశేఖర శివాచార్య మహాస్వాముల వారి కోరికమేరకు సుమారు 35 వేల రూప్యములను వెచ్చించి ఈ వీరశైవ సిద్ధాంత శిఖామణి అను ఉద్గ్రంథమును అచ్చువేయించి యున్నారు. అందుకు నేను ఎంతయో కృతజ్ఞుడను.

ఇక పోతే ఈ వీరశైవ సిద్ధాంత శిఖామణి అను గ్రంథము వీర శైవులందరికి ప్రామాణికమైన మూలగ్రంథమై విరాజిల్లుచున్నది. ఏలనన 28 ఆగమముల సారము ఇందు నిబిడీకృతమై ఒప్పుచున్నది. దీన్ని మించిన వీరశైవ గ్రంథము మరొకటి లేదనుట అతిశయోక్తి కాదు.

కనుక వీరశైవులందరు అత్యంతాభిమాన ప్రేరితులై ఈ గ్రంథము విలిచి (కొని) మక్కువతో చదివి వీరశైవులు తమ మూల సిద్ధాంతములను తప్పకుండా అవగతమొనర్చుకొనగలరని మదీయాకాంక్ష.

ఇట్లు:

కన్నడమునకు తెలుగు వ్యాఖ్యాన కర్త
డా॥ పండిత పెద్దమఠము రాచవీరదేవర. "తీర్థ", యం.ఓ.యల్.
ఇంటి నెం. 3-3-139, కాచిగూడ, హైదరాబాద్ - 27

# శ్రీ సిద్ధాంత శిఖామణి

## గ్రంథ ప్రశస్తి

- శ్రీ. ఎం. శంకరయ్య స్వామి

శ్రీమత్ శివాచార విచార దీక్షం - స్వశిష్య సత్రీణనపూర్ణ పక్షం
దుర్వార కామారి విదార దక్షం - భజామ్య హం రేవణ కల్పవృక్షం

శ్రీ జగద్గురు రేణుకాది ప్రమథగణ ప్రముఖులు పరమశివుని ఆజ్ఞానుసారం చతుర్యుగములలో సోమనాథాది మహాలింగముల నుండి దివ్య దేహధారులై యవతరించి వీర శైవ మత స్థాపనాచార్యులై వెలసిరని స్వాయంభువాగమము, వీరాగమము, సుప్రభేదాగ మాది గ్రంథములు ఘంటాఘోషముగా చాటుచున్నవి. అందు ప్రథములు ప్రముఖులు నైన శ్రీ జగద్గురు రేణుకాచార్యుల వారు మునిశ్రేష్ఠుడైన శ్రీ అగస్త్య మహర్షికి నిగమాగమ విఖ్యాతమగు శివాద్వైత మత సిద్ధాంతమును బోధించిరి. అందు శివజీవైక్య రూపలింగాంగ సామరస్యము ప్రధాన ప్రతిపాదిత విషయము. ముక్తిధామము ప్రవేశింపగోరువారికి శ్రీ భగవత్ పాదులు శ్రేష్ఠ క్రియా సూచకములగు అష్టావరణముల గురించియు, నీతి, శీల సూచకములగు పంచాచరములను గురించియు, జ్ఞాన సూచకములగు షట్ స్థలముల గురించియు వివరించిరి. (వీర శైవ సంప్రదాయములో స్థల శబ్దము పరశివ బ్రహ్మమునకు సంకేతము).

ఈ విషయములన్నియు ప్రతిబింబించుమణి దర్పణమే వీరశైవ సిద్ధాంత శిఖామణియను సంస్కృత - గ్రంథస్థమణి.

శివజ్ఞానమహాసాగరులు, ఆగమ శాస్త్రజ్ఞులు, శివానుభవులునైన శ్రీ శివయోగి శివాచార్యులు ఈ సిద్ధాంత శిఖామణి గ్రంథకర్త, ఇందులోని భాషమృదుమధురము, భావములు సుస్పష్టములు. ఈ గ్రంథమునందు శివాద్వైత సిద్ధాంతమునకు అంగములగు అష్టావరణ, పంచాచార, షట్ స్థలముల గురించియే కాక అందలి అవాంతర స్థలములగు ఏకోత్తర శత స్థలముల గురించి విశేషముగా వివరించి యున్నందున ఈ గ్రంథము వీర శైవులతో పాటు శివాద్వైత మత సిద్ధాంత జిజ్ఞాసువులందరికి మిక్కిలి ఉపయోగ కరమైనది.

ఈ గ్రంథరాజమునందు 21 పరిచ్ఛేదములు కలవు. 1, 2, 3, 4, 21 పరిచ్ఛేదములలో చారిత్రక విషయములు ప్రస్తావింపబడినవి. 5 నుండి 21 వరకు గల 16 పరిచ్ఛేదములలో

శివాద్వైత సిద్ధాంతము ప్రతిపాదించబడినది. ఈ పదునారు పరిచ్ఛేదములలో 101 స్థలముల సమగ్ర స్వరూపము నిరూపింపబడినది. ఇందు అంగస్థలము 44 స్థలములుగాను, లింగస్థలము 57 స్థలములుగాను విభజింపనైనది. ఈ స్థలములయందు ప్రమాణ విచారము, గురుమాహాత్మ్య విచారము, భస్మ, రుద్రాక్షధారణ - పంచాక్షర మంత్ర విచారము, వర్ణాశ్రమ ధర్మ విచారము, క్రియాజ్ఞాన సముచ్చయ విచారము, ద్వైతాఽద్వైత విచారము, జీవాత్మ - పరమాత్మ విచారము, లింగాంగ సామరస్య విచారము మున్నగు నెన్నియో విషయములు నిగమాగమ, ఉపనిషత్ పురాణ ప్రమాణములతో నిరూపింపబడినవి. ఈ విషయములన్నియు పూర్వము...

శ్లో॥ శైవాగమేషు సర్వేషు పురాణేష్వ ఖిలేషుచ

పురాదేవేన కథితం దేవ్యై తున్నందనాయచ

తత్ సంప్రదాయ సిద్ధేన రేణుకేన మహాత్మనా

గణేశ్వర కథితం అగస్త్యాయ పునఃక్షితౌ

- అను ప్రమాణముననుసరించి

దేవ దేవుడైన సదాశివుడు మున్ను దేవియైన పార్వతికి, కుమారునకు బోధించినట్లును, ఆపిమ్మట వీరశైవ సంప్రదాయ ప్రవర్తకుడగు శ్రీ రేణుక గణాధీశ్వరునకుపదేశించినట్లును తదుపరి శ్రీ రేణుకుడు కుల్య పాక (కొలను పాక - వ్యవహార నామము) పురియందలి సోమేశ్వర లింగము నుండి దివ్య దేహధారియై యవతరించి అగస్త్య మహర్షికి ఈ వీరశైవ సిద్ధాంతముపదేశించినట్లు తెలియుచున్నది.

సర్వేషాం శైవతంత్రాణాముత్తమత్వాన్నిరుత్తరం

నామ్నా ప్రక్షీయతేలోకేయత్ సిద్ధాంత శిఖామణిః ॥

సమస్తశైవతంత్రములలో శ్రేష్ఠమైన ఈ మహాశైవ తంత్రము తనకు మించినది మరియొకటి లేని కారణమున "సిద్ధాంత శిఖామణి" యను సార్థక నామధేయమున కర్హమై యున్నది.

ఈ కృతి శ్రేష్ఠమైన కృతి. మహత్తరమగు మహతి. కావ్య కళను, శాస్త్ర వాదమును, పూర్ణానుభవసారమను రసమును సంగమింప జేసిన ఉత్తమ సత్కృతి, ఇందు ప్రతిపరిచ్ఛేదము శియోగిశివా చార్యుని ఆగమానుభవపులోతైన పరిశ్రమ పరిపక్వఫల రూపకముగా పరిణతి

నొంది శోభించుచున్నది. ఈ సిద్ధాంత శిఖామణిలోని తత్త్వమునభ్యసించియలవరచుకొనిన శివయోగి యోగశిఖామణియై శివ శరణ జన శిఖాగ్రణియగుననుటలో సందేహము లేదు. కైవల్య కల్పతరువైన ఈ మహా గ్రంథము యొక్క ప్రాశస్త్యము అద్వితీయము. అనేక సన్నివేశములలో ఈ గ్రంథము భగవద్గీతను పోలియుండుట వలన దీనిని రేణుక గీత 'రేణుకాగమము' 'సిద్ధాంతాగమము' అని వ్యవహరించుటయు కలదు.

ఈ కృతి పై వేదాగమముల ప్రభావమెంతైనా కలదు.

కృతికర్త మనస్ఫూర్తిగా నంగీకరించిన అంశము వారి రచన ద్వారానే గమనింతము.

శ్లో॥ ఆలోక్యశైవతం త్రాణి కామికాద్యాని సాదరం
వాతులాంతాని శైవాని పురాణాన్యఖిలానితు
వేద మార్గా2 విరోధేన విశిష్టా చారసిద్ధయే
అసన్మార్గనిరాసాయ ప్రమోదాయ వివేకినాం ॥

ఈ గ్రంథమునందు ప్రతిపాదించిన విషయము వేద మార్గమునకు విరుద్ధముగాక, కామికాది వాతులాంతముగా గల శైవాగమము సమ్మతముగా, ఉపనిషత్... పురాణానుసారముగా, విశిష్టాచారయుక్తముగా, వివేకి జన ప్రమోదావహముగా భాసించుచున్నది. ఈ గ్రంథకర్త వేద పురాణాదుల సహాయము అవసరమైనంత మేర గ్రహించినను, వాని ననుసరించినను కృతి ఆత్మమాత్రము ఆగమమనుటయే సుస్పష్టము.

శ్రీపతి పండితులు తమ శ్రీకర భాష్యమునందును, శ్రీ కంఠ శివాచార్యులు శ్రీ కంఠ భాష్యమునందును ఈ సిద్ధాంత శిఖామణిలోని కొన్ని శ్లోకములను ప్రమాణముగా నుదాహరించుట వలన ఈ గ్రంథము యొక్క ప్రాచీనత ఉత్కృష్టత తెలుపకయే తెలియుచున్నది. జగత్ ప్రసిద్ధ భాష్యకారులకే ప్రామణికమైన ఈ గ్రంథము మిక్కిలి యోగ్యతమమైనది. అనితరమైనది... అనుపమమైనది. వీర శైవ సిద్ధాంత ప్రతిపాదకమైన ఇతర గ్రంథములన్నింటిలోనిది శిఖామణి గానే ప్రకాశించుచున్నది.

శ్లో॥ అనుగతసకలార్థే శైవతంత్రే సమస్తైః
ప్రకటిత శివబోధాద్వైత భావ ప్రసాదే
విదధతుమతి మస్మిన్ వీరశైవా విశిష్టాః
పశుపతిమత సారే పండిత శ్లాఘనీయే.

సమస్త శైవాగమ రహస్యార్థములు కలదై, శివాద్వైత భావ ప్రసాదమును ప్రకటించునదై, శివమత సార సహితమై, పండిత ప్రకాండులచే శ్లాఘింపబడిన ఈ సిద్ధాంత శిఖామణి వీరశైవ లోకమునకు పరమ ప్రామాణికమైనది. శరణ్యమైనది. అనుసరణీయమైనది.

గ్రంథాంతమున గల ఈ శ్లోకము గ్రంథ ప్రాశస్త్యమును ముక్త కంఠముగా చాటుచున్నది.

శ్లో॥ శ్రీ వేదాగమ వీర శైవ సరణిం శ్రీ షట్స్థలోద్యన్మణిం
శ్రీ జీవేశ్వర యోగ పద్మ తరణిం శ్రీ గోప్య చింతామణిం
శ్రీ సిద్ధాంత శిఖామణిం లిఖితయస్తం లేఖయత్యాదరాత్
శ్రోతా, శ్రావయితా సయాతి విమలాం భక్తించముక్తిం పరాం॥

వేదాగమ ప్రసిద్ధమైన వీర శైవతత్త్వముతో కూడినదియు, షట్ స్థలములను రత్నములతో కూడినదియు, లింగాంగ సామరస్యమనెడి పద్మమును వికసింపజేయు సూర్యుని వంటిదియు, శివరహస్యమునకు చింతామణి వంటిదియునైన ఈ సిద్ధాంత శిఖామణియను గ్రంథమును భక్తితో వ్రాయువారును, వ్రాయించువారును, వినువారును, వినిపించువారును ఇహ సుఖానుభవముతో పాటు ముక్తిని కూడా పొందుదురు.

పై ప్రశస్తి స్వాభావికమైన సహజోక్తియే గాని అతిశయోక్తికాదు. ఇట్టి సిద్ధాంత శిఖామణియందు ప్రతిపాదించిన శివాద్వైత సిద్ధాంత తత్త్వము శైవాగమ సాగరమును మథించి తీసి యుంచిన దివ్య తత్త్వము - సుధా సదృశము, ఆగమమనుగని నుండి శోధించి తీసి యందించిన దివ్య రత్నము. ఆ గమాకాశమున వెలుగులీను ద్యుమణియేయీ శిఖామణి.

ఇట్టి మహిమోపేతమైన, పవిత్రమైన ఈ గ్రంథమును వీర శైవ సమాజము పూజ్యభావమున సమాదరించి, పారాయణ గ్రంథము వలె ప్రతిదినము శివపూజానంతరము నియమముగా పఠించుచు, నిష్ఠతో నాచరించుచు, అనుభావులైతరింతురుగాక యని వినతి. ఈ గ్రంథ ప్రశస్తి వ్రాయుటకు అవకాశము కలిగించిన పూజ్య పాదులందరకు నా హృదయ పూర్వక నమస్సుమాంజలి.

ఇట్లు
బుధజన విధేయుడు....
ఎం. శంకరయ్య స్వామి, ఎం.ఏ, ఎం.ఓ.ఎల్.
విశ్రాంత తెలుగు పండితులు
ఇబ్రహింపట్టణం, రంగారెడ్డి జిల్లా
అధ్యక్షుడు: వీరశైవాగమన పరిషత్, హైదరాబాద్

# వీరశైవ తత్త్వం - శ్రీ సిద్ధాంత శిఖామణి

- డా॥ కసిరెడ్డి.

శైవం ప్రపంచంలోనే అతిప్రాచీనమయింది. "ఏకోహంబహుస్యామః" - అన్న మంత్రం ఆ మూలచైతన్యమే ఇంతగా విస్తరించిందని చెబుతుంది. చిత్ క్రియలేకుంటే విస్తరణ లేదు. ఆ చిత్క్రియ పరమేశ్వరుని నుండే జరిగింది.

అందువల్ల ఈ జీవునిలో కూడా అదే క్రియ ప్రారంభమయింది. పరమేశ్వరుని సృష్టిలో శాశ్వతత్త్వమున్నది. జీవుని సృష్టిలో పరిణామమున్నది. అందుకే జీవుడు శాశ్వతత్త్వం వైపుగా పయనించాలి. పయనించడానికి అనువైన వాతావరణం తానే నిర్మాణం చేసుకోవాలి. దీనినే సాధన అంటారు. సాధనా పథంలో నడవడానికి శాస్త్రం కావాలి. ఆ శాస్త్రం అనుభవజ్ఞులైన ఆచార్యులే వ్రాస్తారు. అదివారి దర్శనం.

ఆ దర్శనం నిమిత్తం ఆచార్యులు అంతరాంతరాల్లోకి వెళ్ళిపోతారు. అతి ప్రాచీన కాలానికి చెందిన ఆచార్యుల జగద్గురువుల వాణి వారికి వినిపిస్తుంది. ఇదే తపస్సిద్ధి. అటువంటి సిద్ధిపొందిన శ్రీ శివయోగి శివాచార్యులు విరచించినదే "శ్రీ సిద్ధాంత శిఖామణిః" అన్న వీరశైవ తత్త్వ శాస్త్ర గ్రంథం.

ఇది 21 పరిచ్ఛేదాల గ్రంథం. ఇది అనేక పర్యాయాలు సంస్కృతాంధ్ర కర్ణాటక లిపులలో ముద్రింపబడినా శబ్దార్థదోషాలు కుప్పలు తెప్పలుగా ఉండినాయని, ఆ దోషాలు లేకుండా ప్రచురించడానికి కాశీవీరశైవ విద్వత్సంఘం పూనుకొన్నది. ఆబాధ్యత వేద కావ్య స్మృతి తీర్థ ధర్మాచార్య విద్యానిధి విద్యారత్నాది బిరుదాంకితులును, సుప్రసిద్ధ పండిత వర్యులు నైన శ్రీ చిదిరె మఠము వీర భద్రశాస్త్రి గారికి అప్పగించారు. వారి కృషివల్ల "శ్రీ సిద్ధాంత శిఖామణిః' ' పరిశుద్ధంగా వచ్చింది. ఆ మూలప్రతిని ఆధారంగా గ్రహించి, కన్నడంలో భావ ప్రకాశ వ్యాఖ్యానాన్ని ఉన్నదున్నట్టుగా తెలుగు చేసిన పండితులు సుప్రసిద్ధ వీరశైవ సైద్ధాంతిక దార్శనికులు శ్రీశ్రీ డా॥ పెద్దమఠం రాచవీర దేవరగారు. ఇది వీరశైవ సామాజికుల అదృష్టమే కాదు. ఇది ఆంధ్రావళి అదృష్టం.

సంస్కృతం తెలిసిన వారు సరే; సంస్కృతం అంతంత మాత్రమే తెలిసిన వారికి, బొత్తిగా తెలియని వారికి వీరశైవ తత్త్వం ఈ తెలుగు శ్రీ సిద్ధాంత శిఖామణి వల్ల బాగా అర్థమవుతుంది. కథలు, శివలీలలు, ఆచారాల తంతు సామన్యుల నలరిస్తాయి. తత్త్వం ధీమాన్యుల భావాలను

మరేస్థిరపరుస్తుంది. తంతు నుండి తత్త్వం వరకు సామాన్యుడు కూడా ఎదగడానికి ఇటువంటి గ్రంథాలే ఉపకరిస్తాయి.

ఇవి మూల గ్రంథాలు. ఈ మూలతత్త్వాన్ని అతిసూక్ష్మంగా ఎప్పుడో పంచాచార్యులలో ఒకరు ఆద్యులూ అయిన శ్రీశ్రీశ్రీ జగద్గురు రేణుకాచార్యుల వారు అగస్త్యమహర్షికి బోధించారు. దానిని దర్శించిన శ్రీశివయోగి శివాచార్యుల వారు మనభాగ్య ఫలముగా మనకందించారు.

భౌతికమైన, ఇంద్రియ పరమైన అనేక బలహీనతలకు లోనైన మానవుడు 'మాయ' జుట్టు పట్టిలాగుతుంటే పాపకూపంలో పడిపోతుంటాడు. మానవుడు అమృతపుత్రుడు. పాపం వైపుగా పయనించకూడదు. అతణ్ణి ఆవరించే మాయను ఛేదించాలి.

ఆ ఛేదించడానికి ఈ తత్త్వ శాస్త్రాది గ్రంథాలే ఉపయోగపడతాయి. అందులో శ్రీ సిద్ధాంత శిఖామణి అగ్రశ్రేణిలోకి వస్తుంది.

ఈ జీవుడు గురూపదేశం పొందాలి. ఆ ఉపదేశానికి ఎటువంటి వాతావరణం కావాలో ఈ వీరశైవతత్త్వం చెబుతుంది. స్థల తత్త్వం విశదీకరిస్తుంది.

స్థావరం, జంగమం, అంగం, లింగం, సృష్టి, శక్తి, జగత్తు, దేవి, దేవత, సేవ, అవతారం, పూజ, ప్రార్థన, తత్త్వం, ఉపదేశం, భక్తస్థలం, అంగస్థలం, పిండస్థలం, జ్ఞానం, సంసారం, గురుకారుణ్యం, లింగధారణం, భస్మధారణం, రుద్రాక్షధారణం, పంచాక్షరజపం, భక్తి మార్గ క్రియ, ప్రసాదం, ప్రసాది , సోపాధి, నిరుపాధి, లింగనిష్ఠ, శివజగన్మయ స్థలం, గురులింగజంగమ భక్తమహాత్మ్యాలు, శరణప్రసాద మాహాత్మ్యాలు, ఐక్యం, ఆచారం, సకాయం అకాయం పరకాయ స్థలాలు, దీక్షా శిక్షా జ్ఞాన గురుస్థలాలు, కాయార్పణ - కరణార్పణ - భావార్పణ స్థలాలు, ఆత్మ - అంతరాత్మ - పరమాత్మ స్థలాలు, భాండ - భావన - అంగాలేపన స్థలాలు, జ్ఞానశూన్య స్థలం, అభీష్టసిద్ధి ....

ఇటువంటి వందలాది తాత్త్విక పారిభాషిక పదాలకు అర్థ వివేచనం ఈ గ్రంథమంతటా చూస్తాం. అంతేగాక సందర్భం నుండి ఓ రెండు వందల శ్లోకాలు వెలికితీసి అందులోని నీతిని - రీతిని ఆచరించాల్సిన ఆవశ్యకతను నొక్కి చెప్పవచ్చు.

"భక్తిః స్థిరా కృతా యస్మిన్ - మ్లేచ్ఛేవా ద్విజ సత్తమే ।

శంభోః ప్రియః నవిప్రశ్చ - నప్రియో భక్తి వర్జితః ॥ (9 - 5)

అస్పృశ్యుడేగా నిమ్ము బ్రాహ్మణుడే గానిమ్ము అతనిలో భక్తి దృఢ పడినట్లయితే ఆతడు శివునికి ప్రీతి పాత్రుడవుతాడు. బ్రాహ్మణుడైనను భక్తి శూన్యుడైన యెడల శివాను గ్రహమునకు పాత్రుడు గాడు.

"సా భక్తిర్ద్వి విధాజ్ఞేయా - బాహ్యాభ్యంతర భేదతః ।

బాహ్యా స్థూలాంతరా సూక్ష్మా - వీర మాహేశ్వరాదృతా ॥' (9 - 6)

- ఆ భక్తి బాహ్యము అంతరంగికమని రెండు భేదాలు. బాహ్యభక్తి స్థూలభక్తి అనియు, అంతరంగిక భక్తి సూక్ష్మ భక్తి యనియు పిలవబడును. ఇట్టి సూక్ష్మభక్తి వీర మాహేశ్వరులకు అంగీకృతమై యొప్పచున్నది.

శ్రీ దేవరగారి అనువాదమంతా ఇలాగే సాగింది. బాహ్యాచారం బాహ్యభక్తి, అనీ, మానసిక వికాసమే ఆంతరభక్తి అని ఎవరైనా ఊహించుకోవచ్చు. ఈ వీరమాహేశ్వరత్వాన్ని తమతమ సంస్థలకూ ఆపాదించుకోవచ్చు.

అయితే ఇతర మతాల వైపు కూడా చూడరాదనే నియమాలు ఈ శ్రీ సిద్ధాంత శిఖామణిలో ఉండడం ఉదారవాదులకు నచ్చకపోవచ్చు. అయితే ఆయాదేశకాల పరిస్థితులతో అన్వయించుకొన్నప్పుడు, విదేశీ మత సామ్రాజ్యవాద శక్తులు ఈ దేశంలో చెలరేగుతున్నప్పుడు ఈ వీర మాహేశ్వరత్వమే జాతిని రక్షించిందన్న సత్యాన్ని గుర్తిస్తే, అటువంటివి ఆపద్ధర్మంగా అంగీకరించాల్సిందే అనిపిస్తుంది.

జీవుడు పరమ మాహేశ్వరుడయ్యే పరమోత్తమ పథాన్ని నిర్దేశించిన ఈ శ్రీ సిద్ధాంత శిఖామణికి అందరం స్వాగతం పలుకుదాం. దీనిని అనువదించిన వారికి, ప్రచురించిన వారికి వారు చేసిన ఈ పరమోపకారానికి ధన్యవాదాలు తెలుపుకుందాం.

భాగ్యనగర్
తేది. 8-5-2000

డా॥ కసిరెడ్డి
కార్యదర్శి
జాతీయ సాహిత్య పరిషత్, ఆం. ప్ర.

# శ్రీసిద్ధాంత శిఖామణి

శ్రీజగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

## ప్రస్తావన

"శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు
జీయాత్ శ్రీరేణుకాచార్యో - శివాచార్య శిఖామణిః ।
యోమాహేశ్వర సిద్ధాంతం - స్థాపయామాసభూతలే ॥
యస్యస్మరణ మాత్రేన నృణాం ముక్తికరేస్థితా।
తంవందేజగదాధారం - రేణుకార్యం జగద్గురుం ॥

మునియాచనయా శివాజ్ఞయా
శివభక్త్యుద్ధరణార్థమాగతం ।
వృషరాజ పరావతారతా
మహితం శ్రీబసవేశ్వరంభజే॥

సమో, ఉగ్రస్వరూపాయ - నమోజిష్ణ్వాది శాత్రవే ।
దక్షయజ్ఞ వినాశాయ - వీరభద్రాయతేనమః ॥

## శ్రీ శివయోగి శివాచార్య విరచిత శ్రీ సిద్ధాంత శిఖామణిః

### ప్రథమ పరిచ్ఛేదః

శ్లో॥ త్రైలోక్యసంపదాలేఖ్య - సముల్లేఖనభిత్తయే ।
సచ్చిదానందరూపాయ - శివాయబ్రహ్మణేనమః । ॥ 1 ॥

బ్రహ్మేతివ్యపదేశస్య విషయం యంప్రచక్షతే
వేదాంతినో జగన్మూలం తంనమామి పరంశివం ॥ 2 ॥

యస్యోర్మిబుద్బుదాభాసః షట్త్రింశత్తత్త్వసంచయః
నిర్మలం శివనామానం తం వందే చిన్మహోదధిం ॥ 3 ॥

# ఒకటవ పరిచ్ఛేదము

శ్రీరేణుకాగస్త్య సంభాషణరూపమైన సిద్ధాంత శిఖామణి గ్రంథమును రచించిన శ్రీశివయోగిశివాచార్యులవారు గ్రంథాదియందు పరమశివుని గురించి యేడు శ్లోకములతో నమస్కారాత్మకమగు మంగళస్తోత్రమునాచరించును.

# శివస్తుతిః

**తాత్పర్యం :-** త్రైలోక్యసంపద స్వరూపంబగు చిత్రలేఖనమునకు గోడ (భిత్తి) వంటి వాడును. సచ్చిదానంద స్వరూపుండును. పరబ్రహ్మ స్వరూపుండును. ఐన శివునకునా నమస్కారము॥1॥

వేదాంతులు "పరబ్రహ్మ యనుశబ్దమునకు ఎవనినైతె లక్ష్యముగా నిడుకొని చెప్పుదురోఈచరాచరజగత్తునకు కారణభూతుడైన ఆ పరమశివునకు నమస్కరించుచున్నాను ॥2॥ శివాదిభూమ్యంతమగు ముప్పదియారు తత్వముల సమూహము ఏ బ్రహ్మనామకుండగు పరమ శివుడు చిత్సముద్రమున తరంగములవలె భావించబడునో, అట్టి ఆణవాదిమల త్రయరహితంబైన శివనామకమగు మహా సముద్రమునకు నమస్కారము. ॥3॥ వీరశైవ సిద్ధాంతమునందు (36) ముప్పదియారు తత్వములు అంగీకృతములైనవి. అందుచేతనే గ్రంథకారులు ఆ ప్రతిబింబమును (ఛాయను) ఇట్టి మంగళకర శ్లోకములందు ఉట్టంకించియున్నారు, ఈ ముప్పదియారు తత్వముల స్వరూపము సమస్తజనులకును ముఖ్యముగానవగతము గావలయుననిన ఈ విషయమును ఇట సంక్షిప్తముగా వివరింపదగును.

సచ్చిదానంద స్వరూపంబగు పరశివబ్రహ్మమునందు అవినాభావ సంబంధముతో యున్నట్టి విమర్శనా శక్తియొక్క స్పందనమే శివ - శక్తి - సదాశివ - ఈశ్వర - శుద్ధవిద్యా - మాయా - కలా - విద్యా - రాగ - కాలా - నియతి - పురుష ప్రకృతి - బుద్ధి - అహంకారము - మనస్సు - శ్రోత్రము - త్వక్ - నేత్రము - జిహ్వా - ఘ్రాణము - వాక్ - పాణి - పాదము - వాయువు - పాయు - ఉపస్థ - శబ్దము - స్పర్శము - రూపము - రసము - గంధము - ఆకాశము - అగ్ని - జలము - పృథివి, అనునవి ముప్పదియారు తత్త్వముల స్వరూపమై పరిణమించును,

శక్తి విశిష్ట పరబ్రహ్మము "బహుస్యాంప్రజాయేయ" (6 -2-3) అనుఛాందోగ్యశ్రుతి

వాక్యాను సారముగా సృష్టికున్ముఖమగుటకు, తన్నిష్ఠమైన విమర్శనా శక్తి ఇచ్ఛాశక్తి స్వరూపమై పరిణమించును.

"అనాదినిధనాచ్ఛాంతాచ్ఛివాత్ పరమకారణాత్ ।
ఇచ్ఛాశక్తిర్వినిష్క్రాంతా తతోజ్ఞానంతతః క్రియా ।
తత్రోత్పన్నాని భూతాని భువనాని చతుర్దశ ॥

అను శివాగమ ప్రమాణానుసారముగా ఉత్పత్తినాశరహితమగు పరమ కారణము, శాంతము అయిన పరశివబ్రహ్మనుండి. మొదల్కొని, ఇచ్ఛాశక్తి దానినుండి జ్ఞానశక్తి అంతరంగమున అలవడి, క్రియాశక్తి బహిర్గతమై యుండును. పరశివబ్రహ్మము జ్ఞాన శక్తియం దు లీనమై "నేను సర్వజ్ఞుడిని" అనునభిమాన మును బొందుటను "శివతత్త్వమని పించుకొనును, సాలెపురుగువలను పన్నుటకునిమిత్త" కారణమైనట్లుగా, ఈ శివతత్త్వాకమైనట్టి పరబ్రహ్మమే జ్ఞానవిశిష్టాకారమునుండి, భావి ప్రపంచమునకు నిమిత్తకారణమగును.

పరశివబ్రహ్మము క్రియాశక్తిలో లీనమై "నేనే సర్వకర్తను" అనే అభిమానమును బొందుటను "శక్తితత్త్వమనిపించుకొనును. సాలెపురుగు వల పన్నుటకు దగినయాకారము చేత వలకు ఉపాదాన కారణమైనట్లుగా, ఈ శక్తి తత్త్వాత్మకమగు పరశివ బ్రహ్మమే క్రియావిశిష్టాకారముతో భావిప్రపంచమునకు నిమిత్త కారణమగును.

పరశివబ్రహ్మమొకటే ప్రపంచమునకు అభిన్ననిమిత్తోపాదానకారణమగును. అనునది ముండకోపనిషత్తు శృతి

"యథోర్ణనాభిః సృజతే గృహ్యతేచ, (1-1-7) అను వాక్యముతో ప్రతిపాదించుచున్నది.

ఇట్టి శక్తి తత్త్వము ఇచ్ఛాశక్తికి అంతరంగమైన జ్ఞానశక్తిలోకి బ్రవేశించి జలాధివాసము చేత అంకురోన్ముఖమైన శనగలమాదిరిగా ఉబ్బి అంకురించిన పగిది భావి ప్రపంచమును గురించి "అహమిదం" నేనే ఈ ప్రపంచమును "అని అభిమానమును పొందుటను, అదే" సదాశివతత్వమనిపించుకొనును.

ఈ శక్తితత్త్వము ఇచ్ఛాశక్తికి బహిర్గతమగు క్రియాశక్తిలో బ్రవేశించి సుక్షేత్రమున విత్తిన (నాటిన) సుబీజమురీతిగా అంకురించిఅట్లు అంకురించిన ప్రపంచమును గురించి "ఇది నేను" "అహమిదం" ఈ ప్రపంచమును, అనే అభిమానమును బడయుటను "ఈశ్వరతత్త్వ మనిపించుకొనును, ఇట్టి శక్తి తత్త్వము సాగరతరంగముల న్యాయము మాదిరి (సముద్రపు

నీటికితరంగములకభేద్యముగా నున్నట్లు) "అహమిదం" "నేను అను" నహంకారమునకిది. ప్రపంచమునకు అభేద జ్ఞానమును బొందుటను శుద్ధమైన విద్యాతత్త్వమనిపించు కొనును.

శుద్ధ విద్యాతత్త్వరూపమై పరిణమించిన ఈ శక్తితత్త్వము, 'మయూరాండరస న్యాయము' వలె అనగా (నెమిలియొక్క గుడ్డులో నున్న రసమున పాద - పక్ష (రెక్కలు) వర్ణము వైచిత్ర్యాదులు విభజింపబడి సూక్ష్మరూపముననున్న మాదిరిగా) తనలో లీనమైయున్న భావిప్రపంచ నిర్మాణమునకు గారణీభూతమైన సూక్ష్మపదార్థములందు అన్యోన్యా భావరూప భేద బుద్ధి ప్రాధాన్యతతో మాయాతత్త్వమనిపించుకొనును,

కలా - విద్యా - రాగ - కాల నియతులనునవి, పంచతత్వములు పురుషునికి కంచుక (తొడుగు) రూపముననుండుట వలన, మొదట కంచుకమైన పురుషతత్త్వమును నిరూపించి, ఆపిదప కలాది పంచతత్త్వములను గూర్చి నిరూపింపనగును.

కాష్ట సంఘటనల (కఱ్ఱలరాపిడి) చేత అగ్ని (మిణుగురులు) (కణములు) ఆవిర్భవించునట్లుగా పరమశివుని ఇచ్ఛాశక్తి సంయోగము వలన ఆవిర్భవించునట్టి శివాంశమేమాయాశక్తిలోకి బ్రవేశించి "పురుషతత్త్వమని పించుకొనును. ఇట్టి పురుషతత్త్వమున కేమాయామల సంబంధమేర్పడును. అందుచేత, ఆత్మలోననాత్మత్వజ్ఞానము, అనాత్మత్వ వస్తువులలో ఆత్మత్వ జ్ఞానము, "నేనుసుఖించితిని" - నేను దుఃఖించితిని. అనుబుద్ధి యుత్పన్నమగును, పురుషుడు ఈ విధముగ అణవాదిమలముల చేతగూడి యున్నవాడగుట వలన సంసారియనబడుచున్నాడు.

పురుషుడు మాయా మలావృతుడై తనయొక్క సర్వకర్తృత్వముసర్వజ్ఞత్వము పరిపూర్ణత్వము నిత్యత్వ వ్యాపకత్వ రూపశక్తులను బొగొట్టుకొని, కించిత్కర్తృత్వాది శక్తులతో గూడియున్నవాడగును. పురుషుని ఇట్టి కించిత్కర్తృత్వాది రూపమైన శక్తే కలాతత్త్వ మనిపించుకొనును మరియు నా కించిత్కర్తృత్వరూపమైనశక్తే "విద్యాతత్త్వమనిపించుకొనును. అసంపూర్ణత్వ రూపమైన శక్తే ప్రక్ఛందన వనితాది విషయక ప్రీతి రూపమైన శక్తే రాగతత్త్వ మనిపించుకొనును. అనిత్యత్వ రూపకమైన శక్తే భూత - భవిష్యద్వర్తమానకాలముల వ్యవహారమునకు అసాధారణమైన కాలతత్త్వమనిపించుకొనును. అవ్యాపకత్వ రూపశక్తే, ఈ కారణముచేత-ఇట్టి-కార్యముప్పతిల్లును (పుట్టును) మరొకటి జన్మించదనునదినియమ మునకు అసాధారణానికి మూలమైన "నియతితత్త్వ" మనిపించుకొనును.

కార్యోన్ముఖగర్భితమైన ఇచ్ఛాశక్తి, స్వగతమగు జ్ఞానశక్తి క్రియా శక్తులయందున్నట్టి "జ్ఞానం క్రియానభవతి, క్రియా జ్ఞానం నభవతి", అన్యోన్యాభావరూప భేద బుద్ధి ప్రధానమగు

మాయాతత్త్వమునందు ప్రతి స్పందనజెందగా "ప్రకృతి తత్త్వ"మనిపించుకొనును, ఇట్టి ప్రకృతితత్వమే మానవుని సుఖదు:ఖ మోహములకు కారణములైన సత్వ - రజ - తమోగుణముల సామాన్యవస్థారూపమైయుండి మహత్తత్త్వము మొదల్కొని పృథివ్యాంతమైయున్న 23 తత్త్వములకు కారణీభూతమైయుండును.

ప్రకృతి తత్త్వరూపమగునీ శక్తితత్త్వమే "ఇదమిత్థం" ఇది యిలాగే ఉన్నది, అనునిశ్చితార్థమునకు కారణీభూతమై "బుద్ధితత్త్వ"మనిపించుకొనును. దీనికే "మహత్తత్వమను నామాంతరము గలదు. బుద్ధితత్త్వరూపమైన ఈశక్తితత్త్వమె "నేను నాది" అహంకార మమ కారములకు కారణమై "అహంకార" తత్వమనిపించుకొను, అహంకారతత్త్వరూపమైన ఈ శక్తితత్వమే "స్థాణుర్వా పురుషోవా, అను సంకల్ప వికల్పములకు కారణభూతమై "మనస్తత్వ మనిపించుకొనును, బుద్ధ్యహంకారమనస్తత్వములు శరీరమునందున్నందున ఈ మూడు" "అంతఃకరణములనఁబడును. ఇట్టి అంతఃకరణమే ఇచ్ఛాశక్తి ప్రధానమైయున్నది.

ఇట్లు అంతఃకరణ రూపముగా పరిణమించిన ఈ శక్తితత్త్వమే బాహ్య శరీరము నాశ్రయించి శబ్దజ్ఞానమునకు సాధనభూతమై"శ్రోత్రతత్వ" మనియు, స్పర్శ జ్ఞానము నకు సాధనమై "త్వక్‌తత్వ" మనియు రూపజ్ఞానమునకు సాధనమై "నేత్ర త్తత్వమనియు, రస జ్ఞానమునకు సాధనమై "జిహ్వా త్తత్వ"మనియు, గంధజ్ఞానమునకు సాధనమై "ఘ్రాణత్తత్వం - మనియు చెప్పబడును. ఇట్లీ ఐదు ఇంద్రియములు జ్ఞానశక్తి ప్రధానములైన కారణమువలన జ్ఞానేంద్రియములనియు చెప్పబడుచున్నవి.

జ్ఞానేంద్రియరూపమున రూపొందిన ఈ శక్తి తత్వమె ఉచ్చారణ క్రియకు సాధన భూతమై వాక్తత్వ" మనియు దానాదానాది క్రియలకు సాధనమై పాణితత్వ మనియు గమనాగమనాది క్రియలకు సాధకమై పాదతత్వమనియు, మలవిసర్జనకు సాధకమై (పాయు) "గుద తత్వమనియు, మూత్రవిసర్జనకు సాధకమై" ఉపస్థ,, - గుహ్య - తత్వమనియు, వ్యవహరింపంబడును, ఇట్టి అయిదు ఇంద్రియములు క్రియాశక్తి ప్రధానమగుటవలన కర్మేంద్రియములనియు వీటికి వ్యవహారమున్నది, ఈ పైన గనపరచిన బుద్ధి తత్వాది త్రయో దశ తత్వములు, ఇచ్ఛా - జ్ఞాన - క్రియా - శక్తికి ప్రధానము లైనవి,

"ఇట్టి శక్తి తత్వమే కేవలము శోత్రేంద్రియ గ్రాహ్యమగు" శబ్దతత్వ రూపమై - కేవలము త్వగింద్రియ గ్రాహ్యమైన "స్పర్శతత్వ" రూపమే కేవలమునేత్రేంద్రియ గ్రాహ్యమగు" "రూపతత్వమని" కేవలము జిహ్వేంద్రియగ్రాహ్యమగు 'రసతత్వముగా రూపొంది, కేవలము'

ఘ్రాణేంద్రియ గ్రాహ్యమైన" గంధతత్త్వముగా (రూపొంది) పరిణమించును, శబ్దమున ధ్వన్యాత్మకము - వర్ణాత్మక శబ్దమనియు, స్పర్శమున శీతోష్ణస్పర్శమనియు, రూపమున, నీలపీతాది రూపమనియు రసమున మధురామ్లాదిరసమనియు, గంధమున, సుగంధ - దుర్గంధములనియు విభాగములు గానేర్పడియున్నవి ఇవి సాధారణ రూపమగుటవలన శబ్దాదులు" తన్మాత్రలనియు చెప్పఁబడుచున్నవి.

యద్భాసా భాసతే విశ్వం యత్సుఖేనానుమోదతే
నమస్తస్మై గుణాతీత విభవాయ పరాత్మనే ॥4॥

సదాశివముఖాశేష తత్త్వో న్మేషవిధాయినే
నిష్కలంకస్వభావాయ నమః శాంతాయ శంభవే ॥5॥

స్వేచ్ఛావిగ్రహయుక్తాయ స్వేచ్ఛావర్తనవర్తినే
స్వేచ్ఛాకృతత్రిలోకాయ నమః శాంతాయ శంభవే ॥6॥

మొదట జెప్పబడిన ఈ శక్తితత్త్వమె శబ్దైకగుణముగల "ఆకాశతత్త్వ" రూపముగను, స్పర్శమను ప్రధానగుణముగల "వాయుతత్త్వ" రూపముగను, ఆకారమను ప్రధాన గుణము గల "తేజస్తత్త్వ" రూపముగను, రసమెప్రధాన గుణముగల "జలతత్త్వ" రూపముగను. గంధమను ప్రధానగుణము గలది "పృథ్వీతత్త్వ" రూపముగాను పరిణమించును. ఇట్టి పంచభూతములలో ఉత్తరోత్తర భూతములందు, పూర్వపూర్వ భూతముల గుణములు అనుసరించి యుండును. నిగమాగమముల చేత ప్రతిపాదించబడిన ఈ ముప్పదియారు తత్త్వములు సచ్చిదానందరూపమైన శక్తి విశిష్ట పరశివ బ్రహ్మముయొక్క పరిణామ రూపమగుట వలన. వీరశైవమతము పరిణామవాదమును జగత్సత్యత్వవాదమును బోధించుచున్నది. ॥3॥

"తస్యభాసాసర్వమిదంవిభాతి" (5-15)

అనుకంఠవల్లీ శ్రుతి ప్రమాణానుసారముగ సమస్త ప్రపంచము ఏదైతె పరశివబ్రహ్మము యొక్క ప్రకాశము చేత ప్రకాశించుచున్నదో, ఏదైతె పరశివ బ్రహ్మము యొక్క ఆనందాతిరేకముచేత ఆనందింపఁబడుచున్నదో అట్టి హేయగుణరహితమైన వైభవోపేత పరమాత్మునకు నానమస్కారము ॥4॥ శివాది భూమ్యంతమగుముప్పదియారు తత్త్వములను తనలో లీనమైయున్న విమర్శనా శక్తి చేత మయూరాండరస న్యాయము" మాదిరిగా విస్తరింపఁజేయువాఁడు, నిష్కలంక స్వభావముగలవాఁడు, శాంతస్వరూపుడు నైన శివునకు

నానమస్కారము ॥5॥ భక్తానుగ్రహము కొరకు స్వేచ్ఛగాననేక ప్రకారములైన దివ్యమంగల విగ్రహరూపమును ధరించును, స్వేచ్ఛాచారనర్తనముగల వాఁడైతనలో లీనమైయున్న ఇచ్ఛాశక్తి నుండి ముల్లోకములను సృష్టించినట్టి పార్వతీపతియైన శంకరునకు నానమస్కారము ॥6॥

యత్ర విశ్రామ్యతీశత్వం స్వాభావిక మనుత్తమం
నమస్తస్మై మహేశాయ మహాదేవాయ శూలినే ॥7॥

యామాహుః సర్వలోకానాం ప్రకృతిం శాస్త్రపారగాః
తాం ధర్మ చారిణీం శంభోః ప్రణమామి పరాం శివాం॥8॥

ఏదైతే పరశివబ్రహ్మమునందు సర్వశ్రేష్ఠము, స్వభావ సిద్ధమైయున్న ఈశత్వము (స్వామిత్వము - ప్రభుత్వము) విశ్రాంతిని బొందుచున్నదో అట్టి ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి రూపమైన త్రిశూలధారియగు మహాదేవునకు నానమస్కారము ॥ 7 ॥

ఇఁకను గ్రంథకర్తలు పరమ శివునియందు సదా అవినాభావ సంబంధముతో నున్నట్టి శక్తిని యాదిగువనున్న ఐదుశ్లోకములతో స్తుతించుచున్నారు.

## శక్తి స్తుతిః

సమస్త శాస్త్రకోవిదులు, సమస్తలోకముల ఉత్పత్తికి దేనినైతే మూలకారణీ భూతురాలినిగా చెప్పుకుందురో, శంకరునకు ధర్మ పత్నిస్వరూపురాలైన అనర్వమంగళా దేనికి నమస్కరించుచున్నాను, గ్రంథకర్తలు ఈ మంగల శ్లోకమున శివునకు శక్తికిని అవినాభావ సంబంధమును బేర్కొనియున్నారో, అదే వీరశైవ సిద్ధాంతమునకు మూలరహస్యమైయుండి, శక్తి విశిష్టాద్వైతమని చెప్పఁబడుచున్నది. ఇట్టి శక్తి విశిష్టాద్వైత సిద్ధాంత స్వరూపమునే ముముక్షువులందరు తప్పని సరిగా తెలునుకొనవల్సియున్నదిగనుక. దానినే ఇక్కడ క్లుప్తముగా వివరించనగును.

శక్తి విశిష్టాద్వైతమనగా - శక్తి విశిష్టమగు జీవునకు శక్తి విశిష్టమైన శివునకు సామరస్యముందని చెప్పుట. "శక్తిశ్చ - శక్తిశ్చ - శక్తీ - తాభ్యాం విశిష్టౌ జీవేశౌ, తయోః అద్వైతం శక్తి విశిష్టాద్వైతం" అనియు ప్రాచీనాచార్యులు శక్తి విశిష్టాద్వైత పదమునకు వ్యుత్పత్త్యర్థమును నిరూపించియున్నారు. ఆశక్తి స్థూల చిదాత్మక శక్తి - సూక్ష్మ చిదాత్మక శక్తి యనియురెండు విధములుగా నున్నది, జీవుఁడుస్థూల చిదచిదాత్మక శక్తియుక్తుడై

యున్నాడు, శివుడు సూక్ష్మ చిదాత్మక శక్తియుక్తుడైయున్నాడు. జీవుని స్థూల చిచ్ఛక్తి కించిజ్ఞతారూపమై యున్నది. స్థూలచిచ్ఛక్తి కించిత్కర్తత్వతారూపమైయున్నది. శివుని సూక్ష్మక చిచ్ఛక్తి సర్వజ్ఞతా రూపమై వెలసినది. సూక్ష్మ చిచ్ఛక్తి సర్వకర్తృతారూపముననున్నది. ఇట్టి ద్వివిధమయ శక్తులతో గూడు కొనిన జీవుడు మరియు శివుడు వీరియద్వైతమే (సామరస్యమే) శక్తి విశిష్టాద్వైతమనఁ బడును. ఈ శక్తి పరశివబ్రహ్మమున అవినాభావ సంబంధముతో నుండి శాశ్వత మనబడు చున్నది. ఇట్టి విషయమును శ్వేతాశ్వతరశ్రుతిలో.

"పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతె స్వాభావికీ జ్ఞానబలక్రియాచ॥ అనువాక్యము చాటి చెప్పుచున్నది, ఈ మంత్రార్థమును బరిశీలించిన యెడల. పరబ్రహ్మమునందు శక్తి సహజముగా నున్నదనియు, ఈ శక్తే - క్రియా శక్త్యాదిరూపముతో ననేక విధములు గానున్నదనియు సిద్ధమగు చున్నది. "స్వాభావికీ" అనుపదము శక్తియే నిత్యత్వమును ఘంటాఘోషముగా చాటుచున్నది. ఇదే విషయమును. ఇదే శ్రుతి మరోచోట.

"యదాతమస్తన్న దివానరాత్రి -ర్నసన్నచాసచ్ఛివ ఏవకేవలంః।
తదక్షరంతత్సవితుర్వరేణ్యం - ప్రజ్ఞాచతస్మాత్ ప్రసృతా పురాణీ ॥ (4-18)

అనువాక్యముచేత ప్రతిపాదించియున్నది, పురాణీ - అనాది - సంసిద్ధమగు, ప్రజ్ఞా - చిచ్ఛక్తి ఆపరశివబ్రహ్మము చేత, ప్రసృతా క్రియా శక్త్యాద్యనంత రూపముతో విస్తృతమైనది - అని - ఉద్బోధించుచున్నది. ఈ శ్రుతి వాక్యమునందు శక్తివికాసము స్ఫుటముగా నిరూపించనైనది.

"మాయాంతు ప్రకృతింవిద్యా - న్మాయినంతు మహేశ్వరం ।

ఈ మంత్రముగూడ పరమాత్ముడు శక్తి విశిష్టుడైయున్నాడని యుబోధించుచున్నది. పూర్వాచార్యులు మాయా అనుశబ్దమునకు "మంశివం - ఆయతి - స్వభావతః ప్రాప్నోతీతి మాయా" అని విగ్రహమును జెప్పుటవలన, ఇట్టిమాయ అద్వైతులు జెప్పునట్లుగా మూలా విద్యారూపమైన మాయగాక, విమర్శనా శక్తి రూపమాయయైయున్నదని తెలియవలెను. ఈ మంత్రాశయమునే సిద్ధాగమము.

"మంశివం పరమంబ్రహ్మ - ప్రాప్నోతీతి స్వభావతః।
మాయేతి ప్రోచ్యతేలోకే - బ్రహ్మనిష్ఠా సనాతనే ॥

అను నీ శ్లోకముచేత బోధింపబడుచున్నది.

"అఖుస్తే రుద్రపశుస్తం - జుషస్వైషతే రుద్రభాగ ః।
సహస్వస్రాసంబికయాతం జుషస్వ (1-8-6)

- అనునీమంత్రముతో శక్తినిత్యత్వమును ప్రతిపాదించుచున్నది. ఈమంత్రమునందు స్వస్రా - అంబికయా "అనుపదములను పరిశీలించినచో పరమాత్ముని యందలి శక్తి సహజముగా నున్నదనియు సిద్ధమగుచున్నది.

*॥నమః సోమాయచ - రుద్రాయచ (త్రై.సం.4-5-8)*

- అనుశ్రీరుద్రమంత్రముకూడ, పరమేశ్వరుడు ఉమారూపశక్తితో గూడియున్నాడని బోధించుచున్నది, ఇదే ఆశయమును కైవల్య శ్రుతి గూడ ...

*॥ఉమా సహాయం - పరమేశ్వరం ప్రభుం (1-7)*

- అను మంత్రముచేత సమర్థించు (ధ్రువపరచు) చున్నది. ఇదే విధముగా ననేక శ్రుతివాక్యములు శక్తినిత్యత్వమును - శివసమేతత్వమును ప్రతిపాదించుచున్నవి.

॥యథాచంద్రే స్థిరాజ్యోత్స్నాం విశ్వ వస్తుప్రకాశినీ।
తథాశక్తిర్విమర్శాఖ్యా - ప్రకాశేబ్రహ్మణిస్థిరా ॥32॥

అంతఃకరణ రూపేణ-జగదంకురరూపతః।
యస్మిన్ విభాతిచిచ్ఛక్తి - ర్బ్రహ్మోభూతఃసఉచ్యతే॥ ॥36॥
(సి,శి,పరిచ్ఛేదే20)

సమస్తవస్తువులను ప్రకాశ పరచునట్టి చంద్రిక చంద్రునిలో ఎట్లు స్థిరపడియుండునో, అట్లే ఈ చరాచరాత్మకమైన సమస్త వస్తు సముదాయమును ప్రకాశింపజేయు విమర్శనాశక్తి ప్రకాశ స్వరూపమగు పరబ్రహ్మమునందు స్థిరమై యున్నదనియు విమర్శనా శక్తి మూలాహంకార రూపమునను సూక్ష్మమైన జగద్రూప మనియు, అదియెవనియందు ప్రకాశించుచున్నదో, వాఁడే పరబ్రహ్మస్వరూపుడనియు సిద్ధాంత శిఖామణిలో శక్తి స్వరూపము స్ఫుటముగా ప్రతిపాదించబడినది. లోక ప్రసిద్ధి గాంచిన కాళిదాసమహాకవి గూడ తనచే రచింపఁబడిన రఘువంశ కావ్యము ప్రారంభమునందు

శ్లో॥ వాగర్థావివసంపృక్తౌ - వాగర్థప్రతిపత్తయే।
జగతఃపితరౌ వందే-పార్వతీపరమేశ్వరౌ॥

అనియు మంగలాచరణమును జెప్పియున్నాడు. ఈ మంగలశ్లోకమున పార్వతీ పరమేశ్వరులు శబ్దార్థముల మాదిరి నిత్యసంబంధముతో గూడియున్నారనియు ఉల్లేఖించి యున్నాడు. పార్వతీ పరమేశ్వరులనగా శక్తి-శివుడని యర్థము.

శబ్దమును వీడి అర్థముండదు, అర్థమును వీడి శబ్దమెట్లుండదో, అట్లే-శివుని వీడి శక్తి గాని శక్తిని వీడి శివుడుగాని ఉండరని మహాకవిశ్రీ కాళిదాసుని అభిప్రాయము.

వీరశైవ సిద్ధాంతమున బ్రహ్మనిర్విశేషముగా నుండక సవిశేషముగా నుండును, పరబ్రహ్మము శక్తి విశిష్టమైనందున సవిశేషమనఁబడుచున్నది. బ్రహ్మము సవిశేషమగుట వలననే,చరాచరజగదుత్పత్తికి కారణీభూతమైయున్నది. శక్తి విశిష్టబ్రహ్మమునుండి యుత్పన్న మైన ఈ జగత్తుగూడ శక్తి విశిష్టమై యున్నది. ఇట్టి ప్రపంచమునందున్నట్టి ప్రతి పదార్థమును పరిశీలించి చూచినచో ప్రతియొక్క పదార్థమునందునుఒక్కొక్క రీతిగా శక్తి యున్నట్లుగా నగుపడుచున్నది. పృథివీయందు ధారణశక్తి, జలమునందు అప్యాయన(ప్రేమ)శక్తి. తేజస్సు నందు ఉజ్జ్వలనశక్తి, వాయువులో స్పందనశక్తి, అకాశమున వ్యాపకశక్తి. ఆత్మలో బుద్ధి శక్తి ఉన్నది. అంతేగాకుండ వృక్షాదులలో జలాకర్షణాదిశక్తి, అగ్ని మున్నగు వానిలో దహనాదిశక్తి వనస్పతులలో గొప్పగొప్పరోగములను నశింపచేయుశక్తి, వజ్రములో శిలను ఛేదించేశక్తి, మణి-మంత్రాదులలో విషప్రభావమును, భూత-ప్రేత-పిశాచాదులతో నుత్పన్నములైన బాధలను నశింపచేయు శక్తి, ధ్వన్యాకర్షక యంత్రము (రేడియో)లో శబ్దమును ఆకర్షించి దానిని విస్తరింపజేయు శక్తి, విద్యుత్తులోననేక ప్రకారములైన యంత్రములను నడిపించే శక్తి, సూదంటురాయిలో సూదిని తనవైపులాక్కునే శక్తి, చీమలో వృక్షమూలము(వేఱు)ను వాసన జూచుట చేత వృక్షాగ్రముననున్న ఫలమును కనుగొనేశక్తిని, ఒంటెలో శ్వాసద్వారా కర్ప మును ఆకర్షించుకునే శక్తిని. ఇదే విధముగా బ్రహ్మ సృష్టియంతర్గతమైన సమస్త పదార్థము లందును ఒక్కొక్క విధమైన-శక్తియుండుట లోకమందలి ప్రతియొక్కరికి ప్రత్యక్షముగా కనబడుచున్నది. దీనితో సమస్త- చరాచరాత్మకమైన జగత్తుశక్తి విశిష్టమైయున్నదనియు, ఇట్టి శక్తి విశిష్టమైన ఈ జగత్తును నిర్మించిన బ్రహ్మ అర్థాత్ శక్తి విశిష్టమైనదని సమస్తజనులకు అనుభవవేద్యమైనదేగదా? సత్-చిత్-ఆనందస్వరూపమగునీపరబ్రహ్మ" అమి ప్రకాశేనందాస్మి" అనగా నేను ఉన్నాను. ప్రకాశించు చున్నాను ఆనందించుచున్నాను, అను అనుభవముచేత గూడియున్నదే! ఇట్టియనుభవమే పరబ్రహ్మయొక్క విమర్శనాశక్తియనబడును. ఈ అనుభవము అట్టి పరబ్రహ్మలో లీనముకానిచో ఆ బ్రహ్మమునకు ప్రకాశ రూపమగుస్ఫటిక-శిలామాదిరి జడమైనదనిచెప్పే ప్రసంగమేర్పడును. సౌందర్య విశిష్టుడైన అట్టి వానికి తన సౌందర్యమును దెలుసుకునే శక్తి లేని కారణమున అతనికి ఆ సౌందర్యము వృథాయగునట్లుగా బ్రహ్మమునకు తన సచ్చిదానంద స్వరూపమునుదెలుసుకునే శక్తిలేని ఎడల తనలో లీనమైయున్న సచ్చిదానంద

స్వరూపము వ్యర్థమగును గదా? అందుచేత బ్రహ్మమునందు సచ్చిదానంద రూపానుభవ శక్తిని యంగీకరించక తప్పదుగదా!

ఆ కారణమున బ్రహ్మము శక్తి విశిష్టమైనదని సిద్ధమైనది. ఇట్టి శక్తి విశిష్టమగు పరబ్రహ్మము - 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా, "చైతన్యమాత్మా" ఇత్యాదిబ్రహ్మసూత్ర - శివసూత్ర మయ మగు వేదాంత శాస్త్ర ప్రతిపాద్యమై యొప్పియున్నది. ॥8॥

॥శ్లో॥ యయా మహేశ్వరః శంభుర్నామరూపాదిసంయుతః
తస్యై మాయాస్వరూపాయై నమః పరమశక్తయే ॥ 9 ॥

శివాద్యా2 దిన2 ముత్పన్నా శాంత్యతీతపదోత్తరా
మాతరం తాం సమస్తానాం వందే శివకరీం శివాం ॥ 10 ॥

ఇచ్ఛాజ్ఞానాది రూపేణ యా శంభోర్విశ్వభావినీ
వందే తాం పరమానందప్రబోధలహరీం శివాం ॥ 11 ॥

అమృతార్థం ప్రపన్నానాం యా సువిద్యా ప్రదాయనీ
అహర్నిశమహం వందే తా మీశానమనోరమాం ॥12 ॥

తనలో నిత్య సంబంధమై యున్న యే శక్తి వలన పరమేశ్వరుడు నామ-రూప-క్రియాదులతో గూడియున్నాడో, జగదుత్పత్తికి కారణీభూతమైన మూలప్రకృతి స్వరూప మైన అట్టి పరమశక్తికి నా నమస్కారము (9) ॥౯॥ శాంత్యతీతోత్తరకలా (విమర్శనాశక్తి) స్వరూపిణి యగునామె పరమశివుని చేత సృష్ట్యాదియందు ఆవిర్భవించినదో, సమస్తప్రపంచమునకు మాతృ స్వరూపము మంగళదాయకమునైన ఆ సర్వ మంగళాదేవికి నమస్కరించుచున్నాను॥౧౦॥ (10) ఈమె పరమశివునికి జ్ఞానశక్తి - క్రియాశక్తి-ఇచ్ఛాశక్త్యాదిరూపముతోనే జగత్తును ప్రకాశింప జేయుచున్నదో, చిదానంద-లహరీ స్వరూపిణియగు నాయుమాదేవికినమస్కరించుచున్నాను ॥౧౧॥ (11) ముక్తిని గోరి తన నాశ్రయించి శరణాగతులైన వారికి ఏయేతత్వమస్యాది మహావాక్య ప్రకాశిత మగుశివజీవైక్య విద్యను అనుగ్రహించుచున్నదో అట్టి పరమశివశక్తికి రేయింబవళ్ళు నేను నమస్కరిం చు చున్నాను.॥౧౨॥ (12)

## ఈ గ్రంథకర్తయగు శ్రీ శివయోగి శివాచార్యులవారి వంశవర్ణనము

## - గ్రంథకర్తృ వంశవర్ణనం -

॥శ్లో ॥ ఆసీదా చారసిద్ధానామగ్రణీః శివయోగినాం
శివయోగీతి విఖ్యాతః శివజ్ఞాన మహోదధిః ॥ 13 ॥

శివభక్తి సుధాసింధుజృంభణామల చంద్రికా
భారతీ యస్య విదధే ప్రాయః కువలయోత్సవం ॥ 14 ॥

తస్య వంశే సముత్పన్నో, ముక్తామణిరివామలః
ముద్దదేవాభిధాచార్యో మూర్ధన్యః శివయోగినాం ॥ 15 ॥

ముద్దానాత్ సర్వజంతూనాం ప్రణతానాం ప్రబోధతః
ముద్దదేవ ఇతి ఖ్యాతా సమాఖ్యా యస్య విశ్రుతా ॥ 16 ॥

తస్యాసీన్నందనః శాంతః సిద్ధ నాథాబిధః శుచి :
శివ సిద్ధాంత నిర్ణేతా శివాచార్యః శివాత్మకః ॥17॥

సదాచార సంపన్నులైన శివయోగులలో నగ్రగణ్యుడు శివజ్ఞానమునకుసాగరము వంటివాడు. ఐన"శివయోగి శివాచార్యులనునాతడు ఈ గ్రంథకర్తవంశములో సుప్రసిద్ధుడయ్యెను. ॥13॥ ఏశివాచార్యుని దివ్యవాణి శివభక్తిరూపమైన అమృత సముద్రము నుప్పొంగించుటలో స్వచ్ఛమైన వెన్నెల స్వరూపము వంటివాడై భూమండలమను కలువ పువ్వునకు ఆనందమును గలుగజేసెనో అట్టి శివయోగి శివాచార్యుని వంశసముద్రమున నిర్మలమైన ముత్యమువలె శివయోగ శిఖామణియగు "ముద్దదేవశివాచార్యుడను ఆచార్యుడు జన్మించెను.(14-15) శరణాగతమైన సమస్త ప్రాణికోటికి సద్బోధచేత ఆనందమును గలిగించుటచే ఏ ఆచార్యునకైతే "ముద్దదేవ అనుపేరు సర్వత్ర ప్రసిద్ధమైనదో ఆ ముద్దదేవ శివాచార్యునకు, శాంతి స్వరూపుడు పవిత్రుడు శివ స్వరూపుడు, శివాద్వైత సిద్ధాంత నిర్ణేతయైన సిద్ధ నాథ శివా-చార్య, అను పేరుగల పుత్రుడు జన్మించెను.॥ ॥16-17॥

ఎవనిని ఆచార్యులు వీరశైవబృందమునకు (సమూహమునకు) శిఖామణి స్వరూపునిగాను, శ్రేష్ఠమైన ఆచారమే సంపదగల్గిన వానిగాను, శివజ్ఞానమునకు మహా సాగర స్వరూపుడయ్యు, ముక్తకంఠముతో పొగడుచుందురో, ఏ ఆచార్యుని వంశములో

సదాచారముల మూల ముత్పన్నమాయెనో ఏ ఆచార్యునియందునిరుపద్రవమైన శివభక్తి దృఢపడి నదో, వీరశైవాచార్యులకు శిఖామణి స్వరూపుడైన సిద్ధ నాథ శివాచార్యునకు, సముద్రము నుండి చంద్రుడుదయించినట్లుగా శివయోగశివాచార్యుడను, పుత్రుడు దయించెను.

## శ్రీ శివయోగి శివాచార్యుల వర్ణనము

॥శ్లో॥ వీరశైవ శిఖారత్నం విశిష్టాచారసంపదం
శివజ్ఞాన మహాసింధుం యం ప్రశంసంతి దేశికాః ॥ 18 ॥

యదాచార్యకులే జాతా సతామాచారమాతృకా
శివభక్తిః స్థిరా యస్మి జజ్ఞే విగత విప్లవా ॥ 19 ॥

తస్య వీరశివాచార్య శిఖారత్నస్య నందనః
అభవచ్ఛివయోగీతి సింధోరివ సుధాకరః ॥ 20 ॥

18-19)చిదానంద స్వరూపుడు పరాకాశ స్వరూపుడును అయిన పరశివస్వరూపాను భవముచేత శివయోగి అను పేరు ఎవనికి ఆచార్యునిలో యధార్ధముగా అన్వయమగునో (సార్ధకత యగునో) శివాగమ జ్ఞానము యొక్క పరిపాకము చేత నత్యంతసువాసనగలయే ఆచార్యుని కీర్తి కుసుమము దశ దిశలను సుగంధ విశిష్ఠముగా మార్చెనో, బౌద్ధ జైనాధిప్రతికూల సిద్ధాంత ములను గొప్ప అంధకారమునకు సూర్యుని వలెనున్న ఏ ఆచార్యుని వలన సనాతనమగు శివభక్తి రక్షింపబడెనో అట్టి శివతత్వ జ్ఞానమను వెన్నెల చేత నా వృతమయ్యెనో అట్టి చంద్రునింబోలు వీరశైవ ధర్మమార్గప్రవర్తకుడు అయిన, ఆ శివయోగి శివాచార్యుడు కామికాది వాతులాంత-మగు ఇరువదియెనమిది శివాగమములను నమస్త పురాణములను కూలంకషముగా పరామర్శించి వేద మార్గమునకు అనుకూలముగానున్న సమస్త ధర్మాచారము సంసిద్ధికై, అనత్య మార్గప్రవిష్ఠబౌద్ధాది సిద్ధాంతముల నిరసనము కొరకు, జ్ఞానుల మనస్సంతోష మునకుగాను, నిఖలనిగమాగ-మార్ధ ప్రకాశమగు, నిర్మల హృదయముగల జ్ఞానుల చేతనంగీకృతమైన, సమస్త దోషములచేత దూరీకృతమైన, సమస్తపురాణాగమాదులలో శివుని చేత పార్వతికి-షణ్ముఖునకు, ఉపదేశింపబడిన, శివసాంప్రదాయ స్థాపకుడు, మహాత్ముడుఐన శ్రీ రేణుక గణాధీశ్వరుడు, ఈ భూమండలమునందు దివ్య దేహధారియై యవతరించి అగస్త్య మహర్షికి యుపదేశించిన నూటొక్కన్థలములతో గూడిన వీరశైవ మహాశాస్త్రమును లోకమునుద్ధరించుట కొరకు బోధించియున్నాడు.

## శ్రీ శివయోగి శివాచార్య వర్ణనం

॥శ్లో॥ చిదానంద పరాకాశ శివానుభవయోగ్యతః
శివయోగీతి నా మోక్తి ర్యస్య యాథార్థ్యయోగినీ ॥ 21 ॥

శివాగమ పరిజ్ఞాన పరిపాకసుగంధినా
యదీయకీర్తి పుష్పేణ వాసితం హరితాం ముఖం ॥ 22 ॥

యేన రక్షావతీ జాతా శివభక్తి : సనాతనీ
బౌద్ధాదిప్రతిసిద్ధాంత మహాధ్వాంతాంశుమాలినా ॥ 23 ॥

స మహావీర శైవానాం ధర్మమార్గప్రవర్తకః
శివతత్త్వ పరిజ్ఞాన చంద్రికా వృత చంద్రమాః ॥ 24 ॥

ఆలోక్య శైవతంత్రాణి కామికాద్యాని సాదరం
వాతులాంతాని శైవాని పురాణా న్యఖిలాని తు ॥ 25 ॥

వేదమార్గా విరోధేన - విశిష్టాచార సిద్ధయే
అసన్మార్గ నిరాసాయ - ప్రమోదాయవివేకినాం ॥ 26 ॥

సర్వస్వం వీరశైవానాం సకలార్థ ప్రకాశకం
అస్పృష్టమఖిలైర్దోషైరాదృతం శుద్ధమానసైః ॥ 27 ॥

శైవాగమేషు సర్వేషు పురాణే ష్వఖిలేషుచ
పురా దేవేన కథితం దేవ్యై తన్నందనాయ చ ॥ 28 ॥

తత్సంప్రదాయసిద్ధేన రేణుకేన మహాత్మనా
గణేశ్వరేణ కథితమగ స్త్యాయ పునః క్షితౌ ॥ 29 ॥

వీర శైవ మహాతంత్ర మేకోత్తరశతస్థలం
అనుగ్రహాయ లోకానామభ్యధాత్ సుధియాం వరః ॥ 30 ॥

సర్వేషాం శైవతంత్రాణా ముత్త రత్నాన్నిరుత్తరం
నామ్నా ప్రతీయతే లోకే మత్సిద్ధాంతశిఖామణిః ॥ 31 ॥

అనుగతసకలార్థే శైవతంత్రైః నమస్తైః
ప్రకటితశివబోధాద్వైత భావ ప్రసాదే

విదధతు మతిమస్మిన్ వీరశైవా విశిష్టాః
పశుపతిమత సారే పండితశ్లాఘనీయే ॥ 32 ॥

21-22-23-24-25-26-27-28-29-30-31 11 నుండి 32 వరకు

ఏవీరశైవ మహాతంత్రము సమస్త శైవమంత్రములలో శ్రేష్ఠముగా నుంటవలన అత్యంత శ్రేష్ఠమైనదిగాను లోకములో సిద్ధాంత శిఖామణి, అను పేరుతో ప్రసిద్ధి జెంది యున్నది.॥31॥ సమస్త శివాగమముల ననుసరించుచున్న రహస్యార్థమును ప్రతిపాదించదగినది. శివజ్ఞానముతో గలిగిన శివాద్వైత భావరూపప్రసాదమును ప్రకటించునది. శివమతముయొక్క సారముగలది. పండిత మాన్యులచేత శ్లాఘనీయమైనది- ఈ సిద్ధాంత శిఖామణియందు వీరశైవోత్తములు పూజ్యబుద్ధి నుంచవలెను. ॥32॥

ఇతి శ్రీసిద్ధాంత శిఖామణౌ శివయోగి శివాచార్య
వంశ వర్ణనం నామ ప్రథమ పరిచ్ఛేదః పరిసమాప్తః

ఇది శ్రీసిద్ధాంత శిఖామణిలో శివయోగి శివాచార్య
వంశ వర్ణనాత్మకమగు ఒకటవ పరిచ్ఛేదము పరిసమాప్తమైనది.



# శ్రీసిద్ధాంత శిఖామణి

## ద్వితీయ పరిచ్ఛేదః

## రెండవ పరిచ్ఛేదము

### జగత్సృష్టి విచారః

॥శ్లో॥ సచ్చిదానందరూపాయ సదసద్వ్యక్తి హేతవే
నమః శివాయ సాంబాయ సగణాయ స్వయంభువే ॥ 1 ॥

సదాశివ ముఖా శేష తత్త్వ మౌక్తికశుక్తికాం
వందేమాహేశ్వరీం శక్తిం మహామాయాదిరూపిణీం ॥ 2 ॥

అస్తి సచ్చిత్సుఖాకారమలక్షణ పదాస్పదం
నిర్వికల్పం నిరాకారం నిరస్తా శేష విప్లవం ॥ 3 ॥

పరిచ్ఛేదకథాశూన్యం ప్రపంచాతీత వైభవం
ప్రత్యక్షాది ప్రమాణా నామగోచరపదే స్థితం ॥ 4 ॥

స్వప్రకాశం పరాకాశమనౌపమ్యమనామయం ॥ 5 ॥
సర్వజ్ఞం సర్వగం శాంతం సర్వశక్తి నిరంకుశం

శివరుద్ర మహాదేవభవాది పదసంజ్ఞికం ॥ 6 ॥
అద్వితీయమనిర్దేశ్యం పరం బ్రహ్మ సనాతనం

తత్ర లీనమభూత్ పూర్వం చేతనాచేతనం జగత్ ॥ 7 ॥
స్వాత్మలీనం జగత్కార్యం స్వప్రకాశ్యం తదద్భుతం

శివాభిదం పరంబ్రహ్మ జగన్నిర్మాతుమిచ్ఛయా
స్వరూపమాదధే కించిత్ సుఖ స్ఫూర్తి విజృంభితం ॥ 8 ॥

నిరస్త దోష సంబంధం నిరుపాధిక మవ్యయం
దివ్యమప్రాకృతం నిత్యం నీల కంఠం త్రిలోచనం ॥ 9॥

చంద్రార్ధ శేఖరం శుద్ధం శుద్ధస్ఫటిక సన్నిభం
శుద్ధముక్తా ఫలాభాసముపాస్యం గుణమూర్తిభిః ॥ 10 ॥

విశుద్ధజ్ఞానకరణం విషయం సర్వ యోగినాం
కోటి సూర్య ప్రతీకాశం చంద్ర కోటి సమప్రభం
అప్రాకృత గుణాధారమనంతమహిమాస్పదం ॥ 11 ॥

తదీయా పరమాశక్తిః సచ్చిదానంద లక్షణా
సమస్త లోకనిర్మాణ సమవాయస్వరూపిణీ
తదిచ్ఛయాభవత్ సాక్షాత్ తత్స్వరూపానుకారిణీ ॥ 12 ॥

సశంభుర్భగవాన్ దేవః సర్వజ్ఞః సర్వశక్తికః
జగత్సిసృక్షుః ప్రథమం బ్రహ్మాణం సర్వదేహినాం
కర్తారం సర్వలోకానాం విదధే విశ్వనాయకః ॥ 13 ॥

తస్మై ప్రథమపుత్రాయ శంకరః శక్తిమాన్ విభుః
సర్వజ్ఞః సకలా విద్యా ః సానుగ్రహము పాదిశత్ ॥ 14 ॥

ప్రాప్త విద్యో మహాదేవాద్బ్రహ్మ విశ్వనియామకాత్
సమస్త లోక నిర్మాణసముద్యోగ పరో2భవత్ ॥ 15 ॥

కృతో ద్యోగోన పి నిర్మాణే జగతాం శంకరాజ్ఞయా
అజ్ఞాతో పాయసంపత్తి రభవన్మా యయావృతః ॥ 16 ॥

విధాతుమఖిలాన్ లోకానుపాయం ప్రాప్తుమిచ్ఛయా
పునస్తం ప్రార్థయామాస దేవదేవం త్రిలోచనం ॥ 17 ॥

నమస్తే దేవదేవేశ నమస్తే కరుణాకర
అస్మదాదిజగజ్జాలనిర్మాణ విధిషు క్షమః ॥ 18 ॥

ఉపాయం వద మే శంభో జగత్సృష్టౌ జగత్పతే
సర్వజ్ఞ ః సర్వ శక్తిస్త్వం సర్వకర్తాసనాతనః ॥ 19 ॥

ఇతి సంప్రార్థితః శంభుర్బ్రహ్మణా విశ్వనాయకః
ఉపాయమీరద త్తస్మైలోకసృష్టి ప్రవర్తకం ॥ 20 ॥

ఉపాయమీశ్వరేణోక్తం లబ్ధ్వాపి చతురాననః
న సమర్థో భవత్కర్తుం నానా రూపమిదం జగత్ ॥ 21 ॥

పునస్తం ప్రార్థయామాస బ్రహ్మా విహ్వలమానసః
దేవ దేవ మహాదేవ జగత్ప్రథమకారణ ॥ 22 ॥

నమస్తే సచ్చిదానంద స్వేచ్ఛా విగ్రహరాజిత
భవ శర్వ మహేశాన సర్వకారణ కారణ ॥ 23 ॥

భవదుక్తోక ప్యుపాయో మేన కించిద్ జ్ఞాయతే ధునా
సృష్టిం విధేహి భగవన్ ప్రథమం పరమేశ్వర
జ్ఞాతో పాయస్తతః కుర్యాం జగత్సృష్టి ముమాపతే ॥ 24 ॥

ఇత్యేవం ప్రార్థితః శంభుర్బ్రహ్మణా విశ్వయోనినా
ససర్జాత్మ సమప్రఖ్యాన్ సర్వజ్ఞాన్ సర్వశక్తికాన్ ॥ 25 ॥

ప్రబోధ పరమానంద పరివాహిత మానసాన్
ప్రమథాన్ విశ్వ నిర్మాణ ప్రలయాది విధక్షమాన్ ॥ 26 ॥

సృష్ట ప్రమథవర్గేషు వర్ణాశ్రమ పరిక్రమాన్
అప్రాకృత సదాచారా నుపాదిశ దథ ప్రభుః ॥ 27 ॥

సచ్చిదానంద స్వరూపుడు, చేతనా చేతనాత్మక ప్రపంచ నిర్మాణ కారణీభూతుడు, ప్రమథగణసమేతుడు పార్వతీయుతుడు, స్వయంభువుడైన పరమశివునకు నా నమస్కారము ॥1॥ శివాదిభూమ్యంతమగు ముప్పదియారు తత్వములను ముత్యములకు శుక్తికాస్వరూపమైన విమర్శనా శక్తి రూపోర్ధ్వమాయాది స్వరూపురాలైన శక్తికి నా నమస్కారము. ॥2॥ సచ్చిదానంద స్వరూపము, మోక్షస్థానమునకు మూలము, నిర్వికల్పము - నిర్వికారము, నిరాకారము, (హేయాకారరహితము) సమస్తోపద్రవమునకు దూరమైనది. పరిచ్ఛేదనార్తా శూన్యము, సీమాతీతవైభవయుతము, ప్రత్యక్షాది ప్రమాణములకు అగోచరమైనది. స్వతఃప్రకాశమానము పరాకాశ స్వరూపము, ఉపమాతీతము, జనన-మరణ దోషరహితుడు, సర్వజ్ఞుడు, సకలచరాచరాత్మక ప్రపంచవ్యాపకుడు, శాంతుడు, నానావిధ ప్రక్రియశక్తి సమ న్వితము ప్రతిబంధరహితము -శివ-రుద్ర-మహాదేవ-భవాది నామ సహితము, సనాతనము, అనిర్దేశ్యము, అద్వితీయమునైన పరబ్రహ్మము ప్రకాశించుచున్నది. ॥3,4,5,6 ॥ అట్టి పరబ్రహ్మము నందు సృష్టికంటెను మొదలు చేతనా చేతనాత్మక మైన ఈ జగత్తు ఉభయేంద్రియములకు అగోచరమై గుప్తముగా నుండినది. ఈ విధముగా తనలో గుప్తముగా నున్నదిగాను అద్భుతమైనదియు, కార్యరూపమైనదిగాను ఉండిన ఈ

జగత్తు, తన చేతనే ప్రకాశింపబడిన దనుటకు యోగ్యమైనది. శివనామముతో బ్రసిద్ధిగాంచిన అట్టి పరబ్రహ్మము జగత్తును నిర్మాణముగావించవలెనను అభిలాషతో జనన-మరణాది సమస్త దోషరహితమైనది, ఉపాధికి దూరము, నాశరహితము దివ్యము, అప్రాకృతము,నిత్యము, నీలకంఠయుతము, త్రినేత్రయుతము, చంద్రధారణయుతము, శుద్ధము, శుద్ధ స్ఫటిక సమానము. శుద్ధ మౌక్తిక సమానము, కాంతియుతము, బ్రహ్మాదిగుణమూర్తుల చేతను పొన్యము, శుద్ధ జ్ఞానకారణీభూతము సమస్త యోగిపుంగవులకువిషయము, కోటి సూర్యసమానమైన ప్రకాశము-కోటి చంద్రసమానమగు కాంతిమయము. అప్రాకృత గుణాధారము అనంతమహిమోపేతము, ఆనందస్ఫూర్తియుత మునైన ఒకానొక స్వరూపమును దాల్చెను ॥8-9-10-11॥ సమస్త లోకముల నిర్మాణమునందు సమవాయస్వరూపముననున్న పరమశివునకు సంబంధించిన విమర్శనా శక్తి పరమశివుని ఇష్టానుసారముగా, సాక్షాత్తుగానాతని స్వరూపమునే అనుకరించినదయ్యెను. ॥12॥ భగవంతుడు సర్వశక్తి సమన్వితుడు జగత్ప్రభువు, సర్వజ్ఞుడునైన అట్టి పరశివమూర్తి ఈ ప్రపంచమును సృష్టింపనెంచి

"విశ్వాధికోరుద్రోమహర్షిః- హిరణ్యాగర్భంజనయామాస-పూర్వం" అనువేద వాక్య ప్రమాణానుసారముగా ఆదిలో పదునాలుగు లోకములను మరియు ప్రాణులను నిర్మించే చతుర్ముఖబ్రహ్మను సృష్టించెను ॥14 ॥ సర్వశక్తి సంపన్నుడు సర్వవ్యాపి. సర్వజ్ఞుడైన శివుడు తనకు ప్రథమ పుత్రుడైన బ్రహ్మకు అనుగ్రహ పూర్వకముగా సమస్త విద్యలనుపదేశించెను ॥15॥విశ్వనియామకుడైన మహాదేవునిచేత బ్రహ్మ సృష్టిరచనాదివిద్యను బొంది సమస్త లోకముల నిర్మాణోద్యోగమునందు నిరతుడయ్యెను ॥16॥ శంకరునియాజ్ఞానుసారముగా బ్రహ్మ జగన్నిర్మాణమునందు ద్యుక్తుడయ్యెను ॥17॥ అయినను మాయాపరివృత్తుండగుట వలన నిర్మాణోపాయమును ఎరుగడయ్యెను. అప్పుడు బ్రహ్మలోకనిర్మాణోపాయమును దెలిసికొన కోరికగలవాడై మరల శ్రీ శంకరుని బ్రార్థించెను. ॥18॥ ఓ దేవాధి దేవా! కరుణా సాగరా! నన్ను మొదలుకొని సమస్త ప్రపంచముల నిర్మాణ విధియందు సమర్థుడవైన ఓ దేవా !జగత్ప్రభూ! శంభోనీవు సర్వజ్ఞుడవు! సర్వశక్తి సమన్వితుండవు, సర్వ కర్తవు, సనాతనుండవు. అగుటవలన నాకు జగన్నిర్మాణోపాయమును బోధించుము అని బ్రహ్మ శివునియనేక విధములుగా స్తుతింపగా, అప్పుడు శివుడు బ్రహ్మకులోకముల నిర్మాణోపాయమును దెలియపరచెను.॥ 19-20-21 ॥ బ్రహ్మశివుడు బోధించిన ఉపాయమును దెలిసిన వాడైనప్పటికిని యనేక రూపము లతోనున్న జగత్తును నిర్మించుటకు

అసమర్థుడయ్యెను ॥22॥ అప్పుడు బ్రహ్మావ్యాకుల మనస్సుగలవాడై మళ్ళీ పరమశివుని బ్రార్థించెను. దేవదేవా! ఓ మహాదేవా!జగదాదికి కారణీభూతుండవైన - సచ్చిదానంద స్వరూపుఁడా! స్వేచ్ఛా విగ్రహధారీ, భవా!శర్వా! మహేశ్వరా! సర్వకారణకారణా!నీవు నాకు ఈ మొదలు జగత్సృష్టియుపాయమును దెలిపినను, నాకు తేటముగా దేలియకున్నది. మీ చేతనేను జగత్సృష్టి పద్ధతిని లెస్సగా దెలసికొన్న పిదప జగత్సృష్టిని ప్రారంభింతును అని బ్రహ్మశివుని ప్రార్థింపగా అప్పుడు శంకరుడు తనకు సమానమైన ప్రతిభగలవారు సర్వజ్ఞులు సర్వశక్తి సంపన్నులు, జ్ఞానానందమయ మనస్కులు, జగన్నిర్మాణలయాది కార్యవిధానమునందు సమర్థులు ఐన శ్రీరేణుకా దారుకాద్యనంత జనప్రమథులను సృష్టించెను. ॥23-24-24-25-26॥ శివుడు తనచేత సృష్టించబడిన ప్రమథ సమూహమునకు శివవర్ణాశ్రమ ధర్మముల క్రమమును అప్రాకృతసదాచారములను ఉద్బోధించెను. బ్రహ్మశివుని వలన నిర్మించబడిన సృష్టియుపాయమును దెలిసికొని తరువాత సృష్టి నిర్మాణమును గావించెను ॥27॥

ఇతి శ్రీసిద్ధాంత శిఖామణౌ జగత్సృష్టి విచారో
నామ ద్వితీయ పరిచ్ఛేదః పరిసమాప్తః

ఇది శ్రీసిద్ధాంత శిఖమణియందలి జగత్సృష్టి నిర్మాణాత్మకమైన
రెండవ పరిచ్ఛేదము సమాప్తము



# శ్రీ సిద్ధాంత శిఖామణి

## తృతీయపరిచ్ఛేదః

### మూడవ పరిచ్ఛేదము

॥శ్లో॥ కదాచిదథ కైలాసే కలధౌత శిలామయే
గంధర్వ వామనయనా క్రీడామౌక్తిదర్పణే ॥ 1 ॥

మందారబకులాశోక మాకందప్రాయ భూరుహే
మల్లీ మరందనిష్యందపాన పీనమధుప్రతే ॥ 2 ॥

కుంకుమస్తబకామోదకూలంకష హరిన్ముఖే
కలకంఠకులాలాపకందల ద్రాగబంధురే ॥ 3 ॥

కిన్నరీగీత మాధుర్య పరివాహిత గహ్వరే
సానంద వరయోగీంద్ర బృందాలంకృతకంధరే ॥ 4 ॥

హేమారవిందకలికాసుగంధిరసమానసే
శాతకుంభమయోత్తుంగ శతస్తంభ విరాజితే ॥ 5 ॥

మాణిక్య దీపకలికామరీచిద్యోతి తాంతరే
ద్వారతోరణ సంరూఢశంఖపద్మ నిధిద్వయే ॥ 6 ॥

ముక్తా తారకితో దార వితానాంబరమండితే
స్పర్శలక్షితవైడూర్యమయభిత్తి పరంపరే ॥ 7 ॥

సంచరత్ప్రమథశ్రేణీ పదవాబాలనూపురే
ప్రవాల వలభీశృంగ శృంగారమణి మంటపే ॥ 8 ॥

శ్రీ రేణుక దారుకాది ప్రమథ సమూహము భువికి అవతరించిన మీదట శివుని వాసస్థానమైనకైలాస పర్వత వర్ణనము, శివ శక్తుల వర్ణనమువిస్తృతముగా జేయబడినది.

ముందుగా కైలాసవర్ణనము:-

ద్వారములకు రెండు వైపుల శంఖ పద్మములను నిధులు కలదియు నక్షత్రములను పోలిన ముత్యములకూర్పుగల విలాసము కలదియు, స్పర్శచేతనే తెలియబడు

వైడూర్యమయమైన గోడలు కలదియు, అటునిటు సంచరించు ప్రమథగణముల పాదనూపురధ్వనులు కలదియు, పగడపుబుట్టగోడలు గల శృంగారమణిమంటపములు కలదియునై కైలాసము వెలుగొందుచుండెను. రజతమయ శిలావిశిష్టమైనది. గంధర్వ స్త్రీల క్రీడలకు ముత్యములముకురము (అద్దం) వలెనున్నదియు ॥1॥ మందార -బకుల-అశోక-మామిడి, మొదలైన వృక్ష విశేషములతో దట్టమైనదియు, మల్లె పుష్పములనుండి వెదజల్లబడిన మకరందపానముచేత పరిపుష్టములైన భ్రమరములు గలది. ॥2॥ ఎఱుపుపుష్పముల గుత్తులసువాసనలతో నిండిన సమస్త దిక్ప్రదేశములు గలది. కోకిలల మధుర ధ్వని చేతను నుప్పతిల్లిన (పుట్టిన) పంచమ స్వరముచేత మనోహరమైనదియు ॥3॥ కిన్నెర స్త్రీల సంగీత మాధుర్యము చేత వ్యాపించిన గహ్వర (గుహలు) ములుగలదియు సానందాదియోగీంద్రుల సమూహముచేత అలంకృతమైన కంధరములు గలదియు. బంగారు కమలముల సుగంధ రసముచేనిండిన మానస సరోవరముగలది, ఉన్నతమైన వందల కొలదిబంగారుస్తంభములతో విరాజిల్లునదియు ॥5॥

రత్నదీపశిఖతో వెలువడిన కిరణములతో ప్రకాశించుచున్న అంతఃపురముగలది, మహా ద్వార స్తంభములు గల రెండు ప్రదేశములందును శంఖ పద్మములను నిధులతో గూడియున్నట్టిదియు,॥6॥

నక్షత్రముల వలెనున్న ముత్యములతోడ విరచితమైన విశాల వితానముతో అలంకృతమైనది. స్పర్శముచేతనే గుర్తింపవలసిన వైడూర్యాది మణిమయమైన భిత్తుల వరుసతో గూడియున్నదియు,॥7॥

అక్కడక్కడ సంచరించుచున్న ప్రమథుల చరణముల యందున్న గజ్జెల పంక్తితో శబ్దాయ మానమైనది, పగడములతో కట్టబడిన ప్రాకార శిఖరములతో కూడిన క్రీడా మండపము గలదియైన కైలాస పర్వతము శోభిల్లుచున్నది. ॥5,6,7,8,॥

## శివవర్ణనము

॥శ్లో॥ వందారుదేవమకుట మందార రసవాసితం
రత్న సింహాసనం దివ్యమధ్యస్తం పరమేశ్వరం ॥ 9 ॥

తమాస్థానగతం దేవం సర్వలోకమహేశ్వరం
త్రయ్యంతకమలారణ్య విహారకలహంసకం ॥ 10 ॥

ఉదారగుణ మోంకారశుక్తికాపుటమౌక్తికం
సర్వ మంగల సౌభాగ్యసము దాయనికేతనం ॥ 11 ॥

సంసారవిషమూర్చాల జీవనం జీవనౌషధం
నిత్య ప్రకాశ నైర్మల్యం కైవల్యసురపాదపం ॥ 12 ॥

అనంతపరమానందమకరందమధువ్రతం
ఆత్మశక్తిలతా పుష్యత్త్రిలోకీపుష్పకోరకం ॥ 13 ॥

బ్రహ్మాండకుండికాషండపిండీకరణ పండితం
సమస్త దేవతా చక్రచక్రవర్తి పదే స్థితం ॥ 14 ॥

చంద్రబింబాయుత చ్ఛాయాదాయాదద్యుతివిగ్రహం
మాణిక్యముకుట జ్యోతిర్మంజరీపింజరాంబరం ॥ 15 ॥

చూడాలం సోమకలయా సుకుమారబిసాభయా
కల్యాణ పుష్పకలికాకర్ణ పూరమనోహరం ॥ 16 ॥

ముక్తావలయసంబద్ధరుండమాలా విరాజితం
పర్యాప్త చంద్రసౌందర్య పరిపంథిముఖశ్రియం ॥17॥

ప్రాతః సంపుల్ల కమల ప్రతీకాశత్రిలోచనం
మందస్మితమితాలా పమధురాధరపల్లవం ॥18॥

గండమండల పర్యంతక్రీడన్మ కర కుండలం
కాలిమ్నా కాలకూటస్య కంఠనాలే కలంకితం ॥19॥

మణి కంకణ కేయూర మరీచికర పల్లవై ః
చతుర్భిః సంవిరాజంతం బాహు మందార శాఖిభి ః ॥20॥

గౌరీపయోధరాశ్లేషకృతార్థభుజమధ్యమం
సువర్ణ బ్రహ్మ సూత్రాంకం సూక్ష్మకౌశేయవాసనం ॥21॥

నాభిస్థానావలంబిన్యా నవమౌక్తి కమాలయా
గంగయేవ కృతాశ్లేషం మౌలిభాగావతీర్ణయా ॥22॥

పదేన మణి మంజీర ప్రభాపల్లవితశ్రియా
చంద్రవత్ స్ఫాటికం పీఠం సమావృత్య స్థితం పురః ॥23॥

ఇంతటి మనోహరమైన కైలాసపర్వతముననతమస్తకులైన దేవతల యొక్క కిరీటము లందు శోభిల్లు చుండిన పారిజాత పుష్పముల పరాగముతో సుగంధిత మైన దివ్య రత్న శోభితమైన సింహాసనమునలంకరించిన ॥9॥ దేవాధి దేవుఁడు, సమస్తలోకాధిపతియు, వేదాంతరూపమైన కమల వదనమునందు విహరించెడి రాజహంసస్వరూపుడు ॥10॥ ఉదారగుణోపేతుడు, ఓంకారమనెడు శుక్తి కాపుటమందుదయించిన మౌక్తికస్వరూపుడు సర్వమంగలములకు, సర్వసౌభాగ్యములకు నిలయస్వరూపుడు ॥11॥ సంసారమనెడు విషముతో మూర్ఛనొందిన, జీవకోటికి సంజీవనౌషధస్వరూపుడైన, స్వయం ప్రకాశముచేత పరిశుద్ధుడు, మోక్షమనెడు కల్పవృక్షస్వరూపుడు ॥12 ॥ అపారమగు పరమానంద మనెడి మకరందమును పానమొనర్చుటలో భృంగమువంటి వాడును తనలోని నిత్య సంబంధముతో నుండిన శక్తి రూపమైనలతతో ముల్లోకముల నెడు పుష్పకోరక (మొగ్గలను) ములను సంరక్షించువాడును ॥13 ॥ అనంత బ్రహ్మాండములనెడు పాత్రల సమూహమును ఒకటిగా జేయుటలో నైపుణ్యతగల వాడును, సమస్తదేవతా సమూహమునకు సార్వభౌముడైన వాఁడును ॥14 ॥ పదివేల చంద్రుల ప్రతిబింబ ఛాయకు సదృశమైన తేజోమయశరీరముగల వాడును, సమస్తదేవతల రత్నమయ కిరీటముల నుండి విరజిమ్మిన కిరణములతో చిత్ర విచిత్రమగు వస్త్రాచ్ఛాదనము గలవాడును ॥15 ॥ మృదువైన కమలముతంత్రుల (కేసరముల) మాదిరి ప్రకాశించునట్టి చంద్రకళయనేశిరో భూషణముగలవాడును, మంగలమయకుసుమ -కోరకమనెడు కర్ణాభరణములచే తమనోహరుడైన వాడును ॥16॥

ముత్యాల హారములతో విరాజిల్లుచుండిన మరియు రుండమాలికతో గూడియున్న, పూర్ణ చంద్రుని సౌందర్యమును దిరస్కరించుచున్న ముఖకాంతిగలవాడును ॥17 ॥ ప్రాతః కాలమున వికసించిన పద్మములకు సదృశములైన మూడు నేత్రములుగలవాడును. చిరునవ్వుతోను, మితభాషణయుతుడునైన సుందరాధరములున్న వాడును ॥18 ॥ కపోలముల (చెక్కిళ్ళ) వరకుప్రేలాడుచుండిన మీనాకారమువలెనున్నట్టి కర్ణకుండలములుగల వాడును, కాల కూటవిషపానముచేతకప్పుగా మారిన కంఠముగలవాడును ॥19॥ రత్న కంకణములు మరియు రత్నమయ భుజకిరీటముల కాంతులతో గూడిన కరపల్లవములుగల వాడును, మందార వృక్షశాఖలకు సమానమైన నాలుగు హస్తములతో ప్రకాశించుచున్నవాడును ॥20॥

పార్వతీ దేవి యొక్కకుచాలింగనముచేత కృతార్థుడైన భుజములున్న వాడును సువర్ణమయమగు యజ్ఞోపవీతముచేత గూడిన వాడును, అత్యంత సూక్ష్మమైన (సన్నమైన)

పట్టు వస్త్రమును దాల్చిన వాడును ॥21॥ మస్తక ప్రదేశమునుండి క్రిందికి దిగి వచ్చిన గంగానది యో ఏమో అనునట్లు నాభిస్థానమువరకు వ్రేలాడుచున్న కొంగ్రొత్తనైన ముత్యాల హారముతో గూడిన వాడును ॥22॥రత్ననూపురముల కాంతి చేత చిగురు టాకుల శోభను ధరించిన చరణములతో చంద్రునివలె శుభ్రమైయున్నస్ఫటిక పీఠమునలంకరించి యున్న పరమేశ్వరుడు విరాజిల్లుచున్నాడు ॥23॥

## శక్తి వర్ణనము

వామపార్శ్వ నివాసిన్యా మంగల ప్రియ వేషయా
సమస్త లోక నిర్మాణ సమవాయస్వరూపయా ॥ 24 ॥

ఇచ్ఛాజ్ఞానక్రియా రూపబహుశక్తి విలాసయా
విద్యాతత్త్వ ప్రకాశిన్యా వినాభావ విహీనయా ॥ 25 ॥

సంసార విషకాంతార దాహవాదాగ్ని లేఖయా
ధమ్మిల్ల మల్లికామోదఝుంకుర్వద్భృంగ మాలయా ॥ 26 ॥

సంపూర్ణ చంద్ర సౌభాగ్య సంవాది ముఖ పద్మయా
నానామౌక్తికలావణ్య నాసీరస్మిత శోభయా ॥ 27 ॥

మణితాటంక రంగాంతర్వలితా పాంగలీలయా
నేత్రద్వితయసౌందర్య నిందితేందీవరత్విషా ॥ 28 ॥

కుసుమాయుధ కోదండ కుటిల భ్రూవిలాసయా
బంధూకకుసుమచ్ఛాయా బంధుభూతాధరశ్రియా ॥ 29 ॥

కంఠనాలజితానంగకంబుబిబ్బోక సంపదా
బాహుద్వితయ సౌభాగ్యవంచితోత్పలమాలయా ॥ 30 ॥

స్థిరయౌవనలావణ్య శృంగారితశరీరయా
అత్యంతకఠినోత్తుంగ పీవరస్తనభారయా ॥ 31 ॥

మృణాలవల్లరీతంతు బంధు భూతావలగ్నయా
శృంగారతటినీతుంగ పులిన శ్రోణి భారయా ॥ 32 ॥

కుసుంభ కుసుమచ్ఛాయా కోమలాంబర శోభయా
శృంగారోద్యానసంరంభాస్తంభోరుకాండయా ॥ 33 ॥

చూతప్రవాలసుషమాసుకుమార పదాబ్జయా
స్థిర మంగలశృంగార భూషణాలంకృతాంగయా ॥ 34 ॥

హారనూపుర కేయూర చమత్కృతశరీరయా
చక్షురానందలతయా సౌభాగ్య కులవిద్యయా ॥ 35 ॥

ఉమయా సమమాసీనం లోకజాలకుటుంబయా
అపూర్వ రూప మభజన్ పరివారాః సమంతతః ॥ 36 ॥

పరమ శివుని వామ భాగమున గూర్చుండిన, మంగళకరమైన వేషభూషణములుగలది, సమస్తలోకములను సృష్టించుటలో సమవాయసంబంధముతోనున్నట్టి ॥24॥ ఇచ్ఛాజ్ఞాన క్రియారూపమైనయనేక విధములైన శక్తులతో విరాజిల్లు చుండిన ఆత్మవిద్యాస్వరూపమును ప్రకాశింపజేయునట్టి శివునితో అవినాభావ (నిత్యము) సంబంధముతో నున్నదియునగు॥25॥ సంసారమనెడు విషారణ్యమును దహింపజేయుటలోదావాగ్ని (కార్చిచ్చు) వంటిదగు, తన సిగలో ధరించిన మల్లెపువ్వుల సుగంధముచేతఘీంకారము జేయుచున్నట్టి భృంగపంక్తి గల దియు ॥26॥ పూర్ణ చంద్ర సౌభాగ్యమును అనుసరించుచున్న ముఖకమలము గలదియు, ముత్యాలు పొదిగిన ముకుపోగు సౌందర్యవిశేషముతోగలిగిన చిఱునవ్వులొలుకు శోభ గలదియు రత్నము లచే తనలంకరింపబడిన రంగ మంటపము మధ్యలో విరాజిల్లిన కరుణా కటాక్షము గలదియు. నేత్రముల సౌందర్యము చేతనుకలువ పువ్వుల కాంతిని దిరస్కరించు చున్నదియు ॥27॥ మన్మథుని కోదండమువలె కనుబొమల సోయగము గలది యు,మందార కుసుమ శోభననుకరించుచున్న అధర శోభగలదియు ॥28॥ మదనునిజయ శంఖధ్వనిని తన మధుర కంఠధ్వనిచేత జయించినట్టియు బాహువుల సౌభాగ్యముతో కలువ పూల తూండ్లమాలికను దిరస్కరించుచున్నదియు ॥30॥ నిత్య (శాశ్వత)మైన యౌవనపు సౌందర్యము చేత విరాజిల్లు చుండిన శరీరముగలదియు అత్యంత కఠినములైన యున్నతకుచముల బరు వుతో గూడిన (31) కమలతూండ్లకు (దేంట్లకు) సమానమైన నడుముగలది శృంగార రూప మనెడు నదికి యున్నతమైన ఇసుక తిన్నెలవలెనున్న జఘనము (కటి ప్రదేశము) గలదియు (32) కుసుమపువ్వు యొక్క శోభననుకరించుచున్న మనోహరమైన వస్త్రముతో శోభించుచున్నట్టి, శృంగారమనెడు ఉద్యానముయొక్క అలంకారమునకు అరటి బోదెలవలె ప్రకాశించు తొడలు గలది (33) మృదువైన మామిడి చిగురుటాకుల రంగును బోలిన మనోహర ములైన పాదపద్మములు గలదియు, నిత్యమంగళాత్మకములైన (వినూతనములు) యలంకారములతో నలంకృతమైన

దేహ సౌష్ఠవముగలదియు (34) ముత్యాల హారము కాలసరపణివలె మలచిన బంగారము వంకీలతో (దండగడియములు) పరిశోభించునట్టి శరీరముగలది. చూపులకు ఆనందలతలవలెనున్నసౌభాగ్యకుల విద్యా స్వరూపిణి (35) సమస్త లోకములె తనకు ఒక కుటుంబమువలెనున్నట్టి యా ఉమాదేవితో దివ్య సింహాసనము న లంకరించినవాడును అసాధారణమైన రూపముచేత కూడియున్న వాడును నైన అపరశివ పరమాత్ముని ముప్పది మూడు కోట్ల దేవతలుఅతని చుట్టు నిలబడి స్తుతిజేయుచున్నారు(36)

## దేవతాసమూహకృత శివసేవా వర్ణనము

॥శ్లో॥ పుండరీకాకృతి స్వచ్ఛం పూర్ణ చంద్రసహోదరం
దధౌ తస్య మహాలక్ష్మీ : సితి మాతపవారణం ॥ 37 ॥

తంత్రీర్ఝుంకారశాలిన్యా సంగీతా మృత విద్యయా
ఉపతస్థే మహాదేవముపాంతే చ సరస్వతీ ॥ 38 ॥

ఝణత్కంకణజాతేన హస్తేనోపనిషద్వధూః
ఓంకారతాలవృంతేన వీజయామాస శంకరం ॥ 39 ॥

చలచ్చామరికాహస్తా ఝుంకుర్వన్మణికంకణాః
ఆసేవంత తమీశానమభితో దివ్యకన్యకాః ॥ 40 ॥

చామరాణాం విలోలానాం మధ్యే తన్ముఖమండలం
రరాజ రాజహంసానాం భ్రమతామివ పంకజం ॥ 41 ॥

మంత్రేణ తమసేవంత వేదాః సాంగవిభూతయః
భక్త్యా చూడామణిం కాంతం వహంత ఇవ మౌలిభిః ॥ 42 ॥

తదీయా యుధ ధారిణ్యస్తత్సమానవిభూషణాః
అంగభూతా : స్త్రియః కాశ్చిదాసేవంత తమీశ్వరం ॥ 43 ॥

అష్టాధికారిణ : కేచిదనంత ప్రముఖా ఆపి
అష్టౌ విద్యేశ్వరా దేవమభజంత సమంతతః ॥ 44 ॥

తతో నందీ మహాకాళ్చండో భృంగిరిటిస్తతః
ఘంటాకర్ణః పుష్పదంతః కపాలీ వీరభద్రకః ॥ 45 ॥

ఏవమద్యా మహాభాగా మహాబలపరాక్రమాః
నిరంకుశ మహాసత్త్వా భేజిరే తం మహేశ్వరం ॥ 46 ॥

అణిమాదికమైశ్వర్యం యేషాం సిద్ధేరపోహనం
బ్రహ్మాదయః సురా యేషా మాజ్ఞాలంఘనభీరవః ॥ 47 ॥

మోక్షలక్ష్మీ పరిష్వంగ ముదితా యేఽతరాత్మనా
యేషామిషత్కరం విశ్వ వర్గసంహార కల్పనం ॥ 48 ॥

జ్ఞానశక్తి పరా యేషాం పర్వ వస్తు ప్రకాశినీ
ఆనందకణికా యేషాం హరిబ్రహ్మాది సంపదః ॥ 49 ॥

అకాంక్షంతే పదం యేషాం యోగినో యోగతత్పరాః
కాంక్షణీయఫలో యేషాం సంకల్పః కల్ప పాదపః ॥ 50 ॥

కర్మకాలాది కార్పణ్యచింతా యేషాంన విద్యతే
యేషాం విక్రమసన్నాహోమృత్యోరపి చ మృత్యవః
తే సారూప్య పదం ప్రాప్తాః ప్రమథా భేజిరే శివం ॥ 51 ॥

పరమేశ్వరునకు మహాలక్ష్మీదేవిశ్వేతకమలమువలె శుభ్రము, పూర్ణచంద్రునివలె శోభించున్నదియు నైనశ్వేతచ్ఛత్రమునుధరించి యుండెను ॥37॥సరస్వతీదేవి పరమేశ్వరుని సమాపమున నిలబడి తన వీణను మధురంబైనధ్వనిచేత శోభిల్లెడు అమృతసమానమైన సంగీత విద్యతో సేవించుచుండెను. ॥(38) ఉపనిషదూ పస్త్రీ శబ్దాయమానములైన కంకణముల (గాజుల)తో గూడిన హస్తముతో ఓంకారరూపమైనవ్యజనముతోగాలివీచు చుండెను. ॥39॥శబ్దాయమాన ములైన రత్నఘటిత కంకణములు గలవారును, కదలుచున్న చామరములతో గూడిన హస్తములుగలవారును ఐన దేవతాకన్నియలు ఆ పరమేశ్వరుని చుట్టును నిలబడి సేవించుచుండిరి ॥40॥ సంచరించుచున్న రాజ హంసలమధ్యన కమలమెట్లు శోభించునో అట్లే కదులుచున్న చామరముల మధ్య పరమ శివుని ముఖ మండలము ప్రకాశించుచుండెను ।శిక్షావ్యాకరణాది షడంగయుక్తములైన ఋగాదివేదములు ఉపనిషద్రూపమస్తకములతోనా పరమేశ్వరుని మనోహరమైన చూడామణివలె ధరించినదియై మంత్రముచేత భక్తి పూర్వకముగా సేవించుచుండెను ॥41॥ అట్టి శివునకు సంబంధించిన ఆయుధములను ధరించిన వారు ను, శివునకు సమానమైన వేషభూషణములను ధరించినవారును శివునకంగరక్షకులుగాను ఐన కొందరు స్త్రీలు పరమేశ్వరుని

సేవించుచుండిరి ॥45॥ (శివునకు ఆప్తాధికారులైన అనంత సూక్ష్మ- శివోత్తమ -ఏక-నేత్ర - ఏకరుద్రత్రిమూర్తి - శ్రీ కంఠ శిఖండి-నామములుగల ఎనమండుగురు విద్యేశ్వరులు ఆ పరమశివుని సేవించుచుండిరి ॥46 ॥ నంది మహకాలచండ - భృంగిరిటి - ఘంటాకర్ణ - పుష్పదంత - కపాల-వీరభద్ర వీరే మున్నగువారు నిరంకుశ సత్త్వశీలురు, మహాబల పరాక్రమ శాలురుఐన ప్రమథులు, పరమేశ్వరుని సేవించుచుండిరి.) ॥45 ॥ శివునకు ఆప్తాధికారులైన అనంత సూక్ష -శివోత్తమ ఏక-నేత్ర -ఏకరుద్ర, త్రిమూర్తి - శ్రీ కంఠ-శిఖండి - నామములుగల ఎనమండుగురు విద్యేశ్వరులు అపరమవివుని సేవించుచుండిరి ॥46 ॥ నంది - మహాకాల, చండ - భృంగిరిటి - ఘటాకర్ణ - పుష్ప దంత - కపాల-వీరభద్ర, వీరే మున్నగువారు నిరంకుశ సత్త్వశీలురు, మహాబలపరాక్రమాశాలురుఐన ప్రమథులు పరమేశ్వరుని సేవించుచుండిరి ॥47॥ ఎవరి సిద్ధి యెదుట ఆణిమా - మహిమాద్య ష్టసిద్ధులుతుచ్ఛములైన వోఏమో బ్రహ్మాది సమస్తదేవతలు ఎవరియాజ్ఞను ఉల్లంఘించుట కుభీతిల్లుదురో, ఎవరు మోక్షలక్ష్మి యొక్క ఆలింగము వలన సంతుష్ట చిత్తులగుదురో, ఎవరికి యీ ప్రపంచము యొక్క సృష్టి స్థితి లయములు అతీవసులభ సాధ్యములైనవో, ఎవరి జ్ఞానశక్తి సమస్త వస్తువుల యథార్థ జ్ఞానమును గలుగజేయునో, హరిబ్రహ్మాది దేవతల సంవదలు ఎవరికైతే లేశమాత్రములో శివయోగ తత్పరులైన మహాయోగులు ఎవరి స్థానమును ఆకాంక్షింతురో, ఎవరి సంకల్పము అందరిచేత అపేక్షింపబడు ఫలములున్నదిగా కల్పవృక్షము నకు సమానమైనదో సంచితాగామి ప్రారబ్ధరూపకర్మములు, భూత-భవిష్యద్వ ర్తమాన కాలములు కామాదులచేతనుత్పన్నము లగుకార్పణ్యచింతయు, ఎవరికి ఉండదో, ఎవరికి పరాక్రమోద్యోగములు, మృత్యువునకు మృత్యువు స్వరూపములైనవో, శివసారూప్యములను బొందిన ఆ ప్రమథులు పరమేశ్వరుని సేవించుచుండిరి.॥ 48-49-50-51 ॥

॥శ్లో॥ బ్రహ్మోపేంద్రమహేంద్రాద్యా విశ్వ తంత్రాధికారిణం
అయుధాలంకృతప్రాంతాః పరితస్తం సిషేవిరే ॥ 52 ॥

ఆదిత్యా వసవో రుద్రా యక్ష గంధర్వ కిన్నరాః
దానవా రాక్షసా దైత్యాః సిద్ధా విద్యాధరోరగాః
అభజంత మహాదేవమపరిచ్ఛిన్నసైనికాః ॥ 53 ॥

వసిష్ఠో వామదేవశ్చ విశ్వామిత్రా త్రిశౌనకాః
దధీచిర్గౌతమశ్చైవ సానందశుక నారదాః ॥54 ॥

ఉపమన్యుభృగువ్యాసపరాశరమరీచయః
ఇత్యాద్యా మునయః సర్వే నీలకంఠం నిషేవిరే ॥55॥

పార్శ్వస్థపరివారాణాం విమలాంగేషు బింబితః
సర్వాంతర్గతమాత్మానం స రేజే దర్శయన్నివ ॥56॥

బ్రహ్మ-విష్ణు -ఇంద్రాది ముప్పదిమూడుకోట్ల దేవతలు తమతమ ఆయుధములను దాల్చి జగన్నాటక సూత్రధారియైన పరమేశ్వరుని పార్శ్వభాగములందు నిల్చుండి యనన్య భక్తితో సేవించుచుండిరి ॥52॥ ద్వాదశసూర్యులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు కుభేరుడు మొదలగు, యక్షులు, హాహా మున్నగు గంధర్వులు, అశ్వముఖుడు మొదలగు కిన్నరులు, దానవులు, రాక్షసులు, దైత్యులు ఆదినాధుడుమున్నగు సిద్ధులు, సాధ్యులు మణిభద్రాది విద్యాధరులు శేషుడు మున్నగు సర్పములు ఇట్లే అసంఖ్యాక పరివారముతో గూడుకొని యా పరమేశ్వరుని భజించుచుండిరి (స్తుతించుచుండిరి) ॥53॥ వశిష్ఠ వామదేవ - విశ్వామిత్ర-అత్రి-శౌనక-దధీచి -గౌతమసానంద- శుక-నారద-ఉపమన్యు-భృగు-వ్యాస-పరాశర మరీచమొదలగు మహర్షులు నా పరమేశ్వరుని సేవించుచుండిరి॥54-55॥ తన యెడమ -కుడి పార్శ్వ భాగములందు నిల్చుండిన సమస్త పరివారమువారి యత్యంత నిర్మలమైన శరీరములందు ప్రతిబింబించిన శ్రీ పరమేశ్వరుడు తాను సర్వాంతర్యామి యనునది నిరూపించుకొనుచున్నాడో ఏమో అననట్లు పరిశోభించుచుండెను.॥ 56 ॥

## శ్రీ పరమేశ్వరుని రాజ వ్యవహార వర్ణనము

॥శ్లో॥ క్షణం స శంభుర్దేవానాం కార్యభాగం నిరూపయన్
క్షణం గంధర్వ రాజానాం గానవిద్యాం విభావయన్ ॥ 57 ॥

బ్రహ్మవిష్ణ్వాదిభిర్దేవైః క్షణమాలాపమాచరన్
క్షణం దేవమృగాక్షీణాం లాలయన్ నృత్య విభ్రమం ॥ 58 ॥

వ్యాసాదీనాం క్షణం కుర్వన్ వేదోచ్చారేషు గౌరవం
నిదధానః క్షణం దేవ్యా ముఖే బింబాధరే దృశః
హాస్య నృత్యం క్షణం పశ్యన్ భృంగిణా పరికల్పితం ॥ 59 ॥

నందినా వేత్రహస్తేన సర్వతంత్రాధికారిణా
అముంచతా సదా పార్శ్వమాత్మాభిప్రాయ వేదినా ॥ 60 ॥

చోదితానానయన్ కాంశ్చిద్విసృజన్ భ్రూవిలానతః
సంభావయంస్తథా చాన్యానన్యానపి నియామయన్ ॥ 61 ॥

సమస్త భువనాధీశ మౌలిలాలితశాసనః
అకుంఠశక్తి రవ్యాజలావణ్య లలితా కృతిః ॥ 62 ॥

స్థిరయౌవన సౌరభ్యశృంగారితకలేవరః
ఆత్మశక్త్య మృతాస్వాదరసోల్లాసిత మానసః ॥ 63 ॥

స్వాభావికమహైశ్వర్య విశ్రాంతి పరమావధిః
నిష్కలంక మహాసత్త్వ నిర్మితానేక విగ్రహః ॥ 64 ॥

అఖండారాతిదోర్దండకండూ ఖండన పండితః
చింతామణిః ప్రసన్నానాం శ్రీ కంఠ పరమేశ్వరః ॥ 65 ॥

సభాంతరగతం తంత్రం రేణుకం గణనాయకం
ప్రసాదం సులభం దాతుమాహూయేత్థం సమాదిశత్ ॥ 66 ॥

### శ్రీ రేణుక గణేశ్వరం ప్రతి శివాదేశ

శ్రీ శైలస్యోత్తరే భాగే త్రిలింగవిషయే శుభే
కుల్యపాకాభిధం పుణ్యక్షేత్రమేకం విరాజతే ॥ 67 ॥

సోమేశ్వరాభిధానస్య తత్ర వాసవతో మమ
అస్పృశన్మానుషం భావం లింగాత్ ప్రాదుర్భవిష్యసి ॥ 68 ॥

మదీయలింగ సంభూతం మద్భక్తపరిపాలకం
విస్మితా మానుషాః సర్వేత్వాం భజంతు మదాజ్ఞాయా ॥ 69 ॥

మదద్వైత పరం శాస్త్రం వేద వేదాంత సమ్మతం
స్థాపయిష్యసి భూలోకే సర్వేషాం హితకారకం ॥ 70 ॥

మమ ప్రతాపమతులం మద్భక్తానాం విశేషతః
ప్రకాశయ మహీభాగే వేదమార్గానుసారతః ॥ 71 ॥

ఇత్యుక్త్వా పరమేశ్వరఃస భగవా భద్రాసనాదుత్థితో
బ్రహ్మోపేంద్ర ముఖాన్విసృజ్య విబుధా భ్రూసంజ్ఞయా కేవలం ॥ 72 ॥

పార్వత్యా సహితోగణైరభిమతై! ప్రాపస్వమంతఃపురం
క్షోణీభాగమవాతరత్పశుపతే రాజ్ఞావశా ద్రేణుకః ॥73 ॥

శ్రీ పరమేశ్వరుడుక్షణకాలందేవతలకు మీరు ఆయాయాపనులను జేయుమని యాజ్ఞాపించుచుండెను. క్షణకాలము గంధర్వుల మనోహరమైన సంగీతము నాలకిం చు చుండెను. ॥56॥ క్షణకాలము బ్రహ్మ-విష్ణు-మున్నగుదేవతలతో మాట్లాడుచుండెను. క్షణకాలము దేవతాస్త్రీల నర్తన వైభవమును దిలకించు చుండెను. క్షణకాలము వ్యాసాది మహర్షులు పఠించుచుండిన వేదోచ్చారణమును పరామర్శించి వారిని గౌరవించుచుండెను. క్షణకాలము పార్వతీదేవి ముఖకమలమునందు దృష్టిని నిలుపుచుండెను. క్షణకాలము భృంగి నటించు హాస్య చేష్టలను దర్శించుచుండెను. ॥59 ॥ సమస్త కార్యనిర్వహణాధికారి. దండధారి, ఎల్లప్పుడు ఏ మారకుండ పరమేశ్వరుని సన్నిధిలోనుండువాడు, ఆ పరమేశ్వరుని అభిప్రాయమును గుర్తించి అదే విధముగా మెదలుచున్న నందికేశ్వరుని చేత కొందరిని పిలిపించుచుండెను. మరి కొందరిని నేత్ర సంజ్ఞచేత పంపించుచుండెను. కొందరిని ప్రేమ పూరిత వాక్కుల చేత ఆనందపరచుచుండెను. కొందరిని యడ్డగించు చుండెను ॥60-61॥ తాను చతుర్దశలో కాధిపతియగుటవలన తనయానతిని దేవతల ద్వారానెరవేర్చుకొనువాడును అప్రతిహతమగు శక్తిగలవాడును, సహజ సౌందర్యముచేత మనోహరమైన శరీర కాంతి గల వాడును ఎల్లప్పుడు స్థిరముగా నుండెడు యౌవనమునుండి విరాజిల్లు చుండెడు అవయ ములు గల వాడును. తనలో నిత్య సంబంధముతో స్థిరపడియున్న శక్తి రూప మహనందం సాస్వాదము చేత సంతుష్టిగల మనస్సుగల వాడును, తనయందు సహజముగా నెలకొనియున్న సర్వజ్ఞత్వాది మహదైశ్వర్యములకు, విశ్రాంతికి పర్యంత భూమిస్వరూపుడును, నిష్కలంకమైన మహాశక్తి చేతననేకాకఅనేక మంగళమూర్తులను నిర్మించువాడును, అనంతులైన సజ్జనశత్రు వుల భుజకండూతి (దురద)ని నశింప జేయుటలో (పోగొట్టుటలో) సమర్థుడును శరణాగతులైన వారికి చింతామణి స్వరూపుడైన వాడును పరమశివుడు ప్రకాశించుచుండెను॥62-63-64-65॥ ఇంతటి దేదీప్య మానమగు శివ సభను అలంకరించియున్నవాడు సభా ప్రముఖుడును, ప్రమథనాయకుడునైన శ్రీరేణుక గణనాథుని, పరమేశ్వరుడు తన వద్దకు రప్పించుకొని తాంబూల ప్రసాదములను అనుగ్రహించుటకొరకు గాను ఈ విధముగా నాజ్ఞాపించెను ! ఓయీ రేణుకా! శ్రీ శైల

క్షేత్రమునకు ఉత్తర భాగముననున్న ఆంధ్ర (తెలుగు) దేశమునందు కుల్యపాక అనేపేరుతో ప్రసిద్ధిగాంచిన పుణ్యక్షేత్రమొకటి విరాజిల్లుచున్నది ॥67॥ అటువంటి పరమ పవిత్రమైన ॥66॥ "సోమేశ్వరలింగమునామముతో నక్కడనెలసియున్ననా యొక్క లింగరూప శరీరమై విరాజిల్లుచున్నది". నీవు మనుష్య రూపమున గాక (తేజోమయమగు) శరీరముచేతనీవు భూలోకముననవతరించుము. ॥68॥

శివలింగావతారి, శివభక్తపాలకుడునైన నిన్నుజూచి మానవులందరు చకితులై, నా యొక్క ఆజ్ఞానుసారముగా నిన్ను భక్తిమీరసేవింతురు. ॥69॥ సమస్తమానవులకు మోక్షదా యకము, వేదవేదాంత సమ్మతము నైన శివాద్వైతసిద్ధాంతమును భూలోకమన స్థాపించుము. ॥70॥ నీవు భూవలయమున నా యొక్క మహిమలను, విశేషించి నా యొక్క భక్తుల మహిమలను వేద మార్గానుసారముగా ప్రకాశపరచుము ॥71॥ ఈ రీతిగా పరమేశ్వరుడు శ్రీ రేణుక గణాధీశ్వరుని ఆజ్ఞాపించి తమ భద్రాసనమునుండి భ్రూసంజ్ఞచేత బ్రహ్మ-విష్ణు మొదలగు దేవతలు వెళ్ళుట కాజ్ఞాపించెను. నంద్యాది ప్రమథగణములతో బాటు పార్వతితో గూడి తనయంతఃపురమున బ్రవేశించెను. ఇక్కడ రేణుకగణాధీశ్వరుడు పరమేశ్వరుని యాజ్ఞానుసారముగా భూమండలముననవతరించెను ॥72॥

ఇతి శ్రీసిద్ధాంత శిఖామణౌ శివ
సభావర్ణనం నామ తృతీయ పరిచ్ఛేదః పరిసమాప్తః

ఇది శ్రీసిద్ధాంత సిఖామణిలో శివ సభావర్ణనాత్మకమైన
తృతీయ పరిచ్ఛేదము పరిసమాప్తము.



# శ్రీసిద్ధాంత శిఖామణి

## చతుర్థ పరిచ్ఛేదః

## నాలుగవ పరిచ్ఛేదము

### శ్రీ రేణుక గణాధీశ్వరుని లింగావతార వర్ణనము

॥శ్లో॥ అథ త్రిలింగవిషయే కుల్యపాకాభిధే స్థలే
సోమేశ్వరమహాలింగాత్ ప్రాదురాసీత్ స రేణుకః ॥ 1 ॥

ప్రాదుర్భూతం తమాలోక్య శివలింగాత్రి లింగజాః
విస్మితాః ప్రాణినః సర్వే బభూవురతితేజసం ॥ 2 ॥

భస్మోద్ధూలితసర్వాంగం సారరుద్రాక్ష భూషణం
జటాముకుట సంయుక్తం త్రిపుండ్రాంకితమస్తకం ॥ 3 ॥

కటీతటపటీ భూతకంథాపటల బంధురం
దధానం యోగదండం చ భస్మాధారం కమండలం ॥ 4 ॥

శివాద్వైత పరిజ్ఞాన పరమానంద మోదితం
నిర్ధూతసర్వ సంసార వాసనాదోష పంజరం ॥ 5 ॥

శివాగమ సుధాసింధుసము న్మేషసుధాకరం
చిత్తారవిందనం గూఢ శివ పాదాంబుజద్వయం ॥ 6 ॥

యమాదియోగ తంత్రజ్ఞం స్వతంత్రం సర్వ కర్మసు
సమస్త సిద్ధ సంతానసముదాయ శిఖామణిం ॥ 7 ॥

వీరసిద్ధాంత నిర్వహకృత పట్టనిబంధనం
ఆలోకమాత్ర నిర్భిన్న సమస్త ప్రాణిపాతకం ॥ 8 ॥

తమ పృచ్ఛస్ జనాః సర్వే సమంతః కో భవానితి
ఇతి పృష్టో మహాయోగీ జనైర్విస్మితమానసైః ॥ 9 ॥

ప్రత్యువాచ శివా ద్వైత మహానంద పరాయణః
పినాకినః పార్శ్వవర్తీ రేణుకాఖ్యో గణేశ్వరః ॥ 10 ।

శివాదేశానుసారేణ శివలింగాదిహోద్భవం
నామ్నా రేణుకసిద్ధో హం సిద్ధ సంతాన నాయకః
స్వచ్ఛందచారీ లోకే స్మి శివ సిద్ధాంత పాలకః ॥ 11 ॥

ఇత్యుక్త్వాపశ్యతాం తేషాం విషయస్థిర చక్షుషాం
ఉత్థాయ వ్యోమమార్గేణ మలయాద్రిముపాగమత్ ॥ 12 ॥

పరమేశ్వరుని యాజ్ఞానుసారముగా శ్రీ రేణుక గణాధీశ్వరుడు త్రిలింగ (తెలుగు)దేశమున నంప్రసిద్ధ శివక్షేత్రమగు శ్రీ కొలను పాక క్షేత్రములో వెలసియున్న శ్రీ సోమేశ్వరనామకమహాలింగమునుండి యవతరించెను ॥1 ॥ త్రిలింగ (తెలుగు) దేశములోని ప్రజలందరునాశివలింగమునుండి యవతరించిన మహాతేజశ్శాలి యైన శ్రీ రేణుక మహాగణాధీశ్వరుని జూచి ఆశ్చర్యభరితులైరి॥2 ॥ భస్మలిప్తమగు శరీరమునత్రిపుండ్రరేఖలు, రుద్రాక్షమాలా లంకృతులై. జటాముకుటమండితుడు, త్రిపుండ్రాంకిత మస్తకముగలవాడును కటి(మధ్యము-నడుము) ప్రదేశమందు వస్త్రమును బోలియున్న కంథము చేత మనోహరముగా నున్నట్టి యోగ దండము కమండలము, భస్మఘుంటి కలను ధరించిన వాడును, శివాద్వైత సిద్ధాంత జ్ఞానమునుండి గల్గిన పరమానందమునలీనమైన వాడును. సమస్త సంసారవాసనా దోషముల సమూహము నుండి దూరమైనవాడును. శివాగమరూపమైన అమృత సముద్రాభివృద్ధికి చంద్రుని వంటివాడును తన హృదయకమలమున పరమ శివుని పాద పద్మములను సదా సంస్మరించు వాడును, యమ-నియమాద్యష్టాంగయోగముల స్వరూపమును దెల్పినవాఁడును సమస్త సిద్ధకుల సమూహమునకు శిఖారత్న స్వరూపుడు వీరశైవ సిద్ధాంతమును నెలకొల్పుటలో పట్టాభిషిక్తుడైన వాడును దర్శనముతోనే సమస్త ప్రాణుల పాపము హరింప జేయు సమర్థుడును నైన శ్రీరేణుచార్యుగురించి ఆ దేవాలయముందుండిన సమస్త జనులు ఆశ్చర్య సంభ్రమాలతో గూడిన వారై ఓ మహాత్మా ! నీ వెవరు? అని ప్రశ్నించిరి. ॥3-4-5-6-7-8-9 ॥ ఇట్లు శివాద్వైతమహానందమున లీనమైనవాడును పరమేశ్వరుని పార్శ్వవర్తియునగు శ్రీరేణుక గణేశ్వరుడు అక్కడి జనులతో ఈ విధముగా నుడివెను. ॥10 ॥

ఓయీ! శివభక్తులారా!నేను పరమేశ్వరుని యాజ్ఞానుసారముగా పరమపవిత్రమైన ఈ శివక్షేత్రమున వెలసియున్న ఈ సోమేశ్వర శివలింగమునుండి యవతరించియున్నాడను, నానామధేయము (పేరు) రేవణ సిద్ధుడనునది. నేను సిద్ధుల సమూహమునకంతటికిని అధిపతిని, నేను ఈలోకమున సర్వ స్వతంత్రుడను. మరియు శివాద్వైతసిద్ధాంతమును

ఉద్ధరించువాడను అని దెలియపరచెను. అదివిని భక్తులు అనిమేష లోచనులై (రెప్పగొట్ట కుండ) చూస్తూఉండగా శ్రీరేణుకుండుగగన (ఆకాశ) మార్గమునమలయ పర్వతమునకు బయనమయ్యెను (11-12)

## మలయాద్రివర్ణనం

నవ చందన కాంతారకం దలన్మందమారుతం
అభంగురభుజంగ స్త్రీ సంగీతరస సకులం ॥ 13 ॥

కరిపోతకరాకృష్టస్ఫురదేలా తివాసితం
వరాహదంష్ట్రికాధ్వస్తముస్తాసురభికందరం ॥ 14 ॥

పటీరదలపర్యంకప్రసుప్తవ్యాధదంపతిం
మాధవీ మల్లికా జాతీమంజరీ వేణు రంజితం ॥ 15 ॥

॥శ్లో॥ తత్ర కుత్రచిదాభోగే సర్వర్తుకుసుమద్రుమే
అపశ్యదాశ్రమం దివ్యమగస్త్యస్య మహామునేః ॥ 16 ॥

## మలయ పర్వత వర్ణనము

ఆమలయపర్వతము కొంగ్రొత్తదైన శ్రీ గంధము చెట్ల (వనము) మధ్యన సంచరించు చుండినమందమారుతముచేత గూడియున్నదై. స్త్రీసర్పము లయొక్క సంగీత మాధుర్యముతో వ్యాపించినదై ఏనుఁగులకుంభస్థలమునుండి స్రవించుమదరసనముతో సుగంధితమైన మరియు గున్న ఏనుగులతొండములతో లాగబడుచున్న యేలకులతీగలుగలదై బహుసు వాసనగలదై, అడవి పందుల కోరలతో నష్ట (భగ్న) పరచిన తుంగముస్తెలతోను నిండిన గుహలుగలదై. చందన వృక్షముల ఆకులతో నిర్మించబడిమంచములపైబరుండిన వ్యాధ (కిరాతకుల) దంపతులతో గూడి యున్నదై, మాధవి-మల్లికా-జాజిపుష్పములగుత్తులతోడను, వాటి నుండి వెదజల్లబడిన పరాగ సుగంధముగలదైపరిశోభించుచుండినది (13-14-15-16)

## అగస్త్య మహర్షి ఆశ్రమ వర్ణనము

మందారచందన ప్రాయైర్మండితం తరుమండలైః
శాఖ శిఖరసంలీన తారకాగణ కోరకైః ॥ 17 ॥

మునికన్యాకరానీతకల శాంబు వివర్ధితైః
ఆలవాలజలాస్వాదమోదమానమృగీగణైః ॥ 18 ॥

హేమారవింద నిష్యందమకరందసుగంధిభిః
మరాలాలాపవాచాలవీచిమాలామనోహరైః ॥ 19 ॥

ఇందీవరవర జ్యోతిరంధీకృతహరిన్ముఖైః
లోపాముద్రాపద న్యాసచరితార్థ తటాంకితైః ॥ 20 ॥

హారనీహారకర్పూరహరహాసామలోదకైః
నిత్య నైమిత్తి కస్నాననియమార్థైస్త పస్వినాం ॥ 21 ॥

ప్రకృష్టమణిసోపానైః పరివీతం సరోవరైః
విముక్త సత్త్వ వైరస్యం బ్రహ్మలోకమివాపరం ॥ 22 ॥

హూ యమానాజ్య సంతాన ధూమగంధిమహాస్థలం
శుకసంవత్సమారబ్ధశ్రుతిశాస్త్రోపబృంహణం ॥ 23 ॥

వసంతాది షడృతువులల్లో జరిగే సమస్త విధములైన పుష్పముల చేతనలంకృతమైన వృక్షములతోడను విరాజిల్లుచున్నట్టి యామలయపర్వతము ఒకానొక ప్రదేశమునందు శ్రీజగద్గురు రేణుకా చార్యులవారు అగస్త్య మహర్షియొక్క భవ్యమైన ఆశ్రమమును జూచెను ॥16॥ ఆశ్రమము చెట్ల కొమ్మల అగ్రభాగములలో నక్షత్ర సమూహమువలెనున్న మొగ్గలతో గూడి యుండినట్టి. మునికన్నియలకరకమలములతో నెరచిన (పోసినట్టి) నీటితో బెరగిన మడుగులలో లేచి నిలచిన నీటిని గ్రోలియానందముతోనున్న ఆడలేళ్ళగుంపుతో నిండినవై యున్న వృక్షములతో నలంకృతమై యుండినది ॥17-18॥ బంగారు కమలములనుండి స్రవించుచున్న మకరందముచేత సుగంధ విశిష్టములైనవి, రాజ హంసలమధుర ధ్వనులతో శబ్దాయమానమైన తరంగములతో మనోహరములైనవి ॥19॥ నీలిపద్మముల కాంతిచేత దశదిశలను అంధకారమయము గావించినవియు అగస్త్యమహర్షి ధర్మపత్ని యగలోపాముద్ర యొక్క పాద పద్మముల సంచారముచేత కృతకృత్యమైన తటాక తీరములుగలదియు. ॥20॥ ముత్యాలసరము - మంచుగడ్డ - కర్పూరము - శివుని చిఱునవ్వు నీటి మాదిరిగా నత్యంత శుభ్రమైన జలములున్నవియు, తపోధనుల (తపస్వీజనుల) నిత్యనైమిత్తిక స్నానమునకై నియమితములైనవియు. ॥21॥ శ్రేష్ఠములైన రత్నములతో విరచితమైన సోపానములున్న సరోవరముల (సరస్సుల)తో నావరించియున్నది. అనేక విధములైన

ప్రాణులు తమ తమ పరస్పర వైరభావను వదలినవియు, బ్రహ్మలోకమువలె విరాజిల్లుచున్నదియు. ॥22॥ యజ్ఞమునందు హవనము జేయుఘృతముతో నుత్పన్నమైన ధూమమువలన సుగంధ విశిష్టమైన గొప్ప స్థలము కలదియు, శుకాళిచేత నుచ్చరింపబడుచున్న వేద విచారశాస్త్రార్థ చర్చకలదియు నై యొప్పుచుండినది. ॥23॥

## అగస్త్య మహర్షి వర్ణనం

తస్య మధ్యే సమాసీనం మూలే చందన భూరుహః
సుకుమారదల చ్ఛాయా వారితాదిత్య తేజసః ॥ 24 ॥

తడిత్పింగజటాభారై స్త్రిపుండ్రాంకితమస్తకై :
భస్మోద్ధూలిత సర్వాంగై : స్ఫురద్రుద్రాక్ష భూషణై : ॥ 25 ॥

నవవల్కలవాసోభిర్నానియమధారిభిః
పరివీతం మునిగణైః ప్రమథైరివ శంకరం ॥ 26 ॥

సముజ్జ్వలజ్జటాజాలైస్తపః పాదప పల్లవై :
స్ఫురత్సౌదామినీకల్పైర్జ్వాలా జాలైరివానలం ॥ 27 ॥

విశుద్ధభస్మకృతయా త్రిపుండ్రాంకితరేఖయా
త్రిస్రోతసేవ సంబద్ధశిలా భాగం హిమాచలం ॥ 28 ॥

భస్మాలంకృత సర్వాంగం శశాంకమివ భూగతం
వసానం వల్కలం సవ్యం బాలాతపసమప్రభం ॥ 29 ॥

వడవాగ్ని శిఖాజాలసమాలీఢమివార్ణవం
సర్వాసామపి విద్యానాం సముదాయనికేతనం ॥ 30 ॥

న్యక్కృతప్రాకృతాహంతం నిరూఢ శివభావనం
తృణీకృత జగజ్జాలం సిద్ధీనాముదయస్థలం ॥ 31 ॥

మోహాంధకారతపనం మూలబోధమహీరుహం
దదర్శన మహాయోగీమునిం కలశ సంభవం ॥ 32 ॥

ఆ ఆశ్రమము యొక్క మధ్య భాగమున నున్న మృదువైన లేతనైన పర్ణఛాయతో సూర్యకిరణముల నడ్డుకొనుచున్న శ్రీ గంధపువృక్షముల క్రింద కూర్చొని యుండిన ॥24॥

మెరుపువలె పింగళ వర్ణముగల జటాజూటములతో కూడియున్న, నుదుట భస్మత్రిపుండ్రమును ధరించియున్నవారు సర్వావయవములందును భస్మోద్ధూళనము గావించుకొన్నవారును, ప్రకాశమానములైన రుద్రాక్షమాలికలే ఆభరణములుగా ధరించిన వారును. ॥25॥ కొంగ్రొత్తవైన నారగుడ్డలను దాల్చినవారును, రకరకాల వ్రతములనాచరించు వారును, మునులచేతను, ప్రమథుల చేతను, పరమేశ్వరుని చుట్టు కూర్చున్నట్లుగా నావృతుడైనవాడును. ॥26॥ మెరుపుతీగల జ్వాలమాలికతో నగ్నివిలసిల్లినట్లు ప్రకాశమానమగు జటాజూటములతో విరాజిల్లువాడును. ॥27॥ గంగానదియొక్క మూడు ప్రవాహములతో కూడియున్న శిలా ప్రదేశముచేత హిమాలయ పర్వతము శోభించునట్లుగా నత్యంతశుభ్రమైన భస్మముతో నలంకరించిన మూడు రేఖలతో శోభించుచున్నవాడును. ॥28॥ భస్మాలంకృతమైన సమస్తావయవములు గలవాడును, భువికవతరించిన చంద్రునివలె ఉన్నవాడును, క్రొంగ్రొత్త నార వస్త్రములను దాల్చినవాడును, లేతయెండయొక్క కాంతిగలవాడును. ॥29॥ బడబాగ్ని జ్వాలాసమూహముచేత వ్యాపించిన సముద్రమువలె నున్నవాడును, సమస్త విద్యలకు నిలయమైనవాడును. ॥30॥ ప్రాకృత శరీరాహంకారమును తిరస్కరించిన వాడును, శివ భావనలో లీనమైనవాడును, జగజ్జాలమును తిరస్కరించినవాడును, సమస్త సిద్ధులకు ఉత్పత్తికి స్థానభూతమైన వాడును. ॥31॥ మోహమనెడి అందకారమునకు సూర్యుని వంటివాడును, స్వస్వరూప జ్ఞానమునకు కల్పవృక్షము సదృశుడును ఐన అగస్త్య మహర్షిని రేణుక గణాధీశ్వరుడు చూచెను. ॥32॥

## అగస్త్యాశ్రమాగతస్య శ్రీరేణుకగణేశ్వరస్య పాదపూజాతథా అగస్త్యం ప్రతి కుశల ప్రశ్నః

తమాగతం మహాసిద్ధం సమీక్ష్య కలశోద్భవ :
గణేంద్రం రేణుకాభిఖ్యం వివేద జ్ఞానచక్షుషా
తస్యానుభావం విజ్ఞాయ సహసైవ సముత్థిత : ॥ 33 ॥

లోపాముద్రాకరానీ తైరుదకైరతిపావనైః
పాదౌ ప్రక్షాలయామాన స తస్య శివయోగినః ॥ 34 ॥

సంపూజ్య తం యథాశాస్త్రం తన్నియోగపురస్సరం
మునిర్వినయనం పన్నో నిషసాదాసనాంతరే ॥ 35 ॥

సమాసీనం మునివరం సర్వతేజస్వినాం విభుం
ఉవాచ శాంతయా వాచా రేవణః సిద్ధ శేఖరః ॥ 36 ॥

నిర్విఘ్నం వర్తసే కింను నిత్యా తే నియమక్రియా?
అథవాగస్త్య తేజస్విన్ కుతః స్యుస్తేऽంతరాయకాః ॥ 37 ॥

వింధ్యో నిరుద్ధో భవతా విశ్వోల్లంఘన విభ్రమః
నహుషో రోషలేశాత్తే సద్యః సర్పత్వమాగతః ॥ 38 ॥

ఆచాంతా భవతా పూర్వం పంకశేషాః పమోధయః
జీర్ణస్తే జాఠరే వహ్నౌ దృష్టో వాతాపిదానవః ॥ 39 ॥

ఏవంవిధానాం చిత్రాణాం సర్వలోకాతిశాయినాం
కృత్యానాం తు భవాన్ కర్తాకస్తేऽగస్త్య సమప్రభః ॥ 40 ॥

శివాద్వైత పరానందప్రకాశన పరాయణం
భవంతమేకం శంసంతి ప్రకృత్యా సంగవర్జితం ॥ 41 ॥

పురా హైమవతీ సూనువదత్తే షడావనః
శివధర్మోత్తరం నామ శాస్త్రమీశ్వరభాషితం ॥ 42 ॥

భక్తిః శైవీ మహాఘోర సంసార భయహారిణీ
త్వయారాజస్వతీ లోకే జాతాऽగస్త్య మహామునే ॥ 43 ॥

ఇతి తస్యవచః శ్రుత్వా సిద్ధప్య ముని పుంగవః
గంభీరగుణయా వాచా బభాషే భక్తి పూర్వకం ॥ 44 ॥

## అగస్త్య మహర్షి వర్ణనము

అగస్త్యుడు తన ఆశ్రమమునకు విచ్చేసిన సిద్ధకులపతిని గాంచి జ్ఞాన నేత్రముచేత నీతడు శ్రీరేణుక గణాధీశ్వరుడనియు గుర్తించుటే గాకుండా ఈతని మహిమను కూగా గుర్తించి వెంటనే లేచి నిలుచుండెను. ॥33॥ లోపాముద్రయొక్క హస్తకమలములతో కొనిరాబడిన పరమ పవిత్రమైన జలముచేత అగస్త్య మహర్షి శివయోగి శిఖామణియగు శ్రీరేణుకాచార్యుని పాదకమలములను ప్రక్షాళనం బొనర్చి శాస్త్ర విధానమునకు అనుసారముగా పూజించెను. తరవాత అసాధారణమైన వినయముతో కూడిన అగస్త్య

మమర్షి శ్రీ రేణుకాచార్యుని ఆనతి మేరకు వేరే ఆసనమునందు కూర్చుండెను. ॥34,35॥ సిద్ధకుల సిఖామణియగు శ్రీరేవణసిద్ధుడు సమస్త తేజస్వీ పురుషులలో నగ్రగణ్యుడైన యామునశ్రేష్ఠుని గురించి ప్రశాంతమైన వాణితో నీవిధముగా నుడివెను. ॥36॥ ఓయీ తేజోవంతమైన రూపముగల అగస్త్యుడా! సుఖముగా నున్నావా! నీయొక్క నిత్య నియమక్రియలు సక్రమముగా నెరవేరుచున్నవా అథవా నీకు విగ్రహములు ఎట్లు ఏర్పడును? ॥37॥ అంతులేకుండక పెరుగుతూ పెరుగుతూ జగత్తులో దాట శక్యముగాని వింధ్య పర్వతమును నీవు భూమిపై శాశ్వతముగా పడియుండుమని ఆదేశించితివి. నహుష చక్రవర్తి నీయొక్క కోపమునకు గురియై తక్షణమే సర్పరూపమును ధరించెను. ॥38॥ పూర్వంలో సమస్త సముద్రములు నీచేత పంకము మాత్రమే మిగిలినవై పానము చేయబడినవి. మదోన్మత్తుడైన వాతాపియను దైత్యుడు నీయొక్క జఠరాగ్నిలో తగుల్కొని కాల్పోయాను. ॥39॥ ఓయీ అగస్త్య మహర్షి ఈ విధంబైన అలౌకికమైన చిత్రవిచిత్రమైన కార్యములను నీవు జేసియున్నాడవు. అందుచేత నీకు ఈ భూలోకమున సమానులైనవారెవరును లేరు. ॥40॥ ఈలోకమునందలి జనులందరు నిన్నొకనినే శివాద్వైతాను భావముచేత గల్గిన ఆనందమును ప్రకాశపరచుటలో ఆసక్తుడిగా నిన్ను ప్రకృతి సంబంధరహితునిగా పొగడుచున్నారు. ॥41॥ తొల్లి పార్వతి పుత్రుడైన కుమారస్వామి నీకు శివప్రోక్తమైన శివధర్మోత్తరనామకమగు శాస్త్రమును ఉపదేశించెను. ॥42॥ ఓయీ! అగస్త్య మహర్షి! భయంకరమైన సంసార భీతిని బోగొట్టునది శివభక్తి నీవలననే ఈ లోకమునందు ప్రకాశించునట్టిదయ్యెను ॥43॥ ఈ రీతిగా నాదేశించు శ్రీరేణుకాధీశ్వరుని వాక్యముల నాలకించి అగస్త్య మహర్షియత్యంత భక్తితో గంభీరమైన వాణి వలన నీ రీతిగా మాట్లాడెను. ॥44॥

## అగస్త్య మహర్షి ప్రార్థనా

॥శ్లో॥ అహమేవ మునీంద్రాణాం లాలనీయోన స్మి సర్వదా
భవదాగమసం పత్తిర్మాం వినా కస్య సంభవేత్ ॥ 45 ॥

స్థిర మద్య శివజ్ఞానం సిద్ధామే తాపనక్రియా
భవద్దర్శన పుణ్యేన స్థిరా మే మునిరాజతా ॥ 46 ॥

సంసారసర్ప దష్టానాం మూర్ఛితానాం శరీరిణాం
కటాక్షస్తవ కల్యాణం సముజ్జీవ భేషజం ॥ 47 ॥

సమస్త లోక సందాహతా పత్రయమహానలః
త్వత్పదాంబుకణా స్వాదాదుపశామ్యతి దేహినాం ॥ 48 ॥

రేణుకం త్వాం విజానామి గణనాథం శివప్రియం
అవతీర్ణమిమాం భూమిం మదను గ్రహ కాంక్షయా ॥ 49 ॥

భవాదృశానాం సిద్ధానాం ప్రభోధధ్వస్త జన్మనాం
ప్రవృత్తిరీదృశీ లోకే పరానుగ్రహకారిణీ ॥ 50 ॥

త్వన్ముఖాచ్ఛ్రోతుమిచ్ఛామి సిద్ధాంతం శ్రుతిసమ్మతం
సర్వజ్ఞ వద మే సాక్షాచ్ఛైవం సర్వార్థ సాధకం ॥ 51 ॥

సద్యః సిద్ధికరం పుంసాం సర్వయోగీంద్ర సేవితం
దురాచారైర నా ఘ్రాతం స్వీకృతం వేద వేదిభిః
శివాత్మైక్య మహాబోధనసంప్రదాయప్రవర్తకం ॥ 52 ॥

ఉక్త్వా భవాన్ సకలలో కమహోపకారం
సిద్ధాంత నంగ్రహమనాదృత బాహ్య తంత్రం
సద్యః కృతార్థయితుమర్హతి దివ్య యోగిన్
నానాగమశ్రవణ వర్తి తసంశయం మాం ॥ 53 ॥

ఓయీ! ఆచార్యుడా! నీ యొక్క ఆగమన రూపమైన సంపదనాకుదప్ప మరెవరికిని సంభవించదు! ఆకారణముచేత ముని శ్రేష్ఠులందరికిని యెల్లప్పుడు నేనెస్తుత్యార్హుడనై యున్నాను. ॥45॥ నీ దర్శనము చేతగల్గిన పుణ్య విశేషము చేత నేటికి నా యొక్క శివజ్ఞానము స్థిరపడినది. మరియు నాయొక తపస్సాధనము ఫలించినది. నాయొక్క ముని సార్వభౌమత్వము శాశ్వతమైనది. ॥46॥ సంసార రూపమైన సర్పదష్టమై మూర్ఛితులైయున్న మానవులకు నీయొక్క కళ్యాణ కటాక్షమే సంజీవని ఔషదమైయున్నది. ॥47॥ సమస్త లోకములను దహింపజేయు ఆధ్యాత్మిక - అధిభౌతిక -అధిదైవిక తాపములకు సంబంధించిన ప్రచండాగ్ని నీపాదోదకమొక్క ఒక్కబిందువును సేవించుట తోడనే యుప శమించును, ॥48॥ శివునకు ప్రీతిపాత్రుడవు ప్రమథాధినాయకుడవైన ఓయీ! ంణుక గణాధీశ్వరా! నన్ను అనుగ్రహించ వలయుననే కోరికతో నీవు ఈ భూమండలమునం దవతరించితివి, అనునది నే నెరుంగుదును. ॥49॥ శివాజ్ఞవేలన జననమరణములను నిర్మూలించిన నీవంటి సిద్ధాగ్రేసరుల ఈ విధమైన సంచారమె మానవాళికి అనుగ్రహించు

నట్లైనది. ॥50॥ యీ రేణుకా చార్యుడా! వేద సమ్మతమైన సిద్ధాంత శాస్త్రమును నీ వలన ఆలకించవలయునను కోరిక నాకు గలిగినది. అందుచేతనో సర్వజ్ఞమూర్తీ సర్వార్థ సాధకమైనదియునగు శివ సంబంధమైనదియు నగువెంటనే సిద్ధింపజేయునదియు నగు సమస్త యోగిపుంగవుల చేత సేవింపఁదగినదియు, దురాచారుల కనాఘ్రాతమైనదియగు, వేదవిదులకంగీకృతమైనదియునగు శివజీవైక్యమహాజ్ఞాన సాంప్రదాయ ప్రవర్తకమైనదియునైన సిద్ధాంత శాస్త్రమును నాకుపదేశింపుము. ॥51, 52॥ ఓయీ! యోగిపుంగవా! అనేక ప్రకార ములైన ఆగమశాస్త్రముల వినికిడిచేత సంశయగ్రస్తుడనైన నాకు నీ వేద బాహ్య తంత్రములను ఖండించునట్టి సమస్త ప్రాణులను అనుగ్రహించునట్టి దైన సిద్ధాంత శాస్త్రమును బోధించి ప్రస్తుతము నన్ను కృత కృత్యుడినిగా జేయుము. ॥53॥

*ఇతి శ్రీసిద్ధాంత శిఖామణౌ శ్రీరేణుకాగస్త్య*
*సంభాషణ ప్రసంగోనామ చతుర్థ పరిచ్ఛేదః పరిసమాప్తః*

*ఇది శ్రీసిద్ధాంత శిఖామణి శ్రీరేణుకాగస్త్యసంభాషణాత్మకమగు*
*నాలుగోవ పరిచ్ఛేదము పరిసమాప్తము*



# శ్రీసిద్ధాంత శిఖామణి

## పంచమ పరిచ్ఛేదః

## ఐదవ పరిచ్ఛేదము

॥శ్లో॥ అథాగస్త్యవచః శ్రుత్వా రేణుకో గణ నాయకః
ధ్యాత్వా క్షణం మహాదేవం సాంబమాహ సమాహితః ॥ 1 ॥

అగస్త్య మునిశార్దూల సమస్తాగమపారగ
శివజ్ఞానకరం వక్ష్యే సిద్ధాంతం శృణు సాదరం ॥ 2 ॥

అగస్త్య బహుధా ఖ్యాతాః సిద్ధాంతా రుచిభేదతః
భిన్నా చారసమాయుక్తా భిన్నార్థప్రతిపాదకాః ॥ 3 ॥

సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా
ఏతాని మానభూతాని న హంతవ్యాని యుక్తిభి : ॥ 4 ॥

వేదః ప్రధానం సర్వేషాం సాంఖ్యాదీనాం మహామునే
వేదానుసరణా దేషం ప్రమాణమితి నిశ్చితం ॥ 5 ॥

పాంచరాత్రస్య సాంఖ్యస్య యోగస్య చ తథా మునే
వేదైక దేశ వర్తిత్వం శైవం వేదమయం మతం ॥ 6 ॥

వేదైక దేశవర్తిభ్యః సాంఖ్యాదిభ్యో మహామునే
సర్వవేదాను సారిత్వాచ్ఛైవతంత్రం విశిష్యతే ॥ 7 ॥

శైవ తంత్ర మితి ప్రోక్తం సిద్ధాంతాఖ్యం శివోదితం
సర్వవేదార్థరూపత్వాత్ ప్రమాణం వేదవత్సదా ॥ 8 ॥

అగమా బహుధా ప్రోక్తాః శివేన పరమాత్మనా
శైవం పాశుపతం సోమం లాకులం చేతి భేదతః ॥ 9 ॥

తేషు శైవం చతుర్భేదం తంత్రం సర్వ వినిశ్చతం
వామం చ దక్షిణం చైవ మిశ్రం సిద్ధాంత సంజ్ఞకం ॥10 ॥

శక్తి ప్రధానం వామాఖ్యం దక్షిణం భైరవాత్మకం
సప్త మాతృపరం మిశ్రం సిద్ధాంతం వేద సమ్మతం ॥11 ॥

వేద ధర్మాభిధాయిత్వాత్ సిద్ధాంతాఖ్యః శివాగమః
వేద బాహ్య విరోధిత్వా ద్వేదసంమత ఉచ్చతే ॥ 12 ॥

వేద సిద్ధాంతయోరైక్య మేకార్థ ప్రతిపాదనాత్
ప్రామాణ్యం సదృశం జ్ఞేయం పండితై రేతయోః సదా ॥ 13 ॥

సిద్ధాంతాఖ్యే మహాతంత్రే కామికాద్యే శివోదితే
నిర్దిష్టముత్త రె భాగే వీరశైవమతం పరం ॥ 14 ॥

విశబ్దేనోచ్యతే విద్యా శివజీవైక్య బోధికా
తస్యాం రమంతే యే శైవా వీరశైవాస్తు తే మతాః ॥ 15 ॥

వేదాంత జన్యం యద్ జ్ఞానం విద్యేతి పరికీర్త్యతే
విద్యాయాం రమతే యః స వీర ఇత్యభిధీయతే ॥ 16 ॥

విద్యాయాం శివరూపాయాం రమంతే యే విశేషతః
తస్మాదేతే మహాభాగా వీరశైవా ఇతి స్మృతాః ॥ 17 ॥

విద్యాయాం రమతే యస్మాయాం హేయాం శ్వపద్రహేత్
అనే నైవ నిరుక్తేన వీరమహేశ్వరః స్మృతః ॥ 18 ॥

శైవైర్మా హేశ్వరైశ్చైవ కార్యమంతర్బహిః క్రమాత్
శివో మహేశ్వర శ్చేతి నాత్యంతమిహ భిద్యతే
యథా తథాన భిద్యంతే శైవా మహేశ్వరా అపిః ॥ 19 ॥

శివాశ్రితేషు తేశైవా జ్ఞాన యజ్ఞరతానరా
మాహేశ్వరా సమాఖ్యాతాః కర్మయజ్ఞరతాభువి
తస్మాదభ్యంతరే కుర్యుః శైవామాహేశ్వరాబహీ ॥ 20 ॥

వీర శైవాస్తు షడ్భేదాః స్థలధర్మ విభేదతః
భక్తాదివ్యవహారేణ ప్రోచ్యంతే శాస్త్రపారగైః ॥ 21 ॥

శాస్త్రం తు వీర శైవానాం షడ్విధం స్థలభేదతః
ధర్మభేదసమాయోగా దధికారి విభేధతః ॥ 22 ॥

అదౌ భక్త స్థలం ప్రోక్తం తతో మహేశ్వర స్థలం
ప్రసాదిస్థల మన్యత్తు ప్రాణలింగిస్థలం తతః
శరణస్థల మాఖ్యాతం షష్ఠమైక్యస్థలం మతం ॥ 23 ॥

# భక్తస్థలం (అంగస్థలాని)

ప్రమథాధిపతియగు శ్రీ రేణుకాచార్యులు అగస్త్య మహర్షి విన్న వించుకొనిన వాక్యములను విని క్షణకాలం ఏకాగ్రచిత్తుడై శక్తి సమేతుడైన పరమ శివుని ధ్యానించియుపదేశించుటకు మొదలిడెను ॥1॥ సమస్తాగమములయందు నిష్ణాతుడనై ఓయి! అగస్త్య మహర్షీ! శివజ్ఞానమును గలుగజేయుసిద్ధాంత శాస్త్రమునుపదేశిస్తున్నాను చిత్తగింపుము ॥2॥ ఓయి అగస్త్యుడా! కపిల పతంజల్యాది మహర్షులు ప్రీతివైచిత్ర్యముతో భిన్న భిన్న ఆచారములచేత గూడినవియు భిన్న భిన్నాచారములను ప్రతిపాదించునట్టివైన సిద్ధాంత ములనేకములున్నవి. ॥3॥ కపిలమహర్షిచేతవిరచితమైన సాంఖ్య శాస్త్రము, ప్రకృతిమరియు పురుషుడను రెండు పదార్థములను ప్రతిపాదించునట్టి ద్వైయనీశ్వరవాదమును గలిగియున్నది. పతంజలి మహర్షిచేతవిరచితమైన యోగశాస్త్రము అత్యంత కష్టతరమైనయమ-నియమ-ఆసన-ప్రాణాయామ-ప్రత్యాహార- ధ్యాన- ధారణ-సమాధియను అష్టాంగములను ప్రతి పాదించుచున్నది. సేశ్వరవాదిగానున్నది. వాసుదేవ విరచితమైన పాంచరాత్ర శాస్త్రమున వైష్ణవ దీక్షాంగభూతతప్త ముద్రధారణాది క్రియాప్రతిపాదన ద్వారా చిత్. అచిత్ - ఈశ్వర రూప పదార్థ త్రయమును ప్రతిపాదింపబడినది. శివ ప్రణీతంబైన పాశుపతశాస్త్రము, పశు-పాశ-పతిరూప పదార్థ త్రయమును ప్రతిపాదిం పఁబడినది. శివుని యప్రయత్న సిద్ధమైన నిశ్వాసోచ్ఛ్వా సరూపమగు ఋగ్యజు స్సామ వేదముల పూర్వకాండాను సారముగా జైమిని మహర్షిచేత విరచితమైన పూర్వ మీమాంస శాస్త్రము. యాగాది కర్మములను ప్రతిపాదించునట్టిదై అనీశ్వరవాదియై యున్నది. ఇటువంటి శాస్త్రములన్నియు ప్రమాణ భూతములైయున్నవి. అందుచేత వీటిని యుక్తి ప్రయుక్తులచేత ఖండింపదగదు ॥5॥ ఇక్కడ నుటంకించబడిన సాంఖ్యాది శాస్త్రములన్నియు వేదములననుసరించి యనుష్ఠించుట వలన ప్రమాణభూతము లైనవి ॥6॥ పాంచరాత్ర శాస్త్రము సాంఖ్యశాస్త్రము, యోగశాస్త్రము,వేదము యొక్క ఒక్కొక్క భాగముననున్నవి. శైవశాస్త్రము వేదమయమై యొప్పు చున్నది ॥7॥ ఓయీ! అగస్త్య మహర్షీ! వేదముయొక్క ఒక్కొక్క భాగమునందున్న సాంఖ్యాది శాస్త్రములకంటెను, సమస్తవేదములను అనుకరించునట్టి శైవశాస్త్రము విశేషించి మహత్వ పూరితమైయున్నది ॥8॥ శివప్రణీతంబైన శైవశాస్త్రము సిద్ధాంత శాస్త్రమని చెప్పబడుచున్నది. ఇట్టి సిద్ధాంత శాస్త్రము సమస్త వేదార్థమయ మైయున్నందున, ఎల్లప్పుడు వేదముల మాదిరిగానే ప్రమాణభూతమై విలసిల్లు చున్నది. శివ పరమాత్మునిచేత ఆగమములు శైవ-పాశుపత-సోమ-లాకుల-అనుభేదములచేననేక విధములుగా చెప్పబడినవి

॥9॥ ఆ ఆగమములలో శైవతంత్రము :- వామ -దక్షిణ-మిశ్ర - సిద్ధాంతములను నామములతో నాలుగు భేదములుగలవైయున్నవనియు సమస్త తంత్రజ్ఞుల చేత నిశ్చయించబడినది. ॥10॥

వామతంత్రము శక్తి ప్రధానమైనదియు, దక్షిణతంత్రముభైరవదేవతాత్మకమైనదియు, మిశ్రతంత్రము సప్తమాతృక దేవతాత్మకమైనదియు, సిద్ధాంతతంత్రము వేద సమ్మతమైనదిగా నున్నది. ॥11॥ సిద్ధాంతనామకమైన శివాగమమువేదోక్తమైన భస్మధారణ, మురుద్రాక్షధారణము. లింగధారణాది ధర్మములను ప్రతిపాదించుట చేత, వేద బాహ్యములైన చార్వాకాది మతము లను నిరోధించుటవలన వేద సమ్మతమైనదని చెప్పబడుచున్నది.॥12॥

*॥సర్వవేదేషు యద్దృష్టంతత్సర్వంతు శివాగమే॥*

అను వీరాగమ ప్రమాణాను సారముగా, వేద శాస్త్రము మరియు సిద్ధాంత శాస్త్రము ఈ రెండును ఒకే అర్థమును ప్రతిపాదించుటవలన పండితులైన వారు ఈ రెంటికిని ఒకే విధమైన ప్రామాణ్యంగా దెలియవలెను ॥13॥ శివునివలన యాదేశింపబడిన కౌమికాదివాతు లాంతమగు సిద్ధాంతనామకమగు మహాతంత్రము యొక్కఉత్తరభాగమందు పరమపవిత్రమైన వీరశైవమతము యొక్క స్వరూపమును నిరూపించనైనది. ॥14॥

"వి" యను శబ్దము లింగాంగ సామరస్య రూపంబైన శివజీవైక్య విద్యను బోధించుచున్నది. ఇట్టి లింగాంగ సామరస్యక రూపమగు శివజీవైక్య విద్యయందు ఎవరైతే వినోదముతో క్రీడింతురో వారే వీరశైవులని చెప్పబడుదురు " అన్యేషామ పిదృశ్య తె" (6-3-132) అను పాణినీయ సూత్రాను సారముగా "వి" శబ్దమునకు దీర్ఘము రావడము చేత "వీర"అను శబ్దము సిద్ధమగును ॥15॥ ఏ జ్ఞానము వేదాంత జన్యమైనదో. అదే విద్యగా చెప్పబడుచున్నది. ఇట్టి విద్యలో ఎవడైతేరమించునో అతడు "వీరుడు" అని చెప్పబడును ॥16॥ పరశివబ్రహ్మ స్వరూపంబగు విద్యలో విశేషముగా నెవరు ప్రేమను గనుపరచెదరో, అట్టివారు వీరశైవులని చెప్పబడుదురు ॥17॥ లింగాంగ సామరస్య రూపంబగు శివజీవైక్య విద్యలో ప్రీతియున్నవాడు జుగుప్సా (హీనము-నీచము) రూపమైనమాయను శ్వానము (కుక్క)వలెనివారించువాడు వీరమాహేశ్వరుడని చెప్పబడును, ॥18॥ వీరశైవులు శివలింగపూజను అంతరంగముననను వీరమాహేశ్వరులు బహిరంగమునందును జేయవలెను, శివ మరియు మహేశ్వర అను శబ్దములలో ఎట్లుగా విశేష భేదముండదో అట్లే వీర శైవులలో గాని లేదా వీరమాహేశ్వరులందుగాని విశేష భేదముండదు ॥19॥ శివాశ్రితులైన

వారిలో ఏమానవులైతే జ్ఞాన యజ్ఞమునందు అధికమైన అభిలాషగలవారో వారు వీరశైవులని చెప్పుకొందురు కర్మ యజ్ఞమునందు ప్రేమ గలవారు మాహేశ్వరులుగా చెప్పబడుదురు. ఆ కారణముచేత వీరశైవులు ప్రధానముగా లింగపూజను అంతరంగమునను, మాహేశ్వరులు ప్రధానముగా బహిరంగముగా నాచరించవలెను ॥20॥ వీరశైవములో భక్త-మహేశ-ప్రసాది-ప్రాణలింగ-శరణ-ఐక్య, అనే స్థల సంజ్ఞక నామ ధేయములతో నారు విధాలుగానున్నారు. ॥22॥ వీరశైవ శాస్త్రము స్థల భేదములతో నాయా స్థలములలో నిరూపించబడిన ఆ చార భేదము చేత, అధికారభేదము చేతను ఆరువిధాలుగా నున్నది. ఈ శాస్త్రమునకు వీరశైవ ధర్మనిష్ఠుడైన ముముక్షుడే అధికారి. శివజీవైక్య రూప సాయుజ్య ముక్తియే ప్రయోజనము. షట్ స్థలాంత ర్గతైకోత్తర శత స్థలములే విషయము. ఈ విషయమునకు శాస్త్రమునకు, ప్రతిపాద్య ప్రతిపాదక భావమే సంబంధము, వీరశైవ శాస్త్రము ఈ ప్రకారమైన అనుబంధ చతుష్టయముతో గూడియున్నది. ॥23॥ వీర శైవ శాస్త్ర ప్రసిద్ధమైయున్న షట్ స్థలములలో ఒకటవది భక్త స్థలము, రెండవది మాహేశ్వరస్థలము, మూడవది ప్రసాధిస్థలము, నాలుగవది ప్రాణలింగస్థలము, ఐదవది శరణస్థలము, ఆరవది ఐక్య స్థలము, ఈ రీతిగా స్థలము ఆరు విధములుగా విభజింపబడినది.

వీరశైవ సిద్ధాంతమునందు పరశివ బ్రహ్మము "స్థలమను పేరుతో వ్యవహరింపబడును. స్థీయతె లీయతేయత్రజగదేతచ్చరాచరం తద్బ్రహ్మ స్థల మిత్యుక్తం స్థల తత్వవిశారదైః ॥ అను ప్రమాణముమేరకు, చరాచరాత్మకమైన ఈ జగత్తుదేనియందు త్పత్తి లయములను బొందుచున్నదో అట్టి బ్రహ్మము స్థలమని పేర్కొనబడినది. అట్టి స్థలరూప పరశివ బ్రహ్మము తన యొక్క లీలా విలాసముచేత అంగ లింగ మనియు రెండు విధములుగా (నగును) నుండును. చిత్ శక్తి విశిష్ట జీవుడే " అంగము" అనబడును, చిచ్ఛక్తి విశిష్ట పరమశివుడే లింగమనబడును, లింగాంగ వదవాచ్యులైన శివ-జీవులైక్యవే లింగాంగ సామరస్యమనబడును. స్థలము-భక్త-మహేశ ప్రసాది ప్రాణలింగి శరణ-ఐక్యమను భేదముచేత నారువిధములై యున్నది. [శివే భక్తిస్సముత్పన్నాయస్యాసౌభక్త ఉచ్యతే! తస్యానుష్ఠేయధర్మాణాముక్తిర్భక్త స్థలం మతం ॥ కేవలం సహజేదానె నిష్ణాతః శివ తత్పరః బ్రహ్మాది స్థాణవిముఖో భక్తో మాహేశ్వరః స్మృతః॥ మనః ప్రసాద సిద్ధ్యర్థం - నిర్మలజ్ఞాన కారణం! శివ ప్రసాదం స్వీకుర్వన్ ప్రసాదీత్యేష కథ్యతే॥ లింగం చిదాత్మకం బ్రహ్మ తచ్ఛక్తిః ప్రాణరూపిణీ తద్రూపలింగ విజ్ఞానీ ప్రాణలింగీతి కథ్యతే ॥ సతీవరమణేయస్తు శివే శక్తిం విభావయన్ తదన్య విముఖః సోనయం జ్ఞాతః శరణనా మవాన్ ॥ ప్రాణలింగాది యోగేనసుఖాతి

శయమే యివాన్ ! శరణ్యాఖ్యా. శివేనైక్య భావనాదైక్యవాన్ భవేత్॥] ఎవడియందు నిజమైన శివభక్తి గలదో అట్టివాడు "భక్తుడ"నబడును. సహజదానమున నిష్ణాతుడైనవాడు, శివాసక్తుడు బ్రహ్మాది స్థాన విముఖుడు ఐనవాడే "మాహేశ్వరుడు అనబడును, ఈ మాహేశ్వరుడు తన మనః ప్రసన్నత కొరకు నిర్మలజ్ఞానమునకు గారణమైన శివ ప్రసాదమును స్వీకరించుటవలన "ప్రసాది యనబడును. పరశివబ్రహ్మ చిత్స్వరూపమనియు అట్టిపరశివ బ్రహ్మలోనున్న శక్తి ప్రాణ స్వరూపమనియు లింగము ఈ రెండిటి స్వరూపమై యున్నదనియు తెలిసికొనిన ప్రసాదియే"ప్రాణలింగాది యోగేన సుఖాతి శయమే యివాన్! శరణాఖ్యాం శివేనైక్య భావనాదైక్య వాన్ భవేత్॥

ఎవడియందు నిజమైన శివభక్తిగలదో అట్టివాడు "భక్తుడ"నబడును, ఈ మహేశ్వరుడు తన మనః ప్రసన్నత కొరకు నిర్మల జ్ఞానమునకు గారణమైన శివ ప్రసాదమును స్వీకరించుట వలన "ప్రసాది యనబడును. పరశివ బ్రహ్మచిత్స్వరూపమనియు, అట్టి పరశివ బ్రహ్మలోనున్న శక్తి ప్రాణ స్వరూపమనియు లింగము ఈ రెంటి స్వరూపమైయున్నదనియు తెలిసికొనిన ప్రసాదియే "ప్రాణలింగి"యనబడును. తన భర్తను దప్ప పర పురుషుల పై విముఖురాలైన పతివ్రతా స్త్రీ మాదిరి (వలె) ఎవడు తనను శివునివిషయమున సతి (భార్య)వలె భావించుకొని అన్య దేవతల విషయమంలో విముఖుండగునో అట్టి ప్రాణలింగేశివశరణుడనబడును, ఇట్టి శరణుడు ప్రాణలింగాది యోగముచేత సుఖాతిశయమును బొంది శివోహంభావన చేత శివునిలోనే కత్వమును బొందుట వలన "ఐక్యుడు" అనబడును. అనియీ గ్రంధమునందేశ్రీ రేణుక భగవత్పాదులు షట్ స్థలములను స్వరూపములను గురించి నిరూపించి యున్నారు.॥23॥

## భక్తస్థలం (అంగస్థలాని - 44)

॥శ్లో॥ భక్తస్థలం ప్రవక్ష్యామి ప్రథమం కలశోద్భవ
తదవాంతర భేదాంశ్చ సమాహితమనాః శృణు ॥ 24 ॥

శివే భక్తిః సముత్పన్నా యస్యాసౌ భక్త ఉచ్యతే
తస్యానుష్ఠేయధర్మాణాయుక్తిర్భక్త స్థలం మతం ॥ 25 ॥

అవాంతరస్థలాన్యత్ర ప్రాహుః పంచదశోత్తమాః
పిండతా పిండవిజ్ఞానం సంసారగుణ హేయతా ॥ 26 ॥

దీక్షా లింగధృతిశ్చైవ విభూతేరపి ధారణం
రుద్రాక్షధారణం పంచాక్షరజపస్తథా ॥ 27 ॥

భక్త మౌర్గక్రియా చైవగురోర్లింగస్య చార్చనం
జంగమస్యతథా హ్యేషాం ప్రాసాదస్వీకృతి స్తథా ॥ 28 ॥

అత్ర దానత్రయం ప్రోక్తం సోపాధి నిరుపాధికం
సహజం చేతి నిర్దిష్టం సమస్తాగమపారగైః
ఏతాని శివభక్తస్య కర్తవ్యాని ప్రయత్నతః ॥ 29 ॥

ఓయీ! అగస్త్య మహార్షీ! మొదలు భక్తి స్థలమును, ఆ స్థలమునందున్నట్టి అవాంతర భేదములను బోధించెదను, నిశ్చలమనస్సుగలవాడవైవినుము ॥24॥ ఎవనిలో నిజమైన శివభక్తియుత్పన్నమగుచున్నదో అతడే నిజమైన భక్తుడని జెప్పబడుచున్నాడు. అటువంటి భక్తుడు అనుష్ఠానమునాచరించు ధర్మములయుపదేశమె భక్తస్థలమని చెప్పబడును ॥25॥ ఇట్టి భక్తస్థలము -పిండస్థలము, పిండజ్ఞానస్థలము, సంసార హేయస్థలము, దీక్షలక్షణగురుకారుణ్య స్థలము, లింగధారణ స్థలము, భస్మధారణస్థలము, రుద్రాక్షధారణస్థలము, పంచాక్షర జప స్థలము, భక్తిమార్గక్రియా స్థలము,ఉభయ స్థలము, త్రివిధ సంపత్తి స్థలము, ప్రసాద స్వీకార స్థలము సోపాధిదాన స్థలము, నిరుపాధిదాన స్థలము, సహజ దాన స్థలము, అను భేదముల చేత 15 విధ ములుగా నున్నది. శివ భక్తుడైన వాడు ఈ 15 స్థలము లందు జెప్పబడిన ధర్మములను ప్రయత్న పూర్వకముగా నాచరింపదగును ॥26-27-28-29॥

## 1. పిండస్థలము

॥శ్లో॥ బహుజన్మ కృతైః పుణ్యైః ప్రక్షీణే పాపపంజరే
శుద్ధాంతఃకరణో దేహీ పిండశబ్దేన గీయతే ॥ 30 ॥

శివశక్తి సముత్పన్నే ప్రపంచేన స్మిన్ విశిష్యతే
పుణ్యాధికంః క్షీణపాపః శుద్ధాత్మా పిండనామకః ॥ 31 ॥

ఏక ఏవ శివః సాక్షా చ్చి దానందమయో విభుః
నిర్వికల్పో నిరాకారో నిర్గుణో నిష్ప్రపంచకః ॥ 32 ॥

అనేక జన్మములనుండియార్జించిన పుణ్యములచేత పాపసమూహమునశింపగా జీవుడు శుద్ధాంతః కరణయుక్తుడై పిండమని చెప్పఁబడును ॥31॥ శక్తి విశిష్ట పరమశివుని చేత నుత్పన్నమైన ఈ ప్రపంచమునందు పుణ్యాధిక్యతచేత పాపసమూహమును నశింపచేసి పరిశుద్ధాత్ముడైన పిండనామకుడైన జీవుడు అందరి కంటెను శ్రేష్ఠుడనిపించుకొనును. ॥32॥ పరమ శివుడు చిదానంద స్వరూపుడు సర్వ వ్యాపకుడు, భేద రహితుడు, నీల పీతాద్యాకార రహితుడు. మాయిక సత్త్వరజస్తమోగుణరహితుడు మాయిక ప్రపంచమునకు దూరమైనవాడు.

అనాద్య విద్యా సంబంధాత్తదంశో జీవనామకః
దేవతిర్యఙ్మనుష్యాదిజాతిభేదే వ్యవస్థితః
మాయీ మహేశ్వరస్తేషాం ప్రేరకో హృదిసంస్థితః ॥ 33 ॥

చంద్రకాంతే యథాతో యం సూర్యకాంతే యథా2నలః
బీజే యథాన్ంకురః సిద్ధస్తథాఽఽ త్మని శివః స్థితః ॥ 34 ॥

గుణత్రయాత్మికా శక్తి ర్బ్రహ్మనిష్ఠా సనాతనీ
తద్వైషమ్యాత్స ముత్పన్నా తస్మిన్ వస్తుత్రయాభిధా ॥ 35 ॥

కించత్సత్త్వరజోరూపం భోక్తృసంజ్ఞకముచ్యతే
అత్యంతతామసోపాధిర్భోజ్యమిత్యభిధీయతే ॥ 36 ॥

పరతత్త్వ మయోపాధిర్బ్రహ్మచైతన్యమీశ్వరః
భోక్తాభోజ్యం ప్రేరయితా వస్తుత్రయమిదంస్మృతం ॥ 37 ॥

అత్ర ప్రేరయితా శంభుః శుద్ధోపాధిర్మ హేశ్వరః
సమిశ్రోపాధయః సర్వే భోక్తారః పశవఃస్మృతా
భోజ్యమవ్యక్త మిత్యుక్తం శుద్ధతామసరూపకం ॥ 38 ॥

అత్యంత గూఢ చైతన్యం జడమవ్యక్త ముచ్యతే
సర్వజ్ఞః ప్రేరకః శంభుః కించిద్‌జ్ఞో జీవ ఉచ్యతే ॥ 39 ॥

ఉపాధిః పునరాఖ్యాతః శుద్ధాశుద్ధవిభేదతః
శుద్ధోపాధిః పరామాయా స్వాశ్రయాన్ మోహకారిణీ ॥ 40 ॥

అశుద్ధోపాధిర ప్యేవమవిద్యాశ్రయ మోహినీ
అశుద్ధోపాధిరప్యేవ మవిద్యాశ్రయ మోహినీ
అవిద్యా శక్తి భేదేన జీవా బహువిధాః స్మృతాః ॥ 41 ॥

మాయా శక్తి వశాదీశో నానామూర్తి ధరఃప్రభుః
సర్వజ్ఞః సర్వకర్తాచ నిత్యముక్తో మహేశ్వరః ॥ 42 ॥

కించిత్కర్తాచ కించిద్జ్ఞో బద్ధోఽ నాదిశరీరవాన్
అవిద్యా మోహితా జీవా బ్రహ్మైక్యజ్ఞానవర్జితా ॥ 43 ॥

పరిభ్రమంతి సంసారే నిజకర్మానుసారతః
దేవతిర్యఙ్మనుష్యాదినానాయోనివిభేదతః ॥ 44 ॥

చక్రనేమిక్రమేణైవ భ్రమంతి హి శరీరిణః
జాత్యాయుర్భోగవైషమ్య కారణం కర్మ కేవలం ॥ 45 ॥

ఏతేషాం దేహినాం సాక్షీ ప్రేరకః పరమేశ్వరః
సంసారే భ్రమతాం నిత్యం కర్మయంత్ర నియంత్రణే ॥ 46 ॥

దేహినాం ప్రేరకః శంభుర్హిత మార్గోపదేశకః
పునరావృత్తి రహిత మోక్ష మార్గోపదేశకం ॥ 47 ॥

స్వకర్మపరిపాకేన ప్రక్షీణమలవాసనః
శివప్రసాదాజ్జీవోఽ యం జాయతే శుద్ధమానసః ॥ 48 ॥

శుద్ధాంతః కరణే జీవే శుద్ధకర్మ విపాకతః
జాయతే శివకారుణ్యాత్ ప్రస్ఫుటా భక్తిరైశ్వరీ
జంతురంత్య శరీరోఽసౌ పిండశబ్దాభిదేయకః ॥ 49 ॥

॥ఏకమేవాద్వితీయం బ్రహ్మ ॥ఇత్యాదిశ్రుతి ప్రమాణానుసారముగా ఒకే ఒక ప్రభువై యున్నాడు. ॥33॥తనలో నిత్య సంబంధముతో యుండి విమర్శనా శక్తిలో లీనమైయున్న అనాది మాయయొక్క సంబంధము చేత పరమశివుని యందంశము "జీవుడనిపించు కొనును". అట్టి జీవుడు దేవ మనుష్య-పశు-పక్షి-మృగ-జలచర- ఇత్యాద్యనం తానంత భేదములతో గూడినజీవరాసులయందు నివసించియున్నాడు. "మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం" అనే శ్రుతి ప్రమాణానుసారముగా ఆ పరమశివుడు

మాయాశక్తి విమర్శశక్తితో గూడుకొని ప్రేరకుండై సమస్త ప్రాణుల హృదయమున నివసించి యున్నాడు. జీవుడై శివాంశరూపుడై యున్నాడనియు ఈ అభిప్రాయమును బ్రహ్మసూత్ర మునందు "అంశోనానావ్యపాదేశాత్ అను సూత్రము సమర్థించుచున్నది.

శ్లో ॥ యథాసుదీప్తా త్పావకాత్ విస్ఫుల్లింగాః సహస్ర శః ప్రభవంతే సరూపాః।
తథ్యాక్షరాద్వివిధాఃసోమ్య భావాః ప్రజాయంతే తత్రచేవాపియంతి॥

అగ్నినుండి అగ్న్యంశరూపంబులైన కణములు ఎట్లు ఆవిర్భవించుచున్నవో అట్లుగానె పరబ్రహ్మనుండి తదంశరూపంబులైన అనంతానంత జీవరాసులు ఆవిర్భవించుచున్న వనియు, అక్కడేలయమును బొందుచున్నవనియు ముండకోపనిషత్తు చాటుచున్నది. జీవుడు స్థూల చిద చిదాత్మక శక్తి విశిష్టుడై యున్నాడు. జీవుని స్థూల చిచ్ఛక్తి కించిత్ కర్తృతాస్వరూపమై యున్నది. జీవుడు ఈ రెండు విధములైన శక్తుల కాధారమై ఇచ్ఛాశక్తితో గూడుకొని యున్నాడు.అర్థాత్ ఇచ్ఛాశక్తి విశిష్టుడై యొప్పుచున్నాడు. శివాంశ సంభూతుడగు జీవుఁడు కించిదజ్ఞుడు కించిత్కర్తువు. కించిచ్ఛక్తియుతుడును. అవిద్యా మోహితుడు, బ్రహ్మైకజ్ఞాన వర్జితుం డును, అతి భయంకరమైన అంతులేని సారములేని సంసారతాపత్రయానలము నుండిగాల్చబడి పాశబద్ధుడై యున్నాడు. పరమశివుడు సచ్చిదానంద స్వరూపుడు, సర్వజ్ఞుడు, సర్వకర్త, సర్వశక్తి సంపన్నుడు. ఉపమాతీతుడు, జనన - మరణ రహితుడు, చరాచర ప్రపంచవ్యాపకుడు, శాశ్వతుఁడునై యున్నాడు.

వీరశైవ సిద్ధాంతమునందు శివ-జీవులకు పార మార్థిక -భేదా భేదము అంగీకృతమై యున్నది. అగ్నినుండావిర్భవించిన అగ్నికణములకు అగ్నికి అత్యంత భేదమునుగాని అథవా అత్యంతా భేదమునుగాని చెప్పరాని రీతిగా, శివుని నుండి ఆవిర్భవించి శివాంశ సంభూతము లైన జీవులకును శివునకుఅత్యంత భేదమునుగాని అథవా అత్యంతా భేదమును గాని చెప్పుటకు వీలులేదు, జౌతె ఈ భేదాభేదమును మాత్రము చెప్పఁదగును, అంశాంతులకు యత్యంతా భేదమును జెప్పిన యెడల అగ్నినుండి జరిగే పాకాది క్రియలు అగ్ని యంశములైన కణముల నుండియు జరుగవచ్చును గదా!

అత్యంత భేదమును జెప్పినచో నగ్నికి యత్యంత భిన్నములైన జలాదులతో దాహకార్యము జరుగబోదు? అగ్ని కణములు పత్తి (దూది)లో ప్రవేశించి దాహకార్యమును గలుగ జేయుటలోక ప్రసిద్ధేగదా? ఇట్లే శివుడికి శివాంశరూపమగు జీవుడికి అత్యంతా భేదమును జెప్పిట్లైతే, శివునిలోనున్న సర్వజ్ఞత్వము-సర్వ కర్తృతాదిగుణములు జీవునిలోను

ఉండ వచ్చును. అత్యంత భేదమును జెప్పినచో శివునకు భిన్నములైన ఘటాపటాదుల చేత జ్ఞానరూపకార్యము జరుగకుండజీవుడినుండియు గాకపోవును? జీవులకు ఘటపటాదివుల జ్ఞానముండ్ను సరియైనదేగదా! అందుచేత వీరశైవాచార్యులు శివునకు జీవునకు పారమార్థిక మగు భేదాభేదమును అంగీకరించియున్నారు. అందువల్లనే వీరశైవమతమునకు ద్వైతాద్వైత మనియు నామాంతరము వచ్చియున్నది. వేదములందును.

"ద్వాసుపర్ణాసయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతె" ఇత్యాది వాక్యములు ద్వైతమును ప్రతిపాదించునట్టివైయున్నవి. "తత్త్వమసి" అహంబ్రహ్మాస్మినేవ తీనానాస్తికించన' ' ఇత్యాది వాక్యములు అద్వైతమును ప్రతిపాదించున్నట్టివి. ఇట్టి రెండు విధములైన వాక్యములు నంలభమార్గముచేత సామంజన్వమును గలుగజేయుట, వైదికమతానుయాముల ముఖ్యకర్తవ్యమైయుంటవలన ఇదే మార్గములను వీరశైవమతా చార్యులు అనుసరించి యుండుటవలన వీరశైవ సిద్ధాంతము సమస్త వేదముల సమ్మతమై యున్నది.

ఇదే విషయమును వీరశైవమత భాస్య కారులైన శ్రీపతి పండితుల వారు తామురచించిన శ్రీకర భాష్యమునందు ఇట్లాదేశించిరి.

*॥ద్వైతాద్వైతమతేశుద్ధే - విశేషాద్వైత సంజ్ఞికే!*
*వీరశైవైక సిద్ధాంతే - సర్వశ్రుతి సమన్వయః*

దీనితో వీరశైవ మతము భేదాభేదాత్మక మైనదనియు సిద్ధమగుచున్నది. ॥34॥ చంద్రకాంత శిలయందు నీరు ఎట్లు సహజసిద్ధముగా నున్నదో. సూర్యకాంత శిలయందగ్ని ఎట్లు సహజముగా నున్నదో, బీజమందంకురమెట్లు సహజముగా నుండునో, అట్లే జీవుని యందు పరమ శివుడు సహజముగానే యుండును.

*॥ఔష్ణ్యంహుతాశ ఇవ- శీతలీమానమిందౌ!*
*శయ్యానుమార్దవమివాశ్మసుకర్క శత్వం॥*

అను ప్రమాణానుసారముగా అగ్నిలో ఉష్ణత్వము చంద్రునిలో శీతలత్వము, పడకలో మెత్తదనము రాతిలో కఠినత్వముండుట స్వభావ సిద్ధముగా నుండురీతిగా సచ్చిదానంద రూపమగు పరశివ బ్రహ్మమున అనాదియగు విమర్శనా శక్తి స్వభావసిద్ధముగానున్నది. మయూ రాండరసన్యాయము పగిది (నెమలి యొక్క గ్రుడ్డురసములో మున్ముందుత్పన్నమయ్యె.

నెమిలి యొక్క రూపు రేఖలు అనగా దానికి గలగబోవు పాదములు-రెక్కలు-ముక్కు-మూతి - కన్నులు అనేక రకములైన చిత్ర విచిత్రమైన రంగులు అరసమునందు లీనమై యుండునట్లుగా) ఆ విమర్శనా శక్తిలో ఈ సమస్త చరాచరాత్మకమైన జగత్తులీనమై యున్నది.

ఈ చరాచరాత్మకమైన జగత్తుతో యుక్తమగు విమర్శన శక్తి తన యంశముతో పరామర్శన స్థితిలో సత్వగుణమురజోగుణ-తమోగుణస్వరూపమును ధరించును. ఆ విమర్శనా శక్తి యంశము నందు ఉత్తమ కర్తృత్వ నిరుక్త జ్ఞానాంశమునుండి సత్వగుణాత్మక మైనవిద్యా శక్తి యుద్భవించును. ఉత్తమ జ్ఞాతృత్వ వినిర్ముక్త క్రియాంశముతో కించిత్సత్తత్వ తమోగుణ మిశ్రితమగు రజోగుణశక్తి యుత్పన్నమగును. జ్ఞానశక్రియలకు స్వాభావికముగానే కత్వముగలిగి యున్నను సృష్టి దృష్టిలో జ్ఞాన క్రియాశక్తులు అన్యోన్యముగా విభాగమును బొంది యుండుటవలన "జ్ఞానం క్రియాన భవతి క్రియా జ్ఞానం నభవతి" జ్ఞానము క్రియానభవతి క్రియా జ్ఞానం నభవతి " జ్ఞానము క్రియగా అక్రియజ్ఞానముగాదు అనుభేద బుద్ధి రూపంబగు తమోగుణశక్తియుప్పతిల్లును. ఇట్టి తమోగుణశక్తే జడరూపమనే మాయయగును. సూర్యకిరణములు సూర్యకాంతశిలకు సోకగానే అది అగ్నిగా మారి ప్రతితో గూడి అగ్నియాకారమును దాల్చు రీతిగా శివుడి విమర్శనా శక్తి జడమాయశక్తిని ప్రతిస్పందనగతి చేత ప్రవేశించి సుఖ-దుఃఖమోహములను గలుగజేయు సత్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతియాకారమును ధరించును.

సత్వరజస్తమోగుణముల తారతమ్యముల చేతనా విమర్శనా శక్తి శుద్ధచిద్రూపుడైన పరమశివుని యందు భోక్త్య-భోజ్య ప్రేరకరూపమై పరిణమించును.

*॥తదీయా పరమాశక్తిః - సచ్చిదానందలక్షణా।*
*సమస్తలోకనిర్మాణ సమవాయస్వరూపిణీ॥*

తదిచ్ఛయా2 భవత్సాక్షా తత్స్వారూపానుకారిణీ॥ పరమశివుడికి సంబంధించిన ఆ శక్తి సమస్తలోకముల నిర్మాణమునందు సమవాయ స్వరూపముతో నుండి ఆతని యిష్టాను సారముగా సాక్షాత్తునాతని స్వరూపమే యగును. అనుప్రమాణాను సారముగా శక్తి పరమశివునికి యభిన్నముగానుండి విశ్వోత్పత్తికి కారణభూతమై యున్నది.

*॥ చిదాత్మైవహి దేవ్యోంతః స్థిత మిచ్ఛావశాద్బహిః*
*యోగీవనిరుపాదాన మర్థజాతం ప్రకాశయేత్॥*

ఈ లోకమునందు యోగి తన యిష్టానుసారముగా వస్తు జాలమును బ్రకటింపజేయు రీతిగా పరమ శివుడు దనలో నిమిడియున్న జగత్తును విమర్శనా శక్తిచేత బ్రకటింప జేయును. అను ప్రమాణముంటవలన ఈ చరాచరాత్మకమైనవిశ్వము అనాది కాలము నుండియు నా పరశివ పరబ్రహ్మములో సద్రూపమై యున్నదనియు సిద్ధమగుచున్నది. ఇదే విషయమును గీతలో గూడ

*॥నాసతో విద్యతే భావో - నా భావో విద్యతే సతః*

అనే వాక్యము ప్రమాణీకరించుచున్నది. దీనితో చరాచరాత్మకమగు నీ జగత్తు మాయా వాదులు జెప్పునట్లుగా మిథ్యగా జెప్పబడకుండ సత్యమైనదేయని సిద్ధాంతీకరించ నైనది. ॥36 ॥

కించిత్సత్త్వరజోగుణరూపమైన జీవచైతన్యము "భోక్త" అనబడును. అత్యంతలామ సోపాధి విశిష్టమగు చైతన్యము రసాదిరూపమైన "భోజ్యమనబడును ॥37॥ పరతత్త్వరూపమగు శుద్ధసత్వగుణోపాధివిశిష్ట బ్రహ్మచైతన్యముతో నున్న మహేశ్వరుడు "ప్రేరకుడనబడును" , భోక్తృ-భోజ్య-ప్రేరక ఈ మూడు వస్తువులనబడును ॥38॥ వీనిలో శుద్ధోపాధి విశిష్టుడైన మహేశ్వరుడు ప్రేరకుడనఃబడును. మిశ్రోపాధులతో కూడియున్న సమస్త "భోక్తృ"లు (జీవులు) "పశువు"లని వ్యవహరించబడును. శుద్ధతామసరూపమైన భోజ్యము. అవ్యక్తమనియు అర్థాత్ప్రకృతియని చెప్పబడును ॥39॥ ఇట్టి యవ్యక్తమగు (మాయాఅథవా ప్రకృతి) జడమైయుండి. అత్యంతనిగూఢ చైతన్యం గలదై యున్నది. లోకమున జడవస్తువులై యున్న సస్యములు, శిలలు, అవ్యక్త చైతన్యముతో గూడివృద్ధి బొందుట సుప్రసిద్ధమేగదా! సర్వజ్ఞుడైన మహేశ్వరుడు ప్రేరకుడనబడును. " కించిజ్ఞుడైన వాడుగా "జీవుడు" అనబడును ॥40॥ పూర్వోక్తమైన మాయోపాధి మరల శుద్ధము మరియు అశుద్ధము అని రెండు విధములు. శుద్ధోపాధిరూపమగు పరామాయయె తనను (శివుడిని)ఆశ్రయించుకొని యుండి యాతనికి మోహమును గలుగజేయును. ఇదే (ఊర్ధ్వమాయె) యనబడును॥41॥ అశుద్ధోపాధి రూపమైన అవిద్య జీవులనాశ్రయించుకొని యుండి వారిని మోహపరవశులుగా నొనర్చును. ఇదే"అధోమాయ" ప్రకృతియనబడును. అవిద్యాశక్తి భేదముతో జీవులు అనేకవిధాలగును. ॥42॥పరమేశ్వరుడు మాయాశక్తి సంబంధముతో అనేక విధాలుగా దివ్యమంగల విగ్రహరూపమును ధరించినవాడై, కర్తుమకర్తుమన్యథాకర్తుంసమర్థుడై, సర్వజ్ఞుడు, సమస్త ప్రపంచనిర్మాణకారణీభూతుడు, నిత్యయుక్తుడు అగును ॥43॥ జీవుడు కించత్కర్తృవు, కించిదజ్ఞుడు ఆణవాద్యనాదిమలపాశబద్ధుడు. అనాదికాలమునుండి బొందియున్న

శరీరాభిమానముగలవాడై యున్నాడు. అవిద్యచేత మోహపరవశులైయున్నారు. ॥44॥జీవులు తమతమ కర్మాను సారముగా దేవుడు. మానవుడు, పశుపక్షి మున్నగు 84 లక్షల జీవరాసుల యోనులందు జన్మించి చక్రనేమిక్రమము మాదిరి సంసారమున సదా తిరుగుచుండును. జాతి ఆయువు-సుఖము-దుఃఖము మొదలగునవన్నీ జీవుల కర్మకేగారణీభూతమైనది. బ్రాహ్మణాద్యుత్తమజాతులలో జన్మమెత్తుటకు, శూద్రాదికనిష్ఠజాతులలో జన్మించుటకు జీవుల కర్మమే ముఖ్యకారణమై యుండి, బ్రాహ్మణాదిజాతులు జన్మసిద్ధమైనవనుటే శ్రీ భగవత్పాదుల ప్రధానాశయమైయున్నది. ఇట్టి యభిప్రాయమునే యోగ శాస్త్ర గ్రంథ కర్తలైన పతంజలి మహర్షుల వారు.

*॥సతిమూలెతద్విపాకోజాత్యాయుర్భోగాః॥*

అనుయోగసూత్రములో ప్రతిపాదించబడినది ॥45-46॥ కర్మ మంత్రమునందు నియంత్రితమై యున్న సంసార చక్రములో సదా పరిభ్రమించు జీవులకు పరమేశ్వరుడే ప్రేరకుడుగాను, సాక్షిభూతుడుగాను ఐ యున్నాడు ॥47॥ ప్రేరకుడైన మహేశ్వరుడు జీవులకు హితమును గూర్చుకర్మమార్గమును జూపించును ॥48॥ జీవుడు తన కర్మ పరిపాకమువలన అనాది సంచితమలవాసనల బోగొట్టుకొని శివ ప్రసాదము వలన శుద్ధాంతః కరణముగల వాడగును ॥49॥ జీవుడు శుద్ధాంతః కరణముగలవాడగుటకు శివునియనుగ్రహమువలన శివుని సంబంధమగు పరిశుద్ధమైన భక్తి సముత్పన్నమగును. ఈ విధమగు పరిశుద్ధ శివభక్తియుక్తుడైన జీవుడు చరమ శరీరము గలవాడై "పిండ" శబ్దవాచ్యుడగును ॥50॥

## 2 పిండజ్ఞాన స్థలం

॥శ్లో॥ శరీరాత్మ వివేకేన పిండజ్ఞానీ సకథ్యతే
శరీరమేవ చార్వాకై రాత్మేతి పరికీర్త్యతే ॥ 50 ॥

ఇంద్రియాణాం తథాత్మత్వమపరైః పరిభాష్యతే
బుద్ధితత్త్వగతైర్బౌద్ధైర్బుద్ధిరాత్మేతిగీయతే ॥ 51 ॥

సేంద్రియాణాం న దేహస్య న బుద్ధేరాత్మతా భవేత్
అహంప్రత్యయ వేద్యత్వాదనుభూతస్మృతేరపి ॥ 52 ॥

శరీరేంద్రియ బుద్ధిభ్యో వ్యతిరిక్తః సనాతనః
ఆత్మస్థితివివేకీ యః పిండజ్ఞానీ నకథ్యతే ॥ 53 ॥

నశ్వరాణి శరీరాణి నానారూపాణి కర్మణా
ఆశ్రితో నిత్య ఏవాసావితి జంతోర్వివేకితా ॥ 54 ॥

శరీరాత్పృథగాత్మానమాత్మనః పృథగీశ్వరం
ప్రేరకం యో విజానాతి పిండజ్ఞానీ స కథ్యతే ॥ 55 ॥

దేహము మరియు ఆత్మవీటి యొక్క జ్ఞానముగలవాడె పిండజ్ఞాని యనబడును. ప్రపంచ మానవులకు గృహక్షేత్రాదులు ఇల్లు-పొలము-ధనము-ధాన్యాదులు) అభివృద్ధి జెందుటకు సుఖము ఇవి నశించుటలో దుఃఖము గలుగుట స్వభావ సిద్ధముగా నున్నది.

అందుచేత విషయాత్మవాదులైన లౌకికులు గృహక్షేత్రాదులే ఆత్మయనిదెలియుచున్నారు. వీరి కంటెను కొంచెము అధికముగా జ్ఞానమున్న చార్వాకులు ఇల్లు-పొలము మున్నగువాటికి ఇది-పక్షి. ఇది-గ్రామము అనే వివేక జ్ఞానముండుటవలన శరీరమే ఆత్మయని చెప్పుచున్నారు. ॥51॥ శరీరమందలి ప్రాణవాయువు యొక్క సంచారమే లేనప్పుడు ఏ జ్ఞానము ఉత్పన్నముగాకపోవుటచేత ప్రాణమే ఆత్మయని కొందరు చెప్పుచున్నారు. పరుండిన సమయంలో ప్రాణవాయువు యొక్క సంచారమున్నను ఇంద్రియముల వ్యవహారములేని కారణమున యే జ్ఞానము గలుగకపోవుట వలన ఇంద్రియములే ఆత్మయని, మరి కొందరు బలుకుచున్నారు. చక్షురాది ఇంద్రియములు జడమై యుండి బుద్ధి కఠీనమై యుంటవలన బుద్ధే ఆత్మయని బౌద్ధులు బలుకుచున్నారు॥52॥

నేను స్థూల శరీరము గలవాడిని కృశించిన దేహము గల వాడిని, నేను సుఖిని. దుఃఖితుడను. పూర్వమున నేను బాలుడిని. ఇప్పుడు యౌవ్వనము గల వాడిని, సద్యః వృద్ధుడిని, అను వ్యవహారము సాధారణముగా నందరియందుండుట వలన ఈ శరీరము ఆత్మగాదు. ॥53॥ శరీరము, ఇంద్రియ, బుద్ధి, వీటన్నింటికంటెను, ప్రత్యేకమైనది. "అహంనేను, అనే జ్ఞానమునకు విషయ భూతుడు. అనాది సంసిద్ధుడు ఐన ఆత్మ వేరొకటై యున్న దనియు ఎవడైతే ఆత్మ స్వరూపమును గుర్తించునో ఆతడే పిండజ్ఞాని యనబడును. ॥54॥ పూర్వాకర్మనుసారముగా నానా యోనులందు జన్మించి యనేక రూపములను ధరించిన శరీరములు నశించును. ఔతే ఇట్టి శరీరములు ఆశ్రయించి యున్న ఆత్మ మాత్రము నాశరహితమై యుండి నిత్యమై యున్నాడని దెలిసి కొనుటే వివేకము ॥55॥ శరీరమున కంటే ఆత్మ భిన్నమై యున్నాడనియు, ఆ ఆత్మకంటెను ప్రేరకుండైన ఈశ్వరుడు భిన్నముగానున్నాడనియు, ఎవడు జీవాత్మ పరమాత్మల స్వరూపమును గుర్తిస్తాడో అతడే పిండజ్ఞాని యని చెప్పబడుచున్నాడు ॥55॥

## 3 సంసారహేయస్థలం

॥శ్లో॥ నిరన్తహృత్కలంకస్య నిత్యానిత్యవివేకినః
సంసార హే యతా బుద్ధిర్జాయతే వాసనాబలాత్ ॥ 56 ॥

ఐహికే క్షణికే సౌఖ్యే పుత్రదారాది సంభవే
క్షయిత్యాదియుతే స్వర్గే కస్య వాంఛా వివేకినః ॥ 57 ॥

జాతస్యహి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృత్యస్యచ
జంతుర్మరణ జన్మభ్యాం పరిభ్రమతి చక్రవత్ ॥ 58 ॥

మత్స్యకూర్మ వరాహాంగైర్న్రు సింహమనుజాదిభిః
జాతేన నిధనం ప్రాప్తం విష్ణు2 నాపి మహాత్మనా ॥ 59 ॥

భూత్వా కర్మవశాజ్జంతుర్బ్రాహ్మణాదిషు జాతిషు
తాపత్రయమహావహ్నా సంతాపాద్దహ్యతే భృశం ॥ 60 ॥

కర్మమూలేన దుఃఖేన పీడ్య మానస్య దేహినః
ఆధ్యాత్మికాదినా నిత్యం కుత్ర విశ్రాంతిరాప్యతే॥ ॥ 61 ॥

ఆధ్యాత్మికం తు ప్రథమం ద్వితయంచాది భౌతికం
ఆధిదైవికమన్యచ్చ దుఃఖత్రయమిదం స్మృతం ॥ 62 ॥

ఆధ్యాత్మికం ద్విధా ప్రోక్తం బాహ్యాభ్యంతర భేదతః
వాతపిత్తాదిజం దుఃఖం బాహ్యమాధ్యాత్మికం మతం
రాగద్వేషాదిసంపన్న మాంతరం పరికీర్త్యతే ॥ 63 ॥

ఆధిభౌతికమేతద్ధి దుఃఖం రాజాదిభూతజం
అధిదైవిక మాఖ్యాతం గ్రహయక్షాదిసంభవం ॥ 64 ॥

దుఃఖైరేతైరుపేతస్య కర్మ బద్ధస్య దేహినః
స్వర్గే వా యది వా భూమౌ సుఖలేశోన విద్యతే ॥ 65 ॥

తటిత్సు వీచిమలాసు ప్రదీపస్య ప్రభాసు చ
సంపత్సు కర్మ మూలాసుకస్య వా స్థిరతామతిః ॥ 66 ॥

మలకోశే శరీరేనస్మిన్ మహాదుఃఖవివర్ధనే
తడిదంకురసం కాశే కోవా మోదేత పండితః ॥ 67 ॥

నిత్యానంద చిదాకారమాత్మ తత్త్వం విహాయ కః
వివేకీ రమతే దేహే నశ్వరే దుఃఖ భాజనే ॥ 68 ॥

వివేకీ శుద్ధహృదయో నిశ్చితాత్మ సుఖోదయః
దుఃఖహేతౌ శరీరేస్మిన్ కలత్రే చ సుతేషుచ ॥ 69 ॥

సుహృత్సు బంధువర్గేషు ధనేషు కులపద్ధతౌ
అనిత్య బుద్ధ్యా సర్వత్ర వైరాగ్యం పరమశ్నుతే ॥ 70 ॥

వివేకినో విరక్తస్య విషయేష్వాత్మరాగిణః
సంసార దుఃఖ విచ్ఛేద హేతై బుద్ధిః ప్రవర్తతే ॥ 71 ॥

నిత్యానిత్య వివేకినః సుకృ తినశ్శుద్ధాశయ స్యాత్మనోత్రః
బ్రహ్మోపేంద్రమహేంద్రముఖ్య విభ వేష్వ స్థాయితాంపశ్య
నిత్యానందపదే నిరాకృతజగత్సంసార దుఃఖోదయే
సాంబే చంద్రశిరోమణే సముదయేద్భక్తి ర్భవధ్వంసినీ ॥ 72 ॥

అనేక జన్మార్జితపుణ్యవిశేషముల చేత మానసిక దోషమును బోగొట్టుకొన్న నిత్యానిత్యబుద్ధి యున్న వాడికి పుణ్య వాసనాబలం చేత సంసారమున హేయ (జుగుప్స) భావమేర్పడును. ॥57॥ ఈ లోకమునందు భార్య పిల్లలు మున్నగువారి వలన సంభవించిన క్షణికసుఖమునకు క్షీణేపుణ్యేమర్త్యలోకేవిశంతి", అను ప్రమాణాను సారముగా నాశశీలమగు స్వర్గమందును వివేకియగు ఏ మానవునకైతే అభిలాష గలుగుతుందో? ఎవరికి అభిలాషగలుగదని భావము ॥58॥ జన్మించిన ప్రాణికి యెప్పటికైనను మరణము సంసిద్ధమై యున్నది. మరణించిన ప్రాణికి మరల జన్మధారణము తప్పదు. అందుచేతనే లోకమందు ప్రాణి జనన-మరణములకులోనై కులాలుని (కుమ్మరివాడి) చక్రము పగిది దిరుగుచుండును. ॥59॥ మత్స్య-కుర్మ-వరాహ-నృసింహ-రామ-కృష్ణ-మున్నగు రూపముల చేత యనేక జన్మలధరించినవిష్ణువునకు గూడ మరణము దప్పదయ్యెను. ॥60॥ మానవుడు పూర్వం కర్మానుసారముగా బ్రాహ్మణ - క్షత్రియ-వైశ్య-శూద్రుడు మున్నగుజాతులలో జన్మించితాపత్రయ రూపమగు మహాగ్ని సంతాపము చేత దహింపబడును ॥61॥పూర్వకర్మమే మూలకారణమై యున్న ఆధ్యాత్మికాది దుఃఖములచేత పీడితుడైయున్న వాడికి విశ్రాంతి

యెక్కడ లభించును ॥62॥ మొట్టమెదట ఆధ్యాత్మిక దుఃఖము, రెండవది ఆధి భౌతిక దుఃఖము. మూడవది ఆధి దైవిక దుఃఖము, ఇవే మూడు విధములైన దుఃఖములని జెప్పబడుచున్నవి ॥63॥ ఆధ్యాత్మిక దుఃఖము బాహ్యాధ్యాత్మికము యొక్క దుఃఖము - అభ్యంతరాధ్యాత్మిక దుఃఖమనియు రెండు విధములుగా నున్నది. రాగ-ద్వేష-కామ-క్రోధములనుండి యుత్పన్నమైన దుఃఖము అభ్యంతరాధ్యాత్మిక దుఃఖమనిపించుకొనును ॥64॥ రాజు మెదలగువారి చేత నుత్పన్నమైన దుఃఖము ఆధి భౌతిక దుఃఖమనబడును. గ్రహము -యక్ష-భూతము-పిశాచముల చేత నుత్పన్నమైన దుఃఖము ఆధ దైవికదుఃఖమనబడును ॥65॥ ఈ దుఃఖములతో గూడియున్న వాడు కర్మబద్ధుడు. ఐన మానవునకు స్వర్గమునందుగాని,భూమిలో గాని యెంత మాత్రము సుఖముగలుగనేరదు ॥66॥ మెరుపు-తరంగమాలికలు-దీపశిఖ-కర్మమూలకమైన సంపదవీటిలో నెవడికీ స్థిరత్వ బుద్ధిగలుగును? ఇవన్నియు క్షణికములైనవే యని భావము ॥67॥ మహాదుఃఖాన్ని గలుగజేయునది, మెరుపుదీగకు సమానమైనది అథవాక్షణికమైనది, మలమునకాగమైనదిఐన ఈ దేహమున ఏ వివేకవంతుడు ప్రేమగలవాడగును?వివేకముగల వాడు ఈ శరీరము విషయమున అభిమానగలిగియుండడని భావము ॥68॥ సచ్చిదానంద రూపమగు ఆత్మతత్త్వమును వీడి, దుఃఖమయము నాశన స్వభాముగల ఈశరీరము విషయమున ఏ వివేకవంతుడు ప్రేమగల్గియుండును, బుద్ధిమంతుడెవడును ఈ దుఃఖమయమగు శరీరమును ప్రేమించడు ॥69॥ నిర్మల హృదయుడు శ్రుతి-గురు-స్వానుభవములతో నిత్యానిత్యస్వరూపమును తెలిసి దెల్సికొని సుఖస్ఫూర్తిగలవాడైయున్న వివేకి సమస్త దుఃఖములకు మూలకారణీభూతమగు ఈ శరీరమును భార్యపైన పుత్రులపైన మిత్రులపైన బంధువర్గముపైన, ఐశ్వర్యముపైన, కులపద్ధతిపైన, వీటిని వీడినాడియితర సమస్త వస్తువులందును అనిత్యత్వబుద్ధినుంచి శ్రేష్ఠమైన వైరాగ్యమును అవలంబించును॥70॥ సాంసారిక విషయములందు విరక్తి (ఆశలేక) గలవాడు, పరమాత్మునియందు భక్తిగలవాడు జ్ఞాన, బుద్ధిగల్గి సాంసారిక దుఃఖమును నశింపజేయుటలోనే ప్రవర్తించును ॥71॥ నిత్యా నిత్య వస్తువివేకయుతుడు, నిగమాగమోక్త సత్కర్మాచరణ పరాయణుడు, శుద్ధాంతఃకరణ శీలుడును, బ్రహ్మ-విష్ణుఇంద్ర మున్నగు దేవతల సంపదలన్నియు అస్థిరములైనవని దెలిసికొన్నవాడు పిండజ్ఞానికి నిత్యానందమునకు స్థాన భూతుడు ప్రపంచ సంసార దుఃఖమును నిరాకరించినవాడు, చంద్రచూడామణియైన శివునియందు భవనాశకమగు పరిశుద్ధభక్తి యుత్పన్న మగును ॥72॥

ఇతి శ్రీసిద్ధాంత శిఖామణౌ భక్తస్థలే
పిండాది స్థలత్రయ ప్రసంగోనామ
పంచమ పరిచ్ఛేదః  పరిసమాప్తః

ఇది సిద్ధాంత శిఖామణిలో పిండాదిస్థలత్రయ
విచారాత్మకమగు ఐదవ పరిచ్ఛేదము, పరిసమాప్తము.



# శ్రీ సిద్ధాంత శిఖామణి

## షష్ఠపరిచ్ఛేదః

## ఆరవ పరిచ్ఛేదము

### 4. గురుకారుణ్య స్థలం

॥శ్లో॥ తతో వివేక సంపన్నో విరాగీ శుద్ధమానసః
జిజ్ఞాసుః సర్వ సంసారదోషధ్వంసకరం శివం ॥ 1 ॥

ఉపైతి లోక విఖ్యాతం లోభ మోహ వివర్జితం
ఆత్మతత్త్వ విచారజ్ఞం విముక్త విషయభ్రమం ॥ 2 ॥

శివ సిద్ధాంతతత్త్వజ్ఞం ఛిన్న సందేహ విభ్రమం
సర్వతంత్రప్రయోగజ్ఞం ధార్మికం సత్యవాదినం ॥ 3 ॥

కులక్రమాగతాచారం కుమార్గాచారవర్జితం
శివధ్యానపరం శాంతం శివతత్త్వ వివేకినం ॥ 4 ॥

భస్మోద్ధూలననిష్ణాతం భస్మతత్త్వ వివేకినం
త్రిపుండ్రధారణోత్కంఠం ధృతరుద్రాక్ష మాలికం ॥ 5 ॥

లింగధారణసంయుక్తం లింగపూజాపరాయణం
లింగాంగ యోగతత్త్వజ్ఞం నిరూఢా ద్వైతవాసనం
లింగాంగస్థల భేదజ్ఞం శ్రీ గురుం శివవాదినం ॥ 6 ॥

సేవేత పరమాచార్యం శిష్యో భక్తిభయాన్వితః
షణ్మాసాన్ వత్సరం వాపి యావదేష ప్రసీదతి ॥ 7 ॥

ప్రసన్నం పరమాచార్యం భుక్తిముక్తి ప్రదాయకం
ప్రార్థయేదగ్రతః శిష్యః ప్రాంజలిర్వినయాన్వితః ॥ 8 ॥

భో కల్యాణ మహాభాగ శివజ్ఞానమహోదధే
ఆచార్యవర్య సంప్రాప్తం రక్ష మాం భవరోగిణం ॥ 9 ॥

ఇతి శుద్ధేన శిష్యేణ ప్రార్థితః పరమో గురుః
శక్తిపాతం సమాలోక్య దీక్షయా యోజయేదముం ॥ 10 ॥

దీయతే చ శివజ్ఞానం క్షీయతే పాశబంధనం
యస్మాదతః సమాఖ్యాతా దీక్షేతీయం విచక్షణైః ॥ 11 ॥

సాదీక్షా త్రివిధా ప్రోక్తా శివాగమవిశారదైః
వేధారూపా క్రియా రూపామంత్రరూపాచనతాపన ॥ 12 ॥

గురోరాలోక మాత్రేణ హస్తమస్తకయోగతః
యః శివత్వ సమావేశో వేధాదీక్షేతి సామతా ॥ 13॥

మాంత్రీదీక్షేతి సా ప్రోక్తా మంత్రమాత్రో పదేశినీ
కుండమండలికోపేతా క్రియాదీక్షా క్రియోత్తరా ॥14 ॥

శుభమాసే శుభతిథౌశుభకాలే శుభే2హని
విభూతిం శివభక్తేభ్యో దత్వా తాంబూల పూర్వకం ॥ 15 ॥

యథావిధి యథాయోగం శిష్యమానీయ దేశికః
స్నాతం శుక్లాంబరధరం దంత ధావనపూర్వకం ॥ 16 ॥

మండలే స్థాపయేచ్ఛిష్యం ప్రాఙ్ముఖం తముదఙ్ముఖః
శివస్య నామ సంకీర్తిం చింతామపి చ కారయేత్ ॥ 17 ॥

విభూతిపట్టం కృత్వాన్ గ్రేయథాస్థానం యథావిధి
పంచబ్రహ్మమయైస్తత్ర స్థాపితైః కలశోదకైః
ఆచార్యః సమమృత్విగ్భి స్త్రీవారమభిషేచయేత్ ॥ 18 ॥

అభిషిచ్చ గురుః శిష్య మాసీనం పురతః శుచిం
తతః పంచాక్షరీం శైవీం సంసారభయతారిణీం ॥ 19 ॥

తస్య దక్షిణకర్ణేతు నిగూఢమపికీర్తయేత్
ఛందోరూపమృషి చాస్య దేవతాం న్యాసపద్ధతిం ॥ 20 ॥

సంసారమున జుగుప్సాబుద్ధి యుదయించిన పిదపనిర్మలాంతఃకరణం గలవాడు, శరీరాత్మల పరిజ్ఞానము గలవాడు, విరక్తియైన సాధకుడు సమస్త సంసారదోషములను

నశింపఁజేయు మహాలింగమును దెలిసికొన కోరికగలవాడై ॥1॥జగద్విఖ్యాతుడు లోభమోహవిదూరుడు జీవాత్మ పరమాత్మల యథార్థ స్వరూపమును గుర్తించినవాడును, విషయ భ్రాంతి చేతముక్తుడైన వాడును, శివాద్వైత సిద్ధాంతమును దెలిసిన వాడును. నానావిధ సంశయములతో నుత్పన్నమగు భ్రమలను దొలగించువాడును, సమస్తతంత్రముల ప్రయోగముల నెఱిగిన వాడు, శివధర్మిష్ఠుడు, సత్యవాది, శిష్య సంప్రదాయ విశిష్ట పవిత్రగురుస్థల (ఆచార్య) వంశపరంపరనుండి ప్రాప్తించిన ఆచార ధర్మములున్నవాడు, కుత్సితాచారములకుదూరముండువాడు, శివధ్యానాసక్తుడు, శాంతుడు, శివస్వరూపమును ఎరింగిన వాడు, భస్మోద్ధూలనమున నిష్ణాతుడైన వాడును భస్మ స్వరూపమును గుర్తించిన వాడు, భస్మత్రిపుండ్రధారణయందిష్టము గలవాడును, రుద్రాక్ష మాలికలను ధరించిన వాడు, శివలింగధారణముతో గూడినవాడు, శివలింగపూజలో ఆసక్తి గలవాడు, లింగాంగ సామరస్యమును (శివజవైక్య) స్వరూపమును దెలిసినవాడు, శివాద్వైతవాసనలోలీనమైనవాడు, అంగస్థల లింగస్థలాత్మికములైన నూటొక్క స్థలముల భేదమును (స్వరూపమును) గ్రహించినవాడు, ఎల్లప్పుడును మంగలకరముగ మాట్లాడువాడునైన శ్రీ గురువు నాశ్రయించవలెను ॥ 2-3-4-5-6॥ శిష్యుడు భయభక్తులతో గూడి ఆరుమాసములు గాని, ఒక సం॥మువరకు గాని యెంతవరకైతే గురువు ప్రసన్నుడగునో అంతవరకు ఆ గురువర్యుని సేవించవలెను ॥7॥ శిష్యుడు ప్రసన్నుడు భోగమోక్షప్రదుడైన ఆచార్యుని యెదుట వినమ్రతతోనంజలి బద్ధుడై నిల్చుండి యీ విధముగా ప్రార్థించవలెను ॥8॥ ఓ! కల్యాణమూర్తి మహాభాగ! శివజ్ఞాన సాగరా! గురువర్యా! భవరోగ పీడితుండనగు నన్ను కాపాడుము ॥9॥ అని శుద్ధాంతఃకరణుండగు శిష్యుడు పరమాచార్యుని బ్రార్థించగా అప్పుడు శ్రీ గురువు శిష్యుని శక్తి పాతమును పరామర్శించి, ఆతనికి శివదీక్షనొసగవలెను. శక్తి పాతలక్షణము మృగేంద్రాగమ ములో నిట్లాదేశించనైనది.

యేషాంశరీరిణాంశక్తిః పతత్యదివివృత్తయే!
తేషాంతల్లింగమౌత్సుక్యం- ముక్తాద్వేషోభవస్థితా!
భక్తిశ్చ శివభక్తేషు - శ్రద్ధాతచ్ఛాసకే విదౌ ॥ (మృగేంద్రాగమే)

సంసారయుత జీవులకు దుఃఖమయమగు సంసారమార్గమున పునరావృత్తి ని దప్పించుటకై వారివిషయమున ఈశ్వరశక్తిని బొందుటే (శివుని చల్లని చూపులు భక్తుని పై బడుటే) శక్తి పాతమనబడును. చక్షు (దృగ్గోచరము) ర్గోచరముగాని, ఈ శక్తి పాతమును కనిపెట్టుటకు - ముక్తి యందలి ప్రేమ సంసార మందు జుగుప్సాబుద్ధి (హేయభావము)

లేక ద్వేషము. శివభక్తులయందు పవిత్రమైన ప్రేమ, శైవశాస్త్రముపై శ్రద్ధ, ఇవే ముఖ్యచిహ్నములు. ఏమానవుల యందిట్టి చిహ్నములు దృగ్గోచరమగుచున్నవో అట్టి వారు ఈశ్వర శక్తి గలిగి యున్నారని దెలియవలెను, శ్రీ గురువు శిష్యునిలో నీ విధమగు శక్తి పాతమును పరామర్శించి శివదీక్షను అనుగ్రహించవలయునని భావము ॥10॥ ఏదైతే శివజ్ఞానమును గల్పించునో మరియు మలమాయాకర్మ బంధమును నశింప జేయునో దానిని శాస్త్రజ్ఞులు ॥దీక్ష॥ యని చెప్పుదురు ॥11॥ ఓయీ! అగస్త్యమహర్షి అట్టి దీక్షవేధాదీక్ష-మంత్రదీక్ష-క్రియాదీక్షయని మూడు రకాలుగా నున్నది ॥12॥ శ్రీగురువుయొక్క కటాక్షవీక్షణమాత్రముచేత హస్త-మస్తకసంయోగమువలననుయేది జ్ఞాన-క్రియాత్మకమగు శివతత్వనమావేశము ఉత్పన్నమగుచున్నదో, అదియేవేధాదీక్షయనబడును ॥13॥ శివపంచాక్షరీమంత్రోపదేశమును గావించుట వలన అదియే మంత్ర దీక్షయనబడును, హోమగుండము -స్వస్తి కమండలము - పంచకలశము మున్నగు దీక్షాంగభూతక్రియలచేత గూడియున్నదో అది క్రియా దీక్షయగును. ॥14॥ శుభమాస -శుభతిథి -శుభకాల-శుభదినము లందు శివభక్తులకు తాంబూల పూర్వకము (యుక్తము)గా విభూతి నొసగి, విధ్యుక్తముగాను మరియు శాస్త్రోక్తముగానుదంతధావన పూర్వకముగా, స్నానమాడి స్వేత (తెల్లని) వస్త్రధారియైన శిష్యుని శ్రీగురువు తనచెంతకు రప్పించి స్వస్తికమండలమునందు తూర్పుముఖముగా కూర్చుండబెట్టి, తాను ఉత్తరాభిముఖముగా గూర్చుండి శిష్యునిచేత శివనామస్మరణను, శివధ్యానమును జేయించవలెను ॥15-16-17॥భస్మధారణకు యోగ్యమైన స్థానములందే విధిననుసరించి (శాస్త్రప్రకారముగా) శిష్యునకు భస్మమును ధరింపజేసి సద్యోజాత -వామదేవ అఘోర- తత్పురుష -ఈశాన నామక పంచ బ్రహ్మరూపకమగు పంచ కలశములను స్థాపించి ఆకలశములందున్న పవిత్రోదకముచేతనాచార్యుడు సమస్తభువన ప్రఖ్యాతిగాంచిన శ్రీ మజ్జగదురు పంచాచార్యుల సాంప్రదాయాగతులైన నలుగురు ఋత్విక్కులతో శిష్యునికి మూడుసార్లు- అభిషేకముజేసి ఆచార్యుడు తనయెదుట గూర్చునియున్న పవిత్రుడైన శిష్యునకు అభిషేకించిన పిదప సంసార భయనాశకమగు శివపంచాక్షరీ మంత్రమును ఆతని కుడి చెవిలోగుప్తముగానుపదేశించవలెను.

మరియు ఆ మహామంత్రము యొక్క స్వరూపమును, ఋషి-దేవతాఛందస్సు-శక్తి-బీజము-మొదలగు వాటిని అంగన్యాస- కరన్యాస-దేహన్యాస పద్ధతులను బోధించవలెను॥

"శ్రీ పంచాచార్య మధ్యేతుయః పీఠమధిరోహతి!
తద్వాసౌగురుశబ్దేన-వాచ్యఇత్యభిధీయతే!

శేషాశ్చత్వారఆచార్యా-ఉపదేశస్యసాక్షిణః!
ఈశ్వరస్య ముఖాన్యేవ కలిశాహి న సంశయః
ఏతాదృక్కలశాన్ పంచ-నవసూత్రేణవేష్టయేత్!!
ప్రత్యేకంనవవస్త్రేణ-వేష్టయేద్దేశికోత్తమః
గంగాది పుణ్యతీర్థానామంభసాపరిపూరయేత్!!
సంపూర్య పంచకలశాని - మంమేఇతి మంత్రితః!!
తేషుతీర్థాంబు పూర్ణేషు-సన్నిధాయామ్రపల్లవాన్!!
నానా విధైశ్చకుసుమై- ర్గంధపత్రాక్షతాదిభిః!
ఏవంశాస్త్రోక్త విధినా- కలశాన్ పంచపూజయేత్!!
శిష్యలింగ గురూణాంచ-కలశానాంతథైవచ!!
ఏకసూత్రాంవేష్టయిత్వా- శిష్యాభిముఖోగురుః
శుద్ధింకృత్వాపంచగవ్యై- లింగం శిష్యకళాతథా
లింగం తథ్యార్చయేద్ధీమాన్ -ఏకవింశతి పూజనైః
మస్తకేసప్తపూజాశ్చ-కృత్వాహస్తంత థాధార్చయేత్!!
సంస్కారాన్ విధివత్కృత్వా-చతుర్భిసైశ్చ సంయుతః
పంచాక్షరీ మంత్రరాజముపదిశ్యయథావిధి!
శివలింగం ధారయిత్వా-శివతత్త్వం సమాదిశేత్!!

శ్రీమజ్జగద్గురు పంచాచార్యులలోనే ఆచార్యుడు మధ్యస్థానమును ఆలంకరించునో, అట్టిఆచార్యుడు గురువాచ్యుడగుననియు మిగతనలువురుఆచార్యులు సాక్షీభూతులుగా నుండగలరనియు పరమేశ్వరుని పంచముఖములె పంచకలశములనియు గురువు ఈ పంచకలశములను కొత్త దారముతో జుట్టి గంగాది పవిత్రోదకము చేతనింపి పూజించవలెను. శిష్యునకు, లింగమునకు, గురువునకు, కలశములకు ఒకే సూత్రమును సంబంధించవలెననియు, శిష్యుని హస్తమస్తకపూజాదులను నెరవేర్చి, చతురాచార్యులతో బాటు శాస్త్రవిధిననుసరించి దీక్షాంగభూత సమస్త సంసారములనొనర్చి పంచాక్షరీ మహామంత్రమునువదేశించి శిష్యుని దేహమునందు శివలింగమును ధరింపజేసి శివతత్వమునుపదేశింపవలెను, అనియిట్లు పాశుపతతంత్రము చాటుచున్నది. శ్రీ గురువు శిష్యునకు వీరశైవ దీక్షా విధిననుసరించి మోక్షదాయకమగు శివదీక్షను అనుగ్రహించ వలెననియు భావము॥18-19-20॥

## 5. లింగధారణస్థలం

స్ఫాటికం శైలజం వాపి చంద్రకాంతమయం తువా
బాణం వాసూర్యకాంతంవా లింగమేకం సమాహరేత్ ॥ 21 ॥

సర్వ లక్షణసంపన్నే తస్మిన్ లింగే విశోధితే
పీఠస్థితే2 భిషిక్తే చ గంధపుష్పాధిపూజితే ॥ 22 ॥

మంత్రపూతే కలాం శైవీం యోజయేద్విధినా గురుః
శిష్యస్య ప్రాణమాదాయ లింగే తత్ర నిధాపయేత్ ॥ 23 ॥

తల్లింగం తస్య తు ప్రాణే స్థాపయెదేక భావతః
ఏవం కృత్వా గురుర్లింగం శిష్యహస్తే నిధాపయేత్ ॥ 24 ॥

ప్రాణవద్ధారణీయం తత్ప్రాణలింగమిదం తవ
కదా చిత్కుత్ర చిద్వాపి న వియోజయ దేహతః ॥ 25 ॥

యది ప్రమదాత్పతితే లింగే దేహాన్మహీతలే
ప్రాణాన్ విముంచ సహసా ప్రాప్తయేమోక్ష సంపదః ॥ 26 ॥

ఇతి సంబోధితః శిష్యో గురుణా శాస్త్ర వేదినా
ధారయేచ్ఛాంకరం లింగం శరీరే ప్రాణ యోగతః ॥ 27 ॥

లింగస్య ధారణం పుణ్యం సర్వపాప ప్రణాశనం
అద్భుతం మునిభిః సర్వై రాగమార్థవిశారదైః ॥ 28 ॥

లింగధారణ మాఖ్యాతం ద్విధా సర్వార్థ సాధకం
బాహ్యామభ్యం తరం చేతి మునిభిర్మోక్ష కాంక్షిభిః ॥ 29 ॥

చిద్రూపం పరమం లింగం శాంకరం సర్వకారణం
యత్తస్య ధారణం చిత్తే తదాంతరముదాహృతం ॥ 30 ॥

చిద్రూపం హి పరం తత్త్వం శివాఖ్యం విశ్వ కారణం
నిరస్త విశ్వ కాలుష్యం నిష్కలం నిర్వికల్పకం ॥ 31 ॥

సత్తానంద పరిస్ఫూర్తి సముల్లా స కలామయం
అప్రమేయమనిర్దేశ్యం ముముక్షుభిరుపాసితం ॥ 32 ॥

పరం బ్రహ్మ మహాలింగం ప్రపంచాతీతమవ్యయం
తదేవ సర్వభూతా నామంత స్త్రి స్థానగోచరం ॥ 33 ॥

మూలాధారే చ హృదయే భ్రూమధ్యే సర్వ దేహినాం
జ్యోతిర్లింగం సదాభాతియద్బ్రహ్మేత్యాహురాగమాః ॥ 34 ॥

అపరిచ్ఛిన్న మవ్యక్తం లింగం బ్రహ్మ సనాతనం
ఉపాసనార్థమంతస్థం పరిచ్ఛిన్నం స్వమాయయా ॥ 35 ॥

లయం గచ్ఛతి యత్రైవ జగదేతచ్చరాచరం
పునఃపునః సముత్పత్తిం తల్లింగం బ్రహ్మ శాశ్వతం ॥ 36 ॥

తస్మాల్లింగమితి ఖ్యాతం సత్తానంద చిదాత్మకం
బృహత్వాద్బృంహణత్వాచ్చ బ్రహ్మశబ్దాభిదేయకం ॥ 37 ॥

ఆధారే హృదయే వాపి భ్రూమధ్యే వా నిరంతరం
జ్యోతిర్లింగానుసంధానమాంతరం లింగధారణం ॥ 38 ॥

ఆధారే కనక ప్రఖ్యం హృదయే విద్రుమప్రభం
భ్రూమధ్యేస్ఫటిక చ్ఛాయలింగం యోగీ విభావయేత్ ॥ 39 ॥

నిరపాధికమాఖ్యాతం లింగస్యాంతర ధారణం
విశిష్టం కోటిగుణితం బాహ్యలింగస్య ధారణాత్ ॥ 40 ॥

యే ధారయంతి హృదయే లింగం చిద్రూపమైశ్వరం
న తేషాం పునరావృత్తి ర్ఘోర సంసారమండలే ॥ 41 ॥

అంతర్లింగాను సంధాన మాత్మ విద్యాపరిశ్రమః
గురూపాసనశక్తిశ్చ కారణం మోక్ష సంపదాం ॥ 42 ॥

వైరాగ్య జ్ఞానయుక్తానాం యోగినాం స్థిరచేతసాం
అంతర్లింగాను సంధానే రుచిర్బాహ్యేన జాయతే ॥ 43 ॥

బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ వాసవాద్యాశ్చ లోకపాః
మునయః సిద్ధ గంధర్వా దానవా మానవాస్తథా ॥ 44 ॥

సర్వే సుజ్ఞానయోగేన సర్వకారణ కారణం
పశ్యంతి హృదయే లింగం పరమానందలక్షణం ॥ 45 ॥

తస్మాత్సర్వ ప్రయత్నేన శాంకరం లింగముత్తమం
అంతర్విభాయేద్విద్వానశేషక్లేశముక్తయే ॥ 46 ॥

అంతర్ధారయితుం లింగమశక్తః శక్త ఏవ వా
బాహ్యంచధారయేల్లింగం తద్రూపమితినిశ్చయాత్ ॥ 47 ॥

లింగంతు త్రివిధం ప్రోక్తం స్థూలం సూక్ష్మంపరాత్పరం
ఇష్టలింగమిదం స్థూలం యద్బాహ్యేధార్యతే తనౌ ॥ 48 ॥

ప్రాణలింగమిదం సూక్ష్మం యదంతర్భావ నామయం
పరాత్పరం తు యత్ప్రోక్తం తృప్తిలింగం తదుచ్యతే
భావనాతీతమవ్యక్తం పరబ్రహ్మ శివాభిధం ॥ 49 ॥

ఇష్టలింగమిదం సాక్షాదనిష్టపరిహారకం
ధారయేదవ ధానేన శరీరేసర్వదా బుధః ॥ 50 ॥

మూర్ధ్ని వా కంఠ దేశే వా కక్షే వక్షఃస్థలే2 పి వా
కుక్షౌ హస్తస్థలే వాపి ధారయేల్లింగ మైశ్వరం ॥ 51 ॥

నాభేరధస్తాల్లింగస్య ధారణం పాపకారణం
జటాగ్రేత్రికభాగే చ మలస్థానే న ధారయేత్ ॥ 52 ॥

లింగధారీ సదా శుద్ధో నిజలింగం మనోరమం
అర్చయేద్గంధ పుష్పా ద్యైః కరపీఠే సమాహితః ॥ 53 ॥

బాహ్యపీఠార్చనాదేతత్ కరపీఠార్చనం వరం
సర్వేషాం వీరశైవానాం ముముక్షూణాం నిరంతరం ॥ 54 ॥

బ్రహ్మ విష్ణ్వాదయో దేవా మునయో గౌతమాదయః
ధారయంతి సదా లింగముత్తమాంగేవిశేషతః ॥ 55 ॥

లక్ష్మ్యాదిశక్తయః సర్వాః శివభావవిభావితాః
ధారయంత్యలి కాగ్రేషు శివలింగమహర్నిశం ॥ 56 ॥

వేదశాస్త్రపురాణేషుకామికాద్యాగమేషుచ
లింగధారణ మాఖ్యాతం వీరశైవస్య నిశ్చయాత్ ॥ 57 ॥

ఋగిత్యాహ పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే
తస్మాత్పవిత్రం తల్లింగం ధార్యం శైవమనామయం ॥ 58 ॥

బ్రహ్మేతి లింగమాఖ్యాతం బ్రహ్మణః పతిరీశ్వరః
పవిత్రం తద్ధి విఖ్యాతం తత్సంపర్కా త్తనుః శుచిః ॥ 59 ॥

ఆతప్తతనురజ్ఞో వైహ్యామః సంస్కార వర్జితః
దీక్షయా రహితః సాక్షాన్నాప్నుయాల్లింగముత్తమం ॥ 60 ॥

అఘోరాన్ పాపకాశీతి యా తే రుద్ర శివాతనూః
యజుషా గీయతే యస్మాత్తస్మాచ్ఛివో2 ఘవర్జితః ॥ 61 ॥

యో లింగధారీ నియతాంతరాత్మా
నిత్యం శివారాధనబద్ధచిత్తః
స ధారయేత్ సర్వమలాపహత్యై
భస్మామలం చారు యథా ప్రయోగం ॥ 62 ॥

తరువాత నా చార్యుడు శిష్యుని కొరకు స్ఫటికలింగం శ్రీశైలలింగం-చంద్రకాంత లింగం- శిలాలింగము - సూర్యకాంత శిలాలింగం- అథవానర్మదా బాణలింగం-వీనిలో నేదేని యొకటి లింగమును దీసికొనవలయును ॥21॥ శిల్ప శాస్త్రాను సారముగా సర్వలక్షణ సంపన్నము -జలాధివాసము -ధాన్యాధివాసము -శయనాధివాసము -అష్టత్రింషత్క లాన్యా సము -షడధ్వశుద్ధి. మొదలగు వాటినుండి సంశోధింపఁబడి-పంచామృతాదులతో నభిషేకించి గంధము -పత్రి-పుష్పము. ధూప-దీప-నైవేద్యాదులతో బూజింపఁబడి శివపంచాక్షరీ మహామంత్రముచేత పరమ పవిత్రము కరపీఠాలంకృతము అయిన శివలింగమునందు శ్రీ గురువు శిష్యుని మస్తకమునందున్న శివకలను శాస్త్రవిధి అను సారముగ సమన్వయ పరచవలెను. ఆక్రమం బెట్టి దనిన ॥శ్రీ గురువు శిష్యుని మస్తకమునందు అయిదుదళములున్న చక్రమును వ్రాసి ఆ అయిదు దళములందునకారాది పంచాక్షరములను మధ్యన ఓంకారమును లిఖించి! "నిత్యానంద సర్వరూపాం నిరుపమ విభవాం నిష్కలాంనిర్విశేషా! నిర్వాణేనోర్ధ్వమాయా విరతన పుష్పంవిశ్వవంద్యాం పరాంతా ఆధారామాదిశక్తిం గుణగణ నమితాం దేవదేవం శివాభ్యాం! వందేహృత్పద్మపీఠే పరమ

శివపదాంశ్రీ మతీమూర్ధ్వనంజ్ఞాం॥" అనియీ చరాచర ప్రపంచతేజో రూపంబగు శివకలనుధ్యానించి, ఆ చక్రమును ధ్యానించి. అట్టి చక్రమును గంధపుష్పాదులచేత బూజించి ంక్రోం అని అంకుశముద్రతో శివకలను ఆకర్షణ పూర్వకముగానావాహించి స్థాపించి పునః గంధాద్యుపచారములచేత బూజింపవలెను. శిష్యుని బ్రాణమును నర్వనంస్కార నంన్కృతమగు శివ లింగమునందు నంబంధపరచవలెను. మరియునాశివలింగమును శిష్యుని బ్రాణకళయందు ఏకాకారముగ నంబంధ మొనర్చవలెను. ఈ విధముగా ఆచార్యుడు శివకళను జీవకళను సామరస్యపరచి (ఏకీభవింపజేసి) శివలింగమునుశిష్యుని హస్త కమలమునందుంచియిట్లు జ్ఞాపించవలెను ॥ 22-23-24॥ ఓయీ! శిష్యా! ఈ శివలింగమును నీ యొక్క ప్రాణలింగముగా భావించి, దీనిని నీ ప్రాణము పగిది ధరించుము. యే సమయముననను, ఏ స్థలమునందును ఈ శివలింగమును నీ శరీరమునుండి (ఎడము) వేరు జేయకుము. నీ శరీరమునుండి ఈ శివలింగము ప్రమాదవశము చేత భూమిపై బడినట్లైతే వెంటనేమోక్ష సంప్రాప్తి కొరకు బ్రాణమును వదలుము. ఈ విధముగా శాస్త్రజ్ఞుడైన ఆచార్యుని వలన యుపదేశింపఁబడిన శిష్యుడుశరీరమున బ్రాణముండువరకు దన శరీరమున ఈ శివలింగమును అసాధారణమగు భక్తి భావముచేత ధరించవలెను. ॥25-26-27॥ శరీరమున సదాశివ లింగమును ధరించుకొనుట పుణ్యకరము సర్వపాపనాశకరమగు అందుచేతనే నిగమాగమార్థజ్ఞులైన సమస్తముని పుంగవులు ఈ శివలింగమును ధరించి యున్నారు. ॥27॥ మోక్షాపేక్షులైన మహర్షులు సర్వార్థ సాధకమగు ఈ లింగ ధారణము బాహ్యము మరియు అంతరంగభేదము వలన రెండు విధములుగానున్నదని చెప్పుకొందురు ॥28॥ ఈ శివ శివలింగము సచ్చిదానందరూపము సమస్త ప్రపంచ కారణీభూతమై యున్నది. హృత్కమలమునందు ఆ మహాలింగమును ధ్యాన రూపమున ధరించుటే అంతరంగలింగ ధారణమని పించుకొనును ॥30॥

పరబ్రహ్మనామకమైన మహాలింగము సచ్చిదానంద స్వరూపమై, పరతత్వ స్వరూపమై ॥శివ॥ యను నామము చేత గూడియున్నదై సమస్త ప్రపంచోత్పత్తికి లయమునకు గారణీ భూతమైమొప్పుచున్నది. హృత్కమలమునందు ఆ మహాలింగమును ధ్యాన రూపమున ధరించుటే అంతర్గత లింగధారణమనిపించుకొనును ॥30॥ సమస్త దోషములతో దూరగించబడినదై, తుచ్ఛమైన కలాశూన్య, వికల్పశూన్యమై, నిత్యానందపరిస్ఫురణ ప్రకాశ కలాస్వరూపమై ప్రత్యక్షాది ప్రమాణములకు అగోచరంబై, అనిర్దేశ్యమై, ముముక్షుజనపూజితమై ప్రపంచాతీతమై నాశరహితమై యుండును, ఇట్టి మహాలింగమే సమస్త ప్రాణుల

కాధారభూతము-మూలాధార-హృదయ భ్రూమధ్యములను మూడు స్థానములందును. ప్రకాశించు చుండును. ॥31-32-33॥శివాగమములు దేనిని పరబ్రహ్మమని బేర్కొనుచున్నవో అట్టి జ్యోతిర్లింగము సమస్తప్రాణులకు మూలాధారచక్రము నందుననను, హృదయము నందును భ్రూమధ్యమునందును ఎల్లప్పుడు ప్రకాశించుచుండును ॥34॥ అపరిచ్ఛిన్నము, అవ్యక్తము, సనాతనము, బ్రహ్మపదవాచ్యము,అంతస్థితము, ఐన లింగము భక్తుల ఉపాసనకొరకు తనలో నున్నమాయా శక్తి చేత విభజింపబడినది ॥35॥ ఏ వస్తువునందు ఈ చరాచరాత్మకమగు జగత్తులయమును బొందునో ఏ వస్తువు నందు మరల మరల ఉత్పత్తి యగుచున్నదో అట్టి శాశ్వతమైన పరబ్రహ్మమే లింగమనియు చెప్పబడుచున్నది. సచ్చిదానంద స్వరూపమైన ఆ లింగము మహత్వముతో గూడియున్నందున తన నాశ్రయించి యుండుట వలన అంతటి మహత్యమునే గలిగించుటచేతను బ్రహ్మ శబ్దవాచ్యమై - యొప్పుచున్నది ॥36-37॥ ఆధార చక్రమందుగాని హృదయమందునుగాని అథవాభ్రూమధ్యమందునుగాని, ఎల్లప్పుడు జ్యోతిర్లింగాను సంధానమును గావించుటే అంతర్గత లింగ ధారణమనబడును॥38॥ యోగీశ్వరుడు లింగమును ఆధార చక్రమునందు సువర్ణకాంతియున్న దాని గాను, హృత్కమలమునందు పగడపుకాంతివలె - కాంతియున్నదానిగాను. భ్రూమధ్యమునందు స్ఫటికపు కాంతివలె కాంతియున్న దానిగా భావించనగును ॥39॥ అంతర్లింగ ధారణము నిరుపాధికమనియు చెప్పబడును. బాహ్యలింగధారణము కంటెను అంతర్లింగ ధారణము, కోటిరెట్లు మిన్నయై యున్నది ॥40॥ ఎవరైతేనా సచ్చిదానంద రూపమగు శివలింగమును తమ హృత్కమలమునందు ధరింతురో అట్టివారికి యీ ఘోరసంసారమండలమున (నవమూహమున) పునర్జన్మమనునదిలేదు. ॥41 ॥

హృదయకమలమునందు లింగాను సంధానముజేయుట బ్రహ్మవిద్యకై శ్రమించుట గురూపాసనలో సామర్థ్యము సంపాదించుట ఈ మూడును మోక్షసంప్రాప్తికి గారణ భూతములైనవి ॥42॥ వైరాగ్యము మరియు జ్ఞానములతో గూడిన వారు స్థిరమైనమనస్సున్న వారు ఐనవారు యోగులకు అంతర్లింగాను సంధానమున ప్రేమ గలుగుటేగాకుండ, బాహ్య లింగమునందు ప్రేమ కలుగనేరదు ॥43॥బ్రహ్మ-విష్ణు-రుద్రుడు-ఇంద్రుడు మొదలగు లోకపాలకులు, మునులు, సిద్ధులు - గంధర్వులు -దానవులు-మానవులు-వీరందరు, జ్ఞానయోగము చేత సర్వకారణ కారణము, పరమానంద స్వరూపము ఐన మహాలింగమును తమ హృదయకమలమునందు నిరీక్షింతురు. ॥44-45॥ అందుచేత వివేక వంతుడైన

వాడు పంచక్లేశములను విడువబడుటకు ప్రయత్న పూర్వకముగా మహాలింగమును హృదయ పద్మమునందు ధ్యానించవలెను. ॥46॥ వీరశైవుడు లింగమును అంతరంగమున ధరించుటకు సమర్థుడుగాని అథవా కాక-పోనిగాء, బహిర్గతముగ మాత్రము (స్థూలదేహముపై) దాల్చిన మహాలింగమే ఈ ఇష్ట లింగము అని నిశ్చయాత్మక బుద్ధితో ధరించవలెను ॥47॥ లింగము -స్థూలము-సూక్ష్మము-పరాత్పరము అనుభేదముచేత మూడు రకాలుగా నున్నది. బాహ్య శరీరమునందు ఏది ధరించబడుచున్నదో ఇది ఇష్ట లింగమనబడును ॥48॥హృదయకమలమునందు భావనారూపమున ధ్యానింపబడునది సూక్ష్మలింగము "ప్రాణలింగమనబడును, భావాతీతమైనది, బాహ్యేంద్రియములకగోచర మైనది పరశివబ్రహ్మమను పేరు గలది పరాత్పర లింగము "భావలింగమనబడును" ఇట్లు ఈ త్రివిధ లింగములలో ఇష్టలింగము ఆచార లింగము-గురు లింగములనియు, ప్రాణలింగము శివ లింగము -చర లింగముల నియు, భావలింగము ప్రసాదలింగము - మహాలింగమనియు ఆరు విధములుగా నుండును.

॥శ్లో॥ ఆచార లింగంఘ్రాణాఖ్యం-భక్తస్థల సమాశ్రయం!
నివృత్తి కలయోపేతం-గంధగ్రహణ సాధనం॥
గురులింగంతుజిహ్వాఖ్యం-మహేశ్వర స్థలసంశ్రయం॥
ప్రతిష్ఠాకలయోపేతం-రసగ్రహణ సాధనం॥
శివలింగతు నేత్రాఖ్యం- ప్రసాది స్థల సంశ్రయం॥
విద్యాకలాసమాయుక్తం- రూపగ్రహణ సాధనం॥
త్వగాఖ్యంజంగమలింగంచ-ప్రాణలింగిస్థలాశ్రయం॥
శాంత్యాఖ్య కలయోపేతం- స్పర్శగ్రహణ సాధనం॥
ప్రసాద లింగం శ్రోత్రాఖ్యం- శరణ స్థల సంశ్రయం॥
శాంత్యతీతకలయోపేతం- శబ్ద గ్రహణ సాధనం॥
మానసంతుమహాలింగ- మైక్యస్థల సమాశ్రయం॥
శాంత్యతీతోత్తరోపేతం - సర్వ గ్రహణ సాధనం॥

ఘ్రాణ రూపమైన ఆచార లింగము, భక్త స్థలమునాశ్రయించి, నివృత్తి కలతోకూడి, గంధ గ్రహణ సాధకమై యున్నది. ఘ్రాణము ఇడా పింగళనాడి ద్వారా ప్రాణ వాయువు సంచారమునకాశ్రయమై యుంటవలనను దేహశుద్ధికి కారణభూతమైన ప్రాణాయామ మాచరించుటకు సాధనమై యుంటవలనను, దీనికి "ఆచారలింగమనియు పేరు వచ్చినది.

జిహ్వారూపమగు గురు"లింగము" మహేశ్వర స్థలమునాశ్రయించి, ప్రతిష్ఠాకలాయుక్తమై రసగ్రహణ సాధనమైయున్నది. జిహ్వా షడక్షరీమంత్రోచ్చారణము నకు సాధన మై యుంటవలనను ఈ మహామంత్రము మంత్ర మూర్తియగు గురుదేవుని ముఖాంతరంబున ప్రాప్తమగుటవలనను దీనికి "గురు లింగమనియు పేరు గలిగినది. నేత్రరూపమగు శివలింగము ప్రసాది స్థలమునాశ్రయించి విద్యాకలాయుక్తమై రూపగ్రహణ సాధనమై యున్నది. నేత్రము తన గోళకమునందున్న శివ ప్రకాశముతో గూడుకొని సకలరూప పదార్థ ప్రకాశమునకు సాధనమగుటవలనదీనికి "శివలింగమను పేరు గలిగెను. త్వగ్రూపమగు చరలింగము ప్రాణ లింగస్థలమునాశ్రయించి శాంతికలాయుక్తమై స్పర్శ గ్రహణ సాధకమై యున్నది. త్వక్ సర్వాంగ మును వ్యాపించి, శీత స్పర్శాదిజ్ఞానమునకు సాధకమై యుండుటవలనను, ఇది సంచరణ శీలమగు వాయువు యొక్క అంశమగుట చేతను దీనికి "చర లింగమను పేరు వచ్చినది. శ్రోత్రరూపమను ప్రసాద లింగము శరణ స్థలమునాశ్రయించి శాంత్యతీతకలాయుక్తమై శబ్ద గ్రహణమునకు సాధనమై యున్నది. శ్రోత్రము శబ్దగ్రహణమునకు సాధనమై యుంటచేతను నాదము-సునాదము-నినాదము-మహానాదరూపమగు పరా-పశ్యంతి- మధ్యమము-వైఖరిక్రమము వలన లభించునట్టి అనుగ్రహరూపమైన ప్రసాదమునకు కారణమై యుంట వలన దీనకిఇ ప్రసాద లింగమని పేరు గలిగినది. మనోహరరూపమైన మహాలింగము ఐక్యస్థలము నాశ్రయించి శాంత్యతీతోత్తర కలాయుక్తమై సర్వగ్రహణ సాధనమై యున్నది. మనస్సు శ్రోత్రాది ఇంద్రియములవలనే ఒక్కొక్క విషయమును గ్రహించకుండ సమస్త విషయములను గ్రహించుట చేతను ఇంద్రియములన్నింటికి మహారాజగుట వలనను దీనికి " మహాలింగమని పేరు గలిగెను ॥49॥ ప్రత్యక్షముగా సంసారపాశరూపమగు అనిష్టమును పరిహరింపజేయునీ ఇష్ట లింగము జ్ఞానియైన వాడెల్లప్పుడును దన శరీరమునందు ధరించేతీరవలెను ॥50॥ శివ లింగమును మస్తకమునందుగాని, కంఠమునందు గాని, బాహుమూలమునగాని, ఎదయందుగాని, ఉదరముపైనగాని, అథవాహస్తమందు (ఎడమ) అరిచేతిలోగాని, ధరించవలెను ॥51॥ నాభిక్రింద లింగమును ధరించగూడదు, అదిపాపమున కారణమగును. జటాజూటమందును వీపున, మలస్థానమున లింగమును ధరించగూడదు॥52॥ లింగధారియగు వీరశైవుడు ఎల్లప్పుడు నిర్మలమనస్కుడై యుండి మనోహరమగు తన ఇష్టలింగమును కరపీఠమునందుంచుకొని గంధాక్షతలు ధూపదీపములతో ఆరాధించ వలెను.॥53॥ మోక్షాపేక్ష గల సమస్తవీరశైవులకు ఎల్లప్పుడు స్థాపితలింగపూజకంటెను కరపీఠపూజే శ్రేష్ఠమైనది ॥54॥ బ్రహ్మ- విష్ణు-మున్నగుదేవతలు గౌతమాది మహాఋషిశ్రేష్ఠులు. ఎల్లప్పుడు తమతమ మస్తకములందు శివలింగమును ధరింతురు.

॥శ్లో॥ బ్రహ్మవిష్ణ్వాదయో దేవాః మునయోగౌతమాదయః
ధారయంతి సదాలింగం- ఉత్తమాంగేవిశేషతః॥సి,శి,

॥55॥శివధ్యాన తత్పరురాండ్రైన లక్ష్మీశారదా మొదలగు శక్తి దేవతలు గూడా సదా శివలింగమును నుదుటిపై భాగమున ధరింతురు॥56॥ వేదములందును శాస్త్రములలోను, పురాణములలోను కామికాది వాతులాంతములైన సమస్త శివాగమములందును వీరశైవునకు లింగధారణమును జెప్పబడియున్నది ॥57॥

॥పవిత్రంతే వితతం బ్రహ్మణ స్పతేప్రభురాత్రాణి పర్యేషి
విశ్వతఃఅతప్తతనుర్నతదామోఅశ్నుతే॥ - ఋగ్వేదము

మంత్రముతోలింగధారణావశ్యకతను బోధించుచున్నది. అందుచేత పవిత్రము దోషరహితముఐన శివలింగమును ధరించాలి. ఈ లింగమునకు పరబ్రహ్మమను పేరు గలదు. శివుఁడు చతుర్ముఖబ్రహ్మకు అధిపతియై యున్నాడు.

"ఈశానస్సర్వ విద్యానాం ఈశ్వరస్సర్వభూతాని॥
బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతి-బ్రహ్మశివోమేఅస్తు॥
సదాశివోమ్॥శాంతిః శాంతిః శాంతిరస్తు॥

అట్టిశివలింగమే "పవిత్రం" అని చెప్పఁబడుచున్నది. అటువంటి పవిత్రమైన (లింగ)మూర్తి సంపర్కముతో శరీరము పవిత్రమగును. దీక్షా సంస్కారమనెడు అగ్నిచేత గాల్చబడకుండ యున్న శరీరముగలవాడు, షడధ్వాన సంస్కార రహితుడు, శివదీక్షారహితుడు శ్రేష్ఠమైన ఈ లింగమును బొందలేడు(అర్హుడుగాడు)

లింగధారణాచంద్రికారచయితయైన శ్రీ నందికేశ్వర శివాచార్యులవారు పైన జెప్పిన మంత్రమునకు "ఓయీ॥ బ్రహ్మణ స్పతి - లింగరూప శరీరావచ్ఛేదేన శరీర భావేనా ధిష్ఠిత పరమశివ, తె= తవ-, తత్= బ్రహ్మ పద వాచ్య లింగరూపం శరీరం, పవిత్రం= ఉక్తరీత్యా శుచ్యశుచికాలే2 పిధర్తుంయోగ్యం, వితతం = ఇష్టాది భేదేన భక్త శరీరాదిభేదేనవా బహువిధం ప్రభుః =నిగ్రహానుగ్రహనమర్థస్త్వం, విశ్వతః= సమస్తాని (సార్వవిభక్తికస్తసిత్ -) గాత్రాణి=భక్తశరీరాణి, పర్యేషి=ప్రాప్నోషి,ధార్యమాణస్సన్, లింగరూపశరీరద్వారా భక్తాంగసంయుక్తో2 సిత్యర్థః, అతప్తతనూః-తప్తావేధాఃమను- క్రియా దీక్షత్రయేణ నిర్దగ్ధపాపపంజరాత సూర్యస్యనభవతీః సః అతప్తతనూః, దీక్షాత్రయ రహితః, అమః- అమః -అపరి- పక్వాంతః కరణస్యన్, తత్=పరమశివ స్వరూపం, నాశ్నుతేః॥ అని వ్యాఖ్యానమును వివరించి వ్రాసి యున్నారు.

ఇట్టి వేదమంత్రాభిప్రాయమును లోక ప్రసిద్ధులైన వ్యాసమహర్షులవారు తమ చేత రచింపఁబడిన ॥లింగపురాణము యొక్క ఉత్తర భాగమైన 21, వ అధ్యాయమునందు సుస్పష్టముగా వివరించి యున్నారు.

"బ్రహ్మేతి లింగమాఖ్యాతం-బ్రహ్మణః పతిరేశ్వరః
పవిత్రం తద్ధి విఖ్యాతం- తత్సంపర్కాత్ తనుఃశుచిః॥ (98)

ఋగిత్యాహపవిత్రంతే -వితతం బ్రహ్మణస్పతే
తస్మాత్పవిత్రం తల్లింగం-ధార్యం శైవమనామయం। (99)

అతప్తతను రజ్ఞోవై- హ్యఘీసంసారలక్షణః
దీక్షయారహితః సాక్షా-న్నాప్నుయాల్లింగముత్తమం। (100)

యః కరోతితపః పూర్వం-సతప్తతనురుచ్యతే
పరిపక్వో విమోక్షాయ-సోऽశ్నూతే లింగధారణం। (101)

సకరోతపః పూర్వం-సోऽతప్తతను రుచ్యతే (102)

అనగా బ్రహ్మమే శివలింగమనియు, ఈ పరమ పవిత్రమైన శివలింగధారణచేత శరీరముగూడా పునీతమగుననియు, అందుచేత పవిత్రమైన శివలింగమును ధరించవలెననియు, వేధా-మను-క్రియా రూపదీక్షతో తప్పుడుగాని యెడల అట్టివాడు, అజ్ఞాని -పాపి- సంసారియగుననియు, ఆకారణమున దీక్షను గైకొనవలయుననియు,దీక్షారహితుడు శివలింగమును ధరించుటకు దగినవాడు గాడనియు, పూర్వమున ఎవడైతే శివుని గురించి తపమునాచరించునో ఆతడు తప్తతను, వని చెప్పఁబడుననియు అట్లు తపమునాచరించనివాడు ॥ అతప్త॥తనువని జెప్పబడుననియు పరిపక్వాంతః కరుణుడు ముక్తి కొరకు లింగధారణమునుబొందుననియు వ్యాసమహర్షులవారుద్బోధించియున్నారు-దీనితో ॥పవిత్రంతె,,అను నీ ఋగ్వేదమంత్రము కేవలము లింగధారణమునే బోధించుచున్నదనియు-సిద్ధమగు-చున్నది ॥58-59-60॥

"యాతేరుద్రశివా తనూరఘోరపాపకాశినీ।

తయాస్తనువాశంత మయాగిరిశంతాభి చాకశీహి"। అనుయజుర్వేద మంత్రము లింగధారణ మునే బోధించుచున్నది. అందుచేత లింగధారణ సంపన్నుడైన వీర శైవుడు పాపసమూహము నుండి ముక్తుడగును॥ ఈ యజుర్వేదమంత్రమునకు శ్రీరేవణారాధ్యుల వారు:-

"ఘోరుద్ర=ఓయీ!పరమేశ్వరా!తె=నీ యొక్క ఆపాపకాశీనీ=మనో-వాక్కాయములలో బుట్టిన అనేక విధములైన పాపములను ప్రకాశించకుండ సంహరింపఁజేయు, అఘోర= భయంకరమైనదిగా కళాంతరూపమైయున్న యాతనూః = లింగంతు శివయోర్దేహస్తాభ్యాం యస్మాదధిష్ఠితః" అని వాయ వీయ సంహితవాక్యముండుటవలన ఏదో ఒకటి ఇష్ట-ప్రాణ లింగ రూపమగు నీ దేహము, శివా=మంగళకరమైనదో శంతమయా=భక్తులకు మహాభోగ-మోక్షరూపమైన సుఖమును ఒసగునదై అత్యంత సుఖస్వరూపమగు, తయాతనువా= ఆఇష్టప్రాణరూపమగునీ శరీరముతో, భోగిరిశంత=ఓయీ!పరమేశ్వరా!త్వం=నీవు, నః=ఇషమూర్జంతపసామయచ్ఛతే ప్రాణేష్వంతర్మనసోలింగమాహుః, అను అథర్వణ వేదమంత్ర మున్నది కావున - "ఇష్టలింగం ప్రాణ లింగమేకీకృత్వార్చనంపరం" అని వాతు లోత్తరతంత్ర ముంటవలన దేశికుని ఉపదేశము వలన సుశిక్షితులైన మమ్ముగురించి, అభిచాకశిమి" అభిముఖమై ప్రకాశించుము, అను నీ విధముగ నీ మంత్రార్థమును వివరించి యున్నారు "యాతెరుద్ర" అను నీయజుర్వేదమంత్రము గూడ లింగధారణమునే బోధించుచున్నదని భావము ॥61॥ ఎవడైతే లింగధారియై , నిర్మలాంతః కరుణుడై ప్రతిదినము శివపూజలో నిరతుండైన మనస్సుగలవాడై యుండునో, వాడు సమస్త దోషముల పరిహారమునకై, మనోహరము పవిత్రముఐన భస్మమును దీనిని ధరించేవిధిననుసరించి ధరించవలెను॥62॥

*ఇతి సిద్ధాంత శిఖామణౌ భక్త స్థలే గురుకారుణ్య*
*స్థల లింగ ధారణ స్థలలింగ ధారణ స్థల ప్రసంగోనామ*
*షష్ఠ పరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది శ్రీసిద్ధాంత శిఖామణి యందు
గురు కారణ్య స్థలములో లింగధారణ స్థల
విచారాత్మకమగు ఆరవ పరిచ్ఛేదము పరిసమాప్తము.



# శ్రీ సిద్ధాంత శిఖామణి

## సప్తమ పరిచ్ఛేదః

## సప్తమ పరిచ్ఛేదం

### 6. భస్మ ధారణ స్థలం

॥శ్లో॥ భస్మధారణ సంయుక్తః పవిత్రో నియతాశయః
శివాభిధానం యత్ప్రోక్తం భాసనాద్భసితం తథా ॥ 1 ॥

మహాభస్మేతి సంచింత్య మహాదేవరం ప్రభామయం
వర్త ంతే యే మహాభాగా ముఖ్యాస్తే భస్మధారిణః ॥ 2 ॥

శివాగ్న్యాదిసముత్పన్నం మంత్రన్యాసాది యోగతః
తత్సోపాధికమిత్యాహుర్భస్మ తంత్ర విశారదాః ॥ 3 ॥

విభూతిర్భసితం భస్మ క్షారం రక్షేతి భస్మనః
ఏతాని పంచ నామాని హేతుభిః పంచభిర్భృశం ॥ 4 ॥

విభూతి ర్భూతి హేతుత్వాద్భసితం త్తత్వభాసనాత్
పాపానాం భర్ప నాద్భస్మ క్షారణాత్ క్షారమాపదాం
రక్షణాత్సర్వ భూతేభ్యో రక్షేతి పరిగీయతే ॥ 5 ॥

నందా భద్రా చ సురభిః సుశీలా సుమనాస్తథా
పంచ గావో విభోర్జాతాః సద్యోజాతాదివక్త్రతః ॥ 6 ॥

కపిలః కృష్ణ ధవల ధూమ్రరక్తాస్తథైవ చ
నందాదీనాం గవాం వర్ణాః క్రమేణ పరికీర్తితాః ॥ 7 ॥

సద్యోజాతాద్విభూతిశ్చ వామాద్భసితమేవ చ
అఘోరాద్భస్మ సంజాతం క్షారం తత్పురుషా త్తథా
రక్షా చేశానవక్త్రాచ్చ నందాది ద్వారతోక భవత్ ॥ 8 ॥

ధారయేన్ని త్యకార్యేషు విభూతిం చప్రయత్నతః
నైమిత్తికేషు భసితం క్షారం కామ్యేషు సర్వదా ॥ 9 ॥

ప్రాయశ్చిత్తేషు సర్వేషు భస్మనామ యథావిధి
రక్షాచ మోక్ష కార్యేషు ప్రయోక్తవ్యా సదాబుధైః ॥ 10 ॥

నందాదీనాం తు యే వర్ణాః కపిలాద్యాః ప్రకీర్తితాః
త ఏవ వర్ణా విఖ్యాతా భూత్యాదీనాం యథాక్రమం ॥ 11 ॥

భస్మోత్పాదనముద్దిష్టం చతుర్ధా తంత్రవేదిభిః
కల్పం చైవానుకల్పం చ హ్యుపకల్పమకల్పకమ్ ॥ 12 ॥

ఏషామాదిమముత్కృష్ట మన్యత్సర్వ మభావతః
తథా శాస్త్రో క్త విధినా గృహీత్వ గోమయం నవం ॥ 13 ॥

సద్యేన వామదేవేన కుర్యాత్పిండమనుత్తమం
శోషయేత్పురుషేణైవ దహేద్ఘోరాచ్ఛివాగ్నినా ॥ 14 ॥

కల్పం తద్భస్మ విజ్ఞేయమనుకల్పమథోచ్యతే
వనేషు గోమయం యచ్చ శుష్కం చూర్ణీకృతం తథా ॥ 15 ॥

దగ్ధం చైవానుకల్పాఖ్య మాపణాదిగతం తు యత్
వస్త్రేణోత్తారితం భస్మ గోమూత్రాబద్ధ పిండకం ॥ 16 ॥

దగ్ధం ప్రాగుక్తవిధినా భవేద్భస్మోపకల్పకం
అన్యైరాపాదితం భస్మ హ్యకల్పమితి కల్పితం ॥ 17 ॥

ఏష్వేకతమమాదాయ పాత్రేషు కలశాదిషు
త్రిసంధ్యమాచరేత్ స్నానం యథాసంభవమేవ వా ॥ 18 ॥

స్నానకాలే కరౌపాదౌ ప్రక్షాల్య విమలాంభసా
వామహస్త తలేభస్మక్షిప్త్వాఽఽచ్ఛాద్యాన్య పాణినా ॥ 19 ॥

అష్టకృత్వోఽ థమూలేన మౌనీ భస్మాభి మంత్ర్యచ
శిర ఈ శానమంత్రేణ వామదేవేన గుహ్యకం ॥ 20 ॥

పాదౌ సద్యేన సర్వాంగం ప్రణవేనైవ సేచయేత్ ॥ 21 ॥

భస్మనా విహితం స్నానమిదమాగ్నేయముత్తమం
స్నా నేషు వారుణాద్యేషు ముఖ్య మేతన్మలాపహం ॥ 22 ॥

భస్మస్నానవతాం పుంసాం యథాయోగం దినేదినే
వారుణా ద్యైరలం స్నానైర్బాహ్యాదోషాపహారిభిః ॥ 23 ॥

ఆగ్నేయం భస్మనా స్నానం యతిభిస్తు విధీయతే
అర్ద్రస్నానాత్పరం భస్మ ఆర్ద్రే జంతువధో ధ్రువం ॥ 24 ॥

అర్ద్రం తు ప్రకృతిం విద్యాత్ ప్రకృతిం బంధనం విదుః
ప్రకృతేస్తు ప్రహాణార్థం భస్మనా స్నానమిష్యతే ॥ 25 ॥

బ్రహ్మాద్యా విబుధాః సర్వే మునయో నారదాదయః
యోగినః సనకాద్యాశ్చ బాణా ద్యా దానవా అపి ॥ 26 ॥

భస్మస్నానరతాః సర్వే శివభక్తి పరాయణాః
నిర్ముక్త దోషకలిలా నిత్య శుద్ధా భవంతి హి ॥ 27 ॥

నమః శివాయేతి భస్మ కృత్వా సప్తాభిమంత్రితః
ఉద్ధూలయేత్తేన దేహంత్రిపుండ్రం చాపి ధారయేత్ ॥ 28 ॥

సర్వాంగోద్ధూలనం చాపి న సమానం త్రిపుండ్రకైః
తస్మాత్త్రి పుండ్ర మేవైకం లిఖేదుద్ధూలనం వినా ॥ 29 ॥

త్రిపుండ్రం ధారయేన్నిత్యం భస్మనా సజలేన హి
స్థానేషు పంచదశసు శరీరే సాధకోత్తమః ॥ 30 ॥

ఉత్తమాంగే లలాటే చ శ్రవణద్వితయే తథా
గలే భుజద్వయే చైవ హృది నాభౌ చ పృష్ఠకే ॥ 31 ॥

బాహుయుగ్మేకకుద్దేశే మణిబంధద్వయే తథా
త్రిపుండ్రం భస్మనా ధార్యం మూలమం త్రేణ సాధకైః ॥ 32 ॥

వామహస్త తలే భస్మక్షిప్త్వా చ్ఛాద్యాన్యపాణినా
అగ్ని రిత్యాదిమంత్రేణ స్పృశన్వారాఽభి మంత్ర్యచ ॥ 33 ॥

త్రిపుండ్రముక్త స్థానేషు దధ్యాత్ సజల భస్మనా
శివం శివంకరం శాంతం స ప్రాప్నోతి న సంశయః ॥ 34 ॥

మధ్యాంగులిత్రయేణైవ స్వదక్షిణ కరస్యతు
షడంగులాయతం మానమపివాకలికమానకం
నేత్రయుగ్మప్రమాణేన ఫాలే దధ్యాత్త్రిపుండ్రకం ॥ 35 ॥

మధ్యమానామికాంగు ష్ఠైరనులోమవిలోమతః
ధారయేద్య స్త్రి పుండ్రాంకం స రుద్రో నాత్రసంశయః ॥ 36 ॥

ఋజు శ్వేతమనువ్యాప్తం స్నిగ్ధం శోత్రప్రమాణకం
ఏవం సల్లక్షణోపేతం త్రిపుండ్రం సర్వ సిద్ధిదం ॥ 37 ॥

ప్రాతఃకాలే చ మధ్యాహ్నే సాయా హ్నేచత్రిపుండ్రకం
కదాచిద్భస్మనా కుర్యాత్స రుద్రో నాత్ర సంశయః ॥ 38 ॥

ఏవం విధం విభూత్యా హి కురుతే యస్త్రిపుండ్రకం
స రౌద్ర ధర్మ సంయుక్త స్త్రయీమయ ఇతి శ్రుతిః ॥ 39 ॥

బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ దేవాః శుక్రపురోగమాః
త్రిపుండ్రం ధారయంత్యేవ భస్మనా పరికల్పితం ॥ 40 ॥

వసిష్ఠాద్యా మహాభాగా మునయః శ్రుతికోవిదాః
ధారయంతి సదాకాలం త్రిపుండ్రం భస్మనా కృతం ॥ 41 ॥

శైవాగమేషు వేదేషు పురాణేష్వఖిలేషు చ
స్మృతీ తిహాసకల్పేషు విహితం భస్మపుండ్రకం
ధారణీయం సమస్తానాం శైవానాం చవిశేషతః ॥ 42 ॥

నాస్తికో భిన్న మర్యాదో దురాచార పరాయణః
భస్మత్రిపుండ్ర ధారీ చేన్ముచ్యతే సర్వకిల్బిషైః ॥ 43 ॥

## 7. రుద్రాక్షధారణ స్థలం

భస్మనా విహితస్నాన స్త్రి పుండ్రాంకితమస్తకః
శివార్చన పరో నిత్యం రుద్రాక్షమపి ధారయేత్ ॥ 44 ॥

రుద్రాక్ష ధారణాదేవ ముచ్యంతే సర్వ పాతకైః
దుష్ట చిత్తా దురాచారా దుష్ప్రజ్ఞా అపి మానవాః ॥ 45 ॥

పురాత్రి పురసంహారే త్రినేత్రో జగతాం పతిః
ఉదపశ్యత్పురాం యోగమునీమ్లిత విలోచనః ॥ 46 ॥

నిపేతుస్తస్య నేత్రేభ్యో బహవో జలబిందవః
తేభ్యోజాతాహిరుద్రాక్షా రుద్రాక్షా ఇతి కీర్తితాః ॥ 47 ॥

రుద్ర నేత్రసముత్పన్నా రుద్రాక్షా లోకపావనాః
అష్టత్రింశత్ప్రభేదేన భవంత్యుత్పత్తి భేదతః ॥ 48 ॥

నేత్రాత్ సూర్యత్మనః శంభోః కపిలా ద్వాదశోదితాః
శ్వేతాఃషోడశసంజాతాః సోమరూపాద్విలోచనాత్ ॥ 49 ॥

కృష్ణా దశ విధా జాతా వహ్నిరూపాద్విలోచనాత్
ఏవముత్పత్తి భేదేన రుద్రాక్షా బహుధా స్మృతాః ॥ 50 ॥

అచ్ఛిద్రం కనకప్రఖ్యమనన్యధృతముత్తమం
రుద్రాక్షం ధారయేత్ ప్రాజ్ఞః శివపూజాపరాయణః ॥ 51 ॥

యథాస్థానం యథావక్త్రం యథాయోగం యథావిధి
రుద్రాక్ష ధారణం వక్ష్యే రుద్ర సాయుజ్య సిద్ధయే ॥ 52 ॥

శిఖాయామేక మేకాన్యం రుద్రాక్షం ధారయేద్బుధః
ద్విత్రిద్వాదశ వక్త్రాణి శిరసి త్రీణి ధారయేత్ ॥ 53 ॥

షట్త్రింశద్ధారయేన్మూర్ధ్ని నిత్యమేకాదశాననాన్
దశసప్త పంచవక్త్రాన్ షట్ షట్ కర్ణద్వయేవ హేత్ ॥ 54 ॥

షడష్టవదనాన్ కంఠే ద్వాత్రింశద్ధారయేత్సదా
పంచాశద్ధారయేద్ధీమాన్ చతుర్వక్త్రాణి వక్షసి ॥ 55 ॥

త్రయోదశ ముఖాన్ బాహ్వోర్ధరేత్ షోడశ షోడశ
ప్రత్యేకం ద్వాదశ వహేన్న వాస్యాన్మణి బంధయోః ॥ 56 ॥

చతుర్దశముఖం యజ్ఞసూత్ర మష్టోత్తరం శతం
ధారయేత్ సర్వకాలం తు రుద్రాక్షం శివపూజకః ॥ 57 ॥

ఏవం రుద్రాక్షధారీ యః సర్వకాలే తు వర్తతే
తస్య పాపకథా నాస్తి మూఢస్యాపి న సంశయః ॥ 58 ॥

బ్రహ్మహా మద్యపాయీ చ స్వర్ణహృద్గురుతల్పగః
మాతృహా పితృహా చైవ భ్రూణహాకృత ఘూతకః
రుద్రాక్ష ధారణా దేవ ముచ్యంతేసర్వ పాతకైః ॥ 59 ॥

దర్శనాత్ స్పర్శనాచ్చైవ స్మరణాదపి పూజనాత్
రుద్రాక్ష ధారణాల్లోకే ముచ్యంతేపాతకైర్జనాః ॥ 60 ॥

బ్రాహ్మణో వాంత్యజోవాపి మూర్ఖోవాపండితో2 పివా
రుద్రాక్ష ధారణాదేవ ముచ్యతే సర్వ పాతకైః ॥ 61 ॥

గవాం కోటి ప్రదానస్య యత్ఫలం భువిలభ్యతే
తత్ఫలం లభతే మర్త్యో నిత్యం రుద్రాక్ష ధారణాత్ ॥ 62 ॥

మృతికాలేతు రుద్రాక్షం నిష్పీడ్య సహవారిణా
యః పిభేచ్చింతయన్ రుద్రం రుద్రలోకం సగచ్ఛతి ॥ 63 ॥

భస్మో ద్ధూలిత సర్వాంగా ధృతరుద్రాక్ష మాలికాః
యే భవంతిమహాత్మానోరుద్రాస్తే నాత్ర సంశయః ॥ 64 ॥

నిత్యాని కామ్యాని నిమిత్త జాని
కర్మాణి సర్వాణి సదాపి కుర్వన్
న భస్మరుద్రాక్షధరో యదిస్యాత్
ద్విజో నతస్యాస్తి ఫలోపపత్తిః ॥ 65 ॥

సర్వేషు వర్ణాశ్రమ సంగతేషు
నిత్యం సదాచారపరాయణేషు
శ్రుతిస్మృతిభ్యామిహ చోద్యమానో
విభూతి రుద్రాక్షధరః సమానః ॥ 66 ॥

భస్మధారణము వలన వీర శైవుడు పరమ పవిత్రుడు నిశ్చల చిత్తుడు అగును.
'సేషభస్మజ్యోతిః - స ఏష భస్మజ్యోతిః

అనుభస్మజాబాలశ్రుతి వాక్యాను సారముగా ఏది శివనామమైయున్నదో? ఏది శివుని స్వరూపమును ప్రకాశింపఁజేయునో దాని చేత "భసిత"మని చెప్పఁబడు చున్నదో, జ్యోతి రూపుడైన శంకరునియామహాభస్మమని భావించియే మహనీయులైతే వర్తించెదరో, నడచు కొందురో అ చరింతురో అట్టి నిరుపాధిక భస్మ ధారులైన వీరశైవులే సర్వ శ్రేష్ఠులుగా చెప్పబడుదురు. పరశివ మూర్తిని మహాభస్మ మహాభస్మనియు, భావించుటే నిరుపాధిక భస్మమని పేర్కొనదగును ॥1-2॥ పంచ బ్రహ్మమంత్ర న్యాసాదుల సంబంధముచే ఏదైతే శివాగ్ని సంస్కార పూర్వకముగా నుత్పన్నమవుచున్నదో అట్టి భస్మమునకు తంత్ర శాస్త్ర విశారదులు సోపాధిక భస్మమని చెప్పుచుందురు ॥3॥

ఈ భస్మమునకు ఐదు కారణములతో (విభూతి -భసిత-భస్మ-క్షౌర-రక్షా,,అను) ఐదు పేర్లున్నవి. ॥4॥ "అణిమాద్యష్టై శ్వర్యములకు గారణీ భూతమగుట వలన "విభూతి" యనియు, ఇవి తత్వమును ప్రకాశింపజేయును గనుక భసితమనియు మనోవాక్కాయ జన్యమగు పాపములను భీతిగొల్పుట చేత "భస్మ" మనియు, ఆధ్యాత్మికము -ఆధి భౌతికము-ఆధి దైవికమగు రూప-తాప-ములనుండి సంక్రమించునట్టి విపత్తులను నశింపఁజేయుట చేత "క్షార" మనియు, భూత-ప్రేత-పిశాచాదుల వలన రక్షించునదిగా వున్న రక్షయనియు జెప్ప ఁబడును. ॥5॥ పరమేశ్వరుని-సద్యోజాత-వామదేవ-అఘోర-తత్పురుష- ఈశాన్య-ముఖముఖ ములనుండి అనుక్రమముగా నందా-భద్రా-సురభి-సుశీల-సుమనా-అమనామములలో ఐదు గోవులు ఉత్పన్నములైనవి. ॥6॥ నందాదిగోవులకు అను క్రమముగా కపిల-కప్పు-తెలుపు-ఆకాశ వర్ణము-ఎఱుపు-వర్ణము (రంగు)లు చెప్పబడినవి ॥7॥ సద్యో జాతముఖమునుండి బుట్టిన భద్రాగోవుఉండి భసితము, అఘోరముఖమునుండి బుట్టిన సురభి గోవునుండి, భస్మము, తత్పురుషముఖమునుండి బుట్టిన సుశీలా గోవునుండి క్షారము. ఈ శానము ఖమునుండి బుట్టిన సుమనా గోవునుండి "రక్ష" యనియు జన్మించినవి ॥8॥

బుద్ధిమంతులు నిత్య కర్మలందు "విభూతిని" నైమిత్తిక కర్మలందు భసితమును, కామ్య కర్మలందు క్షారమును అన్నిరకాలైన ప్రాయశ్చిత్త కర్మలందు "భస్మమును మోక్షకార్యము లందు "రక్షను విధిఅను సారముగ ధరించవలెను ॥9-10॥ నందాది గోవులకు ఏకపిలాది వర్ణములు చెప్పబడినవో విభూత్యాదులకు అవే వర్ణములు అనగా "విభూతికి " కపిలము "భసితమునకు కప్పు" భస్మమునకు తెలుపు. క్షారమునకు ఆకాశ వర్ణము రక్షకు ఎఱుపు వర్ణములును చెప్పబడినవి. ॥11॥ తంత్ర శాస్త్రజ్ఞులు భస్మోత్పత్తిని

గురించి కల్ప, అనుకల్ప, ఉపకల్ప అకల్ప అని నాలుగు రకాలుగా చెప్పుదురు. ॥12॥ వీటిలో మొదటిదైన కల్పభస్మమే సర్వోత్తమమైనది. ఈ కల్ప భస్మములభించని చోట గతమూడు రకాలభస్మములను ఉపయోగించుకొనదగును. విన్నూత్నమైన గోమయమును శాస్త్ర విధిననుసరించి సద్యోజాతమంత్రము చేత అంతరమున క్రింద బడకుండ పైననేలేదా మధ్యనే బట్టుకొని వామ దేవ మంత్రము ముద్దలు (ఉండలు)గా జేసి, తత్పురుష మంత్రమునచేత ఎండబెట్టి (శుష్కించి) అఘోర మంత్రముతో కాల్చవలెను, ఈ శానమంత్రముతో బిల్వాది (మారేడు) పవిత్రమైన పాత్రలో నుంచవలెను. ఇది కల్ప భస్మమని చెప్పబడును, అరణ్యములో నున్నఎండిన గోమయమును పొడి (చూర్ణము) జేసి, మొదలు జెప్పిన విధముగా సంస్కరించబడిన భస్మము అనుకల్పభస్మమనియు చెప్పబడినది. అంగడి (దుకాణము)లో నున్న భస్మమును దెచ్చి వస్త్రముతో వడియగట్టి (వడబోసి) గో మూత్రముతో ఉండలను (ముద్దలను) జేసి, మొదట జెప్పిన విధానముననుసరించి సిద్ధగించిన భస్మము "ఉపకల్ప భస్మము,, అని చెప్పఁబడును. మంత్ర జ్ఞానము లేని వారి చేత సిద్ధగించిన భస్మము "అకల్పభస్మ"మని, చెప్పబడును. ॥13-14-15-16-17॥ వేర్వేరు పాత్రలో నున్నట్టి యానాలు రకాలైన భస్మములలోనేదో ఒక దానిని దీసికొని మూడు సమయములందును గాని లేదా తనకు అనుకూలమైన ఒక సమయమునందును గాని ప్రతి దినము భస్మ స్నానము జేయవలెను ॥18॥ భస్మస్నాన సమయమునందు నిర్మలోదకముచేత రెండు చేతులను, రెండు పాదములను ప్రక్షాళనమును గావించి ఎడమ అరచేతిలో భస్మమునిడుకొని, దానిపై కుడియరచేతితో మూసి, ఆ పిదప మౌనముతోనుండియెనమిది మారులు మూల మంత్రముచేత భస్మమును అభి మంత్రించి, ఈ శానమంత్రముతో శిరస్సును, తత్పురుష మంత్రము చేత ముఖమును, అఘోరమంత్రము చేత హృదయమును, వామదేవ మంత్రము చేత గుహ్య ప్రదేశమును, సద్యోజాతమంత్రముతో రెండు పాదములను, ఓం కారముచేత సర్వాంగమును , ప్రోక్షించవలెను ॥19-20-21॥ జల స్నానము -వాయు స్నానము మున్నగు స్నానములలో అగ్నికి సంబంధించిన ఈ భస్మ స్నానము ప్రధానముగా సమస్తమలములను నశింపఁజేయును ॥22॥ ప్రతిదినము శాస్త్ర విధిననుసరించి భస్మస్నానమును ఆచరించువారికి బాహ్యాదోషములను నశింపఁజేయు జలాది స్నానములతోనేమి ప్రయోజనము ॥23 ॥ అగ్నికి సంబంధించిన భస్మ స్నానము జ్ఞానాంగమై యుంటవలన యతులు (సన్యాసులు) ఇట్టి భస్మ స్నానమును ఆచరింతురు. జలస్నానమునందు ప్రాణి హింస (వధ) జరుగుట వలన జలస్నానమున కంటెను భస్మ స్నానమేశ్రేష్ఠమైనది. ॥24॥ "నవాఏష పురుషోకస్సర

సమయః" అనే శ్రుతి వాక్యముచేతను పురుషః ప్రకృతి స్థోహిభుంక్తే ప్రకృతి జాన్‌గుణాన్ అను గీతోక్తి చేతను అన్న రసమయుడైన పురుషుడు ప్రకృతి గుణగణములను ఉపభోగించుట చేత జలమును ప్రకృతిగా దెలియవలెను జ్ఞానులు ప్రతి నిబంధనముగా భావింతురు. అట్టి ప్రకృతిని నశింపజేయుటకై భస్మ స్నానమును జెప్పి యున్నారు ॥25॥ బ్రహ్మ మొదలగు దేవతలు (సమస్త దేవతలు) నారదుడు మున్నగు మునీశ్వరులు, సనకాది యోగి పుంగవులు, బాణుడు మొదలగుదానవులు భస్మస్నానరతులై శివభక్తి భరితులై, పాపసమూహము బారదోలిన వారై నిత్య నిర్మలమనస్కులై యున్నారు ॥26-27॥ నమఃశివాయ అను పంచాక్షరీ మంత్రముతో భస్మమును ఏడు మారులు అభిమంత్రించి అట్టి భస్మముతో దేహమంతటబూసికొనుటేగాకుండా త్రిపుండ్రముగా ధరించవలెను ॥28॥ భస్మమును సర్వాంగములందు ధరించినను (బూసినను) అది త్రిపుండ్రము (మూడు రేఖలు) ధరించిన దానికి సాటిగాజాలదు. అందుచేత ఉద్ధూలనమును వదలి త్రిపుండ్రదారణమును జేయవలెను ॥29॥ సాధకుడైన వీరశైవుడు ప్రతిదినమే తన శరీరము యొక్క పదియేను స్థానములందు జలమిశ్రితమైన భస్మముతో త్రిపుండ్రమును ధరించవలెను ॥30॥ ॥1॥ మస్తకమునందు ॥2॥ నుదుట ॥3॥రెండు చెవులయందు ॥4॥ కంఠమున ॥5॥రెండు భుజములందు, ॥6॥ హృదయమున నాభియందు, ॥7॥వీపుపై ॥8॥రెండు బాహువులందును ॥9॥(హెగలు) ఎదపై ॥10॥రెండుమోచేతులయందును. ఈ విధముగ పదునైదు స్థానములందు మూల మంత్రమునుచ్చరిస్తు త్రిపుండ్రధారణమును జేయదగును ॥31-32॥ఎడమ అరిచేతిలో భస్మమునుంచి కుడిచేతిలో మూసి

॥అగ్ని రితి భస్మ-వాయురితిభస్మ-జలమితిభస్మ
స్థలమితి భస్మ-వ్యోమేతిభస్మ-భస్మేతి-భస్మ-
సర్వం హనా ఇదం భస్మ-మన ఇత్యేతాని -చక్షూంషిభస్మాని॥

రెండు మంత్రములతోభస్మమును ముట్టి అట్టి భస్మమును జలముతో (ఉదకముతో) 2 సార్లు అభిమంత్రించి జలమిశ్రితమైన భస్మముతో పైన జెప్పిన(15)పదైదు స్థానములందు త్రిపుండ్రమును ధరించవలెను. ఈ రీతిగా త్రిపుండ్ర ధారణమును జేసి కొనిన ప్రతివీరశైవుడు మంగళకరుడైన శివుని బొందును. ఇందులో నేలాంటి సందేహము లేదు.॥33-34॥ వీరశైవుడు కుడిచేతినడుమనున్న మూడు వ్రేళ్ళతో (చూపుడువ్రేలు-నడిమివ్రేలు-ఉంగరపువ్రేలు) ఈ వ్రేళ్ళతో ఆరు అంగుళాల పొడువుగాని, నుదురున్నంతగాని, రెండు నేత్రములసమానము గాని, నుదుట త్రిపుండ్ర ధారణమును జేసికొనవలెను. మధ్యమ మరియు అనామిక

వ్రేళ్ళతో అనులోమముగాను అంగుష్ఠ (బొట్టనవ్రేలు) మువ్రేలుతో విలోమముగాను ఎవడైతే తన నుదుట త్రిపుండ్రముగా ధరించునో వాడు శివుడే యగును, ఈ విషయమున ఏలాంటి సందేహములేదు సరళముగను శుభ్రముగాను, దట్టముగాను (గాఢముగాను) ననుపుగాను శోత్రప్రమాణముగాను, మున్నగు సల్లక్షణములతో గూడిన త్రిపుండ్రధారణము సర్వసిద్ధిప్రదాయకమైనది. ప్రాతఃకాలమునందుగాని, మధ్యాహ్నమునగాని, సాయంకాలమునందు గాని యెవ్వడైతే త్రిపుండ్రమును ధరించునో నాతడు శివుడగును. ఈ విషయమున ఏలాంటి సందేహములేదు. ॥35-36-37-38॥ ఎవడైతే భస్మముతో ఈ విధముగ సల్లక్షణములతో గూడిన త్రిపుండ్రమును ధరించునో

యఇదంత్రిపుండ్రం ధార్యతే-సవేదత్రయ ధారీ భవతి॥
ససంతతం త్రేతాగ్నిర్భవతి- సపుష్కరత్రయ స్నాతో భవతి॥
యస్త్రి పుండ్రధారీ పురుషః సరుద్ర ఏవ భవతి॥

అనుశ్రుతి వాక్యానుసారముగా నతడు శివధార్యుడు, సంయుక్తుడు, వేద స్వరూపుడే యగును॥ ॥39॥ బ్రహ్మ-విష్ణు-రుద్రుడు. ఇంద్రుడు మున్నగు దేవతలు భస్మ త్రిపుండ్రము ధరించి యున్నారు ॥40 ॥ వేదజ్ఞులైన వశిష్టుడు మున్నగు మహర్షులు ఎల్లప్పుడు భస్మత్రి పుండ్రమును ధరింతురు. ॥41॥ నాలుగువేదములందును, కామికాది వాతులాంతములైన ఇరువదెనమిది శివాగమములందును. సమస్త పురాణములందును. సర్వస్మృతులలోను. ఇతి హాసము లందును. కల్పగ్రంథములలోను భస్మత్రిపుండ్రధారణము చెప్పబడియున్నది. ॥42॥ సమస్త శైవమతీయులు విశేషించి భస్మత్రిపుండ్రధారణముచేయవలెను. నాస్తికుడుగానిమ్ము, జాతి భ్రష్టుడుగా నిమ్ము, దురాచారిగా నిమ్ము, భస్మత్రిపుండ్రమును ధరించిన వారందరు సర్వపాపములనుండి ముక్తులగుదురు ॥43॥

### 7.రుద్రాక్ష ధారణము

"భస్మనావిహితస్నానస్త్రిపుండ్రాంకితమస్తకః
శివార్చన పరోనిత్యం-రుద్రాక్షమపిధారయేత్॥
రుద్రాక్షధారణాదేవ-ముచ్యంతేసర్వపాతకైః
దుష్టచిత్తాదురాచారా-దుష్ప్రజ్ఞాఅపిమానవాః
పురాత్రి పురసంహారే- త్రినేత్రోజగతాంపతిః
ఉదపశ్యత్పురాం యోగమున్మీలత విలోచనః॥

నిపేతుస్తస్య నేత్రేభ్యో-బహవోజలబిందవః
తేభ్యోజాతాహిరుద్రాక్షా-రుద్రాక్షాఇతికీర్తితాః
రుద్రనేత్రసముత్పన్నా-రుద్రాక్షాఇతికీర్తితాః
రుద్రనేత్ర సముత్పన్నా-రుద్రాక్షాలోకపావనాః
అష్టత్రింశత్ప్రభేదేన-భవంత్యుత్పత్తి భేదతః

భస్మధారణయుతుడు త్రిపుండ్రాంకితమస్తకయుతుడు. శివార్చనాసక్తుడు,ఐనవీరశైవుడు నిత్యమురుద్రాక్షలను ధాల్చవలెను ॥44॥ మానవులు దుష్టమనస్కులైన వారును, దురాచారులైనను, దుర్బుద్ధిగల వారైనను, రుద్రాక్షధారణతో సమస్త పాపములనుండి ముక్తులగుదురు ॥45॥ పూర్వము జగత్ప్రభువు- త్రినేత్ర ధారియైన పరమేశ్వరుడు త్రిపురాసురులను సంహరించునపుడు, తన మూడు నేత్రములను విస్తరింపజేయువాడై త్రిపురాసురుల సంబంధమును గురించి పైకి జూచెను ॥46॥ అప్పుడా పరమేశ్వరుని సూర్యచంద్రాగ్ని నేత్రముల నుండి జల బిందువులు రాలినవి, అట్టి జలబిందువులనుండి రుద్రాక్ష వృక్షములుత్పన్నము లైనవి. వాటినుండి బుట్టినవేరుద్రాక్షలైనవి ॥47॥ రుద్ర నేత్రములనుండి బుట్టినవి కనుకనే రుద్రాక్షలనిబిలువఁబడుచున్నవి. అవి సమస్తలోక పావనకరములుఐన రుద్రాక్షలు. ఉత్పత్తి భేదముచేత ముప్పది యెనమిది ॥48॥ రకములైనవి పరమేశ్వరుని సూర్యనేత్రము నుండి కపిల వర్ణముగల పంద్రెండు విధములైన రుద్రాక్షలుత్పన్నములైనవి, చంద్రనేత్రము నుండి తెల్లని రంగుగలవి పదునారు ప్రకారములైన రుద్రాక్షలుత్పన్నములైనవి. ॥49॥ అగ్నినేత్రమునుండి, నలుపురంగుగలవి పదిరకాల గలరుద్రాక్షలుత్పన్నములైనవి. ఈ విధముగా నుత్పత్తి భేదముచేత రుద్రాక్షలు నానారకాలుగా చెప్పఁబడివి॥50॥ సువర్ణ కాంతి గలవి. ఛిద్రములేనివి. అన్యులచే ధరించబడని రుద్రాక్షలు శ్రేష్ఠములైనవి. శివపూజనిరతుడైన వీరశైవుడు ఇట్టిరుద్రాక్షలనే ధరించవలెను ॥51॥ స్థానానుగుణ్యముగా, ముఖానుగుణ్యముగా, సంబంధాను గుణ్యముగా శాస్త్ర విధిఅను సారముగాను రుద్రాక్షధారణమును శివ సాయుజ్య సిద్ధి కొరకు చెప్పుచున్నాను ॥52॥ జ్ఞాని, ఒక ముఖమున్న ఒకే రుద్రాక్షను శిఖయందు ధరించవలెను. రెండు మూఁడు పంద్రెండు ముఖములుగల మూడు రుద్రాక్షలను మస్తకము (శిరస్సు)నందు దాల్చవలెను ॥53॥ అథవా పదకొండు ముఖములున్నవి 36 రుద్రాక్షలను మస్తకమునందు ధరించవలెను. పది-ఏడు-ఐదు ముఖములున్నవి. ఆరారు రుద్రాక్షలను రెండు చెవులకు ధరించవలెను. ప్రతి యొక్క ముఖములున్నవి. రెండేసి రుద్రాక్షలుండవలెను ॥54॥ ఆరు మరియు ఎనిమిది ముఖములున్న ముప్పది రెండు (32) రుద్రాక్షలను (ఆరుముఖములున్నవి మరియు ముఖములున్నవి) 16+16 కంఠమున ధరించవలెను నాలుగు ముఖములున్న

రుద్రాక్షలను ఎదపై ధరించవలె. ॥55॥ పదిమూడు ముఖము లున్నవి 16+16 రుద్రాక్షలను రెండు బాహులయందు దరించవలెను, తొమ్మిది ముఖములున్న పండ్రెండు (12) పండ్రెండు రుద్రాక్షలను రెండు చేతులకు ధరించవలెను. ॥56॥ పదినాల్గు (14) ముఖములున్న నూటా యెనిమిది (108) రుద్రాక్షలను యజ్ఞోపవీతముగా ధరించవలెను. ఈ రీతిగా శివపూజను జేయునాతడు ఎల్ల కాలములందును విధిననుసరించి సర్వస్థానము లందును రుద్రాక్షలను ధరించవలెను. ॥57॥ ఈ విధముగ ఎవడైతే సర్వకాలములయందును రుద్రాక్షలను ధరించునో నాతడు మూర్ఖుడైయున్నను అతనిని పాపములు స్పృశింపవు. ॥58॥ బ్రహ్మహత్యను గావించిన వాడైనను మద్యపానం జేసినవాడైనను, సువర్ణమును దొంగలించిన వాడైనను, గురుతల్ప గామియైనను మాతృహత్య-పితృహత్య భ్రూణహత్యలను గావించిన వాడైనను. కృతఘ్నుడైనను రుద్రాక్షలను ధరించినంత మాత్రమున వీరందరు సమస్త పాపములనుండిముక్తులగుదురు ॥58-59॥ ఈ లోకమునందున్న జనులు రుద్రాక్షల దర్శన-స్పర్శన-స్మరణ -పూజన-ధారణాదులతో సర్వ పాపములనుండి దూరమగుదురు ॥60॥ అగ్రవర్ణుడే (బ్రాహ్మణుడే) కానిమ్ము, అంత్యజుడే (అంటరానివాడే శూద్రుడే) కానిమ్ము, మూర్ఖుడేగాని పండితుడే గాని, రుద్రాక్షలను ధరించుట చేత సమస్త పాపములనుండి విముక్తుడగును ॥61॥ ఈ లోకమున కోటి గోవులను దానమొనర్చుట వలన ఎట్టి ఫలము లభించునో ప్రతిదినమున రుద్రాక్షలను ధరించుట వలన మానవుడట్టి ఫలమును బొందును ॥62॥ ఎవడైతే మరణ సమయమున పరమేశ్వరుని స్మరిస్తు జలమున రుద్రాక్షను రాపిడి (రాచి) జేసి ఆ నీరును త్రాగునో అటువంటి వాడురుద్రలోకమును బడయును ॥63॥ ఏమహాత్ములు, సర్వావయవములలో భస్మమును దాల్చి రుద్రాక్షమాలికలను ధరింతురో వారు సాక్షాత్తుగా రుద్రలేయగుదురు ఈ విషయములో ఎట్టి సందేహములేదు ॥64॥ ఎల్లప్పుడు ద్విజుడు బ్రాహ్మణుడు ఈ విధముగ నిత్య కర్మలను నైమిత్తిక కర్మలను ఎల్లప్పుడు చేయువాడైనను భస్మరుద్రాక్షలను ధరింపమిఅట్టి వాడికి ఫలప్రాప్తికానేరదు ॥65॥ సదాచార పరాయణులు వర్ణాశ్రమ ధర్మసంయుతులు ఐన వారిలో విభూతిరుద్రాక్షలను ధరించిన వాడే శ్రేష్ఠుడు. ఈ లోకమున శ్రుతిస్మృతులలోశ్లాఘనీయుడగును ॥66॥

*ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ భక్త స్థలే*
*భస్మరుద్రాక్ష ధారణ స్థల ప్రసంగోనామ*
*సప్తమపరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణిలో భస్మరుద్రాక్షధారణస్థల విచారాత్మకమగు ఏడవ పరిచ్ఛేదము పరిసమాప్తము

# శ్రీ సిద్ధాంత శిఖామణి

## అష్టమ పరిచ్ఛేదః

## అష్టమ పరిచ్ఛేదము

### 8. పంచాక్షర జపస్థలం

ధృతశ్రీభూతి రుద్రాక్షః - ప్రయతో లింగధారకః
జపేత్పంచాక్షరీ విద్యాం-శివతత్త్వప్రబోధినీం ॥ 1 ॥

శివతత్త్వాత్పరంనాస్తి- యథాతత్త్వాంతరం మహత్!
తథాపంచాక్షరీమంత్రాన్నాస్తి మంత్రాంతరంమహత్ ॥ 2 ॥

జ్ఞాతే పంచాక్షరీ మంత్రే- కిం వా మంత్రాంతరైఃఫలం
జ్ఞాతే శివే జగన్మూలే - కిం ఫలం దేవతాంతరైః ॥ 3 ॥

సప్తకోటిషు మంత్రేషు-మంత్రః పంచాక్షరో మహాన్
బ్రహ్మవిష్ణ్వాది దేవేషు - యథా శంభుర్మహత్తరః ॥ 4 ॥

అశేష జగతాంహేతుః-పరమాత్మా మహేశ్వరః
తస్య వాచకమంత్రోకయం-సర్వమంత్రైకకారణం ॥ 5 ॥

తస్యాభిధానమంత్రోక యమభిధేయశ్చ స స్మృతః
అభిధా నాభిధే యత్వాన్మంత్రాత్ సిద్ధః పరశ్శివః ॥ 6 ॥

నమశ్శబ్దం వదేత్పూర్వం -శివాయేతి తతః పరం
మంత్రంః పంచాక్షరో హ్యేష- సర్వశ్రుతి-శిరోగతః ॥ 7 ॥

ఆదితః పరిశుద్ధత్వాన్మలత్రయ వియోగతః
శివ ఇత్యుచ్యతే శంభుశ్చిదానందఘనః ప్రభుః ॥ 8 ॥

ఆస్పదత్వాద శేషాణాం మంగలానాం విశేషతః
శివశబ్దాభిధేయో హి దేవదేవ స్త్రియంబకః ॥ 9 ॥

శివ ఇత్యక్షరద్వంద్వం పరబ్రహ్మ ప్రకాశకం
ముఖ్యవృత్యాతదన్యేషాం శబ్దానాంగౌణవృత్తయః ॥ 10 ॥

తస్మాన్ముఖ్యతరం నామ శివ ఇత్యక్షరద్వయం
సచ్చిదానంద రూపస్య శంభోరమిత తేజసః ॥ 11 ॥

ఏతన్నా మావలంబేన మంత్రః పంచాక్షరః స్మృతః
యస్మాదతః సదా జప్యోమోక్షకాంక్షిభిరాదరాత్ ॥ 12 ॥

యథాన నాదిర్మహాదేవః సిద్ధః సంసారమోచకః
తథా పంచాక్షరో మంత్రః సంసారక్షయకారకః ॥ 13 ॥

పంచభూతాని సర్వాణి పంచతన్మాత్రకాణి చ
జ్ఞానేంద్రియాణి పంచాపి పంచకర్మేంద్రియాణిచ ॥ 14 ॥

పంచ బ్రహ్మాణి పంచాపి కృత్యాని సహకారణైః
బోధ్యాని పంచభిర్వర్ణైః పంచాక్షర మహామనోః ॥ 15 ॥

పంచధా పంచధా యాని ప్రసిద్ధాని విశేషతః
తాని సర్వాణి వస్తూని పంచాక్షరమయాని హి ॥ 16 ॥

ఓంకారపూర్వో మంత్రోఽయం పంచాక్షరమయఃపరః
శైవాగమేషు వేదేషు షడక్షర ఇతి స్మృతః ॥ 17 ॥

మంత్ర స్యాస్యాది భూతేన ప్రణవేన మహామనోః
ప్రబోధ్యతే మహాదేవః కేవలశ్చిత్సుఖాత్మకః ॥ 18 ॥

ప్రణవే నైకవర్ణేన పరబ్రహ్మ ప్రకాశ్యతే
అద్వితీయం పరానందం శివాఖ్యం నిష్ప్రపంచకం ॥ 19 ॥

పరమాత్మమనుర్ జ్ఞేయః సోఽహంరూపః సనాతనః
జాయతే సహయోర్లోపాదోమిత్యేకాక్షరో మనుః ॥ 20 ॥

ప్రణవే నైవ మంత్రేణ బోధ్యతే నిష్కలః శివః
పంచాక్షరేణ మంత్రేణ పంచబ్రహ్మతనుస్తథా ॥ 21 ॥

నిష్కలః సంవిదాకారః సకలో విశ్వమూర్తి కః
ఉభయాత్మా శివో మంత్రే షడక్షరమయేస్థితః ॥ 22 ॥

మూలం విద్యా శివః శైవసూత్రం పంచాక్షర స్తథా
ఏతాని నామధేయాని కీర్తితాని మహామనోః ॥ 23 ॥

పంచాక్షరీమిమాం విద్యాం ప్రణవేన షడక్షరీం
జపేత్ సమాహితో భూత్వా శివపూజాపరాయణః ॥ 24 ॥

ప్రాణాయామత్రయం కృత్వా ప్రాఙ్ముఖోదఙ్ముఖోన పివా
చింతయన్ హృదయాంభోజే దేవదేవం త్రిలోచనం ॥ 25 ॥

సర్వాలంకార సంయుక్తం సాంబం చంద్రార్ధ శేఖరం
జపేదేతం మహావిద్యాం శివరూపామనన్యధీః
జపస్త్రివిధః ప్రోక్తో వాచికోపాంశుమానసః ॥ 26 ॥

శ్రూయతే యస్తు పార్శ్వ స్థైర్యథావర్ణ సమన్వయః
వాచికః సతు విజ్ఞేయః సర్వ పాపప్రభంజనః ॥ 27 ॥

ఈషత్ స్పృష్టాఽ ధర పుటం యో మందమభిధీయతే
పార్శ్వస్థైర శ్రుతః సోన్యముపాంశుః పరికీర్తితః ॥ 28 ॥

అస్పృష్టాఽ ధరమస్పంది జిహ్వాగ్రంయోఽంతరాత్మనా
భావ్యతే వర్ణరూపేణ స మానస ఇతి స్మృతః ॥ 29 ॥

యావంతః కర్మయజ్ఞాద్యా ప్రవదానతపాంసిచ
సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీం ॥ 30 ॥

మాహాత్మ్యం వాచిక స్యైతజ్జపయజ్ఞస్య కీర్తితం
తస్మాచ్ఛతగుణోపాంశుః సహస్రో మానసః స్మృతః ॥ 31 ॥

వాచికాత్త దుపాంశోశ్చ జపాదస్య మహామనోః
మానసా హి జపః శ్రేష్ఠో ఘోర సంసార నాశకః ॥ 32 ॥

ఏతేష్వేకేన విధినా యథాభావం యథాక్రమం
జపేత్పంచాక్షరీమేతాం విద్యాం పాశవిముక్తయే ॥ 33 ॥

అనేన మూలమంత్రేణ శివలింగం ప్రపూజయేత్
నిత్యం నియమసంపన్నః ప్రయతాత్మా శివాత్మకః ॥ 34 ॥

భక్త్యా పంచాక్షరేణైవ యః శివం సకృదర్చయేత్
సోఽపి గచ్ఛేచ్ఛివస్థాం మంత్రస్యాస్యైవ గౌరవాత్ ॥ 35 ॥

అబ్భక్షా వాయుభక్షాశ్చయే చాన్యే వ్రతకర్శితాః
తేషామేతైర్వ్రతైర్నాస్తి శివలోక సమాగమః ॥ 36 ॥

తస్మాత్తపాంసి యజ్ఞాశ్చ వ్రతాని నియమాస్తథా
పంచాక్షరార్చన స్యైతే కోట్యం శేనాపినో సమాః ॥ 37 ॥

అశుద్ధో వా విశుద్ధోవా సకృత్పం చాక్షరేణ యః
పూజయేత్పతితో వాపి ముచ్యతే నాత్ర సంశయః ॥ 38 ॥

సకృదుచ్చారమాత్రేణ పంచాక్షర మహామనోః
సర్వేషామపి జంతూనాం సర్వపాపక్ష యో భవేత్ ॥ 39 ॥

అన్యేపి బహవో మంత్రా విద్యంతే సకలాగమే
భూయో భూయః సమభ్యాసాత్ పురుషార్థ ప్రదాయినః ॥ 40 ॥

ఏషమంత్రో మహాశక్తి రీశ్వరప్రతిపాదకః
సకృదుచ్చారణా దేవ సర్వసిద్ధి ప్రదాయకః ॥ 41 ॥

పంచాక్షరీం సముచ్చార్య పుష్పం లింగే వినిక్షిపేత్
యస్తస్య వాజపేయానాం సహస్రఫలమిష్యతే ॥ 42 ॥

అగ్ని హోత్రం త్రయో వేదాయజ్ఞాశ్చ బహుదక్షిణాః
పంచాక్షరజపస్యైతే కోట్యం శేనాపి నో సమాః ॥ 43 ॥

పురా సానంద యోగీంద్రః శివజ్ఞాన పరాయణః
పంచాక్షరం సముచ్చార్య నారకానుదతారయత్ ॥ 44 ॥

సిద్ధ్యా పంచాక్షరస్యాస్య శతానందః పురామునిః
నరకం స్వర్గమకరోత్ సంగిరస్యాపి పాపినః ॥ 45 ॥

ఉపమన్యుః పురా యోగీ మంత్రేణా నేన సిద్ధిమాన్
లబ్ధవాన్ పరమేశానాచ్ఛైవశాస్త్ర ప్రవక్తృతాం ॥ 46 ॥

వసిష్ఠ వామదేవాద్యా మునయో ముక్త కిల్బిషాః
మంత్రేణా నేన సంసిద్ధా మహాతేజస్వినోన భవన్ ॥ 47 ॥

బ్రహ్మాదీనాం చ దేవానం జగత్సృష్ట్యాదికర్మణి
మంత్రస్యాస్యైవమాహాత్మ్యాత్ సామర్థ్య ముపజాయతే ॥ 48 ॥

కిమిహ బహుభిరుక్తైర్మంత్రమేనం మహాత్మా
ప్రణవసహితమాదౌ యస్తు పంచాక్షరాఖ్యం
జపతి పరమభక్త్యా పూజయన్ దేవదేవం
సగతదురితబంధో మోక్షలక్ష్మీం ప్రయాతి ॥ 49 ॥

భస్మరుద్రాక్ష ధారియైనవాడు పరిశుద్ధుడు ఐన వీరశైవుడు శ్రీ రుద్ర ప్రసిద్ధమైన పంచాక్షరీ మంత్రమును జపించవలెను శివ తత్త్వమునకంటెను శ్రేష్ఠమైనదివేరొండు యద్విధముగలేదో, అదే విధముగ పంచాక్షరీ మంత్రమునకంటెను శ్రేష్ఠమైన మంత్రము వేరొండులేదు సకల మంత్రములకు మాతృభూతమైన పంచాక్షరీ మంత్రము యొక్క సమగ్ర స్వరూపము దెలియుటకు అన్యమంత్రములతో బ్రయోజనముండదు. సకల చరాచరాత్మకమగు జగత్కారణీభూతుడగు శివుని సమగ్ర స్వరూపమును దెల్సికొనుటకు విష్ణ్వాది దేవతల చేతనేమి ప్రయోజనము? ఈ ప్రపంచమున పంచాక్షరీ మంత్రమున కంటెను శ్రేష్ఠమగు మంత్రమేదియు లేదని భావము బ్రహ్మ విష్ణు మొదలగు ముప్పదిమూడు కోట్ల దేవతలలో శివుడే ఏ విధముగ శ్రేష్ఠుడై యున్నాడో అదే రీతిగ ఏడు కోట్ల మంత్రములలో పంచాక్షరీ మంత్రము శ్రేష్ఠమై యొప్పుచున్నది. శివపరమాత్ముడు సమస్త జగత్తులయొక్క ఉత్పత్తి స్థితి-లయములకు గారణ భూతుడై యున్నాడు. అట్టి శివుని పేరుగల ఈ మంత్రము సర్వ మంత్రములకు మూలకారణమై యున్నది. ఈ పంచాక్షరీ మహామంత్రము పరమ శివుని యొక్క అభిధానము (పేరు) మంత్రమై యున్నది. శివుడే అభిధేయుడైయున్నాడు. ఆ పరమ శివునకు ఈ మహామంత్రమునకు వాచ్య వాచకసంబంధముంటచేత ఈ మహామంత్రమునుండి శివుడు ప్రకాశిత మగును సాక్షాత్కారుడగును. అర్థాత్ శివస్వరూపమంతము ఈ మహామంత్రము నందు లీనమైయున్నది ॥6॥ నమః అను శబ్దమును మొదట ఉచ్చరించాలి. ఆ తరువాత శివాయ, అను శబ్దమును ఉచ్చరించాలి. ఇదే పంచాక్షరీ మంత్రముగా పరిగణింపబడుచున్నది. ఈ మహామంత్రము సమస్త ఉపనిషత్తులలోను ప్రతిపాదింపబడినది ॥7॥ సచ్చిదానంద స్వరూపుడు స్వతంత్రుడు ఐన

శంభు శివుడు ఆదినుండి, అణవమల మయామల కార్మికమలములను మూడు మలములయొక్క సంబంధము చేత దూరముగా నుంటవలన పరిశుభ్రము (నిర్మల)గా నుంటవలన శివుడని పేర్కొననగును. బ్రహ్మ-విష్ణు-మున్నగు సమస్త దేవతల కును విశేషముగా ఆశ్రయభూతుడైయుంటవలన శివ శబ్దము మంగళార్థకమగా ప్రతిపాదింపఁ బడినందున "శివ" శబ్ద వాచకమై యున్నాడు ॥9॥ శివ అను రెండక్షరములు ముఖ్యముగా పరబ్రహ్మ ప్రకాశమై యొప్పుచున్నవి. ఈ శివ శబ్దమునకు భిన్నమగు, విరూపాక్ష- చంద్రశేఖర- మొదలైన పేర్లు (శబ్దములు) వారివారి గుణ ప్రభేదములననుసరించి ప్రకాశింపఁబడుచున్నది ॥10॥ అందువలన "శివ" యను నీ శబ్దము సచ్చిదానంద స్వరూపుడైన, అపరిమిత తేజశ్శాలియగు పరమేశ్వరుని ముఖ్యనామమై యున్నది ॥11॥ ఈ నామావలంబనం చేతనే పంచాక్షరీ మంత్రము మహామంత్రముగా చెప్పబడుచున్నది. ఆ కారణముచేత మోక్షాపేక్షులైన వారు ఈ మంత్రమును గౌరవముతో (పూజ్యభావంతో)నెల్లప్పుడు జపించవలెను. ॥12॥ అనాదియగు మహాదేవుడు ఎట్లుగా సంసార పాశవిమోచకుడని ప్రసిద్ధుడుగా చెప్పబడుచున్నాడో అట్లే ఈ పంచాక్షరీ మహామంత్రము సంసారపాశ వినాశకమై యున్నది ॥13॥ పృథ్వి-అప్-తేజ-వాయు ఆకాశములు అను పంచమహా భూతములు గంధ-రస-స్పర్శ-రూప - శబ్దములను పంచతన్మాత్రలు 1.కన్ను, 2. చెవి 3.ముక్కు 4.నాలుక 5. చర్మములను పంచజ్ఞానేంద్రియములు 1. వాక్ 2. పాణి 3. పాద 4. గుద (పాయు) 5. గుహ్య(ఉపస్థ)ములను కర్మేంద్రియములు 1. సద్యోజాత 2.వామదేవ 3. అఘోర 4.తత్పురుష 5. ఈశాన అను పంచబ్రహ్మలు. 1. సృష్టి 2. స్థితి 3.లయము 4.తిరోధానము 5. అనుగ్రహములను పంచ కృత్యములు ఇదే మాదిరిగా అయిదింటిని ప్రతిపాదించునట్టివి అన్నియు పంచాక్షరీ మంత్రమునందుండెడు ఐదు అక్షరములచేత ప్రకాశింపబడినవి. ఏవస్తువులైతే పంచ (ఐదైదు) అని విశేషముగా ప్రసిద్ధి గాంచినవో అవన్నియు పంచాక్షర స్వరూపములైయున్నవి. ॥14-15-16॥ ఓం కారమె ఆది యందున్న సర్వోత్కృష్ట శ్రేష్ఠమైన ఈ పంచాక్షరీ మంత్రము. వేదములందును శివాగములందును షడ్యక్షరమంత్రమని చెప్పబడినది ॥17॥ ఈ పంచాక్షరీ మహా మంత్రమునకు ఆది కారణమైన ఓంకార, ప్రణవము చేత సచ్చిదానంద స్వరూపుడగు పరమ శివుడు ప్రకాశింపబడును.

నకారస్తార కాకారో-మకారో దండ ఉచ్యతే!
శికారః కుండలాకారో-వకారశ్చార్థ చంద్రకః
యకారోదర్పణాకార- ఓంకారః పంచవర్ణరాట్!!



అనుశివాగమ ప్రమాణానుసారముగా ఓం కారము పంచాక్షర కల్పవృక్షమునకు బీజరూప ముగా నున్నది ॥18॥ "ఏకమేవాద్వితీయం, అను శ్రుతివాక్యాను సారముగా అద్వితీయమైనది "ఆనందంబ్రహ్మేతి వ్యజానీత్" అను శ్రుతి వాక్యాను సారముగా ఆనంద స్వరూపమైనది నేహనానాస్తి కించన,, అను శ్రుతి వాక్యానుసారముగా హేయమగు ప్రపంచము శూన్యమైనది అగుట వలన శివనామ కమగుపరబ్రహ్మము ఓంకారమను ఒక వర్ణము వలననే ప్రకాశింపఁబడును ॥19॥ సనాతనమగు పరశివ మంత్రము సోకహం స్వరూపమైనదనియు దెలియవలెను. సకారము చంద్ర బీజమై యున్నది "హకారము సూర్యబీజమై యున్నది. "సోహం" పదమునందున్న "సకార" "హ" కారములు కుంభకమునందు లుప్త (లోప) మగుట వలన అను ఏకాక్షరమంత్రము ఉత్పత్తి యగును ॥20॥ ఓం కార మంత్రమునుండి నిష్కలశివుడు బోధించబడును. పంచాక్షర మంత్రమునుండి పంచ బ్రహ్మరూపుడైన శివుడు బోధించబడును, నిష్కల శివుడు, శుద్ధజ్ఞానస్వరూపుడై యున్నాడు. సకల శివుడు ప్రపంచ స్వరూపుడై యున్నాడు. ఈ విధముగా ఉభయ స్వరూపుడై యున్న శివుడు "ఓం నమః శివాయ" అను షడక్షరమంత్రమున లీనమై యున్నాడు.॥21-22॥ఈ మహామంత్రమునకు మూల, విద్యా-శివ-శైప-సూత్ర-పంచాక్షరములనునవి పర్యాయనామములు సుప్రసిద్ధమై యున్నవి ॥23॥ ప్రణవ సహితమగు ఈ పంచాక్షర మంత్రమును అర్థాత్ షడక్షర మహా మంత్రమును శివపూజాపరాయణుడైన వాడు వీరశైవుడు ఏకాగ్ర చిత్తముగలవాడై సదాజపించవలెను. ॥24॥ శివపూజకుడు పూర్వాభిముఖ గలిగిగాని ఉత్తరాభిముఖము గలిగి గాని, దర్భాసనము లేదా కంబలాసనముపైనగాని కూర్చుండి పూరక-కుంభక-రేచక-ప్రాణాయామముల నాచరించి తన హృదయకమలమున సర్వాభరణ భూషితుడు చంద్రధారి దేవాధిదేవుడు ఐన పరమశివుని ధ్యానిస్తు ఏకాగ్రచిత్తము గలవాడై శివస్వరూపమగు ఈ షడక్షరీమహామంత్రమును జపించవలెను, ఈ జపము -వాచికము-ఉపాంశు-మానసికమని మూడు విధములుగా చెప్పబడినది. ॥25-26॥

తన చుట్టుపట్ల (పరిసరాల)లోనున్న జనులు వర్ణ వ్యత్యాసము లేకుండ యే మంత్రజపముననుష్ఠింతురో (ఉచ్చరింతురో) అదివాచిక జపమనబడును. ఈ జపము సమస్త పాపనాశకమై యున్నది.॥27॥ పెదిమలను కొద్దిగ కదిలిస్తు, సమీపంలో జనులకు వినబడకుండ సూక్ష్మము(మెల్లగా)గా ఏ జపము జేయబడుతుందో అది ఉపాంశు జపమన బడును. ॥28॥ పెదిమలను నాలుకను గదల్చకుండా పంచాక్షరీ రూపమైన మంత్రమును మనస్సు నుండి యే జపము జేయబడుతుందో అది మానసిక జపమనబడును. ఇట్టి

మూడురకములైన జపములు సగర్భ జపములై యుండవలెను. మంత్రార్థమును బాగుగాతెలసికొని జపించునదే సగర్భ జపమనబడును ॥29॥లోకమున జ్యోతిష్ఠోమాది యజ్ఞములు ఎన్ని యున్నవో వ్రతము -దానము తపస్సు మున్నగునవి ఎన్ని గలవో అవన్నియు ఈ జపయజ్ఞమున పదునారవ అంశము గూడ సరితూగవు ॥30॥ ఈ మహత్వము వాచిక యజ్ఞమునకు జెప్పబడినది. దీని కంటెను ఉపాంశు జపము యొక్క మహత్వమునూరుపాలు అధికమైనది. ॥31॥ ఇట్టి మహామంత్రము యొక్క వాచకము మరియు ఉపాంశుజపముల కంటెను మానసిక జపము శ్రేష్ఠమైనదేగాకుండ ఘోర సంసార దుఃఖనాశకమై యున్నది ॥32॥ ఈ మూడు రకములైన జపములలో శ్రేష్ఠమగునొకవిధియను సారముగ క్రమము దప్పకుండ ఏకాగ్ర చిత్తముతో పాపనాశనమునకై పంచాక్షరీ మహామంత్రమును జపించవలెను.

॥అసంపూజ్య శివంస్తోత్రజపాత్ఫల ముదీరితం!
సంపూజ్య చ శివం పశ్చాత్ ఫలం వక్తుంన శక్యతే!
సహస్రంవాతదర్ధంవా తదర్ధం వా శతాష్టకం!
అష్టోత్తర సహస్రంవా జపం కుర్యాదతంద్రధీః
పూజాకోటి సమం స్తో త్రంస్తోత్ర కోటి సమోజపః
జపకోటి సమం ధ్యానం - ధ్యానకోటి సమోలయః

ఇత్యాది శివాగమ వచన ప్రమాణాను సారముగా శివపూజముగించిన తరువాత పంచాక్షరీ మంత్ర జపమును జేయుట సర్వోత్తమమైనదని సిద్ధాంతీకరించుట వలన శివార్చకుడు తన పూజముగియగానే శాంతమగు మనస్సుచేత నీ మహామంత్రమును ఒక వెయ్యి నూటాయెనిమిది మారులు అథవా రెండు వందలయేబది, అథవా నూటాయెనమిది సార్లు జపించాలి ॥33॥ శివపూజా వ్రతనిష్ఠుడు, శుద్ధాత్ముడు, శివస్వరూపుడైన శివపూజకుడు ప్రతినిత్యము ఈ మూలపంచాక్షరీ (షడక్షర) మంత్రముచేతనే శివలింగమును పూజింపఁదగును ॥36॥ ఎవడైతె భక్తి పూర్వకముగా పంచాక్షరీ మంత్రముతో శివుని బూజించునో వాఁడు ఈ మహామంత్రము యొక్క మహిమ వలన శివలోకము ను బొందును ॥35॥

ఎవరు జలాహరులో, ఎవరు ఫలాహరులో, వాయుఆహారులో, ఎవరు చాంద్రాయణాది వ్రతనిష్ఠులో, వారి కాయావ్రతములనుండీ శివలోకప్రాప్తి గలుగనేరదు॥37॥ అందుచేత తపస్సు -యజ్ఞము వ్రతము -నియమము, మున్నగునవి పంచాక్షరమంత్రజపమునకు ఒకకోటి యంశమునకు సాటిరావు ॥36॥ అశుద్ధుడేగా నిండు, శుద్ధుడేగానిండు,

పాపిష్ఠుడేగానిమ్ము, ఎవడైతె ఒకసారి పంచాక్షరీ మంత్రముతో శివుడిని బూజించునో, వాడు భవబంధమునుండి విడుదల బొందును. ఈ విషయమున ఏలాంటి సంశయములేదు ॥38॥ పంచాక్షరీ మహామంత్రమును ఒకసారిఉచ్చరించుట వలన అన్ని రకాల సమస్త ప్రాణుల పాపములు నశించును ॥39॥ అనేకాగములలో వేర్వేరు అనేక మంత్రములున్నవి, అట్టి మంత్రములు విశేషముగ అనేక సార్లు పునఃపునఃపఠించుటవలన ప్రతిఫలము నిచ్చుచున్నవి ॥40॥ ఈ మహామంత్రము మహాసామర్థ్యము గలదేగాకుండ ఈశ్వర స్వరూపమును ప్రతిపాదించునదై యున్నది. ఈ మహామంత్రము తనను ఒకసారి యుచ్చరించినంతమాత్రమున సమస్త సిద్ధులను ఫలింపఁజేయును ॥41॥ ఎవడైతె పంచాక్షరీ మంత్రమును ఉచ్చరించి శివలింగమునకు పుష్పమును నమర్పించునో అట్టి వాడికివేయివాజపేయి యజ్ఞములను చేసిన ఫలములభించును. ॥42॥ అగ్ని హోత్రము ఋగ్యజుసామవేదములు, జ్యోతిష్టోమాదియజ్ఞములు, షోడశదానరూపమగు బహు దక్షిణలు ఇవన్నియు ఈ పంచాక్షరీ జపమునకు ఒక కోట్యాంశమునకంటేను సమానమైనవిగా జాలవు. ॥43॥ శివజ్ఞానపరాయణుండైన సానందయోగి పుంగవుడు పూర్వకాలమున పంచాక్షరీ మంత్రంపఠించి, నరకమున బడికొట్టుమిట్టాడుచున్న పాపులను ఉద్ధరించియున్నాడు ॥44॥ పూర్వకాలమున, శతానందుడనే పేరుగలముని పుంగవుడు ఈ పంచాక్షరీ మంత్రసిద్ధిచేత నంగిర నామకుడైన పాపికొరకు నరకలోకమును స్వర్గలోకముగా మార్చెను. ॥45॥ ప్రాచీన కాలమున ఉపమన్యుమునీశ్వరుడు గూడ ఈ మహామంత్రసిద్ధిగలవాడై శివునిచేత శివశాస్త్రాచార్యత్వమును బొందెను. ॥46॥ వశిష్ట-వామ-దేవ-మొదలగు మహర్షులు ఈ పంచాక్షరమహామంత్రము చేత పవిత్రాత్ములు, మహాతేజశ్శాలురు, సిద్ధపురుషులుఐరి. ॥47॥ బ్రహ్మ-విష్ణు-మున్నగు దేవతలకు జగత్తులో సృష్టి-స్థితి మొదలగు కార్యములలో ఈ మంత్రము ప్రభావము వలన సామర్థ్యము జేకూరును ॥48॥ పలుమాటలతో బనేమి? ఏ మహాత్ముడు దేవాధి దేవుడైన సదాశివుని బూజించు వాడై ప్రప్రథమమున ప్రణవము (ఓం కారము)తో గూడిన ఈ పంచాక్షరీ మంత్రమును అసాధారణమైన భక్తితో జపించునో అతడు పాపరూపమైన పాశము నుండి విడుపఁబడి విముక్తుడై మోక్షలక్ష్మిని బొందును ॥49॥

ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ
పంచాక్షర జపస్థల ప్రసంగోనామ
అష్టమ పరిచ్ఛేదః పరిసమాప్తః

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణిలో పంచాక్షరి జపస్థల
విచారాత్మకమగు ఎనమిదవ పరిచ్ఛేదము
పరిసమాప్తము.

# శ్రీ సిద్ధాంత శిఖామణి

## నవమ పరిచ్ఛేదః

## నవమ పరిచ్ఛేదం

### 9. భక్తమార్గక్రియాస్థలం

॥శ్లో॥ భూతిరుద్రాక్ష సంయుక్తో లింగధారీ సదా శుచిః
పంచాక్షర జపోద్యోగీ శివభక్త ఇతి స్మృతః ॥ 1 ॥

శ్రవణం కీర్తనం శంభోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం ॥ 2 ॥

ఏవం నవ విధా భక్తిః ప్రోక్తా దేవేన శంభునా
దుర్లభా పాపినాం లోకే సులభా పుణ్యకర్మణాం ॥ 3 ॥

అధమే చోత్తమే వాపి యత్ర కుత్ర చి దూర్జితా
వర్త తే శాంకరీ భక్తి ః స భక్త ఇతి గీయతే ॥ 4 ॥

భక్తిః స్థిరీకృతా యస్మిన్ మ్లేచ్ఛే వాద్విజసత్త మే
శంభోః ప్రియః న విప్రశ్చ న ప్రియో భక్తి వర్జితః ॥ 5 ॥

సా భక్తిర్ద్వి విధా జ్ఞేయా బాహ్యాభ్యంతర భేదతః
బాహ్యే స్థూలాంతరా సూక్ష్మా వీరమాహేశ్వరాదృతా ॥ 6 ॥

సింహాసనే శుద్ధదేశే సురమ్యే రత్న చిత్రితే
శివలింగస్య పూజా యా సా బాహ్యే భక్తి రుచ్యతే ॥ 7 ॥

లింగే ప్రాణం సమాధాయ ప్రాణే లింగం తు శాంభవం
స్వస్థం మనస్తథా కృత్వా న కించిచ్చింతయేద్యది ॥ 8 ॥

సాऽऽ భ్యంతరా భక్తిరితి ప్రోచ్యతే శివయోగిభిః
సా యస్మిన్ వర్తతే తస్య జీవనం భ్రష్టబీజవత్ ॥ 9 ॥

బహునాऽ త్రకిముక్తేనగుహ్యాద్గుహ్యాతరా పరా
శివభక్తిర్న సందేహస్తయా యుక్తో విముచ్యతే ॥ 10 ॥

ప్రసాదాదేవ సా భక్తిః ప్రసాదో భక్తి సంభవః
యథైవాంకురతో బీజం బీజతో వా యథాంకురః ॥ 11 ॥

ప్రసాద పూర్వికా యేయం భక్తిర్ముక్తి విధాయినీ
నైవ సా శక్యతే ప్రాప్తుం నరైరేకేన జన్మనా ॥ 12 ॥

అనేక జన్మ శుద్ధానాం శ్రౌతస్మార్తాను వర్తినాం
విరక్తానాం ప్రబుద్ధానాం ప్రసీదతి మహేశ్వరః ॥ 13 ॥

ప్రసన్నే సతిముక్త ః స్యాన్ముక్తః శివ సమో భవేత్
అల్పభావో2పి యో మర్త్యస్త స్య జన్మ త్రయాత్పరం
న యోని యంత్రపీడా వైభవేన్నైవాత్ర సంశయః ॥ 14 ॥

సాంగాన్యూనా చ యా సేవా సా భక్తరితి కథ్యతే
సా పునర్భిద్యతే త్రేధా మనోవాక్కాయ సాధనైః ॥ 15 ॥

శివరూపాదిచింతా యా సా సేవా మానసీ స్మృతా
జపాదిర్వాచికీ సేవా కర్మ పూజా చ కాయికీ ॥ 16 ॥

బాహ్యమాభ్యంతరం చైప బాహ్యాంభ్యంతర మేవ వా
మనోవాక్కాయ భేదైశ్చ త్రిధా తద్భజనం విదుః ॥ 17 ॥

అన్యాత్మ విదితం బాహ్యం శంభోరభ్యర్చ నాదికం
తదేవతు స్వసంవేద్య మాభ్యంతరముదాహృతం
మనో మహేశ ప్రవణం బాహ్యాభ్యంతరముచ్యతే ॥ 18 ॥

మనో మహేశ ధ్యానాఢ్యం నా న్యధ్యానరతం మనః
శివనామరతా వాణీ వాఙ్మతా చైప నేతరా ॥ 19 ॥

లింగైః శివస్య చోద్దిష్టైస్త్రిపుండ్రాదిభిరంకితః
శివోపచార నిరతః కాయః కాయో న చేతరం ॥ 20 ॥

పంచధా కథయతే సద్భిస్త దేవ భజనం పునః
తపః కర్మ జపో ధ్యానం జ్ఞానం చేత్యనుపూర్వకం ॥ 21 ॥

శివార్థే దేహ సంశోషస్తపః కృచ్ఛ్రాదినో మతం
శివార్చా కర్మ విజ్ఞేయంబాహ్యం యా గాదినోచ్యతే ॥ 22 ॥

జపః పంచాక్షారాభ్యాసః ప్రణవాభ్యాస ఎవ వా
రుద్రాధ్యాయాదికాభ్యాసో నవేదాధ్యయనాదికం ॥ 23 ॥

ధ్యానధ శివస్య రూపాదిచింతా నాత్మాది చింతనం
శివాగమార్థ విజ్ఞానం జ్ఞానం నాన్యార్థ వేదనం
ఇతి పంచ ప్రకారోऽయం శివయజ్ఞః ప్రకీర్తి తః ॥ 24 ॥

అనేన పంచయజ్ఞేన యః పూజాయతి శంకరం
భక్త్యా పరమయా యుక్తః స వై భక్త ఇతి స్మృతః ॥ 25 ॥

పూజనాచ్ఛివభక్త స్య పుణ్యాగతిరవాప్యతే
అవమానాన్మహాఘోరో నరకో నాత్ర సంశయః ॥ 26 ॥

శివభక్తో మహాతేజాః శివభక్తి పరాఙ్ముఖాన్
నస్పృశేన్నైవ వీక్షేత నతైః సహవసేత్ క్వచిత్ ॥ 27 ॥

యదా దీక్షప్రవేశః స్యాల్లింగ ధారణ పూర్వకం
తదా ప్రభృతి భక్తోన్ సౌ పూజయేత్ స్వాగమస్థితా ॥ 28 ॥

స్వమార్గాచారనిరతః స్వజాతీయా ద్విజాస్తు యే
తేషాం గృ హేషు భుంజీత నేతరేషాం కదాచన ॥ 29 ॥

స్వమార్గాచార విముఖైర్భవిభిః ప్రాకృతాత్మభిః
ప్రేషితం సకలం ద్రవ్య మాత్మలీనమపి త్యజేత్ ॥ 30 ॥

నార్చయేదన్య దేవాంస్తున స్మరేన్న చ కీర్తయేత్
న తన్నై వేద్యమశ్నీ యాచ్ఛివభక్తో దృఢవ్రతః ॥ 31 ॥

యద్గృహేష్వన్యదేవోऽస్తి తద్గృహాణి పరిత్యజేత్
నాన్యదేవార్చకాన్మర్త్యాऽ పూజాకాలే నిరీక్షయేత్ ॥ 32 ॥

సదా శివై కనిష్ఠానాంవీర శైవాధ్వవర్తినాం
నహి స్థావర లింగానాం నిర్మాల్యాద్యుపభుజ్యతే ॥ 33 ॥

యత్ర స్థావరలింగానా మపాయః పరివర్తతే
అథవా శివభక్తానాం శివలాంఛన ధారిణాం ॥ 34 ॥

తత్ర ప్రాణాన్ విహాయాపి పరిహారం సమాచరేత్
శివార్థం ముక్త జీవశ్చేచ్ఛివసాయుజ్యమాప్నుయాత్ ॥ 35 ॥

యత్ర చాచార నిందాస్తి కదాచిత్త త్రన వ్రజేత్
యద్గృహే శివనిందాస్తి తద్గృహం తు పరిత్యజేత్ ॥ 36 ॥

యః సర్వభూతాధిపతిం విశ్వేశానం వినిందతి
న తస్యనిష్కృతిః శక్యాకర్తుం వర్షశతైరపి ॥ 37 ॥

శివనిందాకరం దృష్ట్వాఘాతయేదథవా శపేత్
స్థానం వా తత్పరిత్యజ్య గచ్ఛేద్య ద్యక్షమో భవేత్ ॥ 38 ॥

శివపూజాపరోభూత్వా పూర్వకర్మవివర్జయేత్
అథవా పూర్వకర్మస్యాత్ సాపూజానిష్ఫలా భవేత్ ॥ 39 ॥

ఉత్తమాం వృత్తి మాశ్రిత్య్య నీచాం వృత్తిం సమాశ్రితః
ఆరూఢపతితో జ్ఞేయః సర్వకర్మ బహిష్కృతః ॥ 40 ॥

పంచాక్షరోపదేశీ యో నరస్తుతికరో యది
సోऽలింగీ స దురాచారీ కుకవిః స తు విశ్రుతః ॥ 41 ॥

చర్మపాత్రే జలం తైలం న గ్రాహ్యం భక్తి తత్పరైః
గృహ్యతే యది భక్తేన రౌరవం నరకం వ్రజేత్ ॥ 42 ॥

న తస్య సూతకం కించిత్ ప్రాణలింగాంగ సంగినః
జననోత్థంమృతోత్థం చ విద్యతే పరమార్థతః ॥ 43 ॥

లింగార్చనరతా యాశ్చ ఋతౌ నార్యాన సూతకం
తథా ప్రసూతికాయాశ్చ సూతకం నైవ విద్యతే ॥ 44 ॥

గృహే యస్మిన్ ప్రసూతా స్త్రీ సూతకం నాత్ర విద్యతే
శివపాదాంబుసంస్పర్శాత్ సర్వపాపం వినశ్యతి ॥ 45 ॥

శివస్థానాని తీర్థాని విశిష్టాని శివార్చకః
శివయాత్రోత్సవే నిత్యం సేవేత పరయా ముదా ॥ 46 ॥

శివక్షేత్రోత్సవమహాయాత్రా దర్శన కాంక్షిణాం
మార్గేకన్నపానదానం చ కుర్యాన్మాహేశ్వరో జనః ॥ 47 ॥

నాన్నతో యసమందానం న చామింసా పరం తపః
తస్మాన్మా హేశ్వరో నిత్యమన్నతో య ప్రదోభవేత్ ॥ 48 ॥

స్వమార్గాచారవర్తిభ్యః స్వజాతిభ్యః సదావ్రతీ
దద్యాత్తేభ్యః సమాదద్యాత్ కన్యాంకుల సముద్భవాం ॥ 49 ॥

భస్మరుద్రాక్ష ధారణ సంపన్నుడు, ఎల్లప్పుడు శుచియైనవాడు, పంచాక్షరీ మంత్రమున జపాసక్తుడుఐన లింగధారి శివభక్తుడని చెప్పబడును ॥1॥ శివకథను శ్రవణము జేయుట (వినుట) శివస్తోత్రము జేయుట, స్మరించుట, శివునిపాద పూజ చేయుట, నమస్క రించుట, అర్పించుట యందు భృత్యభావముతో నుండుట, శివునితో సఖ్యభావముతో నుండుట, శివునికై ఆత్మార్పణము గావించుట, ఈ విధముగా తొమ్మిది రకాల భక్తి శివుడితో చెప్పఁబడినది. ఇట్టి నవవిధ భక్తి లోకమున పాపులకు దుర్లభమైనది. పుణ్యాత్ములకు సులభమైనదిగా నున్నది ॥2-3॥అధముని యందే గాని, ఉత్తముని యందే గాని, అథవా ఎవని యందేగాని, శివభక్తి యున్నచో నాతడే నిజమైన శివ భక్తుడని చెప్పకొనును॥4॥ ఏ అస్పృశ్యుడే గాని. బ్రామ్మణుడే గానిమ్ము ఆతనిలో భక్తి దృఢపడినట్లైతే ఆతడు శివునికి ప్రీతి పాత్రుడగును. బ్రాహ్మణుడైనను భక్తి శూన్యుడైన యెడల శివానుగ్రహమునకు బాతృడుగాడు ॥5॥ ఆ భక్తిబాహ్యము - ఆంతరంగికమని రెండు భేదాలు. భాహ్యాభక్తి స్థూలభక్తియనియు, ఆంతరంగిక భక్తి సూక్ష్మభక్తి యనబడును. ఇట్టి సూక్ష్మభక్తి వీరమాహేశ్వరులకు అంగీకృతమై యొప్పచున్నది. ॥6॥ షట్ సమ్మార్జనములతో పరిశుద్ధము మనోహరము రత్నసంయుతముఐన లింగమును సింహాసనమునందుంచి బూజించునది బాహ్య భక్తియనబడును. ॥7॥ లింగము నందు ప్రాణమును ప్రాణమునందు లింగమును, సంబంధమొనర్చి మనస్సును శివేతర వృత్తి శూన్యముగా జేసి ఏదియు చింతింపబడకుండునో అదే ఆంతరంగభక్తి యననగును. శివయోగులు ఇట్లా దేశించిరి. అర్థాత్ ళింగాంగ సామరస్యమునందే మనస్సును స్థిరపరచ వలయుననను భావము. ఇక అంతరంగ భక్తియెవనియందుండునో ఆతని జన్మము కాల్చిన బీజము వలె పునర్జన్మరహితమగును ॥8-9॥ విశేషముగ చెప్పట వలన లాభమేమి? శివభక్తి శ్రేష్ఠమైనది అత్యంత గోప్యమైనదిగా నున్నది. ఇట్టి శివభక్తి చేత ప్రేరితుడైన వాడు ముక్తుడగును. ఈ విషయమున యేలాంటి సందేహములేదు ॥10॥ అంకురము నుండి బీజము ఎట్లు ఉత్పన్నమగునో, బీజమునుండి

అంకురము ఎట్లు ఉత్పన్నమగునో, అట్లే భక్తి శివాను గ్రహమునుండియుత్పత్తియగును॥11॥ శివానుగ్రహమునుండి యుత్పన్నమైన శివభక్తి ముక్తిని గలుగజేయును, అట్టి శివభక్తి మానవులచేత ఒకే జన్మమునందు బొందుటకు వలను పడదు ॥12॥ అనేక జన్మములలో జేయబడిన శివధ్యానము శివపూజాదులతో పరిశుద్ధులైన వారు, శ్రుతి స్మృత్యుక్తములైన నిత్యనైమిత్తికకర్మానుష్ఠాన తత్పరులు కామ్య కర్మములందు నిస్పృహలు నైన జ్ఞానులకు పరమేశ్వరుడు బ్రసన్నుడగును ॥13॥ పరమేశ్వరుడు ప్రసన్నుడుగా భక్తుడు ముక్తుడగును, ఆ ముక్తుడు శివరూపుడగును, ఏ మానవుడైనను, అల్పభక్తియున్నవాడు గూడా అతనికి మూడు జన్మములు గడిచిన బిదపయోనిజనన బాధగలుగనేరదు. ఈ విషయమున ఏలాంటి సందేహములేదు. ॥14॥ఏలాంటి పరిచర్యయైనను నవవిధాంగముల చేత గూడికొని యున్నదో అదే సంపూర్ణమైన భక్తియనఁబడును. తక్కువైనది అల్పభక్తి యనబడును ॥15॥ నవవిధాంగ సహితమైన భక్తి మనస్సు-వాక్-శరీరముల ద్వారా మూడు రకాలుగా నుండును. ఏ సేవ ఐతే శివలింగ స్వరూపాది చింతనగలదో అది మానసిక భక్తి యనబడును. శివ పంచాక్షరీ జపరూపమైన సేవ వాచికీ భక్తి యనబడును. శరీరమునుండి ఆచరించు భక్తి శివలింగపూజకాయికీభక్తి యనబడును.॥16॥ అట్టి సేవ మనస్సు- వాక్-శరీర భేదములనుండి "బాహ్య" "అభ్యంతర"-బాహ్యాభ్యంతర, అని మూఁడురకాలుగా విభజింప బడినది ॥17॥ ఇతరులకు గోచరింప జేయు శివపూజాది కర్మ బాహ్య సేవయనఁబడును. ఇతరులకు గోచరింప జేయని తనకు మాత్రమే గోచరింపజేయు శివపూజాది కర్మ అభ్యంతర సేవ యనబడును తన చిత్తము "శివలింగాసక్తమైనచో" బాహ్యాభ్యంతర సేవ యనబడును, తన మనస్సు శివధ్యానమునందు ఆసక్తమై యుండవలెను. అన్యదేవతాధ్యానమునందు ఆసక్తియున్నదైనది మనస్సుగాదు, వాణి శివనామోచ్చారమునందే ఆసక్తి గలదై యుండ వలెను, దేవతాంతరనామోచ్చారమునందు ఆసక్తిగలదై యుండిన అదివాణిగాదు, శాస్త్రోక్తమగు భస్మత్రిపుండ్రరుద్రాక్షలు శివలింగాది చిహ్నములతో గూడిన శరీరము శివ లింగపూజలో నిరతుడై యుండవలెను. అన్య దేవతా చిహ్నములతో గూడి అన్యదేవతా పూజలో నిరతమైనది శరీరముగానేరదు. అట్టి సేవ పునః తపస్సు -కర్మ-జపము-ధ్యానము-జ్ఞానము, అని ఐదు రకాలుగా చెప్పబడును ॥21॥ శివుని విషయమున శరీర శోషణమే తపస్సుగా కృచ్ఛాంద్రాయ ణాదివ్రతములనుండగలిగే శరీర శోషణము తపస్సుగాదు. శివపూజ జేయునదే కర్మగాక, కష్టసాధ్యమగు జ్యోతిష్టోమాది బాహ్య యాగములు వీరశైవులాచరించదగినవి కావు. పంచాక్షరీ మంత్రాభ్యాసముగాని, ఓంకారాభ్యాసముగాని, అథవా శ్రీ రుద్రము అథర్వ శిఖా-శ్వేతాశ్వతర కైవల్యాది శ్రుతుల అభ్యాసముగాని, జపమనబడునేగాని, పశుకర్మ

ప్రతి పాదకమగు వేదాభ్యాసముగాని అథవా శ్రీ రుద్రము అథర్వ శిఖా-శ్వే-తాశ్వతర కైవల్యాది శ్రుతుల అభ్యా సముగాని, జపమనబడునే గాని, పశు కర్మ ప్రతిపాదకమగు వేదా భ్యాసము జపమనఁబడదు ॥23॥ శివుని చంద్ర శేఖరత్వము గంగాధరత్వాది దివ్య మంగళాకారాను సంధానమే ధ్యానము గాక శరీరేంద్రియాద్యుపాధిసంయుతమగు ఆత్మధ్యానము ధ్యానము గాదు, శివాగమార్థజ్ఞానమ జ్ఞానముగాక, శివాగమే తరసాంఖ్యాది శాస్త్రార్థ జ్ఞానము జ్ఞానము గాదు, ఈ విధముగా శివ యజ్ఞము, ఐదు రకాలుగా చెప్పబడినది. ॥24॥ ఎవడైతే అసాధారణ మగు భక్తితో గూడుకొని, ఈ అయిదు విధములైన యజ్ఞములతో శివుని పూజించునో అతడు (వాడు) భక్తుడని చెప్పనగును, (చెప్పఁబడును) ॥25॥ శివ భక్తుని గౌరవించుట వలన పుణ్యము లభించును అవమానించుట వలన మహాఘోరనరకముగలుగును. ఈ విషయమున ఏలాంటి సందేహము లేదు ॥26॥ మహాతేజస్వియగు శివ భక్తుడు శివ భక్తి విముఖులైన జనులను ముట్టగూడదు. చూడగూడదు. వారితో స్వల్పకాలమైనను నివసింపగూడదు॥27॥ లింగధారణ పూర్వకమైన శివదీక్ష ఎన్నడు జరుగుతుందో, నాటినుండి ప్రతి దినము భక్తుడు వీరశైవాగమశాస్త్రాను సారముగ ఆచరించునట్టి పూజ్యగురు స్థలమాహేశ్వరులను బూజించవలెను ॥28॥ తమ తమ జాతి అనుసారముగ ఆచారనిష్ఠులైన వీరశైవ ద్విజులు అనగా వీరశైవ బ్రాహ్మణ-వీరశైవ క్షత్రియ -వీరశైవ వైశ్యులు తమ తమ జాతీయ జనుల ఇండ్లలోనే భోజనము జేయదగును, ఇతరుల ఇండ్లలో భోజనము జేయగూడదు. వీరశైవ -క్షత్రియ-వీరశైవ వైశ్యులు - వీరశైవబ్రాహ్మణుల ఇండ్లలో భోజనము జేయవలయునే గాని, బ్రాహ్మణులు -క్షత్రియ -వైశ్యుల ఇండ్లలో భోజనము జేయగూడదు.

"శివోక్తాం జాతిమర్యాదాం - యోऽతీత్యభువివర్తతే!
సచండాల ఇతిజ్ఞేయః- సర్వ కర్మ బహిష్కృతా!!

శివోక్తంబైన జాతిమర్యాదను ఎవడైతే కాదని (ఉల్లంఘించి) ఆచరించునో వాఁడు చాండాలుడు సమస్త కర్మబహిష్కృతుడగును. అని శివాగమములు, చాటి చెప్పుటవలన వీరశైవ మతీయులు తమతమజాతి ధర్మము మేరకు ఆచరించవలయునే గాని దానికి విరుద్ధముగానాచరించి నరకభాజనులు (పాత్రులు)గా గూడదు ॥29॥ వీరశైవాచారమునకు విరుద్ధముగా నున్న ప్రాకృత భవులు పంపించిన సమస్త పదార్థములు తన యాధీనములో నున్నప్పటికిని వాటిని ముట్టగూడదు ॥30॥ శివ వ్రతముగల శివ భక్తుడు శివేతర దేవతలను బూజించగూడదు, స్మరింపదగదు, స్తుతింపగూడదు. నైవేద్యమును స్వీకరింపవలదు ॥31॥

ఎవరి ఇండ్లలో శివేతర దేవతయుండునో అట్టి గృహములను బరిత్యజించవలెను, శివేతర దేవతా పూజకులను శివపూజాకాలమున జూడగూడదు ॥62॥ఎల్లప్పుడును శివలింగ నిష్ఠాపరులైన వీరశైవులు ఆ వీరశైవ ధర్మమార్గనిరతులైన శివభక్తులు దేవాలయములందు బ్రతిష్ఠింపబడిన స్థావరలింగనైవేద్యమును స్వీకరింపగూడదు ॥63॥ ఏ స్థలమునందు స్థావర లింగములకు అపాయము సంభవిస్తుందో అక్కడ అధవా-శివలాంఛన ధారులైన శివభక్తుల అపాయము సంభవిస్తుందో అక్కడ తమప్రాణమును పరిత్యజించి యైనను తత్పరిహారమును బోగొట్టవలయును. శివుని కొరకు బ్రాణమును వదలిన వాడు శివసాయుజ్య పదవిని బడయును. స్థలమునందు ధర్మాచారముగల నిందలగుపడుచుండునో అక్కడ ఎన్నటికి గూడా పోరాదు ఎవడు సర్వ భూతాధిపతి యగు విశ్వేశ్వరుని నిందించునో వాని పాప పరిహారము వందసంవత్సరముల వరకు సమసిపోదు ॥32॥

శివ నిందకుని జూచినచో నాతనిని గొట్టవలెను. అథవా శపించవలెను. ఈ రెండును జేయుటలో తాను అసమర్థుడైన యెడల ఆ స్థానమును వదలి వెళ్ళవలెను ॥ శివార్చనా సక్తుడై ప్రాకృత కర్మమును అనుసరించినట్లైతే అట్టి పూజనిష్ఫలమగును ॥39॥ శివార్చనా రూపమైన ఉత్తమ వృత్తిని బొంది నీచపు వృత్తిని అవలంభించువాడు సర్వ కర్మ బహిష్కృతుడు. ఆ రూఢపతితుడు అగును ॥40॥ పంచాక్షరో పదేశమును బడసిన శివభక్తుడు నరస్తుతిని గావించినచో నాతడు అలింగి, దురాచార కుపండితుడు అని చెప్పబడును. ॥41॥ శివభక్తులు చర్మపాత్రయందలి జలమును గాని, తైలమును (నూనెను) గాని దీసికొన గూడదు, ఒకవేళ ఉపయోగించుకొనినచో రౌరవనరకమును బొందును. ॥42॥ ప్రాణలింగాంగి సంగయైన వీరవైవునకు పారమార్థిక దశలో జననసూతకముగాని, మరణ సూతకముగాని, ఉండవు. అర్థాత్ అతడు లౌకికాచార దశలో నున్నాడని భావము ॥43॥లింగార్చనా సక్తురాలైన వీరశైవస్త్రీకి ఋ(రు)తు-కాలమునందు సూతకముండదు. మరియు లింగార్చనా సక్తురాలైన ప్రసూతియైన స్త్రీకి గూడ సూతకము వర్తించదు. అర్థాత్ శివలింగపూజాసమయమున రజస్వలయైన స్త్రీకిని సూతకములేదనియు. మిగత సమయములందుండునని భావము. ఏ గృహములో వీరశైవ స్త్రీ ప్రసూతియగునో అక్కడ సూతకముండదు, శివపాదోదకము స్పర్శముచేత సమస్త పాపములునశించిపోవును. వీరశైవధర్మ శాస్త్రాను సారముగా వీరశైవులకు యావజ్జీవానుష్ఠేయ మగు శివపూజా సమయమున మాత్రమే సూతకముండదు. ఐతే మిగత సమయములందు మాత్రము ఉండును. ఈ విషయము శ్రీకరభాష్యములో అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అను సూత్రభాష్యములో నున్నది. ఈ విషయమై స్పష్టముగ జెప్పబడినది.

శైవందేవార్చనం యస్య-యస్యచాగ్ని పరీక్షకః!
బ్రహ్మచారియతీనాంచ-శరీరేనాస్తి సూతకం!!
లింగార్చనరతానారీ- సూతకేవారజస్వలా!
రవిరగ్నిర్యథావాయు-స్తథాకోటి గుణోజ్వలా!!
జాతకేమృతకేవాపి -నత్యాజ్యం శివపూజనం! ఇత్యాది
పారాశరస్మృతి సిద్ధాంత శిఖామణ్యాదౌలింగాంగి దేహ -
స్యపవిత్రత్వవ్యపదేశాల్లింగధారణ పూజాదేర్విరోధఃనను-
ప్రమాణాచారసత్వే2పి ప్రత్యక్ష విరుద్ధత్వాత్ సూతక
రజస్వలాకాలకృత పూజాధారణాది కమనుపపన్న
మితిచేన్నః జ్యోతిష్టోమాత్రిరాత్ర పౌండరీకాది యాగి
యపశువిశసనమాంసభక్షణ సురాపాన బ్రహ్మచారి
కృతదివాదాసిసంగమాది ప్రత్యక్షలోకవిరుద్ధశౌలతాచా
రభంగ ప్రసంగాత్ ననుశైవానాం పంచసూతకాభావే
వర్ణ చతుష్టయాతీ తత్వ ప్రసంగః తత్కృత పాకస్పర్శ పరి
గ్రహప్రసక్తిశ్చ! తత్పరిగ్రహే శైవశాస్త్రోక్త పూజాధారణ
సూతకనిషేధ శాస్త్ర విరోధ ప్రసంగా ద్వైది కానాంలింగధా
రణమనర్హమేవేతి చేన్న! స్వేష్టలింగైక పూజయాం
నైవా శాంచవిధీయతె!పాండరీకేరజస్త్రీణాః స్వాగ్నిహో
త్రేయథాతథా!! ఆకర స్పర్శయోగ్యా2పియథాజిహ్వామహేశ్వరి
మంత్రోచ్ఛారణ మాత్రస్య పూతాభవతి భూతలే!! తథా సూతకినః
శైవాఃపూజామాత్ర సునిర్మలాః!నా న్యస్పర్శానుకూలాః స్యురితి
వేదాను శాసనం !!ఇతి సిద్ధాంతా గమాదిషు శివపూజామాత్రయో
గ్యతాశ్రీవణాత్!!

ఈ విధముగ శ్రీపతి పండితులు సిద్ధాంతా గమాదుల అభిప్రాయాను సారముగ లింగార్చన లింగ ధారణాదుల యందు మాత్రమే వీరశైవులకు సూతకములుండవనియు పాకస్పర్శాదుల యందు సూతకములుండుననియు పౌండరీకయాగమునను, అగ్నిహోత్ర కర్మము నందును రజస్వల స్త్రీకిని యెట్లు సూతకముండదో నాలుకను జేతితో ముట్టుటక యోగ్యముగా నున్నను మంత్రోచ్చారణమునకు మాత్రము ఎట్లు పరిశుద్ధముగా నున్నదో,

అటులే సూతకములున్న వీరశైవులు శివపూజాదులందుమాత్రము అత్యంత పరిశుద్ధులని సిద్ధాంతీకరించుట చేత వీరశైవులకు శివపూజాది కర్మలందు మాత్రము సూతకము లుండవనియు, ఇతర పాక స్పర్శాదులందు మాత్రవే సూతకములున్నవని సిద్ధాంతముకలదు (44-45)

శివార్చకుడు, శివయాత్రోత్సవసమయమున శ్రేష్ఠములైన శివ క్షేత్రములను, శివతీర్థము లను అధిక సంతోషముతో సేవించవలయును ॥46॥ శివభక్తులు శివ క్షేత్ర -శివోత్సవాది దర్శనా పేక్షకులకు, శివ, యాత్రికులకు మార్గమధ్యన అన్నదానమును జలదానమును జేయవలెను ॥47॥ అన్నదానము,జలదానములకు సమానమైన దానములేవి లేవు. అహింసకంటెను శ్రేష్ఠమైన తపస్సు మరొకటి లేదు. అందుచేత శివ భక్తులు ప్రతి దినము అన్నోదకము దానము జేయవలెను. శివ వ్రతముండిన శివభక్తులు ఎల్లప్పుడు స్వధర్మాచార శీలురైనవారు తమతమ సంప్రదాయానుగత జాతుల వారిలో నేకన్యనిచ్చుట-తెచ్చుట జరుపవలెను. లింగధారులైనప్పటికిని తమ జాతికి భిన్నమగు జాతి వారిసంబంధమేర్పరచు కొనగూడదు అని భావము ॥49॥

## 10. ఉభయ స్థలం

॥శ్లో॥ ఏవమాచార సంయుక్తో వీరశైవో మహావ్రతీ
పూజయేత్పరయా భక్త్యా గురుం లింగం చ సంతతం ॥ 50 ॥

గురోరభ్యర్చ్య నేనాపి సాక్షాదభ్యర్చితః శివః
నాస్తి భేదస్తయోః కశ్చిదేకత్వాత్తత్త్వరూపతః ॥ 51 ॥

యథా దేవే జగన్నాథే సర్వానుగ్రహకారకే
తథా గురువరే కుర్యాదుపచారాన్ దినే దినే ॥ 52 ॥

అప్రత్యక్షో మహాదేవః సర్వేషామాత్మమాయయా
ప్రత్యక్షోగురురూపేణ వర్తతే భక్తి సిద్ధయే ॥ 53 ॥

శివజ్ఞానం మహాఘోర సంసారార్ణవతారకం
దీయతే యేన స గురుః కస్య వంద్యోన జాయతే ॥ 54 ॥

యత్కటాక్ష కలామాత్రాత్ పరమానంద లక్షణం
లభ్యతే శివరూపత్వం స గురుః కేన నార్చ్యతే ॥ 55 ॥

హితమేవ చరేన్నిత్యం శరీరేణ ధనేన చ
ఆచార్య స్యోపశాంతస్య శివజ్ఞానమహానిధేః ॥ 56 ॥

గురోరాజ్ఞాం న లంఘేత సిద్ధికామో మహామతిః
తదాజ్ఞాలంఘనేనాపి శివాజ్ఞాచ్ఛేదకో భవేత్ ॥ 57 ॥

ఈ విధముగ ధర్మాచరణలతో గూడిన వీర శైవుడు గురువును. లింగమును ఎల్లప్పుడు అసాధారణంబగు భక్తిచేత బూజించవలెను ॥50॥ గురువును బూజించుట వలన బ్రత్యక్షమైన శివుని పూజింపఁబడినట్లగును. గురువు మరియు శివుడు వీరిద్దరు ఒకే స్వరూపులై యుంటచేత వీరిలో కొంచమైనను భేదము లేదు "యస్యదే వేపరా భక్తి ర్యథా దేవేతథాగురౌ' ' అనుశ్వేతాశ్వతరశ్రుతి ఇదే విషయమును బోధించుచున్నది ॥51॥ జగత్పతి సర్వాను గ్రహకారియైన శివుని ప్రతిదినము ఉపచార పూర్వకముగ పూజించునట్లుగా గురువర్యుని బూజించవలెను శివుడు తన మాయచేత సమస్త జనులకు బ్రత్యక్షముగాకున్నను, భక్తి సిద్ధికై గురురూపమున ప్రత్యక్షమైనాడు ॥53॥ మహాభయంకరమగు సంసారమను సాగరమును దాటించుశివజ్ఞానము ఎవరిచేత అనుగ్రహించబడునో అట్టిగురువు ఎవడికిని పూజ్యమైన వాడుకాదనగలమా? ॥54॥ ఎవని కృపా కటాక్షము వలన పరమాత్మరూపమగు శివస్వరూపము ప్రాప్తించునో అట్టి గురువును ఎవరు పూజింపకుందురు?

సమస్త జనులకు పూజ్యుడగునని భావము ॥55॥ శివభక్తుడు రాగద్వేషాదిరహితుడు. శివజ్ఞానసాగరుడు. ఐన శ్రీ గురువునకు శరీరముతోను ధనముతోను ప్రతినిత్యము హితమునే ఆచరించవలెను ॥56॥ సిద్ధినపేక్షించు వివేకవంతుడు గురువునానతిని మీరగూడదు. గురువాజ్ఞను ఉల్లంఘించినచో శివాజ్ఞను భంగపరచిన వాడగును ॥57॥

## 11. త్రివిధ సంపత్తి స్థలం

॥శ్లో॥ యథా గురౌ యథాలింగే భక్తిమాన్ పరివర్తతే
జంగమే చ తథా నిత్యం భక్తిం కుర్యాద్వి చక్షణః ॥ 58 ॥

ఏక ఏవ శివః సాక్షాత్సర్వానుగ్రహకారకః
గురుజంగమలింగాత్మా వర్తతే భుక్తి ముక్తిదః ॥ 59 ॥

లింగం చ ద్వివిధం ప్రోక్తం జంగమాజంగమాత్మనా
అజంగమే యథా భక్తి ర్జంగమే చ తథా స్మృతా ॥ 60 ॥

అజంగమం తు యల్లింగం మృచ్ఛిలాది వినిర్మితం
తద్వరం జంగమం లింగం శివయోగీతి విశ్రుతం ॥ 61 ॥

అచరే మంత్ర సంస్కారాల్లింగే వసతి శంకరః
సదాకాలం వసత్యేవ చరలింగేమహేశ్వరః ॥62 ॥

శివయోగిని యద్దత్తం తదక్షయపలం భవేత్
తస్మాత్సర్వ ప్రయత్నేన తస్మై దేయం మహాత్మనే ॥ 63 ॥

యత్ఫలం లభతే జంతః పూజయా శివయోగినః
తదక్షయమితి ప్రోక్తం సకలాగమపార్గైః ॥ 64 ॥

నావమన్యేత కుత్రాపి శివయోగిన మాగతం
అవమానాద్భవేత్త స్య దుర్గతిశ్చ న సంశయః ॥ 65 ॥

శివయోగీ శివః సాక్షాదితి కైంకర్య భక్తితః
పూజయే దాదరేణైవ యథాలింగం యథా గురుం ॥ 66 ॥

భక్తి సంపన్నుడైన వివేక వంతుడు, గురువునందును, లింగమునందును ఎట్లు తన భక్తిని నిలిపి వర్తించునో అట్లే జంగమునందును ప్రతి నిత్యము భక్తితో వర్తించవలెను ॥58॥ సమస్త భక్తులకు అనుగ్రహమును గలుగ జేయువాడు, భోగమోక్షములనను గ్రహించువాడును ఒకే ఒక్కడైన పరమశివుడు ప్రత్యక్షమైన గురులింగ స్వరూపమును దాల్చి యున్నాడు॥59॥ లింగము స్థిర-చర అనుభేదముతో రెండు రకాలుగా నున్నది. స్థిర లింగమునందెట్లు భక్తిని స్థిరపరచవలయునో అట్లే చరలింగమునందును భక్తిని దృఢపరచవలెను ॥60॥ ఏ లింగమైనా మన్ను-రాయి-మున్నగు వాటితో నిర్మించబడినదో అది స్థిర లింగమనబడును. అట్టి స్థిర లింగము కంటెను శివయోగియని సుప్రసిద్ధమైన చరలింగము (గురుస్థలము చరమూర్తి) శ్రేష్ఠుడై యున్నాడు ॥61॥7 శివలింగమునందు శివుడు మంత్ర సంస్కారముతోడ మాత్రమే నివసించి యుండును చరలింగమున శివుడెల్లప్పుడును స్థిరముగా నుండును ॥62॥ శివయోగికి యేది దానము జేయబడుతుందో అదితరగని (అక్షయ)ఫలమై యున్నదగును .అందుచేత సర్వ విధములుగా యత్నించియైన (ప్రయత్నించి)మహాత్ముడైన శివయోగికి దానమొసగవలెను. ॥63॥ శివయోగిని బూజించుట వలన మానవుడే ఫలమును బడయునో అట్టి ఫలము నాశరహితమైనదని సకల శాస్త్ర కోవిదులు చెప్పుచుందురు ॥64॥ అకస్మాత్తుగ (అనుకొన కుండగ) విచ్చేసిన శివయోగిని

యెక్కడ ఏ విధముగను అవమాన పరచగూడదు. అట్టి శివ యోగిని అవమానపరచిన యెడల నిశ్చయముగా దుర్గతి జెందిన వాడగును. ॥65॥ లింగమును, గురువును ఎట్లు గౌరవముతో పూజించవలెనో అదే రీతిగా నా శివయోగిని గూడా సాక్షాత్తుగా శివుడిగానె భావించి కింకర భావముతో బూజించవలెను. ॥66॥

## 12. ప్రసాద స్వీకారస్థలం

॥శ్లో॥ పాదోదకం యథా భక్త్యా స్వీకరోతి మహేశితుః
తథా శివాత్మనోర్నిత్యం గురుజంగమ యోరపి ॥ 67 ॥

సర్వ మంగల మాంగల్యం సర్వ పావన పావనం
సర్వ సిద్ధికరం పుంసాం శంభోః పాదాంబు ధారణం ॥ 68 ॥

శిరసా ధారయేద్యస్తు పత్రం పుష్పం శివార్పితం
ప్రతిక్షణం భవేత్తస్య పౌండరీక క్రియా ఫలం ॥ 69 ॥

భుంజీత రుద్ర భుక్తాన్నం రుద్రపీతం జలం పిబేత్
రుద్రాఘ్రాతం సదా జిఘ్రే దితి జాబాలికీ శ్రుతిః ॥ 70 ॥

అర్పయిత్వా నిజే లింగే పత్రం పుష్పం ఫలంజలం
అన్నాద్యం సర్వభోజ్యం చ స్వీకుర్యాద్భక్తి మాన్నరః ॥ 71 ॥

గురుత్వాత్సర్వలోకానాం శంభోరమిత తేజసః
తస్మై నివేదితం సర్వం స్వీకార్యం తత్పరాయణైః ॥ 72 ॥

యే లింగధారిణో లోకే యే శివైక పరాయణాః
తేషాం తు శివ నిర్మాల్యముచితం నాన్యజంతుషు ॥ 73 ॥

అన్న జాతే తు భక్తేన భుజ్యమానే శివార్పితే
సిక్థే సిక్థేక శ్వ మేధస్య యత్ఫలం తదవాప్యతే ॥ 74 ॥

నిర్మాల్యం నిర్మలం శుద్ధం శివేన స్వీకృతం యతః
నిర్మలైస్తత్పరైర్ధార్యం నాన్యైః ప్రాకృతజంతుభిః ॥ 75 ॥

శివభక్తి విహీనానాం జంతూనాం పాపకర్మణాం
విశుద్ధే శివనిర్మాల్యే నాధికారోఽస్తి కుత్రచిత్ ॥ 76 ॥

శివలింగం ప్రసాదస్య స్వీకారాద్యత్ఫలం భవేత్
తథా ప్రసాద స్వీకారద్గురు జంగమయోరపి ॥ 77 ॥

తస్మాద్గురుం మహాదేవం శివయోగిన మేవ చ
పూజయేత్త త్ప్రసాదాన్నం భుంజీత ప్రతివాసరం ॥ 78 ॥

శివ భక్తుడు శివుని పాదోదకమును ఎట్లు భక్తితో స్వీకరించునో, అట్లే శివ స్వరూపులైన గురు-జంగముల పాదోదకమును ప్రతినిత్యము సేవించవలెను. ॥67॥ సమస్త మంగళములకు మంగళకరము, సమస్త పవిత్రములకు పవిత్రము ఐన శివపాదోదక సేవనము మానవులకు సకల సిద్ధులను అనుగ్రహించునట్టిది ॥68॥ శివునికి సమర్పించిన పత్ర పుష్పములను ఎవడు మస్తకముపై ధరించునో, అతనికి పౌండరీక యాగ ఫలము ప్రతిక్షణం లోను లభించును ॥69॥ శివ భక్తుడు శివుడను భవించిన (భుజించిన అన్నము ప్రసాదమునే) భుజించవలెను. శివుడు త్రాగిన (పానమొనర్చిన) జలమునే త్రాగవలెను. శివుడాఘ్రాణించిన(వాసనజూసిన) వస్తువునే ఆఘ్రాణించవలెను. అని జాబాల శ్రుతి చాటుచున్నది.

"రుద్రీణాత్త మశ్నంతి - రుద్రోపేతం పిబంతి!
రుద్రేణఘ్రాతంజిఘ్రంతి-"

ఈ విధముగా జాబాల ఋషి శ్రుతి వాక్యమున్నది ॥20॥ శివభక్తియున్న మానవుడు తన ఇష్టలింగమునకు ప్రతి-పుష్ప-ఫలమును-జలమును-అన్నాది సమస్త భోజ్యవస్తువులను సమర్పించవలెను. ॥71॥ అపారమగు (అంతులేని) తేజస్సుగల శివుడు సమస్తలోకములకు గురువై యుంటవలన శివ భక్తి పరాయణులు తాము అనుభవించే సమస్త పదార్థములను శివునికి సమర్పించి స్వీకరించవలెను ॥72॥ ఎవరు లింగధారులు, ఎవరు లోకమున శివభక్తి పరాయణులో వారికి మాత్రమే శివ నిర్మాల్యము దగినదిగా నున్నది ॥73॥ శివ భక్తుడు ఈ శివార్పితమైన అన్నమును స్వీకరించినచో అశ్వమేధ యజ్ఞమునుండి యెట్టి ఫలము లభించునో అట్టి (అంతటి) ఫలము శివార్పితాన్నము యొక్క ఒక్కొక్క మెతుకునుండి లభిస్తుంది ॥74॥ శివార్పితము. నిర్మాల్యమును, నిర్మాల్యతత్పరులు ఐన శివ భక్తులు స్వీకరించవలెను. శివదీక్షారహితులైన ప్రాకృతులు శివ నిర్మాల్యము స్వీకరించఁదగదు॥75॥శివభక్తి విహీనులు పాపకర్ములు ఐనమానవులకు పవిత్రమగు శివ నిర్మాల్యమునందు ఎన్నటికిని యధికారముండదు ॥76॥ శివలింగ ప్రసాదమును స్వీకరించుట వలన ఎట్టి ఫలములభించునో అట్టి ఫలముగురు-జంగ-మంబుల ప్రసాద

స్వీకారమునుండి లభించును ॥77॥ అందుచేత శివుని-గురువును-జంగమును బూజించవలెను. మరియు వారి ప్రసాదమునుప్రతిదినము తప్పక సేవించవలెను ॥78॥

## 13. సోపాధిదానస్థలం

॥శ్లో ॥ శివలింగే శివాచార్యే శివయోగిని భక్తిమాన్
దానం కుర్యాద్యథాశక్తి తత్ప్రసాదయుతః సదా ॥ 79 ॥

దానం తు త్రివిధం ప్రోక్తం సోపాధి నిరుపాధికం
సహజం చేతి తంత్రేషు సర్వ తంత్ర విశారదైః ॥ 80 ॥

ఫలాభిసంధి సంయుక్తం దానం యద్విహితం భవేత్
తత్సోపాధిక మాఖ్యాతం ముముక్షుభిరనాదృతం ॥ 81 ॥

శివభక్తుడు గురు-లింగ-జంగముల ప్రసాదమును స్వీకరించువాడై శివలింగమునందు (లింగమున)శివాచార్య(గురువు)లందును శివయోగి (జంగము)యందును. ఎల్లప్పుడు దనయథాశక్తిగాదానమొనర్చవలెను॥79॥ఈదానము సోపాధికదానము నిరుపాధిక దానము సహజదానము అని మూఁడురకాలుగా నున్నదని తంత్ర శాస్త్ర విశారదులు జెప్పుదురు ॥80॥ ఏదానమైతే ఫలాశచేత గూడియున్నదో అట్టి దానము సోపాధిక దానమనబడును ఈ సోపాధిక దానమును మోక్షాపేక్షులుదిరస్కరింతురు.

## 14. నిరుపాధిక దాన స్థలం

॥శ్లో ॥ ఫలాభి సంధినిర్ముక్త మీశ్వరార్పిత కాంక్షితం
నిరుపాధిక మాఖ్యాతం దానం దాన విశారదైః ॥ 82 ॥

ఏదానమైతే ఫలాభిలాషశూన్యమైనదో ఈ శ్వరార్పరణదానముగా నుండునో అట్టి దానమును దాన విశారదులు నిరుపాధికముగా నుండినది యని జెప్పుదురు ॥82॥

## 15. సహజదానస్థలం

॥శ్లో॥ అదాతృదాతృ దేయానాం శివభావం విచింత్యహి
ఆత్మనో2 కర్తృభావం చ యద్దత్తం సహజంతుతత్ ॥ 83 ॥

సహజం దానముత్కృష్టం సర్వదానోత్తమోత్తమం
శివజ్ఞానప్రదం పుంసాం జన్మరోగ నివర్తకం ॥ 84 ॥

శివాయ శివభక్తాయ దీయతే యది కించన
భక్త్యాతదపి విఖ్యాతం సహజం దానముత్తమం ॥ 85 ॥

దానాత్ స్వర్ణ సహస్రస్య సత్పాత్రే యత్ఫలం భవేత్
ఏక పుష్పప్రదానేన శివే తత్ఫలమిష్యతే ॥ 86 ॥

శివ ఏవ పరం పాత్రం సర్వవిద్యానిధిర్గురుః
తస్మై దత్తంతు యత్కించి త్తదనంతఫలం భవేత్ ॥ 87 ॥

శివయోగీ శివః సాక్షాచ్ఛివజ్ఞాన మహోదధిః
యత్కించిద్దీయతే తస్మై తద్దానం పారమార్థికం ॥ 88 ॥

శివయోగీ మహాపాత్రం సర్వేషాం దానకర్మణి
తస్మాన్నాస్తి పరంకించిత్పాత్రాం శాస్త్ర విచారతః ॥ 89 ॥

భిక్షామాత్రప్రదానేన శాంతాయ శివయోగినే
యత్ఫలం లభ్యతే నైతద్యజ్ఞకోటిశతైరపి ॥ 90 ॥

శివయోగిని సంతృప్తే తృప్తో భవతి శంకరః
తత్తృప్త్యా తన్మయం విశ్వం తృప్తి మేతి చరాచరం ॥ 91 ॥

తస్మాత్సర్వప్రయత్నేన యేన కేనాపి కర్మణా
తృప్తిం కుర్యాత్సదాకాలమన్నాద్యైః శివయోగినః ॥ 92 ॥

నిరుపాధిక చిద్రూప పరానందాత్మ వస్తుని
సమాప్తం సకలం యస్య స దానీ శంకరః స్వయం ॥ 93 ॥

ఉక్తాఖిలాచార పరాయణోక సౌ
సదా వితన్వన్ సహజం తు దానం
బ్రహ్మాదిసంపత్సు విరక్త చిత్తో
భక్తోహి మహేశ్వర తాముపైతి ॥ 94 ॥

దానమును స్వీకరించువారి యందును, దాన మొసఁగు వారియందును, ఇచ్చే వస్తువు (పదార్థము) లందును శివస్వరూపముగా భావించి "దాతాభోక్తా స్వయం శివః, ఇచ్చువాఁడు

శివుడు పుచ్చుకొనువాడును శివుడుగా భావించుట అనుభావముతో తాను నిమిత్తమాత్రుడు భావిస్తు తాను దానము జేయు వాడిని గానని భావిస్తు చేయు దానము సహజదానమన బడును ॥83॥ఈ దానముత్రివిధదానములలో శ్రేష్ఠమైనది. అంతేగాదు సమస్త దానములలోను ఉత్తమోత్తమమైనది. ఇట్టి సహజ దానము శివజ్ఞానమును తప్పక కలుగ జేయును. జనన మరణాది రోగనివారకమైనదిగూడ ॥84॥ స్థావర లింగరూపుడైన శివునకు మాహేశ్వరునకు భక్తితోనేవిధమైన దానమొసగబడునో అట్టి దానము శ్రేష్ఠమైన సహజదానముగా ప్రసిద్ధమైనదిగా చెప్పఁబడినది ॥85॥ సత్పాత్రమున కొన్ని వేలు సువర్ణ నాణెములను దానము జేయుట వలన ఎటువంటి ఫలము లభిస్తుందో అటువంటి ఫలము శివునకు ఒక పుష్పమును దానము జేయుట (సమర్పించు)ట వలన లభించును. ॥86॥ సర్వ విద్యానిధియైన గురువు ఐన శివుడే దానమునకు అత్యంత యోగ్యుడుగానున్నాడు. శివునకు ఏ కాస్త దానమొసఁగినను ఆ దానము అనంత ఫలముగలదిగా నుండును ॥87॥ శివజ్ఞాన సాగరుడైన జంగమము సాక్షాత్తుగా శివుడే ఐయున్నాడు. ఈతనికి గూడా స్వల్పము దానము జేసినను అట్టి దానము పారమార్థికమనబడును ॥88॥ దాన క్రియలో శివయోగే ఉత్తమ పాత్రుడై యున్నాడు. అతని కంటెను ఉత్తమమైన పాత్ర శాస్త్ర పరిశీలనతో జూచినచో నేదియు శ్రేష్ఠమైనదిగాదు (లేదు) ॥89॥ శాంతి స్వరూపుడైన శివయోగికి భిక్షబెట్టుట (దానమొనర్చుట)వలన ఎటువంటి ఫలము లభించునో అటువంటి ఫలము అబ్జయజ్ఞములను జేసినను లభించదు ॥90॥ శివయోగి సంతృప్తి జెందిన ఎడల శివుడు సంతృప్తి జెందును. శివుడు సంతృప్తి బొందినచో శివ స్వరూప మగునీ జగము తృప్తి జెందుతుంది ॥91॥ అందుచేత సర్వ ప్రయత్నముల వలన ఏదేనొక క్రియచేత శివయోగికి యెల్ల వేళల అన్నము జలాదులతో తృప్తి పరచవలెను. ॥92॥

"శివయోగిని సంతృప్తే - తృప్తో భవతి శంకరః
తత్తృప్త్యా త్తన్మయం విశ్వం- తృప్తిమేతి చరాచరం॥

నిరుపాధికుడు, జ్ఞానానందమయుడు ఐన పరమ శివుని యందు యే శివభక్తుని శరీరము-ధనము-ప్రాణరూపమగు సకల వస్తువులు సమర్పించబడునో ఆతడే సహజదాని యనఁబడుటే గాకుండ సాక్షాత్తుగా శివుడే యగుచున్నాడు ॥93॥ సమస్త ధర్మాచారపరా యణుండును, బ్రహ్మాది సంపదలందును, విరక్త మనస్కుడును అయిన శివభక్తుడు ఎల్లప్పుడును సహజ దానమునుచేయువాడై మాహేశ్వర స్థలమును బడయును. ఇట్లు

భక్త-మాహేశ్వర-ప్రసాది-ప్రాణలింగి శరణ-ఐక్యములను నీయారుశబ్దములు జాతివాచకములై యుండక, స్థలవాచకములై యున్నవనియు దెలియపలెను. ॥94॥

ఇతి శ్రీసిద్ధాంత శిఖామణౌ భక్తస్థలే భక్తమార్గక్రియా
స్థలాది సప్తవిధ స్థలప్రసంగోనామ
నవమ పరిచ్ఛేదః పరిసమాప్తః

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణిలో భక్త స్థలమున
భక్త మార్గ క్రియా స్థలాది సప్తవిధ స్థల
విచారాత్మకమగు తొమ్మిదవ పరిచ్ఛేదము పరిసమాప్తము.

# శ్రీ సిద్ధాంత శిఖామణి

## దశమ పరిచ్ఛేదః

## దశమ పరిచ్ఛేదం

### మాహేశ్వర స్థలం

అగస్త్య ఉవాచ:-

॥శ్లో॥ భక్తస్థలం సమాఖ్యాతం భవతా గణనాయక
కేన వా ధర్మభేదేన భక్తో మాహేశ్వరో భవేత్ ॥ 1 ॥

రేణుక ఉవాచ:-

కేవలం సహజే దానే నిష్ణాతః శివతత్పరః
బ్రహ్మాదిస్థాన విముఖో భక్తో మాహేశ్వరః స్మృతః ॥ 2 ॥

భక్తేర్యదా సముత్కర్షో భవేద్వై రాగ్య గౌరవాత్
తదా మాహేశ్వరః ప్రోక్తో భక్తః స్థిర వివేకవాన్ ॥ 3 ॥

మాహేశ్వర స్థలం వక్ష్యే యథోక్తం శంభునా పురా
మాహేశ్వర ప్రశంసాऽऽ దౌ లింగనిష్ఠా తతః పరం ॥ 4 ॥

పూర్వాశ్రయ నిరాసశ్చ తదాऽద్వైతనిరాకృతి
ఆహ్వానవర్జనం పశ్చాదష్టమూర్తి నిరాకృతిః ॥ 5 ॥

సర్వగత్వ నిరాసశ్చ శివత్వం విశ్వభక్తయోః
ఏవం నవవిధం ప్రోక్తం మాహేశ్వర మహాస్థలం ॥ 6 ॥

ఆదితః క్రమశో వక్ష్యే స్థల భేదస్య లక్షణం
సమాహితేన మనసా శ్రూయతాం భవతా మునే ॥ 7 ॥

ఓయీ రేణుక గణాధీశ్వరా! ఇంతవరకు - నీచేత భక్తస్థలము వివరింప బడినది. ఏ ధర్మ భేదము చేత భక్తస్థలసంపన్నుడు మహేశ్వరస్థలాపన్నుడగును ॥67॥ (1) అని అగస్త్య మహర్షి ప్రశ్నించగ అద్దానికి శ్రీరేణుకాచార్యులవారు - సహజ దానమునందు అత్యంతనిష్ణాతుడు, శివాసక్తుడు, బ్రహ్మాది స్థాన విముఖుడును. ఐన భక్తుడే మాహేశ్వరస్థలా

పన్నుడగును. ఏ సమయమున వైరాగ్యాతి శయము వలన శివభక్తి యాధిక్యత ఉత్పన్న మగుచున్నదో, అప్పుడే నిత్యానిత్యవస్తు వివేక శాలియైన శివభక్తుడు మాహేశ్వర స్థలాపన్నుడని చెప్పబడుననియు నాదేశించెను ॥3॥ ఇట్లు పూర్వము శివుని చేత నాదేశించబడిన మహేశ్వర స్థలమును ఇంకను చెబుతాను మహేశ్వర స్థలము మహేశ్వర ప్రశంసా ఫలము. 2 శివలింగనిష్ఠా స్థలము 3. పూర్వాశ్రయ నిరసనా స్థలము 4. అద్వైతనిరసన స్థలము 5. ఆహ్వాననిరసన స్థలము, 6. అష్టమూర్తి నిరసన స్థలము, 7. సర్వగత్వనిరసనస్థలము, 8. శివజగన్మయ స్థలము, 9. భక్త దేహికలింగస్థలము అనియు తొమ్మిది విధములుగా నున్నది. (4-5-6)

ఓయీ! అగస్త్య మహర్షి! ఈ స్థలభేదముల లక్షణమును మొదటి నుండి యను క్రమముగా వివరించుచున్నాను, శాంతమనస్కుండవై వినుము ॥7॥

## 16. మహేశ్వర ప్రశంసా స్థలం

॥శ్లో॥ విశ్వస్మా దధికో రుద్రో విశ్వానుగ్రహకారకః
ఇతి యస్య స్థిరా బుద్ధిః సవై మాహేశ్వరః స్మృతః ॥ 8 ॥

బ్రహ్మాద్యైర్మలిన ప్రాయైర్నిర్మలే పరమేశ్వరే
సామ్యోక్తిం యోన సహతే స వై మాహేశ్వరాభిధః ॥ 9 ॥

ఈశ్వరః సర్వభూతానాం బ్రహ్మాదీనాం మహానితి
బుద్ధియోగాత్త దాసక్తో భక్తో మాహేశ్వరః స్మృతః ॥ 10 ॥

బ్రహ్మాది దేవతా జాలం మోహితం మాయయా సదా
అశక్తం ముక్తి దానే తుక్షయాతిశ యసంయుతం ॥ 11 ॥

అనాదిముక్తో భగవానేక ఏవ మహేశ్వరః
ముక్తిదశ్చేతియో వేదసవైమాహేశ్వరః స్మృతః ॥ 12 ॥

క్షయాతిశయ సంయుక్తా బ్రహ్మవిష్ణ్వాది సంపదః
తృణవన్మన్యతే బుద్ధ్యా వీరమాహేశ్వరః సదా ॥ 13 ॥

శబ్దస్పర్శాది సంపన్నో సుఖలేశేతు నిస్పృహః
శివానందే సముత్కంఠో వీరమాహేశ్వరో భవేత్ ॥ 14 ॥

పరస్త్రీ సంగనిర్ముక్తః పరద్రవ్య పరాఙ్ముఖః
శివార్థ కార్య సంపన్నః శివాగమ పరాయణః ॥ 15 ॥

శివస్తుతి రసాస్వాద మోదమానమనాః శుచిః
శివోత్కర్షప్రమాణానాం సంపాదనసముద్యతః ॥ 16 ॥

నిర్మమో నిరహంకారో నిరస్తక్లేశ పంజరః
అస్పృష్టమద సంబంధో మాత్సర్యావేశ వర్జితః ॥ 17 ॥

నిరస్తమదనోన్మేషో నిర్ధూతక్రోధవిప్లవః
సదా సంతుష్టహృదయః సర్వప్రాణిహితే రతః ॥ 18 ॥

నివారణసముద్యోగీ శివకార్య విరోధినాం
సహచారీ సదాకాలం శివోత్కర్షాభిదాయిభిః ॥ 19 ॥

శివాపకర్ష సంప్రాప్తౌ ప్రాణత్యాగేఽ ప్యశంకితః
శివైకనిష్ఠః సర్వాత్మా వీరమాహేశ్వరో భవేత్ ॥ 20 ॥

విశ్వాధికోరుద్రోమహర్షిః అనుశ్వేతాశ్వతర సూత్రము ప్రకారము శివుడు సమస్త ప్రపంచమున కంటెను గొప్పవాడు. సమస్త ప్రపంచమునకు అనుగ్రహమును (కళ్యాణమును) గలుగ జేయు వాడును అయి యున్నాడు. అనే దృఢమైన బుద్ధియెవనికి ఉంటుందో, వాడు మాహేశ్వరుడని చెప్పబడుచున్నాడు ॥8॥

"బ్రహ్మవిష్ణు రుద్రేంద్రాస్తే సంప్రసూయతే"

అను శ్రుతి వాక్యాభిప్రాయాను సారముగా జనన మరణాదుల నుండి పీడితులై అణవాదిమల విశిష్టులై యున్న బ్రహ్మాదులతో ఆణవాదిమల రహితుడైన పరమేశ్వరునిలో వీరందరు సమానులనే సామ్యోక్తిని ఎవడైతె సహింపడో అతడే మహేశ్వరుడన బడును.॥9॥

"ఈ శానః సర్వవిద్యానా మీశ్వరః సర్వభూతా నాం. బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతిః బ్రహ్మ శివోమె అస్తు సదాశివోం" అనుశ్రుతి వాక్యాభిప్రాయాను సారముగ "ఈశ్వరఃసర్వ భూతానాం హృద్దేశేఽ ర్జునతిష్ఠతి - భ్రామయన్ సర్వభూతాని - యంత్రారూఢాని మాయయా

అనుభవద్గీతాభిప్రాయానుసారముగాను సమస్త ప్రాణులకును, బ్రహ్మాదిదేవతలకును శివుడే ప్రభువైయున్నాడనే బుద్ధియోగముతో అట్టి శివునియందు ఆసక్త మనస్సు గలవారే

వీరమహేశ్వరుడనఁబడును ॥10॥ జనన మరణాదులకులోబడిన బ్రహ్మాది దైవతా సమూహము మాయచేత మోహింపబడినవారై ముక్తిననుగ్రహించుటతో అసమర్థులనియు (అయినా రనియు) అనాదిముక్తుడైన భగవాన్ మహేశ్వరుడే ముక్తిని అనుగ్రహించుటలో అత్యంత సమర్థుడని యెవడైతే తెలుసుకుంటాడో ఆతడే వీర మాహేశ్వరుడనఁబడును (11-12) బ్రహ్మ విష్ణ్వాదిదేవతల సంపదలు వినాశము బొందునవి అనే బుద్ధితో ఎవడు వాటిని తృణప్రాయములని గ్రహించునో వాడే వీరమాహేశ్వరుడనబడును (13) శబ్ద స్పర్శాది విషయములతో గూడిన అల్ప సుఖమునందు నిస్పృహుడై, శాశ్వతమైన శివ సుఖమునందు ప్రీతి (అభిలాష) గలవాడు వీరమాహేశ్వరుడనబడును(14) పర స్త్రీ సాంగత్యము లేనివాడై, పరద్రవ్య పరాఙ్ముఖుడును, "పరద్రవ్యేషులోష్ఠవత్" పరద్రవ్యమును మట్టి ముద్ద మాదిరి జూచువాడు, ఆశించనివాడు శివప్రయోజకకారకమైన కార్యములతో గూడిన వాడును శివాగమ పరాయణుడు, శివస్తోత్రములతో గలిగిన ఆనంద రసస్వీకారముతో సంతసించిన మనస్సుతో గూడిన వాడు, నిర్మలుడు, శివసర్వోత్తమత్వమును ప్రతిపాదించునట్టి ప్రమాణములను సంగ్రహించుటలో ఆసక్తి గలవాడు, అహంకారమమకారములకు దూరమైనవాడును, పంచ క్లేశరూప పంజరమును భగ్న పరచినవాడు, మదముచేత స్పృశింపఁబడనివాడు, మాత్సర్యము నుండి విడువ బడినవాడు, కామోద్రేకమును నిరసించినవాడు. క్రోధమును దరి జేరనీయని వాడు. (నివారించినవాడు) సతతము సంతోషముతో గూడిన మనస్సుగలవాడు. సమస్త ప్రాణులకు హితమునే గూర్చువాడు, శివసంబంధమైన కార్యములకు విరోధమును కలుగజేయు వారిని నివారించుట యందాసక్తియున్న శివోత్కృష్టత పెంపొందించువారితో సహకరించువాడును, శివదేవాలయములందలి శివలింగములకు తొందరగలిగించే సమయమున దన ప్రాణమునర్పించుటకు వెనుకంజవేయని వాడు, శివలింగైకనిష్ఠుడును, సర్వమును దనవలె దెల్సికొనిన వాడు వీర మాహేశ్వరుడన బడును, (15-16-17-18-19-20)

## 17. లింగనిష్ఠాస్థలం

॥శ్లో॥ అన్య మాహేశ్వర స్యోక్తం లింగనిష్ఠామహాస్థలం
ప్రాణాత్యయోఽ పి సంపన్నే యదత్యాజ్యం విధీయతే ॥ 21 ॥

అపగచ్ఛతు సర్వస్వం శిరశ్ఛేదనమస్తువా
మాహేశ్వరో న ముంచేత్తు లింగపూజా మహావ్రతం ॥ 22 ॥

లింగపూజామకృత్వాతు మానవాయేన భుంజతే
తేషాం మహాత్మనాం హస్తే మోక్షలక్ష్మీ రుపస్థితా ॥ 23 ॥

కిమన్యైర్ధర్మకలిలైః కీకసార్థ ప్రదాయిభిః
సాక్షాన్మోక్షప్రదః శంభోర్ధర్మో లింగార్చనాత్మకః ॥ 24 ॥

అర్పితేనాన్న పానేన లింగేనియమపూజితే
యే దేహవృత్తింకుర్వంతి మహామాహేశ్వరా హితే ॥ 25 ॥

చిన్మయే శాంకరే లింగే స్థిరం యేషాం మనః సదా
విము క్తేతర సర్వార్థం తే శివా నాత్ర సంశయః ॥ 26 ॥

లింగే యస్య మనో లీనం లింగస్తుతి పరా చవాక్
లింగార్చనపరౌ హస్తౌ స రుద్రో నాత్ర సంశయః ॥ 27 ॥

లింగనిష్ఠస్య కిం తస్య కర్మణా స్వర్గ హేతునా
నిత్యానంద శివప్రాప్తి ర్యస్య శాస్త్రేషు నిశ్చితా ॥ 28 ॥

లింగ నిష్ఠాపరం శాంతం భూతి రుద్రాక్ష సంయుతం
ప్రశంసంతి సదాకాలం బ్రహ్మాద్యా దేవతా ముదా ॥ 29 ॥

ప్రాణ సంకటము ప్రాప్తించినను ఏ లింగ నిష్ఠా స్థలము విడువ బడదో అట్టిస్థలము ఈ మహేశ్వరుని గురించి చెప్పబడినది ॥21॥ తాను సంగ్రహించిన సంపద అంతయు పోయి నప్పటికిని అథవా శిరచ్ఛేదనమే గాని గాక, వీర మాహేశ్వరుడు లింగపూజా మహావ్రతమును వీడవలదు ॥22॥ ఏ మానవులు లింగపూజను జేయనిదే భోజనము జేయరో ఆ మహాత్ముల కరతలమున మోక్షలక్ష్మీ సదానివసించి యుండును ॥23॥ కుత్సితపములనొసంగె లింగపూజాతిరిక్తములైన క్షుద్ర ధర్మములతో నేమి ప్రయోజనము శివలింగపూజారూపమైన శివ ధర్మము సాక్షాత్తుగా మోక్ష ప్రదమై యున్నది ॥24॥ విధి ప్రకారముగా పూజింపఁబడిన శివలింగమునకు సమర్పించిన అన్నోదకములతో ఎవరైతే దేహమును బోషింతురో వారె మహామహేశ్వరులనబడుదురు ॥25॥ ఎవరి మనస్సు శివేతర స్వర్గాది ఫలములను దూరీకరించి చిత్స్వరూపమగు శివలింగమునందు సతతము స్థిరపడి యుండునో వారె శివ స్వరూపులు ఈ విషయములోనే లాంటి సందేహము లేదు ॥26॥ ఎవని మనస్సు శివలింగమునందు విలీనమై యుండునో, ఎవని వాణి శివలింగ స్తుతి

యందు నిరతమై యుండునో, ఎవని చేతులు శివలింగస్తుతి యందు నిరతమై యుండునో, ఆతడే సాక్షాత్తుగా రుద్రుడు. ఈ విషయమున ఏలాంటి సందేహము లేదు. ॥27॥ నిత్యానందరూపమగు శివపద ప్రాప్తి ఎవడికి శాస్త్రములతో నిశ్చితమై యున్నదో, అట్టి లింగ నిష్ఠునకు స్వర్గప్రాప్తికి గారణ భూతమగు కర్మచేత బ్రయోజనమేమి? ॥28॥ భస్మరుద్రాక్షధారి. శాంతి స్వరూపుడు ఐన లింగనిష్ఠాపరుడిని బ్రహ్మాది దేవతలు ఎల్లప్పుడు సంతోషముతో స్తుతించు చుందురు॥29॥

## 18. పూర్వాశ్రయ నిరసన స్థలం

॥శ్లో॥ లింగైక నిష్ఠ హృదయః సదా మాహేశ్వరో జనః
పూర్వాశ్రయగతాన్ ధర్మాంస్త్య జేత్ స్వాచారరోధకాన్ ॥ 30 ॥

స్వజాతికులజాన్ ధర్మాన్ లింగనిష్ఠావిరోధినః
త్యజన్ మాహేశ్వరో జ్ఞేయః పూర్వాశ్రయ నిరాసకః ॥ 31 ॥

శివ సంస్కారయోగేన విశుద్ధానం మహాత్మనాం
కిం పూర్వకాలికైర్ధర్మైః ప్రాకృతానాం హి తే మతాః ॥ 32 ॥

శివ సంస్కార యోగేన శివధర్మానుషంగిణాం
ప్రాకృతానాం న ధర్మేషు ప్రవృత్తి రుప పద్యతే ॥ 33 ॥

విశుద్ధాః ప్రాకృతాశ్చేతి ద్వివిధా మానుషాః స్మృతాః
శివ సంస్కారిణః శుద్ధాః ప్రాకృతా ఇతరే మతాః ॥ 34 ॥

వర్ణాశ్రమాది ధర్మాణాం వ్యవస్థాహిద్విధా మతా
ఏకా శివేన నిర్దిష్టా బ్రహ్మణా కథితా పరా ॥ 35 ॥

శివోక్త ధర్మ నిష్ఠాతు శివాశ్రమ నిషేవిణాం
శివ సంస్కారహీనానాం ధర్మః పైతా మహః స్మృతః ॥ 36 ॥

శివలింగైక్య నిష్ఠగలవాడు మాహేశ్వరుడు సదాతనయొక్క ఆచార ధర్మములకు విరుద్ధములైన పూర్వాశ్రమ ధర్మములను వదలవలెను. అట్టి పూర్వాశ్రమ స్థలము యొక్క ఆచారములన్నియు మొదట అలింగజాతీయులలో జన్మించి ఆ పైన వీరశైవ మతమునకు జేరిన వారి విషయమున జెప్పంబడినవిగా నున్నవనియు దెలియవలెను ॥30॥ లింగనిష్ఠకు విరుద్ధములైన మొదటి తనయొక్క ప్రాకృత జాతి కులములతో వచ్చిన ధర్మములను

వదలిన వాఁడై పూర్వాశ్రమ నిరాసక్తుడైన మహేశ్వరుడని దెలియవలెను. ॥31॥ శివ సంస్కారమువలన పరిశుద్ధులైన మహాత్ములకు మొదటి జాతికి సంబంధించిన ధర్మములతోనేమి ప్రయోజనము? అట్టి ధర్మములు అలింగ (లింగములేని) ప్రాకృతులకు జెప్పబడినవి ॥32॥ శివ సంస్కార సంయోగముచేత శివ ధర్మములను అనుష్ఠించువారికి లింగరహితులైన ప్రాకృతుల ధర్మములందు ప్రవృత్తి యుపపన్నములుగా నేరవు ॥33॥ మానవులు పరిశుద్ధులు (అప్రాకృతులు) ప్రాకృతులు అని రెండు విధములుగా నున్నారు శివ సంస్కార సంపన్నులు పరిశుద్ధులు (అప్రాకృతులు) అనబడుదురు. శివ సంస్కార శూన్యులు ప్రాకృతులనఁబడుదురు ॥34॥ వర్ణాశ్రమాది ధర్మములవ్యవస్థ రెండు విధములుగా నున్నది. అందొకటి శివుని చేత నిర్దేశింపఁబడినది. మరొకటి బ్రహ్మచేత నిర్దేశింఁబడినది॥35॥ శివుని చేత జెప్పబడినది ధర్మా చరణ, శివ వర్ణాశ్రమ ధర్మములనుష్ఠించే వారికి నిర్ధేశింపఁబడినది. శివ సంస్కార శూన్యులకు బ్రహ్మచేత ఉక్తములైన ధర్మాచరణములు గలవై యున్నవి ॥36॥

## 19. సర్వాద్వైతనిరసన స్థలం

॥శ్లో॥ పూజ్యపూజకయోర్లింగ జీవయోర్భేదవర్జనే
పూజాకర్మాద్యసంపత్తే ర్లింగ నిష్ఠావిరోధతః ॥ 37 ॥

సర్వాద్వైత విచారస్య జ్ఞానాభావో వ్యవస్థితః
భవేన్మా హేశ్వరః కర్మీ సర్వాద్వైత నిరాసకః ॥ 38 ॥

ప్రేరకం శంకరం బుద్ధ్వా ప్రేర్యమాత్మానమేవ చ
భేదాత్తం పూజయేన్నిత్యం నచా ద్వైత పరోభవేత్ ॥ 39 ॥

పతిః సాక్షాన్మహాదేవః పశురేష తదాశ్రయః
అనయోః స్వామిభృత్యత్వమభేదే కథమిష్యతే ॥ 40 ॥

సాక్షాత్ కృతం పరం తత్త్వం యదాభవతి బోధతః
తదాన్ ద్వైతసమాపత్తి ర్జ్ఞానహీనస్యన క్వచిత్ ॥ 41 ॥

భేదస్య కర్మ హేతుత్వాద్వ్య వహారప్రవర్తతే
లింగపూజాదికర్మస్థో నచాన్ ద్వైతం సమాచరేత్ ॥ 42 ॥

పూజాదివ్యవహారః స్యాద్భేదాశ్రయతయా సదా
లింగపూజాపరస్తస్మాన్నా ద్వైతే నిరతో భవేత్ ॥ 43 ॥

పూజార్హమైన శివలింగమునకు పూజించే భక్తునకు అభేదమని (భేదములేదని) చెప్పినచో లింగనిష్ఠకుని విరోధమేర్పడుట వలన, పూజాది కర్మములకు స్వరూపనిష్పత్తి లేకుండా పోతుంది గనుక, సర్వాద్వైత విచార జ్ఞానముయొక్క అభావమే వ్యవస్థితమగును (లేకుండును) అందుచేత శివలింగపూజాది కర్మలనాచరించునట్టి మాహేశ్వరుడు సర్వాద్వైత నిరాసకుడే గావలయును "క్రియా ద్వైతం నకర్తవ్యం" అను ప్రమాణము మేరకు క్రియతో అద్వైతమును ఆచరించవలదని భావము ॥37-38॥ శివుడు ప్రేరకుడనియు జీవుడు ప్రేరితుడనియు భావించి భేద భావమువలన శివుడిని బూజించవలయునే గాని శివ జీవులలో అద్వైతమును భావించి అద్వైతమందాస్తకుడుగాకూడదు ॥39॥ శివుడు సాక్షాత్తుగా ప్రభువై యున్నాడు. జీవుడు ఆ శివుని ఆశ్రయించుకొని యున్నాడు. ఇట్టి శివ జీవులకు అభేదమును జెప్పినచో స్వామి భృత్యత్వము ఎలా పొసగుతుంది? అందుచేత పూజకుడు శివుని భేద బుద్ధితో నే పూజించ వలెనని తాత్పర్యము ॥40॥ శ్రుతి గురుబోధవలన ఎప్పుడైతే పరశివ తత్త్వము ప్రత్యక్షమగు చున్నదో అప్పుడు అద్వైత స్ఫూర్తియేర్పడు తుంది. జ్ఞానశూన్యుడై కేవలము కర్మమునాచరించే వాడికి యెన్నటికిని అద్వైతస్ఫూర్తి గలుగనేరదు ॥41॥ శివ జీవుల భేదవ్యవహారము శివపూజాది క్రియలకు గారణమై యుంటవలన, శివలింగ పూజాది కర్మనిష్ఠుడు శివ-జీవులలో (యందు) అద్వైతమునునుష్ఠించవలదు ॥42॥ పూజాదివ్యవహారము ఎల్లప్పుడు భేదముతోడనే గూడి యున్నది. అందుచేత లింగార్చకుడు అద్వైతమునందు ఆసక్తి గలిగి యుండగూడదు ॥43॥

## 20. ఆహ్వాన నిరసన స్థలం

॥శ్లో॥ లింగార్చన పరః శుద్ధః సర్వాద్వైత నిరాసకః
స్వేష్టలింగే శివాకారే న తమావాహయేచ్ఛివం ॥ 44 ॥

యదా శివకలాయుక్తం లింగం దద్యాన్మహాగురుః
తదారభ్య శివస్తత్ర తిష్ఠత్యాహ్వానమత్ర కిం ॥ 45 ॥

స సంస్కారేషు లింగేషు సదా సన్నిహితః శివః
తత్రా హ్వానం న కర్తవ్యం ప్రతిపత్తి విరోధతః ॥ 46 ॥

నా హ్వానం న విసర్జం చ స్వేష్టలింగే తు కారయేత్
లింగనిష్ఠాపరో నిత్యమితి శాస్త్రస్య నిశ్చయః ॥ 47 ॥

సర్వాద్వైతనిరాసకుడు పరిశుద్ధుడైన లింగపూజకుడు శివాకృతియైన తన ఇష్ట లింగమునందు శివుని ఆహ్వానించగూడదు ॥44॥ మహాచార్యుడు శివకలాయుక్తమైన లింగమును ఎన్నడను గ్రహించునో నాటినుండియు శివుడు ఆ లింగమునందు నివసించి యుండును. మరల నా లింగము నందాహ్వాన మెందుకు? ॥45॥ సంస్కారయుక్తములైన లింగములందు శివుడెల్లప్పుడు సన్నిహితుడై యుండును. ఆహ్వానము శివదీక్షా జ్ఞానమునకు విరోధమైనది గనుక అట్టి శివదీక్షా సంస్కారముగల లింగములందు ఆహ్వానము జేయగూడదు. ॥46॥ లింగపూజాసక్తుడైన వాడు తన ఇష్ట లింగమునందు నిత్యము ఆహ్వానము గాని విసర్జనము గాని జేయగూడదు. ఇదే శివ శాస్త్ర సిద్ధాంతము ॥47॥

## 21. అష్టమూర్తినిరసన స్థలం

॥శ్లో॥ యథాత్మ శివయోరైక్యం న మతం కర్మ సంగినః
తథా శివాత్ పృథివ్యా దేరద్వైతమపి నేష్యతే ॥ 48 ॥

పృథివ్యాద్యష్టమూర్తిత్వమీశ్వరస్య ప్రకీర్తితం
తదధిష్ఠాతృ భావేన న సాక్షాదేకభావతః ॥ 49 ॥

పృథివ్యాద్యాత్మ పర్యంతప్రపంచో హ్యష్టధాస్థితః
నైతత్సాక్షాన్మ హేశోక యం కులాలః కలశో యథా ॥ 50 ॥

పృథివ్యాద్యాత్మ పర్యంతప్రపంచో హ్యష్టథా స్థితః
తనురీశస్య చాత్మాయం సర్వతత్వ నియామకః ॥ 51 ॥

శరీర భూతాదేతస్మాత్ ప్రపంచాత్పరమేష్ఠినః
ఆత్మ భూతస్య దేవస్య నాభేదో న పృథక్ స్థితిః ॥ 52 ॥

అచేతనత్వాత్ పృథ్వ్యా దేరజ్ఞత్వాదాత్మ నస్తథా
సర్వజ్ఞస్య మహేశస్య నైకరూపత్వమిష్యతే ॥ 53 ॥

ఇతి యశ్చింతయేన్నిత్యం పృథ్వ్యాదేరష్టమూర్తి తః
విలక్షణం మహాదేవం సోऽష్టమూర్తి నిరాసకః ॥ 54 ॥

శివపూజాకర్మనిష్ఠుడైన మాహేశ్వరునకు శివజీవుల ఐక్యత ఎట్లు సమ్మతమైనవి కావో, అట్లే శివుడికి ఆతని శరీరములైన వృథివ్యాద్యష్టమూర్తులకు అద్వైతము సమ్మతమైనది కాదు ॥48॥ శివుడికి వృథ్వీ-అప్పు-తేజస్సు-వాయు- ఆకాశము -సూర్యుడు-చంద్రుడు-

ఆత్మ-అనునవి, ఈ ఎనమిది శరీరములు జెప్పబడినవి. ఈ శరీరి-శరీరభావము - అధిష్ఠాతృ-అధిష్ఠేయ భావముతోనే ఉపపన్నమగునే గాని స్వరూపైక్యముచేత ఉపపన్నముగా జాలదు ॥49॥ పృథివ్యాదులు కార్యరూపమును గలిగి యున్నవి, శివుడు కారణ భూతుడు. అందువలన పృథి వ్యాది పంచభూతములు సాక్షాత్తుగా శివుడుగానేరవు. కర్తయైన కుమ్మరికి కార్యరూపమైన ఘటమునకు ఎట్లు అభేదము సంభవించదో. అట్లే శివునికి పృథివ్యాదిపంచ భూతములకును అభేదము సంభవించదు ॥50॥ పృథ్వి మొదల్కొని ఆత్మపర్యంతంగా ఎనమిది విధములైన ప్రపంచము శివుని శరీరమై యున్నది. శివుడు సర్వతత్త్వ నియామకుడై ఆత్మయనబడినాడు ॥51॥ శివుడి శరీరమనబడి యీ ప్రపంచముతోబాటు ఆత్మస్వరూపమైన శివునికి అభేదముండదు, అర్థాత్ భేదమే యున్నది. ఇంక శరీరమనఁబడి భిన్నముగా నుండిన పృథ్వీ ఆది (పృథివ్యాది) ప్రపంచము, శరీరమనఁబడిన శివుని వదలి ప్రత్యేకముగా నుండదు. అర్థాత్ శివునికిని ఆతనికి శరీర భూతములైన పృథివ్యాదులకు భేదాభేదమనునదే శ్రీ జగద్గురు రేణుక భగవత్పాదుల అభిఃప్రాయము, ఇట్టి భేదా భేదమే వీరశైవ సిద్ధాంతము యొక్క రహస్యమై యున్నది. ॥52॥ పృథివ్యాదులు జడపదార్థములై యుంటవలన, ఆత్మ కించిజ్ఞుడగుటవలనను సర్వజ్ఞుడగు శివునకు వీనితో బాటు స్వరూపైక్యము సంభవించతగదు ॥53॥ ఈ విధముగా అష్ట శరీరములనబడు పృథివ్యాదులకు విలక్షణుడగు శివుడిని యెవడైతే ప్రతిదినము ధ్యానించునో, ఆతడు అష్టమూర్తి నిరాసక్తుడని చెప్పకొనబడును.॥54॥

## 22. సర్వగత్వనిరసన స్థలం

॥శ్లో॥ సర్వగత్వే మహేశస్య సర్వత్రారాధనం భవేత్
న లింగమాత్రే తన్నిష్ఠో న శివం సర్వగం స్మరేత్ ॥ 55 ॥

సర్వగోఽపి స్థితః శంభుః స్వాధారే హి విశేషతః
తస్మాదన్యత్ర విముఖః స్వేష్టలింగే యజేచ్ఛివం ॥ 56 ॥

శివః సర్వగతశ్చాపి స్వాధారే వ్యజ్యతే భృశం
శమీగర్భే యథావహ్నిర్వి శేషేణ విభావ్యతే ॥ 57 ॥

సర్వగత్వం మహేశస్య సర్వ శాస్త్ర వినిశ్చితం
తథాప్యాశ్రయలింగాదౌ పూజార్థమధికా స్థితిః ॥ 58 ॥

తస్మాత్సర్వప్రయత్నేన సర్వస్థాన పరాఙ్ముఖః
స్వేష్టలింగే మహాదేవం పూజయేత్పూజకోత్తమః ॥ 59 ॥

శివస్య సర్వగత్వేఽపి సర్వత్ర రతివర్జితః
స్వేష్టలింగే యజన్ దేవం సర్వగత్వ నిరాసకః ॥ 60 ॥

శివుడు సర్వత్ర వ్యాపించి ఉంటవలన ఆతని అరాధన సర్వత్ర జరుగవలసి వచ్చును? కేవలము లింగమునకు మాత్రమే చేయవలదని పించును? అందుచేత శివుని యందు నిష్ఠగల మాహేశ్వరుడు శివుడు సర్వత్ర వ్యాపించి యున్నాడని భావించరాదు ॥55॥ శివుఁడు సర్వత్ర వ్యాపించి యున్నప్పటికిన్ని తనకాధారభూతమైన (ప్రాయమైన) ఇష్ఠలింగమునందే విశేషముగా నివసించి యున్నాడు. ఆకారణమున మాహేశ్వరుడు అన్యభావముచేత విముఖుడై తన ఇష్టలింగమునందే శివుడిని అరాధించవలెను. వీరశైవుడైనవాడు స్థావర లింగమునందును బూజింపక ముఖ్య ముగా ఇష్టలింగమునందే శివుని బూజించవలయుననే భగవత్పాదుల ఆశయమై యున్నది ॥56॥ నిప్పుఅన్ని కఱ్ఱల (కట్టెల)లో నుండినను జమ్మి వృక్షము యొక్క కఱ్ఱ (గర్భము)లో ఎట్లు విశేషముగా నుండునో. అదే విధముగా శివుడు సర్వత్ర వ్యాపించియున్నను తనకాధార భూతమైన ఇష్టలింగమునందే విశేషముగా ప్రకాశించుచుండును ॥57॥ శివుడు సర్వత్ర వ్యాపించియున్నాడనుట. శాస్త్రసిద్ధమైనది. ఐనను దనకాధార భూతమైన ఇష్టలింగమునందును మరియు గురు జంగములందును పూజకొరకు విశేషముగా నివసించి యున్నాడు॥58॥ అందుచేత మహేశ్వరుడు, శివుడు సర్వ స్థానములందును ఉన్నాడను భావనచేత దూరస్థుడై, సర్వ ప్రయత్నములతోడతన ఇష్టలింగమునందే శివుడిని బూజించదగును॥59॥ శివుడు సర్వత్ర వ్యాపించి యున్నను సర్వత్రప్రేమ (భక్తి) యుంచక తన ఇష్టలింగమునందే శివుని బూజించువాడు సర్వగత్వ నిరాసకుడని జెప్పబడును ॥60॥

## 23. శివజగన్మయస్థలం

॥శ్లో॥ పూజా విధౌ నియమ్యత్వాల్లింగ మాత్రే స్థితం శివం
పూజయన్నపి దేవస్య సర్వగత్వం విభావయేత్ ॥ 61 ॥

యస్మాదేతత్సముత్పన్నం మహాదేవాచ్చరాచరం
తస్మాదేతన్న భిద్యేత యథా కుంభాదికం మృదః ॥ 62 ॥

శివతత్త్వాత్సముత్పన్నం జగదస్మాన్న భిద్యతే
ఫేనోర్మిబుద్బుదాకారో యథాసింధోర్న భిద్యతే

యథా తంతుభిరుత్పన్నః పట స్తంతుమయః స్మృతః
తథా శివాత్సముత్పన్నం శివ ఏవ చరాచరం ॥ 64 ॥

ఆత్మశక్తివికాసేన శివో విశ్వాత్మనా స్థితః
కుటీభావాద్యథా భాతి పటః స్వస్య ప్రసారణాత్ ॥ 65 ॥

పత్రశాఖాదిరూపేణ యథా తిష్ఠతి పాదపః
తథా భూమ్యాదిరూపేణ శ్లి ఏకో విరాజతే ॥ 66 ॥

శివుడు భక్తాధీనుడైయుంటవలన పూజకుడు పూజా సమయమున తన ఇష్టలింగము నందు మాత్రమే నివసించి యున్నాడని భావించి పూజించినను ఆ మీదట శివుడు సర్వవ్యాపకుడనియే దెలియవలెను. ॥61॥ మట్టితో జేయబడినకుండ మొదలైన పాత్రలు మట్టి నుండి యెట్లు వేరుబడవో (తద్భిన్నములుగావో) అట్లే శివుని నుండి బుట్టిన ఈ చరాచరాత్మకమైన జగత్తు శివుని నుండి భిన్నమైనదిగాదు,సముద్రమునుండి పుట్టిన తరంగాలు, బుడగలు ఎట్లు సముద్రము కంటే భిన్నమైనవికావో - అట్లే శివతత్వమునుండి యుద్భవించిన ఈ జగత్తు శివుడికంటెను భిన్నమైనదిగాదు ॥63॥ తంత్రుల (దారముల)తోనేయబడిన పటము (వస్త్రము) తన వ్యాప్తి చేత వస్త్రమందిరము (డేరా) గా సిద్ధమైనదై అగపడుచున్నదో, అట్లే శివుడు తనలో నిత్య సంబంధముంటవలన విమర్శన శక్తి వికాసము చేత విశ్వరూపమును ధరించి యున్నాడు.॥64॥ శివుని చేత నుత్పన్నమైన చరాచరజగత్తు శివస్వరూపమై యున్నది. ॥65॥ వృక్షము తన పత్ర-పుష్ప-ఫలశాఖాదిరూపముతో నెట్లు విరాజిల్లుచున్నదో అట్లే శివుడు భూమిజలాది రూపము చేత విరాజిల్లు చున్నాడు. శ్రీ జగద్గురు రేణుక భగవత్పాదులు సమస్త చరాచరాత్మకమగు నీ జగత్తు సత్యమైనదనియు శివుని యొక్క పరిణామ రూపమైనదనియు ఈ స్థలమున సుస్పష్టముగా నాదేశించి యున్నారు. ఇదే విషయము:-

॥శ్లో॥"స్వశక్తి ప్రచయోऽస్య విశ్వం" అని శివసూత్రమునందును,
శక్తి శ్చ శక్తి మాంశ్చైవ -పదార్థ ద్వయముచ్యతే!
శక్తయోऽనస్యజగత్ కృత్స్నం -శక్తిమాంస్తు మహేశ్వరః॥

అను శ్లోకముచేత శ్రీ సర్వ మంగళ శాస్త్రము నందును ప్రతిపాదించబడినది. ఈ కారణము చేత చరాచరాత్మకమగునీ జగత్తు సాక్షాత్తుగా శివస్వరూపమైయుండి సత్యమైనదేయని సిద్ధమగుచున్నది ॥66॥

## 24. భక్త దేహిక లింగస్థలం

||శ్లో|| సమస్తజగదాత్మాపి శంకరః పరమేశ్వరః
భక్తానాం హృదయాంభోజే విశేషేణ విరాజితే || 67 ||

కైలాసే మందరే చైవ హిమాద్రౌ కనకాచలే
హృదయేషు చ భక్తానాం విశేషేణ శివః స్థితః || 68 ||

సర్వాత్మాకపి పరిచ్ఛిన్నో యథా దేహేషు వర్తతే
తథాస్వకీయభక్తేషు శంకరో భాసతే సదా || 69 ||

నిత్యం భాతి త్వదీయేషు యా తే రుద్ర శివా తనూః
అఘోరాక పాపకాశీతి శ్రుతిరాహ సనాతనీ || 70 ||

విశుద్ధేషు విరక్తేషు వివేకిషు మహాత్మసు
శివస్తిష్ఠతి సర్వాత్మా శివలాంఛన ధారిషు || 71 ||

నిత్యం సంతోషయుక్తానాం జ్ఞాననిర్ధూతకర్మణాం
మాహేశ్వరాణా మంతస్థో విభాతి పరమేశ్వరః || 72 ||

అన్యత్ర శంభోరతి మాత్రశూన్యో
నిజేష్టలింగే నియతాంతరాత్మా
శివాత్మకం విశ్వమిదం విబుధ్యన్
మాహేశ్వరోక సౌ భవతి ప్రసాదీ || 73 ||

శివుడు సమస్త చరాచరాత్మకమగు జగత్స్వరూపుడై యున్ననుభక్తుల హృదయకమలము నందు విశేషముగా విరాజిల్లు చున్నాడు. ||67|| శివుడు కైలాస పర్వతమునందుగాని లేదా మందరపర్వతమునందుగాని, హిమాలయమునందు గాని, అథవామేరు పర్వతమున గాని ఉండుటేగాకుండభక్తజనహృదయములందు విశేషముగా నివసించి యుండును ||68|| శివుడు సర్వాత్మకుడైనప్పటికి పరిచ్ఛిన్నుడైదేవ తిర్యఙ్మనుష్యాది దేహములందు ఎలా నివసించి యుండునో అట్లే తన భక్తులలో నెల్లప్పుడు నివసించి యుండును. ||69|| ఓయీ! రుద్రుడా! ఏనీ యొక్క శాంతగుణము దోషరహితమైన శుభకరమగు శరీరము (శివలింగమూర్తి)నీకు సంబంధించిన శివభక్తులలో ప్రకాశించుచున్నదని యజుర్వేదము "యాతేరుద్ర శివాతనూరఘోరాక పాపకాశినీ" అను మంత్రముతో బోధిస్తుంది ||70||

పరిశుద్ధులైన వారు, వైరాగ్య సంపన్నులు. జ్ఞానులు మహాత్ములైనవారు, శివలాంఛన ధారులలో సర్వాత్ముడైన శివుడు నివసించి యున్నాడు ॥71॥ పరమేశ్వరుడెల్లప్పుడు సంతోషయుక్తులు జ్ఞానముచేత పశుకర్మమును దూరగించిన వారైన మాహేశ్వరుల హృదయమందుండి ప్రకాశించు చుండును ॥72॥ శివేతర దేవతలలో ప్రేమలేని వాడు దన ఇష్టలింగమునందు అంతరాత్ముని సంబంధమున్నవాడు చరాచరాత్మక ప్రపంచమును శివస్వరూపముగా గ్రహించిన ఈ మాహేశ్వరుడే ప్రసాది యనఁబడును ॥73॥

ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ మహేశ్వరస్థితే
మాహేశ్వర ప్రశంసాది నవవిధ స్థల ప్రసంగోనామ
దశమ పరిచ్ఛేదః పరిసమాప్తః

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణిలో మాహేశ్వర స్థలమున
మాహేశ్వరుడే ప్రసాదియను నవవిధస్థల
విచారాత్మకమైన పదవ పరిచ్ఛేదము పరిసమాప్తము



# శ్రీసిద్ధాంత శిఖామణి

## ఏకాదశపరిచ్ఛేదః

## పదునొకండవ పరిచ్ఛేదం

అగస్త్య ఉవాచ:-

॥శ్లో॥ ఉక్తో మాహేశ్వర స్సాక్షాల్లింగ నిష్ఠాదిధర్మవాన్
కథమేష ప్రసాదీతి కథ్యతే గణనాయక ॥ 1 ॥

రేణుక ఉవాచ :-

లింగనిష్ఠాదిభావేన ధ్వస్తపాపనిబంధనః
మనఃప్రసాదయోగేన ప్రసాదీత్యేష కథ్యతే ॥ 2 ॥

ప్రసాదిస్థల మిత్యేతదన్య మాహాత్మ్య బోధకం
ఆంతరస్థల భేదేన సప్తధా పరికీర్తితం ॥ 3 ॥

ప్రసాదిస్థలమాదౌతుగురుమహాత్మ్యకం తతః
తతో లింగప్రశంసాచతతో జంగమ గౌరవం ॥ 4 ॥

తతోభక్తస్యమాహాత్మ్యం తతః శరణ కీర్తనం
శివప్రసాదమాహాత్మ్యమితి సప్తప్రకారకం
క్రమాల్లక్షణమేతేషాం కథయామి మహామునే

ఓయీ! గణాధీశ్వరా! లింగనిష్ఠాది ధర్మము గలవాడు మాహేశ్వరుడని చెప్పబఁడినది. ఈ మహేశ్వరుడే ప్రసాదియని యెట్లు నిరూపించబడును? అను దానిని గురించి అగస్త్య మహర్షి గారు ప్రశ్నింపగా అద్దానికి శ్రీ రేణుకా చార్యులవారు ఓయీ! అగస్త్య మహర్షి! లింగనిష్ఠాది స్థలములను ఆచరించుట వలన ఇతడు పాపమునుండి విముకుడైమనః ప్రసాదయోగమునుండి ప్రసాదియని చెప్పబడును. ప్రసాది మహిమను బోధించును.ఈ ప్రసాది స్థలము అవాంతర భేదముచేత ప్రసాది స్థలము, గురుమాహాత్మ్యస్థలము, లింగమాహాత్మ్య స్థలము! జంగమాహాత్మ్యస్థలము, భక్త మాహాత్త్య స్థలము, శరణ మాహాత్మ్యస్థలము, ప్రసాది మాహాత్మ్యస్థలము అని ఏడు రకాలుగా నున్నది. వీటి యొక్క లక్షణము అను క్రమముగా చెప్పఁబడును, అని అనతిచ్చి అట్టి స్థలముల విషయమును బోధించుటకుపక్రమించబడును అని ఆదేశించిరి (3-4-5)

# 25. ప్రసాది స్థలం

॥శ్లో॥ నైర్మల్యం మనసో లింగం ప్రసాద ఇతికథ్యతే
శివస్య లింగరూపస్య ప్రసాదాదేవ సిద్ధ్యతి ॥ 6 ॥

శివ ప్రసాదో యద్ద్రవ్యం శివాయ విని వేదితం
నిర్మాల్యం తత్తు శైవానాం మనో నైర్మల్యకారణం ॥ 7 ॥

మనః ప్రసాద సిద్ధ్యర్థం నిర్మల జ్ఞాన కారణం
శివ ప్రసాదం స్వీకుర్వన్ ప్రసాదీత్యేష కథ్యతే ॥ 8 ॥

అన్న శుద్ధ్యా హి సర్వేషాం తత్త్వశుద్ధి రుదాహృతా
విశుద్ధ మన్న జాతం హి యచ్ఛివాయ సమర్పితం ॥ 9 ॥

తదేవ సర్వకాలం తు భుంజానో లింగ తత్పరః
మనః ప్రసాదమతులం లభతే జ్ఞానకారణం ॥ 10 ॥

ఆత్మభోగాయ నియతం యద్యద్ద్రవ్యం సమాహితం
తత్తత్సమర్ప్య దేవాయ భుంజీతాత్మ విశుద్ధయే ॥ 11 ॥

నిత్యసిద్ధేన దేవేన భిషజా జన్మరోగిణాం
యద్యత్ప్రసాదితం భుక్త్వా తత్తజ్జన్మ రసాయనం ॥ 12 ॥

ఆరోగ్య కారణం పుంసామంతఃకరణ శుద్ధిదం
తాపత్రయమహారోగసముద్ధరణ భేషజం ॥ 13 ॥

విద్యావైశద్యకరణం వినిపాత విఘాతనం
ద్వారం జ్ఞానావతారస్య మోహచ్ఛేదస్య కారణం ॥ 14 ॥

వైరాగ్యసంపదో మూలం మమానందప్రవర్ధనం
దుర్లభం పాపచిత్తానాం సులభం శుద్ధకర్మణాం ॥ 15 ॥

అదృతం బ్రహ్మ విష్ణ్వా ద్యైర్వ సిష్ఠాద్యైశ్చ తాపసైః
శివస్వీకృతమన్నాద్యం స్వీకార్యం సిద్ధి కాంక్షిభిః ॥ 16 ॥

పత్రం పుష్పం ఫలం తోయం యచ్ఛివాయ నివేదితం
తత్తత్ స్వీ కార యోగేన సర్వ పాపక్షయో భవేత్ ॥ 17 ॥

మనస్సు యొక్క నిర్మలత్వ చిహ్నము ప్రసాదియనబడును. ఇట్టి ప్రసాదములింగ స్వరూపమైన శివుని యొక్క ప్రసాదము (అనుగ్రహము)తోనే సిద్ధించును ॥6॥ఏ వస్తువు శివునికి సమర్పించబడుతుందో అదియే శివ ప్రసాద మనబడును. అట్టి శివ ప్రసాదము వీరశైవుల మనోనైర్మల్యమునకు గారణము (మూల)మై యున్నది ॥7॥ మనః ప్రసాద సిద్ధి కొరకు శివ జ్ఞానమునకు గారణీ భూతమైన శివ ప్రసాదమును స్వీకరించునట్టి యీ మహేశ్వ రుడే ప్రసాదియనబడును ॥8॥ అన్నము పరిశుభ్రత వలననే సమస్త ప్రాణులకు తత్వశుద్ధి యేర్పడునని శాస్త్రములందు నిరూపించబడినది. ఏది శివునికి సమర్పింపఁబడుతుందో అది పరిశుద్ధమైన ప్రసాదమనబడుతుంది ॥9॥ లింగనిష్ఠగలవాడు ఎల్లప్పుడు ఆ శివ ప్రసాదమునే స్వీకరించువాడే శివజ్ఞానమునకు కారణమైన మనో నైర్మల్యము పొందును. అనుభవించ దలచిన ఆయావస్తువులను శివుడి నుంచి చిత్త శుద్ధికి గాను వానినే స్వీకరించదగును ॥11॥ భవరోగులకు వైద్యుడు శివలింగమునందెల్లప్పుడు నివసించియుండువాడు ఐన శివుని వలన ఏ ఏ వస్తువు స్వీకరించబడి ప్రసాదరూపమున మార్చబడుతుందో ఆయా వస్తువు సంసారరూపమగు రోగమునకు రసాయన స్వరూపముగా నున్నది ॥12॥ ఆరోగ్యమునకు కారణమైన మానవులకు చిత్త శుద్ధిని గలుగ జేయునది, ఆధ్యాత్మికము - అధిభౌతికము-అధి దైవికము రూప-తాప-త్రయ మను మహారోగమును నశింపఁజేయుటలో ఔషధ స్వరూపమైనది. ఆత్మ-విద్యా- వికాసమునకు మూలసాధన భూతమైనది. వైరాగ్య సంపదకు మూలమైనది, శాశ్వతానందము నభివృద్ధి పరచునది పాపాత్ములకు దుర్లభమైనది. కృత్రిమదోషములను నశింపజేయునది శివజ్ఞానావిర్భావమునకు ద్వారమువలెనున్నది. మోహనాశనమునకు కారణమైనది. బ్రహ్మ విష్ణు-మొదలైనదేవతల చేత వశిష్ఠమున్నగు మహర్షుల చేత స్వీకరించ బడినది. ఐన శివస్వీకృతమైన అన్నాది రూపప్రసాదమును మోక్ష సిద్ధి కాంక్షులు భక్తి చేత స్వీకరించవలెను ॥13-14-15-16॥ పత్రము గాని,పుష్పముగాని, ఫలముగాని -జలముగాని , వీనిలో దేనిని శివుడికి సమర్పించబడునో, ఆయా పదార్థములను స్వీకరించుట వలన సమస్త పాపముల నశించును ॥17॥

## 26. గురుమాహాత్మ్య స్థలం

॥శ్లో॥ యథా శివప్రసాదాన్నం స్వీకార్యం లింగతత్పరైః
తథాగురోః ప్రసాదాన్నం తథైవ శివయోగినాం ॥ 18 ॥

గురురేవాత్ర సర్వేషాం కారణం సిద్ధి కర్మణాం
గురురూపో మహాదేవో యతః సాక్షాదుపస్థితః ॥ 19 ॥

నిష్కలోనపి మహాదేవో నిత్యజ్ఞానమహోదధిః
సకలో గురురూపేణ సర్వాను గ్రాహకో భవేత్ ॥ 20 ॥

యః శివః స గురుర్జ్ఞేయో యో గురుః స శివః స్మృతః
న తయోరంతరం కుర్యాద్ జ్ఞానావాప్త్యై మహామతిః ॥ 21 ॥

హస్త పాదాది సామ్యేన నేత్రాద్యైః సదృశం వదేత్
ఆచార్యం జ్ఞానదం శుద్ధం శివరూపతయా స్థితం ॥ 22 ॥

ఆచార్య స్యావమానేన శ్రేయఃప్రాప్తి ర్విహన్యతే
తస్మాన్ని శ్రేయసః ప్రాప్త్యై పూజయేత్తం సమాహితః ॥ 23 ॥

గురుభక్తి విహీనస్య శివభక్తిర్న జాయతే
అతః శివే యథా భక్తి స్తథా భక్తిర్గురావపి ॥ 24 ॥

లింగనిష్ఠగలవాడు శివప్రసాదాన్నమును ఎట్లు స్వీరించునో అట్లే ప్రసాదాన్నమును, జంగమ ప్రసాదాన్నమును స్వీకరించవలెను ॥18॥ ఈ లోకమున భోగమోక్షరూపమైన సమస్త సిద్ధి క్రియలకు గురువేమూలకారణీభూతుడైయున్నాడు. ఏలనన శివుడే ప్రత్యక్షముగ గురురూపముననున్నాడు. ఆ కారణమున నగురోరధికం, నగురోరధికం! శివశాసనతః మరియు "నాస్తితత్త్వగురోఃపరం" ఇత్యాది వాక్యములతో శ్రుతులు గురువుయొక్క మహిమను విశేషించి పొగడుచున్నవి ॥19॥ నిత్యజ్ఞాన సముద్ర స్వరూపుడైన శివుడు అవయవరహితుడై యున్నను గురురూపమున అవయవ విశిష్టుడై సమస్త ప్రాణులను అనుగ్రహించును ॥20॥ ఎవడు శివుడో వాడే గురువనియు, ఎవడు గురువో ఆతడే శివుడనియుదెలియవలెను, పరిపూర్ణముగ జ్ఞానియైనవాడు జ్ఞానప్రాప్తి కొరకు వారిరువురిలో భేద బుద్ధిని జూపగూడదు ॥21॥ పరిశుద్ధుడు (నిర్మలుడు) జ్ఞానము నొసగువాడును, శివస్వరూపుడు ఐన గురువును కరచరణాది దృష్టాంతములతో ఇతరులతో పోల్చి(సారూప్యత) మాట్లాడగూడదు ॥22॥ గురువును అవమానించుట వలన శ్రేయస్సు నశించును, అందుచేత భోగమోక్ష ప్రాప్తి కొరకు శ్రీ గురువును ఏకాగ్ర చిత్తుడై పూజించవలెను ॥23॥ గురుభక్తి శూన్యునకు శివభక్తి యంకురించదు. ఆ కారణమున శివునిమాదిరిగానే గురువునందును భక్తిని ఉంచవలెను, ఇదే విషయమును శ్వేతా శ్వతర శ్రుతి" యస్యదేవే పరాభక్తిర్యథా దేవేతథాగురౌ" అనియుద్బోధించుచున్నది ॥24॥

## 27. లింగమాహాత్మ్యస్థలం

॥శ్లో॥ గురుమాహాత్మ్య యోగేన నిజజ్ఞానాతిరేకతః
లింగస్యాపిచ మాహాత్మ్యంసర్వోత్కృష్టం విభావ్యతే ॥ 25 ॥

శివస్య బోధలింగం యద్గురు బోధిత చేతసా
తదేవ లింగం విజ్ఞేయం శాంకరం సర్వకారణం ॥ 26 ॥

పరం పవిత్రమమలం లింగం బ్రహ్మ సనాతనం
శివాభిధానం చిన్మాత్రం సదానందం నిరంకుశం ॥ 27॥

కారణం సర్వలోకానాం వేదానామపి కారణం
పూరణం సర్వతత్త్వానాం తారణం జన్మవారిధేః ॥ 28 ॥

జ్యోతిర్మయమనిర్దేశ్యం యోగినామాత్మని స్థితం
కథం విజ్ఞాయతే లోకే మహాగురుదయాం వినా ॥ 29 ॥

బ్రహ్మణా విష్ణునా పూర్వం యల్లింగం జ్యోతిరాత్మకం
అపరిచ్ఛేద్య మభవత్ కేన వా పరిబోధ్యతే ॥ 30 ॥

బహునాత్ర కిముక్తేన లింగం బ్రహ్మ సనాతనం
యోగినో యత్ర లీయంతే ముక్త పాశనిబంధనాః ॥ 31 ॥

పీఠికా పరమా శక్తి ర్లింగం సాక్షాత్పరః శివః
శివశక్తి సమాయోగం విశ్వం లింగం తదుచ్యతే ॥ 32 ॥

బ్రహ్మాదయః సురాః సర్వే మునయః శౌనకాదయః
శివలింగార్చనా దేవ స్వం స్వం పదమవాప్నువన్ ॥ 33 ॥

విశ్వాధిపత్య మీశస్య లింగమూర్తే స్వభావజం
అనన్య దేవ సాదృశ్యం శ్రుతిరాహసనాతనీ ॥ 34 ॥

గురుమహిమాతిశయము (యోగము) వలన, యథార్థమైన జ్ఞానాధిక్యము చేతను శివలింగము యొక్క మహిమనైన సర్వోత్తమమైనదిగా తెలియవలెను ॥25॥ శివుని యే చిన్మయ లింగమున్నదో అది సమస్తమునకు మూలభూతమగును. ఆ లింగము గురుబోధయుక్తమైన మనస్సుతోనే తెలిసికొనుటకు సాధ్యమగును ॥26॥ శ్రేష్ఠము, పవిత్రము

ఆణవాది మలరహితము. బ్రహ్మపదవాచ్యము సనాతనము, శివనామాంకము, జ్ఞాన స్వరూపము, సత్య స్వరూపము. ఆనంద స్వరూపంబునైన, నిరంకుశము, సమస్త లోకములకు, వేదములకును గారణభూతము, షట్త్రింశత్తత్త్వపూరితము, భవసాగర తారకము, జ్యోతి స్వరూపము, యోగి జనులకు సహకారణమైనదై, స్వస్వరూపస్థితము ఐన లింగము ఈ లోకమునందుమహాగురువు యొక్క అనుగ్రహములేనిదే ఎట్లు బోధపడును? శ్రీ గురువు యొక్క అనుగ్రహములేనిదే లింగస్వరూపజ్ఞానముగలుగనేరదని భావము ॥27-28-29॥

జ్యోతిర్మయమైన లింగము పూర్వకాలమున విష్ణు-బ్రహ్మలకు గూడ తెల్సుకొనుటకు శక్యముగానిదై యుండెనో అట్టి లింగము ఎవరికి దానే తెలిసికొనుటకు ఎట్లు సాధ్యమగును? అనగా ఎవరికిని దెలిసికొనుటకు శక్యముగాదని భావము, ఇందుకు శ్రీ గురువు యొక్క అనుగ్రహమే మూలకారణమని భావము.

"వరాహో విష్ణుర్నిమమజ్జిభూమౌ!
బ్రహ్మోత్పపాత దివమాశుహంసః!!

అని లింగ సూత్రముగలదు -విష్ణు-బ్రహ్మలు వరాహ- హంస రూపములను ధరించి పరమాత్మని వెదకి చూడక (కనుగొనక లేక)పోయిరనుట చరిత్ర బోధించుచున్నది ॥30॥ వెయ్యేల? ఆ లింగము శాశ్వతమైన పరబ్రహ్మమై ప్రకాశించుచున్నది. యోగీశ్వరులు భవపావమునుండి విముక్తిని బొంది ఆ వస్తువులోనే లీనమై యుందురు ॥31 ॥

క్రియాశక్త్యాత్మకం పీఠం-జ్ఞానశక్త్యాత్మనః ప్రభోః

అనే శివాగమ ప్రమాణాను సారముగ శక్తి పీఠముగాను పరమశివుడు లింగముగాను నిరూపించబడినది. శివశక్తుల సంబంధముగల ఆ లింగము విశ్వమనబడును. అర్థాత్ జగత్తు లింగరూపమై యున్నదని భావము ॥32॥ బ్రహ్మాది సమస్త దేవతలు, శౌనకాది మునులు, శివ లింగపూజవలన తమతమ స్థానములను బడసిరి(పదవులను బొందిరి) ॥33॥ లింగరూపుడైన పరమేశ్వరునకు విశ్వాధిపత్యము స్వభావ సిద్ధముగా నుండుటే గాక అన్య దేవతా సాదృశ్యము సంభవించదనియు (పొసగజాలదనియు) శ్రుతియుద్ఘోషించు చున్నది.

"విశ్వాధి కోరుద్రో మహర్షిః! హిరణ్య గర్భ జనయా- మాస పూర్వం- న తత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతె!! అను నీ శ్వేతాశ్వతరశ్రుతి ఇదే విషయమును బోధించుచున్నది ॥34॥

## 28. జంగమ మాహాత్మ్యస్థలం

॥శ్లో॥ గురుశిష్యసమారూఢలింగ మాహాత్మ్య సంపదః
సర్వచిద్రూపవిజ్ఞానాజ్జంగ మాధిక్యముచ్యతే ॥ 35 ॥

జానంత్యతిశయా ద్యే తు శివం విశ్వప్రకాశకం
స్వస్వరూపతయా తే తు జంగమా ఇతి కీర్తితాః ॥ 36 ॥

యే పశ్యంతి జగజ్జాలం చిద్రూపం శివయోగతః
నిర్ధూతమల సంస్పర్శాస్తే స్మృతాః శివయోగినః ॥ 37 ॥

ఘోర సంసార తిమిరపరిధ్వంసన కారణం
యేషామస్తి శివజ్ఞానం తే మతాః శివయోగినః ॥ 38 ॥

జితకామా జితక్రోధా మోహగ్రంథి విభేదినః
సమలోష్టాశ్మకనకాః సాధవః శివయోగినః ॥ 39 ॥

సమాః శత్రౌ చ మిత్రే చ సాక్షాత్కృత శివాత్మకాః
నిఃస్పృహా నిరహంకారా వర్తంతే శివయోగినః ॥ 40 ॥

దుర్లభం హి శివజ్ఞానం దుర్లభం శివచింతనం
యేషామేతద్ద్వయం చాసి తేహి సాక్షాచ్ఛివాత్మకాః ॥ 41 ॥

పాదాగ్రేణవో యత్ర పతంతి శివయోగినాం
తదేవ సదనం పుణ్యం పావనం గృహమేధినాం ॥ 42 ॥

సర్వసిద్ధికరం పుంసాం దర్శనం శివయోగినాం
స్పర్శనం పాపశమనం పూజనం ముక్తి సాధనం ॥ 43 ॥

మహతాం శివతాత్పర్యవేదినామనుమోదినాం
కింవాఫలం హినోసిద్ధ్యేత్ సంపర్కాచ్ఛివయోగినాం ॥ 44 ॥

గురు శిష్యులకు సంబంధించిన లింగమాహాత్మ్యస్థల వైభవమునకంటెను ఈ జంగమస్థలము సమస్త ప్రపంచమును జిద్రూపముగా దెలిసికొనుట వలన జంగమ మాహాత్మ్యస్థలమని జెప్పబడుతుంది.॥35॥ తన జ్ఞాన శక్తి క్రియాశక్తులతో చరాచర ప్రపంచమును ప్రకాశింపజేయుచున్న శివుని అతిశయముగ స్వరూపము చేత ఎవరైతే తెలిసి కొందురో,

వారే జంగమమనియు చెప్పుదురు, జంగమమనగా గురు స్థలము యొక్క చరమూర్తులు ॥36॥ ఎవరైతే ఈ సమస్త ప్రపంచమును శివుని సంబంధము వలన చిత్ క్రియా స్వరూపముగా తెలిసి కొందురో అణవాదిమల సంస్పర్శమునుండి దూరమైన వారె జంగములని చెప్పబడుదురు ॥37॥ భయంకరమగు సంసారమను అంధకారమును బారదోలుటకు (నశింపజేయు టకు) కారణభూతమైన శివజ్ఞానము ఎవరియందున్నదో, వారె శివయోగులని చెప్ప బడు చున్నారు. ॥38॥ కామక్రోధములను జయించిన వారు, మోహగ్రంధిని ఛేదించినవారు మట్టిపెడ్డ-రాయి బంగారములను సమానముగా పరిగణించువారు, సాధు స్వభావము గల వారు శివయోగులనబడుదురు ॥39॥ శివ యోగులైనవారు శతృ-మిత్రులయందు సమభావము గలిగి యుందురు, శివస్వరూపమును సాక్షాత్కరించికొన్న వారైనను, ఆశారహితులై అహంకారరహితులై నిరహంకారులై యుందురు ॥40॥ శివజ్ఞానము దుర్లభమైనది. ఆ శివుడేనేనను చింతన దుర్లభమైనది. ఈ రెండును ఎవరియందున్నవో వారె ప్రత్యక్షముగా శివస్వరూపులు ॥41॥ శివయోగుల పాదరేణువులు ఎవరి గృహమున పడునో ఆ గృహస్థాశ్రమమువారి గృహమే పవిత్రమైన దగును ॥42॥ శివయోగుల దర్శనము మానవులకు సమస్త సిద్ధులను గలుగ జేయును. వారి స్పర్శనము సమస్త పాపములను శమింపఁజేయును. వారినర్చించిన యెడల ముక్తికి మూలమైనవి శివ రహస్యమును దెల్సిన వారు, శివ సుఖముననుభవించువారును. మహాత్ములైన శివయోగుల సహవాసము చేత యెట్టి ఫలము సిద్ధించదు? (తప్పక సిద్ధించునని భావము) సమస్త ఫలములు సిద్ధించును.॥44॥

## 29. భక్తమాహాత్మ్యస్థలం

॥శ్లో॥ గురోర్లింగస్య మాహాత్మ్యకథనాచ్ఛివయోగినాం
సిద్ధం భక్తస్య మాహాత్మ్యం తథా హ్యేష ప్రశస్యతే ॥ 45 ॥

యే భజంతి మహాదేవం పరమాత్మా సమవ్యయం
కర్మణా మనసా వాచా తే భక్తా ఇతి కీర్తితాః ॥ 46 ॥

దుర్లభా హి శివే భక్తిః సంసార భయతారిణీ
సా యత్ర వర్తతే సాక్షాత్ స భక్త ఇతి గీయతే ॥ 47 ॥

కిం వేదైః కిం తతః శాస్త్రైః కిం యజ్ఞైః కిం తపోవ్రతైః
నాస్తి చేచ్ఛాంకరీ భక్తి ర్దేహినాం జన్మరోగితాం ॥ 48 ॥

శివభక్తి విహీనస్య సుకృతం చాపి నిష్ఫలం
విపరీత ఫలం చ స్యాద్దక్షస్యాపి మహాధ్వరే ॥ 49 ॥

అత్యంత పాపకర్మాపి శివభక్త్యా విశుద్ధ్యతి
చండో యథా పూరాభక్త్యా పితృహాపిశివో2 భవత్ ॥ 50 ॥

సుకృతం దుష్కృతం చాపి శివ భక్తస్య నాస్తి హి
శివభక్తి విహీనా నాం కర్మపాశ నిబంధనం ॥ 51 ॥

శివాశ్రితానాం జంతూనాం కర్మనా నాస్తి సంగమః
వాజినాం దిననాథస్య కథం తిమిరజం భయం ॥ 52 ॥

నిరోద్ధుం నక్షమం కర్మ శివభక్తాన్ విశృంఖలాన్
కథం మత్తగజాన్ రుంధే చ్ఛృంఖలా బిసతంతుజా ॥ 53 ॥

శుద్ధా నియమసంయుక్తాః శివార్పిత ఫలాగమాః
యేకర్చయంతి శివం లోకే విజ్ఞేయాస్తే గణేశ్వరాః ॥ 54 ॥

గురులింగ జంగముల యొక్క మాహాత్మ్యమును బోధించుట వలన అర్థాత్ భక్తుని యొక్క మాహాత్మ్యమైనను ప్రసిద్ధమైయున్నది. ఈ భక్తుడుగూడ ప్రశస్తిని బొందియున్నాడు ॥45॥ ఎవరైతె మనోవాక్కాయ కర్మల చేత అవ్యయుండైన శివ పరమాత్మను భక్తితో భజింతురో వారె పరమభక్తులని చెప్పబడుదురు ॥46॥ సంసార భయనాశకమగు శివభక్తియే దుర్లభమైనది. అట్టి శివభక్తి యెవనియందు మూర్తి వంతమై యున్నదో. ఆతడే నిజమైన భక్తుడని చెప్పబడుచున్నాడు ॥47॥ భవరోగగ్రస్తులైన మానవులకు శివభక్తి లేనిదే వారు వేద శాస్త్రములను అభ్యసించినను ప్రయోజనము లేదు. అట్టి వేదముల వలనను లాభములేదు. వారనుష్ఠించునట్టి యజ్ఞయాగములతో ప్రయోజనము లేదు. వారు ఆచరించునట్టి తపస్సు వ్రతములవలనను లాభము లేదు. ॥48॥ మానవుడు శివభక్తి రహితుడైన యెడల ఆతనిలోనున్న పుణ్యముగూడ నిష్ఫలమగును, అనిష్టఫలము నహప్రాప్తించును. దక్షుడు మహాపుణ్యశాలియైనను శివభక్తి శూన్యమగుట చేత యజ్ఞమునందు అనిష్ట ఫలముననుభవించెను. ॥49॥ మానవుడు గొప్పగొప్ప పాపకర్మములనాచరించినను శివభక్తితోనె పరిశుద్ధుడగును. పూర్వములో చండుడనే శివ భ క్తుడు తన తండ్రిని చంపినను శివుడే అయ్యెను ॥50॥ శివభక్తునకు పుణ్యముగాని, పాపముగాని లేదు. శివభక్తి శూన్యులుమును ఆచరించినట్టి కర్మాను గుణముగ

సుఖదుఃఖములను అనుభవించేతీరవలెను ॥51॥ శివుని ఆశ్రయించుకొని యున్న ప్రాణులకు కర్మ సంబంధమే ఉండదు. సూర్యుని గుర్రములకు చీకటి భయమెక్కడుండును?॥52॥

శివ మహిమ ద్వారా బంధనమునుండి విముక్తి బొందిన శివ భక్తులను అడ్డుకొనుటకు కర్మ ఎన్నటికిని సాహించదు. తామరతూండ్ల (తొడిమె-కాడ) తంత్రులతో సిద్ధగించిన శృంఖలము మదించిన ఏనుగులను బంధించుటకు శక్తి చాలదుగదా! ॥53॥ ఈ లోకమున ఎవరైతే పరిశుద్ధులై నియమ సంపన్నులయ్యును ఫలప్రాప్తిని శివునికి సమర్పించిన వారై శివార్చన గావింతురో, అట్టివారు గణేశ్వరులని చెప్పబడుదురు ॥54॥

## 30. శరణమాహాత్మ్యస్థలం

॥శ్లో॥ గురులింగాది మహాత్మ్య బోధా న్వేషణసంగతః
సర్వాత్మనా శివాపత్తిః శరణ స్థానముచ్యతే ॥ 55 ॥

బ్రహ్మాదివిబుధాన్ సర్వాన్ ముక్త్వా ప్రాకృత వైభవాన్
ప్రపద్యతే శివం యత్తు శరణం తదుదాహృతం ॥ 56 ॥

శరణ్యః సర్వభూతానాం శంకరః శశిశేఖరః
సర్వాత్మనా ప్రపన్నస్తం శరణాగత ఉచ్యతే ॥ 57 ॥

విముక్త భోగలాలస్యో దేవతాంతరనిః స్పృహః
శివమభ్యర్థయన్ మోక్షం శరణార్థీతి గీయతే ॥ 58 ॥

యే ప్రపన్నా మహాదేవం మనోవాక్కాయకర్మభిః
తేషాం తు కర్మజాతేన కిం వా దేవాదితర్పణైః ॥ 59 ॥

సర్వేషామపి యజ్ఞానాం క్షయీ స్వర్గఫలాయతే
అక్షయం ఫలమాప్నోతి ప్రపన్నః పరమేశ్వరం ॥ 60 ॥

ప్రపన్న పారిజాతస్య శివస్య పరమాత్మనః
ప్రపత్త్యా కిం న జాయేత పాపినామపి దేహినాం ॥ 61 ॥

ప్రపన్నానాం మహాదేవం పరిపక్వాంతరాత్మనాం
జన్మైవ జన్మనా న్యేషాం వృథా జననసంగినాం ॥ 62 ॥

దుర్లభం మానుషం ప్రాప్య జననం జ్ఞానసాధనం
యేన జానంతి దేవేశం తేషామాత్మా నిరర్థకః ॥ 63 ॥

తత్కులం హి సదా శుద్ధం సఫలం తస్య జీవితం
యస్య చిత్తం శివే సాక్షాద్విలీనమబహిర్ముఖం ॥ 64 ॥

గురులింగజంగమాదుల మహిమాపూర్ణజ్ఞానాన్వేషణ సంబంధముతో సర్వ విధముల శివుడే రక్షకుడై యున్నాడని తెలిసి(భావించి) ఆచరించుట శరణ స్థలమనబడును ॥55॥ శివఏకోధ్యేయః శివం కరః సర్వ మన్యత్పరిత్యజ్య" అను శ్రుతి వాక్యానుసారముగా ప్రకృతి సంబంధమైన వైభవముగల బ్రహ్మాది సకల దేవతలను వదలి ఏ స్థలము కేవలముగా శివుడినే ఆశ్రయించి యుండునో అదే శరణ స్థలమని చెప్పబడును ॥56॥ చంద్రశేఖరుండైన శంకరుడు సమస్త ప్రాణుల ను పాలించుటలో సమర్థుడనియు తెలిసి అట్టిశివుని సర్వ విధముల శరణుజొచ్చిన వాడు శరణాగతుడని చెప్పబడును ॥57॥ ఎవడైతే విషయ సుఖాసక్తులకు దూరమగుచున్నాడో, బ్రహ్మాది దేవతాస్థానములందు నిస్పృహుడై శివుని గురించి మోక్షమును ప్రార్థించునో ఆతడే శరణార్థుడని చెప్పబడును ॥58॥ ఎవరు మనోవాక్కాయ కర్మల చేత శివుని శరణు బొందెదరో అట్టి వారికి యజ్ఞాది కర్మ సమూహమునుండి గాని దేవతాతర్పణములనుండి గాని ఏమి ప్రయోజనము? ఎట్టి ప్రయోజనము లేదని భావము ॥59॥ జ్యోతిష్టోమాది సమస్త యజ్ఞములన్ని యక్షయరూపమై నశించె అథవా క్షణిక్షసుఖమునిచ్చే స్వర్గఫలముగా నున్నవి. కాని శివుని శరణు బొందిన వాడు మాత్రము అక్షయమైన (తరగని -శాశ్వతము) మోక్షఫలమును బొందును ॥60॥ శరణాగతులకు గల్పవృక్షమైయున్న పరమశివుడు తన శరణాగతులకు వారు పాపభూయిష్ఠులైనను సర్వ సుఖశాంతులనను గ్రహించును ॥61॥ శివుని శరణు జొచ్చిన శుద్ధాంతః కరణులైన వారి జన్మమే జన్మము అనగా అట్టి వారే ధన్యజీవులు అని అర్థము. శివుని శరణు బొందని మానవుల జన్మ వ్యర్థము ॥62॥ దుర్లభమైన జ్ఞాన సాధనీభూతమగు మనుష్య జన్మముబడసి యెవరు శివస్వరూపమును గుర్తించరో వారి ఆత్మ స్వరూపమునిరర్థకమైనదేయగును ॥63॥ ఎవడి మనస్సు శివుని యందు అంతర్ముఖముగా లీనమగునో ఆతని వంశము పరిశుద్ధమగును. మరియు ఆతని జీవితము సఫలమగును ॥64॥

## 31. ప్రసాద మాహాత్మ్యస్థలం

॥శ్లో॥ గురులింగాది మాహాత్మ్య విశేషానుభవస్థితిః
యస్మాచ్ఛివ ప్రసాదాత్ స్యాత్త దస్య మహిమోచ్యతే ॥ 65 ॥

సదా లింగైకనిష్ఠానాం గురుపూజానుషంగిణాం
ప్రపన్నానాం విశుద్ధానాం ప్రసీదతి మహేశ్వరః ॥ 66 ॥

ప్రసాదోఽపి మహేశస్య దుర్లభః పరికీర్త్యతే
ఘోర సంసారసంతాపనివృత్తి ర్యేన జాయతే ॥ 67 ॥

యజ్ఞాస్తపాంసి మంత్రాణాం జపశ్చింతా ప్రబోధనం
ప్రసాదార్థం మహేశస్య కీర్తితాని న సంశయః ॥ 68 ॥

ప్రసాదమూలాః సర్వేషాం భక్తిరవ్యభిచారిణీ
శివప్రసాదహీనస్య భక్తిశ్చాపి న సిద్ధ్యతి ॥ 69 ॥

గర్భస్థో జాయమానో వా జాతో వా బ్రాహ్మణోఽథవా
అంత్యజో వా పి ముచ్యేత ప్రసాదే సతి శాంకరే ॥ 70 ॥

బ్రహ్మాద్యా విబుధాః సర్వే స్వస్వస్థాన నివాసినః
నిత్య సిద్ధా భవంత్యేవ ప్రసాదాత్పరమేశ్వరాత్ ॥ 71 ॥

ప్రసాదే శాంభవే సిద్ధే పరమానంద కారిణీ
సర్వం శివమయం విశ్వం దృశ్యతే నాత్ర సంశయః ॥ 72 ॥

సంసార చక్ర నిర్వాహనిమిత్తం కర్మ కేవలం
ప్రసాదేనవినా శంభోర్న కస్యాపి నివర్తతే ॥ 73 ॥

బహునాత్ర కిముక్తేన నాస్తి నాస్తి జగత్త్రయే
సమానమధికం చాపి ప్రసాదస్య మహేశితుః ॥ 74 ॥

శివ ప్రసాదేనతి యోగా భాజః
సర్వం శివైకాత్మత యావిభాతి
స్వకర్మ ముక్తః శివ భావితాత్మం
సప్రాణి లింగీతిని గద్యతే కసౌ ॥ 75 ॥

గురు-లింగ-జంగమాదుల మహత్త్వ విశేషానుభవస్థితి యే కారణముచేత శివ ప్రసాదము నుండి యేర్పడునో ఆకారణము చేతనే శివ ప్రసాదమహిమ నిరూపింపబడును ॥65॥ సదాశివలింగపూజా తత్పరులు. శివునికి శరణు జొచ్చిన వారైన శుద్ధాత్ములకు శివుడు ప్రసన్నుడగును ॥66॥ భయంకరమగు సంసారమునుండి గల్గిన సంతాపవిముక్తి దేని నుండి యేర్పడుచున్నదో అట్టి శివ ప్రసాదము గూడ అత్యంత దుర్లభమైనది ॥67॥ యజ్ఞము-తపస్సు-మంత్రజపము-ధ్యానము -జ్ఞానము-ఇవన్నియు శివప్రసాదము కొరకే. పరిశుదమగు భక్తికి శివ ప్రసాదమే ముఖ్య కారణము- శివ ప్రసాద శూన్యునకు భక్తి సిద్ధించదు. ॥69॥ శివప్రసాదము గలుగుటకు గర్భమునందున్నవాడే కానిండు పుట్టని వాడే గానిమ్ము. బ్రాహ్మణుడే గానిమ్ము. అథవా అంత్యజుడే గానిండు ముక్తుడగును. ॥70॥ శివప్రసాదమునుండి బ్రహ్మాది సమస్త దేవతలు తమతమ స్థానములందుండి నిత్య సిద్ధులగుదురు॥

"యస్య ప్రసాదాద్దేవస్య- బ్రహ్మ బ్రహ్మత్వ మాప్తవాన్!
విష్ణుత్వమపి విష్ణుశ్చన శివః కైర్నసేవ్యతే !!
సాక్షాల్లింగ ప్రసాదంతు - స్వదేహేధారయేన్నరః!
వజ్రకాయశ్చ భవతి- శివసాయుజ్య మాప్నుయాత్!

ఏ శివ ప్రసాదమునుండి బ్రహ్మ బ్రహ్మ పదవిని, విష్ణు, విష్ణు పదవిని, బడసియున్నారో, అట్టి శివుడు విశ్వవంద్యుడై యున్నాడనియు శివ ప్రసాదమును ఏ మానవుడు భక్తి పూర్వకముగా తన దేహమున (లింగమును) ధరించునో ఆతడు వజ్రకాయుడై అంత్య సమయమున శివసాయుజ్యము బొందుననియు శైవరత్నాకరమునందు శివ ప్రసాదమహిమను గురించి విశేషముగా నిరూపించబడినది. అందుచే మోక్షాపేక్షులైన మానవులు సర్వోత్తమంబగు శివ ప్రసాదమునందు అనన్యాదృశ్యమగు (అనన్యమగు) భక్తినుంచి వర్తించవలయుననునదే భగవత్పాదాచార్యులవారి ఆశయమై యున్నది ॥71॥ నిత్యానందమునకు హేతువైన శివ ప్రసాదము సిద్ధించుటకు సమస్త ప్రపంచము శివమయముగా నగుపడును. ఈ విషయమున ఎట్టి సంశయములేదు ॥72॥ ఈ సంసార చక్ర భ్రమణమునందు జిక్కి (తగులుకొని) జనన-మరణములను అనుభవించుటకు హేతువైన కర్మ శివ ప్రసాదమును వదలి మరే సాధనమునుండి నశించదు ॥73॥ వేయేల? శివ ప్రసాదమునకు సమానమైనది గాని అథవా అధికమైనదిగాని యీ ముల్లోకములందు ఏదియును లేదు. ॥74॥ శివ ప్రసాదము సిద్ధించుటకు శివయోగికి సమస్త ప్రపంచము

శివ స్వరూపముగానే అగుపడును. స్వకర్మపాశముక్తుడు, సాక్షాత్తుగా శివస్వరూపుడైన ప్రసాదియే ప్రాణలింగియని చెప్పబడును ॥75॥

ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ
ప్రసాది స్థలే ప్రసాదిస్థలాది సప్తవిధ స్థల
ప్రసంగోనామ ఏకాదశ పరిచ్ఛేదః పరిసమాప్తః

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణి ప్రసాది స్థలములో
ప్రసాది స్థలాది సప్త విధ స్థల విచారాత్మకమగు
పదకొండవ పరిచ్ఛేదము పరిసమాప్తము.



# శ్రీ సిద్ధాంత శిఖామణి

## ద్వాదశ పరిచ్ఛేదః

## పండ్రెండవ పరిచ్ఛేదం

అగస్త్య ఉవాచ:-

॥శ్లో॥ భక్తో మాహేశ్వర శ్చేతి ప్రసాదీతి నిబోధితః
ఏక ఏవ కథం చైష ప్రాణలింగీతి కథ్యతే ॥ 1 ॥

రేణుక ఉవాచ:-

భక్తో మాహేశ్వర శ్చేతి ప్రసాదీతి చ కీర్తితః
కర్మప్రాధాన్యయోగేన జ్ఞానయోగో<sup></sup>ऽస్య కథ్యతే ॥ 2 ॥

లింగం చిదాత్మకం బ్రహ్మ తచ్ఛక్తిః ప్రాణరూపిణీ
తద్రూపలింగ విజ్ఞానీ ప్రాణలింగీతి కథ్యతే ॥ 3 ॥

ప్రాణలింగిస్థలం చైతత్పంచ స్థలసమన్వితం
ప్రాణలింగిస్థలం చాదౌ ప్రాణ లింగార్చనం తతః ॥ 4 ॥

శివయోగ సమాధిశ్చ తతో లింగనిజస్థలం
అంగలింగ స్థలం చాథ క్రమాదేషాం భిదోచ్యతే ॥ 5 ॥

ఓయీ గురుమూర్తి! ఒకడే (ఒకే) వ్యక్తి, భక్త మహేశ - ప్రసాద - ప్రాణలింగి యగునని బోధించబడినది. అయితే ఇతడె ప్రాణలింగియని యెట్లు చెప్పదును అని అగస్త్య మహర్షి ప్రశ్నించగా, అందుకు శ్రీరేణుకాచార్యులవారు ఈ విధముగా నాదేశించిరి. (1) కర్మకాండోక్త క్రియా ప్రాధాన్యత వలన ఒక్కడే భక్తుడనియు, మాహేశ్వరుడనియు, ప్రసాదియనియు ఇంతకు మొదటె చెప్పఁబడినది, ఇకపోతె ఈమూడు స్థలాచరణతో గూడిన ఇతనికి జ్ఞానకాండోక్తమగు జ్ఞానయోగము చెప్పఁబడును. భక్త - మహేశ్వర - ప్రసాది - ఈ మూఁడు స్థలములు జ్ఞాన ప్రధానమైనవిగాను యున్నవని భావము. వీరశైవుడు తన శరీరముండు పర్యంతము, కర్మ - జ్ఞానములను రెండును ఆచరించవలెను. వీరశైవ సిద్ధాంతము కర్మ జ్ఞాన సముచ్చయాత్మక మైయున్నది. చిత్ స్వరూపమగు బ్రహ్మము శివలింగమనబడును. శివలింగము యొుక్క పీఠము శక్తి ప్రణవాత్మక ప్రాణ స్వరూపమైయున్నది. ॥3॥ ఈ ప్రాణ లింగ స్థలము - ప్రాణలింగార్చన స్థలము - శివయోగ

సమాధి స్థలము - లింగనిజ స్థలము - అంగలింగ స్థలము అని ఐదు ప్రకారములైయున్నది, అనుక్రమముగ వీటి భేదములను వివరించనగును(4 - 5)

## 32. ప్రాణలింగి స్థలం

॥శ్లో॥ ప్రాణా పానసమాఘాతాత్ కందమధ్యాద్యదుత్థి తం
ప్రాణలింగం తదాఖ్యాతం ప్రాణాపాననిరోధిభిః ॥ 6 ॥

ప్రాణో యత్ర లయం యాతి భాస్క రేందువిఘట్టనాత్
తత్ ప్రాణ లింగ ముద్ధిష్టం తద్ధారీ స్యాత్త దాకృతిః ॥ 7 ॥

జ్ఞానినాం యోగయుక్తానామంతఃస్ఫురతి దీపవత్
చిదాకారం పరం బ్రహ్మ లింగ మజ్ఞైర్న భావ్యతే ॥ 8 ॥

అంతః స్థితం పరం లింగం జ్యోతీ రూపం శివాత్మకం
విహాయ బాహ్య లింగస్థా విమూఢా ఇతి కీర్తితాః ॥ 9 ॥

నం విల్లింగ పరామర్శీ బాహ్య వస్తు పరాఙ్ముఖః
యః సదా వర్తతే యోగీ ప్రాణలింగీ స ఉచ్యతే ॥ 10 ॥

మాయా వికల్పజం విశ్వం హేయం సంచింత్య నిత్యశః
చిదానందమయే లింగే విలీనః ప్రాణ లింగవాన్ ॥ 11 ॥

సత్తా ప్రాణయమీ శక్తిః సద్రూపం ప్రాణ లింగకం
తత్సామరస్య విజ్ఞానాత్ ప్రాణలింగీతి కథ్యతే ॥ 12 ॥

శ్రీ గురువు యొక్క ఉపదేశానుసారముగా ప్రాణవాయువు మరియు అపానవాయువుల సంఘటనతో నాభికందమధ్య నుండియే జ్యోతి ఉద్భవిస్తుందో అదే ప్రాణ లింగమనియు ప్రాణాపానవాయు నిరోధకులైన శివయోగులు చెప్పచుందురు (ఆదేశింతురు) (6) సూర్యనాడి చంద్రనాడు (ఈడా పింగళనాడు)ల సంఘర్షణము నుండి ప్రాణ వాయువు పరబ్రహ్మ స్వరూపమైన ఏ శివలింగమునందు లీనమగుచున్నదో, అదే ప్రాణలింగమన బడుచున్నది, ఆవిధమైన ప్రాణలింగమును ధరించిన వాడు ఆ ఆకారము గలవాడే యగును (7) ప్రకాశరూపము. పరబ్రహ్మ స్వరూపమునైన. ప్రాణలింగము శివయోగమునుండి గూడిన, జ్ఞానుల హృదయ కమలమునందు దీపశిఖవలె ప్రకాశించుచుండును. అట్టి లింగము గురూపదేశ రహితులైన ప్రాకృత జనులకు బోధపడదు.

"హృదయేవై బ్రహ్మ సోమ సూర్యాగ్ని మండలే!
నివాతదీపోపమ స్థాయి హృద్యంతర్జ్యోతిః పురుషః"

మున్నగు శ్రుతి వాక్యములు ఇదే అభిఃప్రాయమును ప్రతిపాదించు చున్నవి (8) హృదయ కమలమునందున్న, జ్యోతి స్వరూపమైన మరియు శివస్వరూపమైన ప్రాణలింగమును వదలి స్థావరలింగాదులను పూజించువారు మూర్ఖులే యనబడుదురు (9) ఎవడైతె స్థావర లింగాదులందును తత్పూ జాసామగ్రులందును పరాఙ్ముఖుడై ఎల్లప్పుడు చిద్రూపమగు ప్రాణలింగ విచారమును గావించుచుండునో అట్టి శివయోగి వర్యుడు ప్రాణలింగియని చెప్పబడును (10) చరాచరాత్మకమగు ఈజగత్తు మాయికగుణ భేదముతో నుత్పన్నమైనదనియు, హేయమైనదని తెలసి, సచ్చిదానంద స్వరూపమగు ప్రాణలింగమునందు మనస్సును లీనమొనర్చువాడు ప్రాణ లింగియని చెప్పఁబడును (11) "అస్మి, నేనున్నాను అను స్ఫూర్తి చిల్లింగము యొక్క ప్రాణ స్వరూపమైన శక్తి ప్రాణ అంగమైనను ఆవిధమగు "అస్మి" అను స్ఫూర్తియునదై సద్రూపమైయున్నది. అట్టిశక్తి మరియు శివుడు ఈ యుభయు లన్యోన్య సామరస్యమును దెలిసికొనుటవలన (గుర్తించుటచేత) ఈతడు ప్రాణలింగియనబడును (12)

## 33. ప్రాణ లింగార్పన స్థలం

॥శ్లో॥ అంతర్గతం చిదాకారం లింగం శివమయం పరం
పూజ్యతే భావపుష్పైర్యత్ప్రాణ లింగార్చనం హితత్ ॥ 13 ॥

అంతః పవనసంస్పృష్టే సుసూక్ష్మాంబరశోభితే
మూర్ధన్య చంద్ర విగలత్సుధాసేకాతిశీతలే ॥ 14 ॥

బద్ధేంద్రియనవద్వారే బోధదీపే హృదాలయే
పద్మపీఠే సమాసీనం చిల్లింగం శివవిగ్రహం
భావయిత్వా సదాకాలం పూజయేద్భావవస్తుభిః ॥ 15 ॥

క్షమాఽ బిషేక సలిలం వివేకో వస్త్రముచ్యతే
సత్యమాభరణం ప్రోక్తం వైరాగ్యం పుష్పమాలికా ॥ 16 ॥

గంధః సమాదిసంపత్తి రక్షతానిరహం కృతిః
శ్రద్ధా ధూపో మహాజ్ఞానం జగద్భాసి ప్రదీపికా ॥ 17 ॥

భ్రాంతి మూలప్రపంచస్య నైవేద్యం తన్నివేదనం
మౌనం ఘంటాపరిస్పందస్తాంబూలం విషమార్పణం ॥ 18 ॥

విషయభ్రాంతి రాహిత్యం తత్ ప్రదక్షిణకల్పనా
బుద్ధిస్తదాత్మికాసక్తి ర్నమస్కారక్రియామతా ॥ 19 ॥

ఏవం విధైర్భావశుద్ధైరుపరి చారైరదూషితైః
ప్రత్యఙ్ముఖమనా భూత్వా పూజయేల్లింగ మాంతరం ॥ 20 ॥

హృదయ కమలాంతర్గత మైనదియు, చిత్ స్వరూపమగు నదియు, సర్వం శివమయమైన దియు శ్రేష్ఠమగునది, ఐన ప్రాణలింగమునకు అంతఃకరణ వృత్తి విశేషముల చేత ఏ పూజ జేయబడుచున్నదో, అదే ప్రాణలింగార్చన యనియు చెప్పబడును (13) ప్రాణ వాయువు చేత వ్యాపించినది, అత్యంత సూక్ష్మాకాశ (దహరాకాశ)ముతో విరాజిల్లునది. బ్రహ్మరంధ్రము నందుండిన చంద్రమండలము నుండి స్రవించునట్టి అమృతాభిషేకముల చేత అత్యంత శీతల మైనది, ఇంద్రియ రూపనవ ద్వారములను నిరోధించు శక్తి గలది. శివజ్ఞాన రూపదీపము గలదియు నైన, హృదయమందిరంబున ద్వాదశదళ కమల కర్ణికయందుగూర్చుండి ప్రకాశించునట్టి మంగల మూర్తియైన ప్రాణలింగమును శ్రీగురూపదేశాను సారముగా ధ్యానించి, మానసిక వస్తువులతో నెల్లప్పుడర్చింపవలెను. (14), (15) ఆయా వస్తువు లేవియనగా క్షమా అభిషేక జలం నిత్యానిత్యవస్తు వివేకమె వస్త్రము, సత్యవాక్యమే ఆభరణము, వైరాగ్యమే పుష్పమాలిక, చిత్తైకాగ్రత గంధము, నిరహంకారమె అక్షింతలు, శ్రద్ధాధూపము, విశ్వప్రకాశమైన మహాజ్ఞానమేదీపము, అజ్ఞానమునకు మూలకారణమగు శరీరాద్యహంకారవర్గము యొక్క నివేదన నైవేద్యం, మౌనమే ఘంటానాదము, శబ్దాదివిషయార్పణమే తాంబూలము. విషయ సుఖ భ్రాంతిరాహిత్యము ప్రదక్షిణ, లింగరూపమున ఆసక్తి యున్న బుద్ధి నమస్కారము. ఈ విధముగ భావశుద్ధి యున్నట్టి మానసిక ఉపచారములతో అంతర్ముఖమనస్సు గలవాడై హృదయకమలము నందున్న ప్రాణలింగమును పూజించవలెను. (16, 17, 18, 19, 20)

## 34. శివయోగ సమాధి స్థలం

॥శ్లో॥ అంతఃక్రియారతస్యాస్య ప్రాణలింగార్చన క్రమైః
శివాత్మ ధ్యానసంపత్తిః సమాధిరితి కథ్యతే ॥ 21 ॥

సర్వతత్త్వోపరిగతం సచ్చిదానంద భాసురం
పరబ్రహ్మ మహాలింగం ప్రాణో జీవః ప్రకీర్తితః
తదేక బావమననాత్ సమాధిస్థః ప్రకీర్తితః ॥ 22 ॥

బహిర్వాసనమా విశ్వం వికల్పార్థం ప్రకాశతే
అంతర్వాసితచిత్తా నామాత్మానందః ప్రకాశతే ॥ 23 ॥

ఆత్మారణిసముత్థేన ప్రమోదమథనాత్సుధీః
జ్ఞానాగ్నినా దహేత్సర్వం పాశజాలం జగన్మయం ॥ 24 ॥

సంసార విషవృక్షస్య పంచక్లేశ ఫలాశినః
ఛేదనే కర్మ మూలస్య పరశుః శివభావనా ॥ 25 ॥

అజ్ఞానరాక్షసోన్మేషకారిణః సంహృతాత్మనా
శివధ్యానంతు సంసారతమసశ్చండ భాస్కరః ॥ 26 ॥

అంతఃషట్చక్రరూపాణి పంకజాని విభావయేత్
బ్రహ్మాదిస్థాన భూతాని భ్రూమధ్యాంతాని మూలతః ॥ 27 ॥

భ్రూమధ్యాదూర్ధ్వభాగే తు సహస్రదలమంబుజం
భావయేత్తత్ర విమలం చంద్రబింబం తదంతరే ॥ 28 ॥

సూక్ష్మరంధ్రం విజానీయాత్ తత్కైలాసపదం విదుః
తత్రస్థం భావయేచ్ఛంభుం సర్వకారణ కారణం ॥ 29 ॥

సర్వతత్త్వోపరిగతం సచ్చిదానంద భాసురం
స్వప్రకాశమనిర్దేశ్య వాఙ్మానస గోచరం ॥ 30 ॥

ఉమాఖ్యయా మహాశక్త్యా దీపితం చిత్స్వ రూపయా
హంసరూపం పరాత్మానం సోహంభావేన భావయేత్
తదేకతానతా సిద్ధిః సమాధిః పరమో మతః ॥ 31 ॥

ఇంతకు పూర్వమాదేశించి ప్రాణలింగ పూజాక్రమములతో అంతరంగ పూజానిరతుడైన ఈ ప్రాణలింగియొక శివ జీవైక్యానుసంధాన రూపమైన సంపత్తు శివయోగ సమాధియనబడును (21) మహాలింగమే పరబ్రహ్మమనియు, ప్రాణమే జీవమనియు, చెప్పఁబడును.

ఆ పరబ్రహ్మ (లింగ)ము, జీవము (ప్రాణము) అంగముల ఏకత్వ చింతనతోనున్న బ్రాణలింగి శివయోగ సమాధిస్థుడని చెప్పబడును. (22) చరాచరాత్మకమైన యీజగత్తు బహిర్వాసనతో ననేక ప్రకారములైన సంకల్ప వికల్పరూపమైనదిగానగఁపడును, అంతర్వాసనాయుక్త చిత్తము గల వారిలో శివానందము ప్రకాశించు చుండును, (23) ప్రాణలింగి ఆనంద ఘర్షణతో నాత్మయను అరణికొయ్యతో (యజ్ఞములో అగ్నిమథనమునకు ఉపయోగించు నట్టి జమ్మిచెట్టు యొక్క కఱ్ఱతో) నుత్పన్నమైన శివ జ్ఞానాగ్ని రూపముతో విశ్వరూపమగు సమస్త పాశసమూహమును నశింపజేయును (24) ధర్మాధర్మరూపకర్మములను మూలములు గలదై అవిద్యాది పంచక్లేశములను పర్ణములు గలదై యుండిన సంసారమను విషవృక్షము ఛేదించుటలో శివధ్యానము గొడ్డలి పెట్టువంటిది. (25) అజ్ఞానమను రాక్షసుని నేత్రోన్మీలనము (కనులు దెరిపించునది) జేయునది. ఆత్మను నిర్మూలించే సంసారమను గాఢాంధకారమునకు శివధ్యానము ప్రచండ మార్తాండు (సూర్యుడు)ని వంటిది (26) శరీరమునందలి ఆధారము - స్వాధిష్ఠానము - మణిపూరకము - అనాహతము - విశుద్ధి - ఆజ్ఞానామకములైన షట్ (ఆరు) చక్ర రూపములైన కమలములని భావించవలెను. ఈ యారుచక్రములు క్రమముగ గుద - గుహ్య - నాభి - హృదయము - కంఠము, భ్రూమధ్యన ఉండి, బ్రహ్మ - విష్ణు - రుద్ర - ఈశ్వర - సదాశివ - పరమశివుఁడను దేవతలకు స్థానములైయున్నవి. (26) భ్రూమధ్యముపై భాగము నందున్నట్టి బ్రహ్మరంధ్రమునందు వేయి దళములున్న కమలమును భావించి ఆ కమలమును స్వచ్ఛమైన చంద్ర మండలముగ భావించవలెను. అట్టి చంద్రమండలము యొక్క మధ్య భాగమున అత్యంత సూక్ష్మమైన రంధ్రమును గురుముఖమునుండి దెలిసికొనవలెను, అదే కైలాస స్థానమైయున్నది. అటనున్న శివుని బ్రహ్మాది సమస్త కారణ పురుషులకు గారణునిగా భావించవలెను. (28 - 29) పృథివ్యాది షట్త్రింశత్తత్త్వములకంటెను పైనున్నవాఁడు సత్ - చిత్ - ఆనందములతో ప్రకాశించువాడును, స్వప్రకాశమునుండే ప్రకాశించువాడును, అనిర్దేశుడు, వాఙ్మనస్సులకు అగోచరుండును, చిత్స్వరూపుడైన తనలో నిత్యసంబంధముతో సున్న ఉమానామక మహాశక్తితో గూడి ప్రకాశించువాడును, హంస రూపుడైన పరమాత్ముని సోహంభావముతో (అతడే నేను అనుభావనతో) ధ్యానించవలెను, శివజీవుల ఏకత్వ సిద్ధే శ్రేష్ఠమగు శివయోగసమాధియని చెప్పఁబడును (31)

## 35. లింగనిజ స్థలం

॥శ్లో॥ స్వాంతఃస్థ శివలింగస్య ప్రత్యక్షానుభవస్థితిః
యా సైవ పరలింగస్య నిజమిత్యుచ్యతే బుధైః ॥ 32 ॥

అవ్యక్తం లింగమిత్యాహుర్జగతాం మూలకారణం
లింగీ మాహేశ్వర శ్చేతి మతమేతదసంగతం ॥ 33 ॥

చిదానందమయః సాక్షాచ్ఛివ ఏవ నిరంజనః
లింగమిత్యుచ్యతే వాన్యద్యతః స్యాద్విశ్వ సంభవః ॥ 34 ॥

బ్రహ్మవిష్ణ్వాదయో దేవాః సర్వే వేదాదయస్తథా
లీయంతే యత్ర గమ్యంతే తల్లింగం బ్రహ్మ కేవలం ॥ 35 ॥

బహునాఽత్ర కిముక్తేన లింగమిత్యుచ్యతే బుధైః
శివాభిధం పరం బ్రహ్మ చిద్రూపం జగదాస్పదం ॥ 36 ॥

జ్యోతిర్మయం పరం లింగం శ్రుతిరాహ శివాత్మకం
తస్యభాసా సర్వమిదం ప్రతిభాతి న సంశయః ॥ 37 ॥

న సూర్యో భాతి తత్రేందున్న విద్యున్న చ పావకః
న తారకా మహాలింగే ద్యోతమానే పరాత్మని ॥ 38 ॥

లింగాన్నాస్తి పరం తత్త్వం యదస్మాజ్జాయతే జగత్
యదేతద్రూపతాంధత్తే యదత్ర లయమశ్నుతే ॥ 39 ॥

తస్మాల్లింగం పరం బ్రహ్మ సచ్చిదానందలక్షణం
నిజరూపమితి ధ్యానాత్త దవస్థా ప్రజాయతే ॥ 40 ॥

తన అంతరంగములో నున్న శివలింగము యొక్క ప్రత్యక్షానుభవ స్థితియేదైతె ఉన్నదో అదే మహాలింగము యొక్క నిజస్వరూపమని ఆత్మతత్త్వ జ్ఞానులు ఆదేశింతురు (వక్కాణింతురు) (31) లోకము (జగత్తు)నకు మూలకారణమైన మాయాతత్త్వమును లింగ మనియు "మాయాంతు ప్రకృతింవిద్యాత్ మాయినంతమహేశ్వరం" అనే వాక్యానుసారముగా ఇట్టి మాయానామకలింగమును ధరించిన వాడే మహేశ్వరుడనియు చెప్పఁబడును. ఇట్లుగా వచించుట అసంగతము. ఏలనన ప్రకృతి జడముగా నుండి హేయకోటి (సమూహము) యందు ప్రవేశించినట్లగును గదా!

"మంశివంపరమంబ్రహ్మ - ప్రాప్నోతీతి స్వభావతః!
మాయేతి ప్రోచ్యతోలోకే బ్రహ్మనిష్ఠా సనాతనీ,

అనే శివాగమ ప్రమాణాను సారముగా 'బ్రహ్మనిష్ఠాసనాతనీ మాయా - పరశివ బ్రహ్మనిష్ఠము నిత్యమగు విమర్శనా శక్తి "మంపరశివబ్రహ్మమును", ఆయతి, - స్వభావ సిద్ధముగా ఆశ్రయించి యుండును అని చెప్పవలెనని జగద్గురు శ్రీరేణుకా చార్యుల వారి ఆశయమైయున్నది (33) పరబ్రహ్మ స్వరూపమగు నే లింగము నుండి ఈ జగదుత్పత్తి యగునో అదేలింగమనియు "లీయతేగమ్యతే యత్రసచరాచరం తల్లింగమ్ చెప్పబడినది, అట్టి లింగము సచ్చిదానంద స్వరూపము, దోషరహితము, సాక్షాత్తుగా శివస్వరూపమే అయి యున్నది, దీనిని వదలి మిగతవస్తువులు లింగమని చెప్పబడవు. (34) బ్రహ్మ విష్ణ్వాదిదేవతలు, వేదాగమాదులు ఏవస్తువునందు లీనమగుచున్నవో, మరల ఏ వస్తువునందు - జన్మించుచున్న (ఉత్పన్నమగు చున్న)వో అదే పరబ్రహ్మనామకమైన లింగమనబడును ॥35॥

"బ్రహ్మ విష్ణ్వదయోదేవా: - సర్వేవేదాదయస్తథా!
లీయంతె యత్రగమ్యంతే - తల్లింగంబ్రహ్మ కేవలం (35)

విపులముగ జెప్పటవలన నేమి ప్రయోజనము? చిద్రూపము, జగదాధారభూతము, శివాభి ధేయము (నామము) నైన పరబ్రహ్మమే లింగమనబడును (36) శివాత్మకమగు మహాలింగమే ప్రకాశమయమైయున్నది. ఇట్టి ప్రకాశమయమైన ఆ మహాలింగము యొక్క ప్రకాశమునుండే సూర్య - చంద్రాది ప్రకాశ వస్తువులు ప్రకాశించుచున్నవి. ఇందులో సందేహమేమియు లేదు. (37) పరమాత్మ మహాలింగము ప్రకాశింపగానె అట్టి మహా ప్రకాశమునందు సూర్యుడు - చంద్రుడు అగ్ని - మించు (మెఱుపు) నక్షత్రములు, ఇవేవియు ప్రకాశింపవు, ఆ మహాలింగముయొక్క ప్రకాశమునందు ఇవన్నియు లీనమగునని భావము (38) ఈ చరాచరాత్మక మైన జగత్తు ఏకారణము నుండి ఈ లింగమునుండే యుద్భవించినదో. ఏ కారణము వలన యీ లింగ రూపత్వమునే బొందియున్నదో. ఏ కారణము చేత నీ లింగమునలీన మగుచున్నదో, ఆకారణముచేత నీలింగము కంటెను శ్రేష్ఠ మైన తత్వము మరొకటి లేదు (39) అందుచేత సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మమే నిజరూపమగు (స్వస్వరూపము) లింగమని దెలిసికొని ధ్యానించుటవలన లింగమే నిజమైనదనే అవస్థ (లభించు) ప్రాప్తమగును (40)

## 36. అంగ లింగస్థలం

॥శ్లో॥ జ్ఞానమంగమితి ప్రాహుర్ధేయంలింగం సనాతనం
విద్యతే తద్ద్వయం యస్య సోఽంగలింగీతి కీర్తితః ॥ 41 ॥

అంగే లింగం సమారూఢం లింగే చాంగముపస్థితం
ఏతదస్తి ద్వయం యస్య స భవేదంగలింగవాన్ ॥ 42 ॥

జ్ఞాత్వా యః సతతం లింగం స్వాంతస్థం జ్యోతిరాత్మకం
పూజయేద్భావకుసుమైస్తం విద్యాదంగ లింగినం ॥ 43 ॥

జ్ఞాయతే లింగమే వైకం సర్వైః శాస్త్రైః సనాతనైః
బ్రహ్మేతి విశ్వధామేతి విముక్తేః పదమిత్యపి ॥ 44 ॥

ముక్తి రూపమిదం లింగమితి యస్య మనస్థితిః
స ముక్తో దేహయోగేఽ పి సజ్ఞానీ స మహాగురుః ॥ 45 ॥

అనాదినిధనం లింగం కారణం జగతామితి
యేన జానంతి తే మూఢా మోక్షమార్గ బహిష్కృతాః ॥ 46 ॥

యః ప్రాణలింగార్చన భావపూర్వై
ర్ధర్మైరుపేతః శివభావితాత్మా
స ఏవ తుర్యః పరికీర్త్యతేఽసౌ
సంవిద్విపా కా చ్ఛరణా భిధానః ॥ 47 ॥

శివజ్ఞానమున్న జీవుడు, అంగమనియు - శివజ్ఞాన విశిష్ట జీవుడితో సాక్షాత్కరించబడిన శివుడు శాశ్వత (నిత్య)మైన లింగమనియు చెప్పబడుదురు. అట్టి అంగ- లింగములు రెండు ఏ వాని ప్రాణలింగమునందుండునో ఆతడే ప్రాణ లింగియని చెప్పబడును॥41॥ జీవాత్మునిలో శివలింగము యొక్క సామరస్యమును గలిగి యుండుట ఈ రెండును బీజాంకురము మాదిరిగా ఎవనియందున్నవో ఆతడే అంగ-లింగియనియు చెప్పబడును ॥42॥ ఎవడు తన హృదయకమలమునందున్న జ్యోతి స్వరూపమైన లింగము గురించి భావ పుష్పములతో ఎల్లప్పుడు పూజించునో ఆతనినే అంగలింగియని దెలియవలెను ॥43॥ ఒకే లింగము పరబ్రహ్మమనియు, జగత్తు కాధారభూతమనియు,ముక్త స్థానమనియు, సనాతన మైన సమస్త శాస్త్రముల వలన నుండి దెలియు చున్నది. ॥44॥ ఇట్టి లింగము

పరమ ముక్తి స్వరూపంబనియు ఏ ప్రాణలింగియొక్క మనస్సు ధృఢముగా నుండునో, ఆతడు శరీరధారియైనను ముక్తుడగును, అర్థాత్ జీవన్ముక్తుడనబడును. అంతే గాకుండ ఆతడు పరమజ్ఞానియనియు, మహాగురువనియు చెప్పబడును ॥45॥ ఉత్పత్తి నాశ రహితమైన లింగమును సమస్త లోకములకు మూలకారణముగా ఎవరు గుర్తించరో అట్టి మూర్ఖులు మోక్షమార్గమునుండి బహిష్కృతులగుదురు.

లీనంప్రపంచ రూపంహి- సర్వమేతచ్చరా చరం
సర్గాదౌగమ్యతేభూయ-స్త స్మాల్లింగముదీరితం
లింగశైవ మిదం సాక్షా- చ్ఛివశక్త్యుభయాత్మకం!
ధ్యాత వ్యమర్చనీయంచ-భుక్తి-ముక్తి ఫలేచ్ఛునా!!
అతోయజేత్సదాలింగం- సర్వకారణ కారణం!!

సమస్త చరాచరాత్మకమగు ప్రపంచము ఏ వస్తువులోలయమగుచున్నదో, మరియే వస్తువునుండి ఉత్పత్తి యగుచున్నదో అదే లింగమనియు, అట్టి లింగము శివశక్త్యాత్మకమై యున్నదనియు, అందుచేత భోగ-మోక్ష-ఫలాపేక్షగలవారును, సర్వ కారణంబగు లింగమును పూజించదగునని సూక్ష్మాగమముబోధించుట వలన ఇంతటి లింగ స్వరూపమును గ్రహించని వారు మూర్ఖులేయనబడుదురు ॥46॥ ఎవడు ప్రాణలింగార్చనను భావనాది ప్రముఖో పచారములతో అర్చించునో, జీవాత్మను లింగరూపముతో భావించుచున్నవాడో, అట్టి నాల్గవ స్థలము వాడైన ప్రాణలింగి శివజ్ఞాన పరిపాకము వలన “శరణుడని చెప్పబడును. ॥47॥

*ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ ప్రాణలింగిస్థలే ప్రాణ లింగి*
*స్థలాదిపంచస్థల ప్రసంగో నామ*
*ద్వాదశ పరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణి యందు ప్రాణలింగి
స్థలములో స్థలాది పంచస్థల విచారాత్మకమగు
పంద్రెండవ పరిచ్ఛేదము పరిసమాప్తము



# శ్రీ సిద్ధాంత శిఖామణి

## త్రయోదశ పరిచ్ఛేదః

## పదమూడవ పరిచ్ఛేదము

అగస్త్య ఉవాచ:-

॥శ్లో॥ మాహేశ్వరః ప్రసాదీతి ప్రాణిలింగీతి బోధితః
కథమేష సమాదిష్టః పునః శరణ సంజ్ఞకః ॥ 1 ॥

శ్రీ రేణుక ఉవాచ -

అంగలింగీ జ్ఞానరూపః సతీజ్ఞేయః శివః పతిః
యత్సౌఖ్యం తత్సమావేశే తద్వాన్ శరణనామవాన్ ॥ 2 ॥

స్థలమేతత్సమాఖ్యాతం చతుర్ధా ధర్మభేదతః
ఆదౌ శరణమాఖ్యాతం తతస్తామసవర్జనం ॥ 3 ॥

నిర్దేశశ్చ తతః ప్రోక్త : శీలసంపాదనం తతః
క్రమాల్లక్షణమే తేషాం కథయామి నిశమ్యతాం ॥ 4 ॥

ఓయీ గణ పుంగవా!మహేశ్వరుడే ప్రసాదియగుననియు ప్రసాదే ప్రాణ లింగియగుననియు ఆదేశింపఃబడినది.! ఈ ప్రాణలింగి శరణుడెట్లగును? అనునది నాకు దెలియజెప్పవలెనని అగస్త్య మహర్షి ప్రార్థించగా, అద్దానికి శ్రీ రేణుకాచార్యులవారు శివజ్ఞానస్వరూపుడు లింగాంగ సామరస్యముగలవాడును ఐన ప్రాణలింగితానే సతియనియు, శివుడే పతియనియు దెలిసికొనవలెను. స్త్రీ పురుష సంబంధమునందు ఎటువంటి సుఖము గోచరిస్తుందో అథవా ఉత్పన్నమగునో, అటే అంగలింగరూపసతిపతిభావమునుండి యుత్పన్న మగు ఆనందముననుభవించువాడే శరణుడనబడును.

"యథాస్త్రియా సంపరిష్వక్త్వేన
బాహ్యంకించన వేదనాంతరం
ఏవమే వాయం పురుషః
ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్విక్తోనబాహ్య
కించన వేదనాంతరం!!

- అనునీ మంత్రము చేత బృహదారణ్యకశ్రుతి ఇదే అభిఃప్రాయమును బోధించుచున్నది ॥1-2॥ ఈ శరణస్థలము ధర్మ భేదముచేత శరణస్థలము-తామసనిరసన స్థలము - నిర్దేశన స్థలము-శీల సంపాదన స్థలము- అని నాలుగు రకాలుగా నున్నది. వీటి యొక్క లక్షణముల్రమముగా జెప్పఁబడుచున్నవి (3-4)

## 37. శరణ స్థలం

॥శ్లో॥ సతీవ రమణే యస్తు శివే శక్తిం విభావయన్
తదన్యవిముఖః సోర యం జ్ఞాతః శరణనామవాన్ ॥ 5 ॥

పరిజ్ఞాతే శివే సాక్షాత్ కో వాన్యమభి కాంక్షతి
నిధానే మహతి ప్రాప్తే కః కాచం యాచతే2 న్యతః ॥ 6 ॥

శివానందం సమాసాద్య కోవాఽన్యముపతిష్ఠతే
గంగామృతం పరిత్యజ్య కః కాంక్షేన్మృగతృష్టికాం ॥ 7 ॥

సంసారతిమిరచ్ఛేదే వినా శంకర భాస్కరం
ప్రభవంతి కథం దేవాః ఖద్యోతా ఇవ దేహినాం ॥ 8 ॥

సంసారార్తః శివం యాయాద్బ్రహ్మాద్యైః కిం ఫలం సురైః
చకోరస్తృషితః పశ్యేచ్చంద్రం కిం తారకా అపి ॥ 9 ॥

శివ ఏవ సమస్తానాం శరణ్యః శరణార్థినాం
సంసారోరగదష్టానాం సర్వజ్ఞః సర్వదోషహా ॥ 10 ॥

శివజ్ఞానే సముత్పన్నే పరానందః ప్రకాశతే
తదాసక్త మనా యోగీ నాన్యత్ర రమతే సుధీః ॥ 11 ॥

తస్మాత్సర్వప్రయత్నేన శంకరం శరణం గతః
తదనంతసుఖం ప్రాప్య మోదతే నాన్యచింతయా ॥ 12 ॥

పతివ్రతా స్త్రీ తన పతిని గాక (వదలి) పరపురుషుల విషయమున ఎట్లుగా విముఖు (ప్రతికూలు)రాలై యుండునో అట్లు గానె ఎవడైతే తనను వరిస్తాడో (పాణీగ్రహణము చేస్తాడో అథవా వివాహసమయమున కంఠమున మంగళ సూత్రధారణగావిస్తాడో) అట్లే శివుని విషయమున తనను సతి (భార్య)గా భావించి అన్య దేవతల విషయమున విముఖత

ప్రతికూలత గల వాడగునో ఆతడే నిజమైన శివ శరణుడుగా దెలియవలెను ॥5॥ అధికమగు ద్రవ్యనిధి లభించగా, రెండవ వాడిని (అన్యుని-ఇతరుని) వలన కాచము (గాజుముక్కను) ఎవడు గోరును? ఇదే విధముగా శివుడినే సాక్షాత్తుగా నెరంగిన (గుర్తించిన) పిదప. ఇతర దేవుడిని యెవడు ఇష్టపడును? (కోరుకుంటాడు?) ఎవడును కోరుకొనడని భావము (6) గంగామృత జలమును వీడి మరీచిక (ఎండమావి)లోని జలమునపేక్షించినట్లగును. కనుక శివుని విశ్వసించిన బిదప శివ సుఖమును బడసి ఎవడు తానె ఇతర దేవుడిని ఆశ్రయించగలడు? ఎవడును ఆశ్రయించడని భావము ॥7॥ ఘోర సంసారమను గాఢాంధకారమును నశింపఁజేయుటలో (పారదోలుటలో అథవా పోగొట్టుటలో)శివుడనే సూర్యుడిని వదలి శివేతర దేవతలను ఖద్యోతులు (మెరుపు-మిరుగుడు పురుగులు) ఎట్లు సామర్థ్యము గల వియగును? శివేతర దేవతలకు సాంసారిక దుఃఖమును నశింపజేయు శక్తి యుండదని భావము॥8॥ దప్పిక గలిగినచకోరము (పక్షి) చంద్రుని జూడకుండ నక్షత్రములను జూచునా? చూడదని భావము. అదే విధముగా సంసారమునుండి విసుగెత్తినవాడు శివుడినే ఆశ్రయించవలెను. బ్రహ్మాది దేవతలతో బ్రయోజనమేమి॥9॥ సంసారమను సర్పము కాటువేయబడిన సమస్త శరణాగత జనులకు సమస్త దోషముల (పాపముల)ను నశింపజేయువాడును, సర్వ జ్ఞుడును అయిన శివుడే రక్షకుడై యున్నాడు ॥10॥ శివజ్ఞానము ఉత్పత్తిల్లగానే పరమానందము బ్రకాశించును. అట్టి పరమానందము నందాసక్తి గల చిత్తముండిన శివయోగిశివేతర దేవతలపై ప్రేమయుంచడు ॥11॥ ఆకారణమ్ము సమస్త ప్రయత్నములనుండియు శివుడికి శరణాగతుడైనవాడు అట్టి శివుడి వలన అనంత సుఖమునంబొంది (బడసి) పరమానంద విశిష్టుడగుచున్నాడు. శివేతర దేవతాచింతనతో అనంద విశిష్టుడు కాజాలడు. అందుచేత మోక్షసుఖమును బడయవలెనను కోరిక గలవాడు శివేతర దేవతలధ్యానముఏ సమయమునందును చేయఁదగదు. ఎల్లప్పుడు శివ ధ్యానమునే జేయవలెను. తత్ఫలితముగ నిరతిశయమగు శివానందమును బొందవలెననునదే శ్రీ భగవత్పాదుల వారి యాశమయు ॥12॥

## 38. తామస నిరసన స్థలం

॥శ్లో॥ శివభక్తి పరానందమోదినా గురుణా యతః
నిరస్యంతే తమోభావాః స తామసనిరాసకః ॥ 13 ॥

యస్య జ్ఞానం తమోమిశ్రం న తస్య గతిరిష్యతే
సత్వం హి జ్ఞానయోగస్య నైర్మల్యం విదురుత్తమాః ॥ 14 ॥

శమోదమో వివేకశ్చ వైరాగ్యం పూర్ణభావనా
క్షాంతిః కారుణ్య సంపత్తిః శ్రద్ధా సత్యసముద్భవా ॥ 15 ॥

శివభక్తి : పరో ధర్మః శివజ్ఞానస్య బాంధవాః
ఏ తైర్యుక్తో మహాయోగీ సాత్వికః పరికీర్తితః ॥ 16 ॥

కామక్రోధ మహామోహమదమత్సరవారణాః
శివజ్ఞానమృగేంద్రస్య కథం తిష్ఠంతి సన్నిధౌ ॥ 17 ॥

యత్ర కుత్రపి యో ద్వేష్టి ప్రపంచే శివరూపిణి
శివద్వేషీ న విజ్ఞేయో రజసాఽఽ విష్టమానసః ॥ 18 ॥

యో ద్వేష్టిసకలాన్ లోకాన్ యోవాన్ హంకురుతేసదా
యోఽ సత్యభావనాయుక్తః స తామస ఇతి స్మృతః ॥ 19 ॥

తమోమూలా హి సంజాతా రాగద్వేషాదిపాదపాః
శివజ్ఞానకుఠారేణ ఛిద్యంతే హి నిరంతరం ॥ 20 ॥

శివజ్ఞానే సముత్పన్నే సహస్రాదిత్యసన్నిభే
కుతస్తయోవికారాః స్యుర్మహతాం శివయోగినాం ॥ 21 ॥

శివభక్తియను పరమానందముచేత సంతసించునట్టి శ్రేష్ఠుడైన శివ శరణునితో నెట్టి కారణముచేత తామస గుణములు నిరాకరించబడునో ఆ కారణముతో నతడు తామస నిరాసకుడని చెప్పబడుచున్నాడు. ఎవని జ్ఞానము తమోగుణమునుండి మిశ్రితమై యున్నదో ఆతనికి ప్రాప్తించదు. జ్ఞానయోగమునకు నిర్మలమగు సత్త్వగణమే సాధనమని జ్ఞాన దెలిసి కొందురు ॥14॥శాంతి (అంతరింద్రియ నిగ్రహము)దాంతి(బహిరింద్రియనిగ్రహము) వివేకము (నిత్యా నిత్య వస్తు విచారము) వైరాగ్యము (విషయమునందలి విరక్తి) అఖండ విజ్ఞానము, క్షమాభూతదయ, సత్యవస్తు సంభవమగు విశ్వాసము, శివభక్తి , శ్రేష్ఠమగు శివ ధర్మము ఇవి శివజ్ఞానమునకు బంధు జనమువలెనుండును వీనితో గూడిన శివయోగి "సాత్వికుడనియు చెప్పఁబడును॥15-16॥ కామ-క్రోధ-లోభ-మోహ-మద-మత్సరములను ఏనుగులు శివజ్ఞానమను సింహముయొక్క సమీపమున (ఎదుట) ఎట్లు నిలబడగలవు?

అట్లు నిల్చుటకు ఎప్పుడును సాహసించవని భావము ॥17॥ ఏ ఒక వ్యక్తి శివ స్వరూపంబగు నీ జగత్తులో ఎక్కడైనను ద్వేషించినట్లైతే అట్టి శివదూషకుడు "రాజస" గుణముగలవాడని చెప్పబడును ॥18॥ ఎవరు సమస్త ప్రాణులను ద్వేషించునో ఎవడు అసత్య భావన కలవాడో, అతడు తామసగుణములున్న వాడని చెప్పబడును. ॥19॥ రాగ ద్వేషములనెడు వృక్షములు ఎల్లప్పుడు శివ జ్ఞానమను కుఠారముతో (గొడ్డలితో) ఛేదింపఁబడును ॥20॥ సహస్ర సూర్యులకు సమానమగు శివ జ్ఞానముగలిగిన మహాశివ యోగులకు తమోగుణ జనితవికారములు ఎట్లు రాగలవు॥21॥

## 39. నిర్దేశన స్థలం

॥శ్లో॥ నిరాకృత్య తమోభాగం సంసారస్య ప్రవర్తకం
నిర్దిశ్యతే తు యద్ జ్ఞానం స నిర్దేశ ఇతి స్మృతః ॥ 22 ॥

గురురేవ పరం తత్త్వం ప్రకాశయతి దేహినాం
కో వా సూర్యం వినా లోకే తమసో వినివర్తకః ॥ 23 ॥

అంతరేణ గురుం సిద్ధం కథం సంసారనిష్కృతిః
నిదానజ్ఞాం వినా వైద్యం కో వా రోగో నివర్తతే ॥ 24 ॥

అజ్ఞానమలినం చిత్త దర్పణం యో విశోధయేత్
ప్రజ్ఞావిభూతియోగేన తమాహుర్గురుసత్తమం ॥ 25 ॥

అపరోక్షితతత్త్వస్య జీవన్ముక్త స్వభావినః
గురోః కటాక్షే సంసిద్ధే కోవా లోకేషు దుర్లభః ॥ 26 ॥

కైవల్య కల్పతరవో గురవః కరుణాలయాః
దుర్లభాహి జగత్యస్మిన్ శివద్వైత పరాయణాః ॥ 27 ॥

క్షారాబ్ధిరివ సింధూనాం సుమేరురివ భూభృతాం
గ్రహాణామివ తిగ్మాంశుర్మణీనామివ కౌస్తుభః ॥ 28 ॥

ద్రుమాణా మివ భద్ర శ్రీర్దేవానా మివ శంకరః
గురుఃశివఃపరఃశ్లాఘ్యోగురూణాం ప్రాకృతాత్మనాం ॥ 29 ॥

సంసార ప్రవృత్తికి మూలకారణమైన తమోగుణ భాగమును నిరాకరించి యేజ్ఞానమైతే గురువునుండి ఉపదేశించబడినదో, అట్టిజ్ఞానము నిర్దేశ(నిర్దేశన)స్థలమని చెప్పబడును ॥22॥

శ్రీ గురువే మానవులలో శ్రేష్ఠమగు శివ తత్వమును ప్రకాశింపజేయును, ఈ జగత్తులో ససూర్యుని వదలి అంధకారమును బారదోలుటకు ఎవడు తానెసాహసించును? అదే విధముగా శ్రీ గురువునకు దప్పవేరే వారికి అజ్ఞానాంధఃకారమును దొలగించరని భావము. ॥23॥ జ్ఞాననిధియైన గురువును వీడి సంసారవృత్తి యెట్లు జరుగును (సాగును)? రోగము నిలవునెరింగిన వైద్యుడు తప్ప మరేవరైన బోగొట్టగలరా? అదే మాదిరిగా జ్ఞానియైన గురువుయొక్క అవసరమేంతేనిగలదు ॥24॥ అజ్ఞాన మనెడు మైల (దుమ్ము-ధూళిని) తో గూడిన దర్పణము (అద్దము)ను జ్ఞానమనెడు భస్మముతో శుభ్రమొనర్చుచున్నాడో అతడే గురు శ్రేష్ఠుడనిజనులచేత చెప్పబడును ॥25॥ స్వస్వరూపజ్ఞానముచేత సాక్షాత్కృత శివ స్వరూపముగల వాడైన గురువు యొక్క కృపాకటాక్షము గలిగినచో ఈ లోకమున ఏ పురుషార్థము దుర్లభమగును? సర్వము సాధ్యమగునని భావము ॥26॥ మోక్షమునకు కల్పవృక్షమున సమానమైన దయాశీలురు, శివాద్వైత భావనాసక్తులు ఐనగురువులు ఈ లోకము న లభించుట దుర్లభముగా నున్నారు ॥27॥ సముద్రములలో క్షీర సముద్రము. పర్వతములలో మేరు పర్వతము గ్రహములలో చంద్రుడు, మణులలో కౌస్తుభమణి వృక్షములలో శ్రీ గంధ (చందన) వృక్షము, దేవతలలో శివుడు (పరమశివుడు) శ్రేష్ఠులుగా నున్నట్లు, ప్రాకృతాత్ములైన గురువులలో సాక్షాత్తుగా శివస్వరూపుడైన గురువు శ్రేష్ఠుడు, శిష్యుడు (ప్రశంసనీయుడు)

## 40. శీల సంపాదన స్థలం

॥శ్లో॥ జిజ్ఞాసా శివతత్త్వస్య శీలమిత్యుచ్యతే బుధైః
నిర్దేశయోగాదార్యాణాం తద్వాన్ శీలీతి కథ్యతే ॥ 30 ॥

ప్రసన్నార్తి హరే దేవే పరమాత్మని శంకరే
భావస్య స్థిరతాయోగః శీలమిత్యుచ్యతే బుధైః ॥ 31 ॥

శీలం శివైక విజ్ఞానం శివధ్యానైకతానతా
శివప్రాప్తి సముత్కంఠా తద్యోగీ శీలవాన్ స్మృతః ॥ 32 ॥

శివాదన్యత్ర విజ్ఞానేవైముఖ్యం యస్య సుస్థిరం
తదాసక్తా మనోవృత్తి స్తమాహుః శీలభాజనం ॥ 33 ॥

పతివ్రతాయా యచ్ఛీలం పతిరాగాత్ప్రశస్యతే
తథా శివానురాగేణ సుశీలో భక్త ఉచ్యతే ॥ 34 ॥

పతిం వినా యథా స్త్రీణాం సేవాఽన్యస్యతుగర్హణా
శివం వినా తథాఽ న్యేషాం సేవా నిందాకృతాత్మనాం ॥ 35 ॥

బహునాఽత్ర కిముక్తేన శివజ్ఞానైకనిష్ఠతా
శీలమిత్యుచ్యతే సద్భిః శీలవాం స్తత్పరో మతః ॥ 36 ॥

శివాత్మ బోధైకరతః స్థిరాశయః
శివం ప్రపన్నో జగతామధీశ్వరం
శివైక నిష్ఠాహిత శీల భూషణః
శివైక్యవా నేష హి కథ్యతే బుధైః ॥ 37 ॥

ఆచార్యునిచేత ఉపదేశించబడిన నిర్దేశనస్థల సంబంధముతో లభించే శివతత్వ జిజ్ఞాసశీలమని చెప్పబడును. ఇంతటి శివతత్వ జిజ్ఞాస రూపశీలములు గలవాడే శీలియని చెప్పబడుచున్నాడు ॥30॥ శరణాగతులైన వారి దుఃఖమును నశింపజేయువాడు దేవాధి దేవుడు పరమాత్ముడైన శంకరుని యందుండబడె చిత్త స్థిరీకరణమే శీలమని శివ శాస్త్రజ్ఞులచేత చెప్పబడుచ్నుది. ॥31॥ శివుడి యందే విశేషజ్ఞానము ఒక శివధ్యానము నందే నిష్ఠావంతుడై యనన్య వృత్తిత్వమును బొందుటే శివప్రాప్తిలో అపరిమితమైన ఉత్కంఠశీలమని చెప్పబడును. ఈ మూడింటిసంబంధమున్న శీలవాన్, అని చెప్పుదురు ॥32॥ శివుని దప్ప ఇతర దేవతల జ్ఞానమున ఎవడికి విముఖత దృఢముగా నుండునో, ఎవని మనో వ్యాపారము శివుని యందు లీనమగుచున్నదో ఆతనినిజ్ఞానులు శీలభాజనుడిగా చెప్పుదురు.॥33॥ పతివ్రతా స్త్రీ యొక్క పాతివ్రత్యము పతియొక్క ప్రేమనుండి యెట్లు ప్రశస్తమగునో, అట్లే శివుని ప్రేమ నుండి శివ శరణుడు సుశీలుడనబడును ॥34॥పతివ్రతా స్త్రీలకు పతిదేవుడు దప్ప పరపురుషుని సేవ ఎట్లు నిందకాస్పదమైనదో అట్లే ధన్యాత్ములు పుణ్యాత్ములు ఐన శివ శరణులకు శివుడు దప్ప అన్యదేవతలసేవనిందా పూరితమైనదే అగును ॥35॥ వేయేల శివజ్ఞాన మొకదానిలోనే నిష్ఠగలిగి యుండుట శీలమనబడును. ఇటువంటి శీలమునందాసక్తి గలవాఁడు శీలవంతుడని చెప్పబడును ॥36॥ లింగాంగ జ్ఞానమునందు ఆసక్తి గలవాడు, జగదీశ్వరుండైన శివుని మరుగు (శరణు)జొచ్చినవాడు సతి పతి భావముతో గూడి దృఢమైన మనస్సు గలవాడు, శివుని ఒక్కనినే ప్రధానముగా నెంచబడిన శీలమే అలంకారముగా నున్నవాడు శివ శరణుడు శివైక్యుడని చెప్పబడుచున్నాడు ॥33॥

*ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ శరణస్థలే*
*శరణస్థలాది చతుర్విధ స్థల ప్రసంగోనామ.*
*త్రయోదశ పరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణిలో
శరణ స్థలమున శరణ్యాధిస్థలాది
చతుర్విధ స్థల విచారాత్మకమగు
పదమూడవ పరిచ్ఛేదము పరిసమాప్తము.



# శ్రీ సిద్ధాంత శిఖామణి

## చతర్దశ పరిచ్ఛేదః

## పదనాల్గవ పరిచ్ఛేదం

॥శ్లో॥ తామసత్యాగ సంబంధాన్ని ర్దేశాచ్ఛీలతస్తథా
శరణాఖ్యస్య భూయోఽ స్యకథమైక్యనిరూపణం ॥ 1 ॥

శ్రీ రేణుక ఉవాచ -

ప్రాణ లింగాదియోగేన సుఖాతిశయమేయివాన్
శరణాఖ్యః శివేనైక్యభావనాద్యైక్యవాన్ భవేత్ ॥ 2 ॥

ఐక్యస్థలమిదం ప్రోక్తం చతుర్ధా మునిపుంగవ
ఐక్యమాచార సంపత్తి రేక భాజనమేవచ
సహభాజనమిత్యేషాం క్రమాల్లక్షణముచ్యతే ॥ 3 ॥

తమోగుణాంశమును నిరసించుట చేతను, జ్ఞాననిర్దేశనమునుండియు, శీల సంపాదనమునుండియు ఇంతటితోనే శివ శరణునకు భేదఘటితమైన అంగ లింగముల ఐక్య నిరూపణము ఎట్లు సంభవించును? అని అగస్త్య మహర్షి ప్రశ్నించగా అందుకు శ్రీ రేణుకా చార్యులవారు ఇట్లు ఉద్భోధించుచున్నాడు ॥1॥ అంతర్లింగ ధ్యానపూజల సంబంధము చేత ఆనందాతిశయమును బొందిన శివ శరణుడు శివునితోనే కత్వమును భావించుట వలన అతడే ఐక్యుడనబడును ఇట్టి ఐక్య స్థలము :- ఐక్య స్థలము-ఆచార సంపత్తి స్థలము- ఏక భాజనస్థలము:- ఐక్యస్థలము- ఆచార సంపత్తి స్థలము-ఏకభాజన స్థలము -సహభాజన స్థలము, అని నాలుగు విధములుగా నుండి, అనుక్రమముగా వీటి యొక్క లక్షణములను వివరించుచున్నాడు ॥6॥

### 41. ఐక్యస్థలం:

॥శ్లో॥ విషయానందకణికా నిఃస్పృహోనిర్మలాశయః
శివానందమహాసింధౌ మజ్జనాద్యైక్యముచ్యతే ॥ 4 ॥

నిర్ధూతమలసంబంధో నిష్కలంకమనోగతః
శివోఽహమితి భావేన నిరూఢో హి శివైకతాం ॥ 5 ॥

శివేనైక్యం సమాపన్నశ్చిదానందస్వరూపిణా
న పశ్యతి జగజ్జాలం మాయా కల్పిత వైభవం ॥ 6 ॥

బ్రహ్మాండబుద్బుదోద్భేదవిజృంభీ తత్త్వవీచిమాన్
మయా సింధుర్లయం యాతి శివైక్యబడవానలే ॥ 7 ॥

మాయాశక్తి తిరోధానాచ్ఛివే భేదవికల్పనా
ఆత్మనస్తద్వినాశేతునా ద్వైతాత్ కించిదిష్యతే ॥ 8 ॥

పశుత్వం చ పతిత్వం చ మాయామోహవికల్పితం
తస్మిన్ ప్రలయామాపన్నే కః పశుః కో నువా పతిః ॥ 9 ॥

ఘోర సంసార సర్పస్య భేదవల్మీకశాయినః
బాధకం పరమాద్వైత భావనా పరమౌషధం ॥ 10 ॥

భేదబుద్ధి సముత్పన్న మహాసంసారసాగరం
అద్వైత బుద్ధి పోతేన సముత్తరతి దేశికః ॥ 11 ॥

అజ్ఞానతిమిరోద్రిక్తా కామరక్షఃక్రియాకరీ
సంసారకాలరాత్రిస్తు నశ్యేదద్వైత భానునా ॥ 12 ॥

తస్మాదద్వైతభావస్య సదృశో నాస్తి యోగినాం
ఉపాయో ఘోరసంసార మహాతాపనివృత్తయే ॥ 13 ॥

అద్వైతభావనాజాతం క్షణమాత్రేకపి యత్సుఖం
తత్సుఖం కోటివర్షేస్తు ప్రాప్యతే నైవ భోగిభిః ॥ 14 ॥

చిత్తవృత్తి సమాలీన జగతేః శివయోగినః
శివానంద పరిస్ఫూర్తిర్ముక్తి రిత్యభిదీయతే ॥ 15 ॥

శుద్ధాంతః కరణుడైన శివ శరణుడు అత్యల్పమగు విషయానందమను నీటి బిందువు నందుకోరికలేనివాడై, శివానంద మనెడు మహాసముద్రములోనే మునిగి (గుంకుడుట) యుంట వలన అర్థాత్ తత్స్వ రూపమునే ధరించుట వలన, ఆతడు ఐక్యుడనియు చెప్ప బడును ॥4॥ ఆణవాదిమల సంబంధమును దొలగించినవాడు కళంకరహితమైన మనస్సు చేత గూడియున్నవాడును ఇఁకపోతె నేనే శివుడననెడు భావనతో శివైక్యత్వమును బొంది ఐక్యుడైన వాడనబడును ॥5॥ చిదానంద స్వరూపుడైన శివునితో ఏకత్వమును బొందిన

వాడు మాయా శక్తి పరికల్పిత వైభవము గల ఈ విశ్వ సమూహమును చూడనోపడు. సమస్త ప్రపంచమును శివమయముగా జూచునని భావము ॥6॥ అనంత బ్రహ్మాండములను బుద్బుదముల (నీటి బుగ్గల) ఆవిర్భావముతో నుప్పొంగుచున్న ముప్పదియారు తత్త్వము లనంతరంగములతో గూడియున్న మాయా సముద్రము శివలింగైక్యమనుబడబాగ్ని (కారుచిచ్చులో) లోలయమగుచుండును ॥7॥ జీవికి మాయాశక్తి రూపమగు బంధనముచేత శివుని యందు భేద కల్పనము ఉత్పన్నమగుచుండును. అట్టి మాయా శక్తి రూపకల్పన బంధనము నశించడముతోడనె (వెంటనె) శివాద్వైతము కంటెను భిన్నమైనదేదియు అగుపడదు ॥8॥ జీవ స్వరూపమైన పశుత్వముగాని, శివ స్వరూపమైన పతిత్వము (స్వామిత్వము)గాని మాయా శక్తి మోహము(వ్యామోహము) నుండి యుత్పన్నమగు చుండును. ఆ రెండును ఏకమగుట వలన ఎవడు పశువో-ఎవడు పతియో (స్వామియో) ఈ పశుపతి భేదమేమియు లేకుండగపోవునని భావము ॥9॥ జడాజడ భేదము, జీవాజీవ భేదము, జీవజడభేదము జీవేశ్వర భేదము, జడేశ్వర భేదములని పంచభేదరూపకమైన బొరియ (రంధ్రము-పొక్క)లో నున్న భయంకరమగు సంసారమనెడు సర్పమును జడచేతనైక్యరూపక శివాద్వైత భావనయే నశింపజేయు దివ్య పథమై యున్నది ॥10॥భేదబుద్ధి చేతనుత్పన్నమైన ఘోర సంసార సముద్రమును శివ లింగైక్యుడు శివాద్వైత బుద్ధి స్వరూపమగు నావనాధారముగా జేసికొని అనాయాసముగా తరించును ॥11॥ అజ్ఞానమను గాఢాంధకారము చేత వ్యాపించియున్న కామమనే రాక్షసకృత్యము నాచరించునట్టి సంసారమనెడు కాళరాత్రి (కారుచీకటి) శివాద్వైతమన్ను సూర్యుని వలన నశించును ॥12॥ అందుచేత భయంకరమగుసంసారమునుండి యుత్పన్నమైన మహాతాపనివృత్తికై శివాద్వైత భావమునకు సమానమగునుపాయము శివయోగులకు మరొకటేదియును లేదు ॥13॥ క్షణమాత్రమున గాని శివాద్వైత భావనచేత నుత్పన్నమైన ఎలాంటి సుఖముందో అలాంటి సుఖము రాజభోగముల కంటెను కోటి వత్సరములు తపించినను లభించుట దుర్లభము. అసాధ్యమని భావము ॥14॥ తన చిత్త వృత్తిలో సమస్త ప్రపంచమును లీనమొనర్చుకొనిన శివయోగికి శివానందము యొక్క పరిస్ఫురణమేముక్తి యనబడును ॥15॥

## 42. ఆచార సంపత్తి స్థలం

॥శ్లో॥ శివైకభావనాపన్నశివత్వో దేహవానపి
దేశికోహినలిప్యేత స్వాచారైః సూతకాదిభిః ॥ 16 ॥

శివాద్వైత పరిజ్ఞానే స్థిరే సతి మనస్వినాం
కర్మణా కిం ను భావ్యం స్యాదకృతేన వా ॥ 17 ॥

శంభోరేకత్వభావేన సర్వత్ర సమదర్శనః
కుర్వన్నపి మహాకర్మ న తత్ఫలమవాప్ను యాత్ ॥ 18 ॥

సుకృతీ దుష్కృతీ వాపి బ్రాహ్మణోవాంత్యజోఽపివా
శివైకభావయుక్తానాం సదృశో భవతి ధ్రువం ॥ 19 ॥

వర్ణాశ్రమసదాచారైర్జ్ఞానినాం కిం ప్రయోజనం
లౌకికస్తు సదాచారః ఫలాభావేఽపి భావ్యతే ॥ 20 ॥

నిర్దగ్ధకర్మ బీజస్య నిర్మలజ్ఞాన వహ్నినా
దేహివద్భాసమానస్య దేహయాత్రా తులౌకికీ ॥ 21 ॥

శివజ్ఞాన సమాపన్న స్థిర వైరాగ్య లక్షణః
స్వకర్మణా నలిప్యేత పద్మపత్రమివాం భసా ॥ 22 ॥

గచ్ఛంస్తిష్ఠన్ స్వపన్వాఽపి జాగ్రద్వా2పి మహామతిః
శివజ్ఞాన సమాయోగాచ్ఛివపూజాపరః సదా ॥ 23 ॥

యద్యత్పశ్యతి సామోదం వస్తు లోకేషు దేశికః
శివదర్శన సంపత్తిస్తత్ర తత్ర మహాత్మనః ॥ 24 ॥

యద్యచ్చింతయతే యోగీ మనసా శుద్ధభావనః
తత్తచ్ఛివమయత్వేన శివధ్యానముదాహృతం ॥ 25 ॥

యత్కించిద్భాషితం లోకే స్వేచ్ఛయా శివయోగినా
శివస్తోత్రమిదం సర్వం యస్మాత్సర్వాత్మకః శివః ॥ 26 ॥

యా యా చేష్టా సముత్పన్నా జాయతే శివయోగినాం
సాసా పూజా మహేశస్య సర్వదా తద్గతాత్మనాం ॥ 27 ॥

శివైక్యముతో శివతత్త్వమును బొందిన శివలింగైక్యుడు దేహముతో నున్నను సూతకము మొదలుకొని స్వమతాచారములచేత సంబంధించిన వాడు కానేరడు.శివైక్యదశలో సూతకాదుల నియమావళికి లోనుగాడని భావము ॥16॥ శివలింగైక్యనిష్ఠ చిత్త వృత్తి గలవాడికి

శివాద్వైతజ్ఞానము దృఢమగుటకు వారాచరించునటువంటి క్రియనుండిగాని, వదలిన క్రియ నుండి గాని ఏమియును గాదు.శివైక్యస్థితిలోనున్న వాడు శివపూజాది కర్మలను ఆచరించినను వదలిను సమానమే శివైక్యప్రాప్తితో సర్వత్ర సమానదృష్టిగల అథవా సమస్తమును శివమయముగాను జూచునటువంటి శివలింగైక్యుడు పుణ్య-పాపరూపమగు మహాకర్మలను ఆచరించినను వాటి నుండి రాగల ఫలమును బొందడు॥18॥ సర్వత్ర శివభావము గల వారికి పుణ్యాత్ముడే గానిమ్ము పాపత్ముడే గానిమ్ము. బ్రాహ్మణుడే గానిమ్ము అంత్యజుడేగానిమ్ము అందరును సమానులే అగుదురు ॥19॥

వర్ణాశ్రమ ధర్మములనాశ్రయించినట్టి సదాచారములతో జ్ఞానులకు బ్రయోజనమేమిటి? లౌకిక మగు వర్ణాశ్రమ ధర్మగతనిత్యనైమిత్తిక సదాచారము పలశూన్య (రహిత)మైనను దానిని ఆచరించవలెను. జ్ఞానులకు వర్ణాశ్రమాచార ధర్మములతో ఏలాంటి ప్రయోజనము లేకున్నను లోకానుగుణ్యముగ దేహమును వదిలే వరకు ఆ దేహము యొక్క ధర్మములను ఆచరించే తీరవలెను. ॥20॥ నిర్మలమగు శివజ్ఞానమను అగ్నిచే పుణ్య-పాపరూప కర్మబీజమును దహింపఁజేసిన దగ్ధ పట న్యాయానుగుణ్యముగ దేహధారి మానవులవలె నగుపడుచున్న శివైక్యునకు కరచరణాదుల సంచారరూపకమగు శరీర వ్యాపారము కేవలము లౌకికమయ్యేయున్నది. అతడు జనులకు సామాన్య మానవుడిగ అగుపడిననుఅతనిలో శరీరాభిమానము ఎంత మాత్రముండదు ॥21॥ నీటిలోనున్న తామరాకు నీటి బిందువులను నిలుపుకొనకుండ ఎట్లుగా నుండునో అదే రీతి శివజ్ఞానమునుండి లభించిన దృఢమైన వైరాగ్య వృత్తి గల శివలింగైక్యుడు స్వేచ్ఛాచారముతో లిప్తుడు (ఆసక్తి) గానేరడు ॥22॥శివలింగైక్యుడు, పోవునప్పుడు (నడుస్తు)

“గచ్ఛన్ తిష్ఠన స్వపన్నాऽపి-జాగ్రద్వాऽపి-మహామతిః
శివజ్ఞాన సమాయోగాచ్ఛివపూజాపరఃసదా॥23। ।(పుట : 175)

నిల్చున్నప్పుడు, పరుండిప్పుడు, లేచినప్పుడు, శివజ్ఞాన సంబంధముగలిగియుంట వలన ఎల్లప్పుడును శివ-పూజానిరతుడయ్యే ఉండును ॥23॥ శివలింగైక్యుడు ఈ లోకమున ప్రేమ పూర్వకముగా ఏఏ వస్తువులను జూచుచుండునో ఆయా వస్తువులందును ఈ మహాత్మునకు శివ దర్శన సంపత్తే ప్రాప్తించును. ఆ మహాత్ముడు చూచే సమస్త వస్తువులందును అతనికి శివుడే దర్శనమొసఁగును ॥24॥ స్వచ్ఛమైన భావముండిన శివయోగిదేని తనమనస్సులో ధ్యానించునో ఆ సర్వము శివస్వరూపముగా దర్శించుట వలన అదియే శివ ధ్యాన మనబడును ॥25॥ ఈ లోకమున శివయోగి స్వేచ్ఛగా దేనినైన

నుడివినచో ఏదైన మాట్లాడినట్లైతే అవన్నియు శివస్తోత్రములుగానె పరిణమించును, ఏలననగా శివుడు సర్వాత్మకుడు గదా ॥26॥ శివయోగులకు ఏఏ శరీర చేష్టలు (క్రియలు) ఉత్పన్నములగునో, శివస్వరూపులైన మహాత్ముల ఆయాయాక్రియలు ఎల్లప్పుడును శివుని పూజగానె పరిగణింపఁ బడును ॥27॥

## 43. ఏకభాజనస్థలం

॥శ్లో॥ విశ్వం శివమయం చేతి సదా భావయతో ధియా
శవైకభాజనాత్మత్వాదేక బాజసముచ్చతే ॥ 28 ॥

స్వస్యసర్వస్య లోకస్య శివస్యాద్వైతదర్శనాత్
ఏకభాజనయోగేన ప్రసాదైక్యమతిర్భవేత్ ॥ 29 ॥

శివే విశ్వమిదం సర్వం శివః సర్వత్ర భాసతే
ఆధారాధేయ భావేన శివస్య జగతః స్థితి ॥ 30 ॥

చిదేక భాజనం యస్య చిత్త వృత్తిశివాత్మికా
నాన్యత్తస్య కిమేతేన మాయామూలేన వసునా ॥ 31 ॥

చిత్ ప్రకాశయతే విశ్వం తద్వినా వస్తు నాస్తి హి
చిదేకనిష్ఠచిత్తానాం కిం మాయాపరికల్పితైః ॥ 32 ॥

వృత్తి శూన్యే స్వహృదయే శివలీనే నిరాకులే
యః సదా రమతే యోగీ సముక్తో నాత్ర సంశయః ॥ 33 ॥

చరాచరాత్మకమైనఈ జగత్తు శివమయమై యున్నదిగా భావించి సదా స్వబుద్ధి చేత బావించుచున్నట్టి శివలింగ్యేక్యునకు శివుడే ముఖ్యముగా నాధారముగా నుంటవలన, అట్టి శివలింగ్యైక్యుడు ఏక భాజనుడనిపించుకొనును. సమస్త ప్రపంచమును శివమయమైనదిగా భావించుటే ఏక భాజన స్థలమనబడును ॥28॥ తననను సమస్త ప్రపంచమును శివుని అద్వైత భావనతో జూచుట వలన ఏకకూటత్వము ఏర్పడును, శివైక్యుడు ఇట్లు ఏక కూటత్వము వలన గలిగిన శివ ప్రసాదమునందు ఐక్య భావము గలవాడై యుండవలెను॥29॥శివునిలోనే ఈ సమస్త ప్రపంచము, సమస్త ప్రపంచమునందు శివుడే అగుపడుచుండును, శివుడు మరియు ప్రపంచస్థితి ఆధారాధేయ భావముతో గూడియున్నది ॥30॥ శివుడాధారమై యుండగా ప్రపంచము ఆధేయమైయున్నది. ఏ శివ

యొక్క మనోవ్యాపారము శివ స్వరూపమై యున్నదో, అతని యొక్క దివ్యజ్ఞానమే ఏక భాజనమనబడుచున్నది. ఇట్టి జ్ఞానాతిరిక్తమైన రెండవదేదియు ఏక భాజనమనబడదు. అటువంటి శివయోగికి మాయకుమూలమైన ఇట్టి భేద విశిష్ట వస్తువు చేత నేమి ప్రయోజనము! ఏమియు ప్రయోజనము లేదని భావము ॥31॥ జ్ఞానము సమస్త ప్రపంచమును ప్రకాశింపజేయును, ఇతర-ప్రకాశింపచేయును, ఇతర ప్రకాశింపచేయదు. అందుచేత ఇట్టి జ్ఞానమునందే ముఖ్యముగా మనస్సును దృఢపరచువారికి మాయాకల్పితమగు పదార్థములతోడను ఏమి ప్రయోజనం ఉండదు. జ్ఞానమును వీడి మిగత ఏ పదార్థములతోనుపయోగముండదని భావము. పరబ్రహ్మము జ్ఞాన స్వరూపమై యొప్పుచుండును, "ప్రజ్ఞానం బ్రహ్మ సత్యంజ్ఞాన మయం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులు అదే అభిప్రాయమును వెలిబుచ్చుచున్నవి. అందుచేత మోక్షమునపేక్షించువాడు కేవలము జ్ఞానమునందే లీనమై కైవల్యసుఖము ననుభవించవలయుననునదే భగవత్పాదుల యొక్క ఆశయమై యున్నది ॥32॥ సమస్త వ్యాపారశూన్యము క్షోభరహితము,శివైక్యప్రాయమైన తన హృదయమునందే ఏ శివయోగి ఎల్లప్పుడును వినోదించుచుండునో ఆతడు జీవన్ముక్తుడన బడును. ఈ విషయమున ఎలాంటి సందేహము లేదు.॥33॥

## 44. సహజ భాజన స్థలం

॥శ్లో॥ గురోః శివస్య శిష్యస్య స్వస్వరూపతయా స్మృతిః
సహభాజనమాఖ్యాతం సర్వగ్రాసాత్మ భావతః ॥ 34 ॥

శివం విశ్వం గురుం సాక్షాద్యోజయేన్నిత్యమాత్మని
ఏకత్వేన చిదాకారే తదిదం సహభాజనం ॥ 35 ॥

అహం శివో గురుశ్చైష జగదేతచ్చరాచ్చరం
అహం చేతి మతిర్యస్య నాస్త్యసౌ విశ్వభాజకః ॥ 36 ॥

అహం భృత్యః శివః స్వామీ శిష్యోకహం గురురేష వై
ఇతి యస్య మతిర్నాస్తి స చాద్వైతపదే స్థితః ॥ 37 ॥

పరాహంతామయే స్వాత్మపావకే విశ్వభాసకే
ఇదంతా హవ్యహోమేన విశ్వహోమితి కథ్యతే ॥ 38 ॥

అహం శివో గురుశ్చాహమహం విశ్వం చరాచరం
యయావిజ్ఞాయతే సమ్యక్ పూర్ణాహం తేతిసాస్మృతా ॥ 39 ॥

ఆధారవహ్నౌ చిద్రూపే భేదజాతం జగద్ధవిః
జుహోతి జ్ఞానజుహ్వాయః సజ్ఞేయో విశ్వహవ్యభుక్ ॥ 40 ॥

చిదాకారేపరాకాశే పరమానంద భాన్వతి
విలీన చిత్త వృత్తీనాం కా వా విశ్వక్రమస్థితిః ॥ 41 ॥
నిరస్త విశ్వసంబాధే నిష్కలంకే చిదంబరే
బావయేల్లీన మాత్మానం సామరస్య స్వభావతః ॥ 42 ॥

సైషా విద్యా పరాజ్ఞేయా సత్తానంద ప్రకాశినీ
ముక్తిరిత్యుచ్చతే సద్భిర్జగ న్మోహనివర్తినీ ॥ 43 ॥

భక్తాదినామా పరధర్మయోగాత్
ప్రాప్యైకభావః పరమాద్భుతేన
శివేన చిద్వ్యోమమయేన సాక్షా
న్మోక్షశ్రియో భాజనతాముపైతి ॥ 44 ॥

"శివయోగికి ఘటోమయాజ్ఞాతః పటోమయాజ్ఞాతః" ఇత్యాది సర్వభేదగ్రసనమే స్వస్వరూపమై యుంటవలన అర్థాత్ శివయోగి సర్వమును అభిన్నముగా దెలియుట వలన, గురువు నందును, శివుని యందును, శిష్యుని యందును, భేదమును పాటింపని, ఈ ముగ్గురిని స్వస్వరూపత్వముతో భావించుటే సహభాజన స్థలమనబడును ॥34॥ సాక్షాత్తుగా చిత్స్వరూపమెపుడైన ఆత్మలో శివుని గురువును ప్రపంచ మును ఏకరూపత్వమున (ఇదంత ఒకటే యను భావనతో) (అభేద బుద్ధితో) నిరంతరము సంయోజించునదే సహభాజన స్థలమనబడును ॥35॥ ఇతడు శివుడు ఇతడుగురువు. ఇది చరాచరాత్మకమైన జగత్తు. నేను అనే భేద బుద్ధి ఎవడికైతే ఉండదో అతడు విశ్వభాజనుడనబడును - అర్థాత్ సర్వస్వరూపుడని భావము ॥36॥ శివుడు స్వామి నేను సేవకుడిని, ఇతడు గురువు, నేను శిష్యుడిని, అనే భేదబుద్ధి ఎవడికైతే ఉండదో శివాద్వైత పదాధికారి యగును ॥37॥ జగత్తును ప్రకాశింపజేయు ఉత్కృష్టమగు తన ఆత్మయను అగ్నిలో భేదబుద్ధి రూపమగు హవన ద్రవ్యముతోహోమము జేయుట వలన అతడు విశ్వహోమియని చెప్పబడును. నేనే శివుడిని, నేనే గురువును. నేనే ఈ చరాచరాత్మక మగు సమస్త ప్రపంచము అనిదేనినుండి బాగా ఎవరైతే తెల్పుకుంటారో అది పూర్ణం యనిపించును ॥39॥ జ్ఞానస్వరూపమైన ఆధార చక్రస్థితాగ్నిలో భేదాత్మకమగు జగత్తను హవిస్సును ఎవడైతే జ్ఞానమను జుహూతో

(హోమమునకు సాధనభూతమగు పాత్రతో) హోమము జేయునో ఆతడు "విశ్వహవ్యభుక్ అని చెప్పబడుచున్నాడు. ॥40॥ జ్ఞానస్వరూపుడు స్వయం ప్రకాశుడైన పరమానందం పరమాత్మునితో మనో వ్యాపారమును లయమొనర్చినట్టి శివయోగులకు విశ్వ వ్యాపార వృత్తి యేది యున్నది? ఏదియులేదని భావన ॥41॥ జననమరణ రూపమగు సమస్త క్లేశములను నివారించువాడును, దోషరహితుడు ఐన చిదాకార స్వరూపుడగు పరమాత్మునిలో జీవాత్ముని సామరస్య స్వభావము చేత లీనమైనట్లుగా భావించవలెను. సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్మునిలో స్వస్వరూపమును లయమొనర్చ వలెనని భావము ॥42॥ఆనందమును ప్రకాశింపఁజేయునట్టి మరియు జగత్తునే మోహింపఁజేయునట్టి దానిని నివారించునట్టి యీ విద్యను పరావిద్యయనియు, ముక్తియనియు జ్ఞానులు చెప్పుచుందురు ॥43॥ భక్త మాహేశాది నామములున్న శివయోగి ఉత్కృష్టమైన శివ ధర్మము సంబంధముతో ఊర్ధ్వహృత్కమల మధ్యస్థమగుచిదాకాశ స్వరూపుడైన శివునితో పరమాశ్చర్యము చేత ఏకత్వము (శివసామరస్యమును) బొందిన వాడై సాక్షాత్తుగ మోక్షలక్ష్మి నివాసమునకు అర్హుడగును ॥44॥ ఇంతవరకు అంగస్థలాంతర్గత భక్తా దిషట్ స్థలముల, (అంగస్థలముల) స్వరూపము నిరూపించబడినది. ఇకముందు అంగస్థలాంతర్గత మగు భక్తాది షట్ స్థలముల (లింగస్థల ముల) స్వరూపము నిరూపింపబడును.

*ఇతి శ్రీసిద్ధాంత శిఖామణౌ ఐక్యస్థలే*
*ఐక్యస్థలాది చతుర్విధ స్థల ప్రసంగోనామ*
*చతుర్దశ పరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణి ఐక్యస్థలమున ఐక్య స్థలాది
చతుర్విధ స్థల విచారాత్మకమగు
పదునాల్గవ పరిచ్ఛేదము పరిసమాప్తము.



# శ్రీసిద్ధాంత శిఖామణి

## పంచదశ పరిచ్ఛేదః

## పదునైదవ పరిచ్ఛేదము

### (లింగస్థలాని)

శ్రీరేణుక ఉవాచ: -

షట్స్థలోక్త సదాచార సంపన్నస్య యథాక్రమం
లింగస్థలాని కథ్యంతే జీవన్ము క్తి పరాణి చ ॥ 1 ॥

అగస్త్య ఉవాచః-

భక్తాద్యైక్యావసానాని షడుక్తాని స్థలాని చ
లింగస్థలాని కానీహ కథ్యంతే కతి వాపునః ॥ 2 ॥

శ్రీ రేణుక ఉవాచః-

గుర్వాదిజ్ఞానశూన్యాంతా భక్తాదిస్థలసంశ్రితాః
స్థలభేదాః ప్రకీర్త్యంతే పంచాశత్సప్త చాధునా ॥ 3 ॥

ఆదౌ నవస్థలానీహ భక్తస్థలసమాశ్రయాత్
కథ్యంతే గుణసారేణ వామూన్యేషాం పృథక్ శ్రుణు ॥ 4 ॥

దీక్షాగురుస్థలం పూర్వం తతః శిక్షాగురుస్థలం
ప్రజ్ఞాగురుస్థలం చాథక్రియా లింగస్థలం తతః ॥ 5 ॥

భావలింగ స్థలం చాథ జ్ఞానలింగస్థలం తతః
స్వయం చరం పరం చేతి తేషాం లక్షణముచ్యతే ॥ 6 ॥

ఇంతవరకు అంగస్థలాంతర్గత షట్ స్థలములు చెప్పఁబడినవి (వివరించబడినవి) ఇక ముందు అంగస్థలాంతర్గత షట్ స్థల ప్రతిపాదిత సదాచార సంపన్ను డగు శివయోగికి అనుక్రమముగ జీవన్ముక్తి పరమగు లింగస్థలములు వివరించబడును ॥1॥ ఈ వరకు భక్తాద్యైక్యాంతమగు అంగస్థళము చెప్పబడినవి. ఐతే లింగస్థలములు ఏవి. అవి యెన్ని రకాలు? అని అగస్త్య మహర్షిగారు ప్రశ్నించగా దానికి శ్రీ రేణుకాచార్యులవారు, దీక్షాగురుస్థలాది జ్ఞాన శూన్యస్థలాంతములైన స్థలములు లింగస్థలములని చెప్పెను. ఇట్టి

లింగస్థలములు భక్తాది షట్ స్థలములను ఆశ్రయించు కొని యుండును. ఈ లింగ షట్ స్థలములలో తొమ్మిది స్థలములు గుణాధిక్యతతో భక్త స్థలమునా శ్రయించి యుంట వలన, మొదట ఈ నవ విధ స్థలములు వివరించబడుచున్నవి. వాటి పేర్లను వినుమని (చిత్తగించు)మని వాటి యొక్క నామములను నిరూపించుచున్నాడు ॥7-8॥ దీక్షాగురుస్థలము, శిక్షాగురుస్థలము, జ్ఞానగురుస్థలము, క్రియాలింగస్థలము, భావలింగ స్థలము, జ్ఞానలింగస్థలము, స్వస్థలము, చరస్థలము, పరస్థలము, అను నీ తొమ్మిది స్థలముల స్వరూపములను నిరూపించబడుచున్నవి ॥5-6॥

## 1. దీక్షాగురుస్థలం

దీయతే పరమం జ్ఞానం క్షీయతే పాశబంధనం
యయా దీక్షేతి సా తస్యాం గురుర్దీక్షాగురుస్స్మృతః ॥ 7 ॥

గుణాతీతం గవర్ణం చ రూపాతీతం రువర్ణకం
గుణాతీతమరూపంచయోదద్యాత్ స గురుఃస్మృత ॥ 8 ॥

ఆచినోతి హి శాస్త్రార్థానాచారే స్థాపయత్యపి
స్వయమాచరతే యస్తు స ఆచార్య ఇతి స్మృతః ॥ 9 ॥

షడధ్వాతీతయోగేన యతతే యస్తు దేశికః
మాయాబ్ధితరణోపాయ హేతుర్విశ్వగురుః స్మృతః ॥ 10 ॥

అఖండం యేన చైతన్యం వ్యజ్యతే సర్వవస్తుషు
ఆత్మయోగప్రభావేణ స గురుర్విశ్వ భాసకః ॥ 11 ॥

దేనితో శ్రేష్ఠమగు శివజ్ఞానము అనుగ్రహింపబడినదో, దేని చేతమలమాయాది పాశబంధము నశింపఁబడుచున్నదో, అదే దీక్షయనబడును. అట్టి చిత్క్రియా స్వరూపమగు దీక్షను అనుగ్రహించువాడు దీక్షా గురువు అనబడును ॥7॥ "గురు" అను నీ "శబ్దముననున్నగు అవే అక్షరము ప్రాకృతగుణ రాహిత్యమును బోధించును"రు" అనే అక్షరము ప్రాకృతరూప రాహిత్యమును బోధించును. ఇటువంటి ప్రాకృత గుణాతీతమైన ప్రాకృతరూపాతీతమగు పరశివ బ్రహ్మ స్వరూపమును ఎవడనుగ్రహించునో ఆతడే నిజమైన గురువనబడును. ॥8॥ ఎవడు శిష్యులకు వీరశైవ శాస్త్రోక్తమైన రహస్యార్థములను ఉపదేశించునో, శిష్యులను వీరశైవాచారమునందు స్థిరపడునట్లు జేయునో, మరియు

తానుగూడా వీరశైవాచారమును ఆచరించునో ఆతడే నిజమైన ఆచార్యుడుగా నెన్నబడును॥9॥ ఏ గురువైతే భువనాధ్వ-వర్ణాధ్వ-పదాధ్వ-కలాధ్వ-తత్వాధ్వ-మంత్రాధ్వములన బడుషడధ్వములను మీరిన యోగము నుండి శిష్యసమూహమునుద్ధరింపప్రయత్నించునో, ఆతడే మాయాసముద్రమును తరించు (దాటె) ఉపాయమునకు గారణీభూతుడైన మహాగురువని చెప్పబడును ॥10॥ తనలో నున్న శివయోగ ప్రభావము చేత సమస్త వస్తువులందును అఖండ చైతన్యము ఎవని చేత ప్రకటింపఁబడుచున్నదో ఆతడే విశ్వ ప్రకాశ గురువుగా అనఁబడును ॥11॥

## 2. శిక్షాగురుస్థలం

దీక్షా గురురసౌ శిక్షా హేతుః శిష్యస్య బోధకః
ప్రశ్నోత్తరప్రవక్తా చ శిక్షా గురురితీర్యతే ॥ 12 ॥

బోధకోయం సమాఖ్యాతో బోధ్యమేతదితి స్ఫుటం
శిష్యో నియుజ్యతే యేన స శిక్షా గురురుచ్యతే ॥ 13 ॥

సంసారతిమిరో న్మాథశరచ్చంద్రమరీచయః
వాచో యస్య ప్రవర్తంతే తమాచార్యం ప్రచక్షతే ॥ 14 ॥

దదాతి యః పతిజ్ఞానం జగన్మాయానివర్తకం
అద్వైతవాసనోపాయం తమాచార్యవరం విదుః ॥ 15 ॥

పూర్వపక్షం సమాదాయ జగద్భేదవికల్పనం
అద్వైతకృతసిద్ధాంతో గురురేష గుణాధికః ॥ 16 ॥

సందేహవనసందోహ సముచ్ఛేదకుఠారికా
యత్సూక్తిధారా విమలా సగురూణాం శిఖామణిః ॥ 17 ॥

యత్సూక్తి దర్పణాభోగే నిర్మలే దృశ్యతే సదా
మోక్ష శ్రీర్బింబరూపేణ స గురుర్భవతారకః ॥ 18 ॥

శిష్యాణాం హృదయాలేఖ్యం ప్రద్యోత యతియఃస్వయం
జ్ఞానదీపికయా తేన గురుణా కః సమో భవేత్ ॥ 19 ॥

పరమాద్వైత విజ్ఞానపరమౌషధదానతః
సంసారరోగనిర్మాథీ దేశికః కేన లభ్యతే ॥ 20 ॥

ఈ దీక్షాగురువే శిష్యునికి యుపదేశించేవాడు,శిష్యుని ప్రశ్నలకు దగిన సమాధానము జెప్పువాడు. వేదోపనిషదాది శిక్షణనొసంగె కారణభూతుడు శిక్ష గురువనియు.జెప్పబడును ॥12॥ గురువు శివసిద్ధాంత బోధకుడనఁబడును. శివ జ్ఞానము బోధ్యమైనది. అని స్పష్టముగా నెవనిచేత శిష్యుడాజ్ఞాపించబడునో ఆతడే శిక్షాగురువనబడును ॥13॥

ఎవనియుపదేశ వాక్యములు సంసారమనెడి యంధకారమును నశింపఁజేయుటలో శరత్కాలములోని చంద్రునికిరణముల మాదిరిగానున్నవో, ఆతనిని ఆచార్యునిగా జెప్పుదురు. ॥14॥ ఎవడు జగద్భేదభ్రాంతి నాశకమగు శివద్వైత వాసనయే ఉపాయముగా గల శివజ్ఞానమును అనుగ్రహించునో ఆతనిని ఆచార్య పుంగవునిగా పేర్కొందురు ॥15॥ ఇతరులతో పూర్వపక్షరూపముగా చెప్పబడిన జగద్భేదకల్పనను సత్యముగా నంగీకరించి శివాద్వైతమును సిద్ధాంత పరచునట్టి ఈ శిక్షా గురువు గురు శ్రేష్ఠుడనబడును ॥16॥ ఏగురువు యొక్క నిర్మలమగు ఉపదేశ వచనధార సంశయమను అరణ్య సమూహమును నశింపజేయుటలో కొడువలివలెనున్నదో అతడే గురు శ్రేష్ఠుడనబడును ॥17॥ ఎవని ఉపదేశ వచనమనెడు స్వచ్ఛ(శుభ్రమైన) దర్పణము (అద్దము) నందు మోక్షలక్ష్మి ప్రతిబింబరూపమున అగుపడు తుందో ఆ గురువు సంసారసాగరమును తరింపజేయును ॥18॥ ఏ గురువైతే శిష్యుల హృదయ కమలముననున్న ఆత్మరూపచిత్రమును జ్ఞానమనెడి దీపముతో ప్రకాశింపజేయునో, అట్టి గురువు తనకు సాటియగును. ॥19॥

శివాద్వైత జ్ఞానమనెడి శ్రేష్ఠమగు ఔషధమును ఒసగుట వలన సంసార మనురోగమును నశింపజేయుగురువు శివానుగ్రహమునకు పాత్రుడైన వాడికే లభించునని అర్థము ॥20॥

## 3. జ్ఞాన గురుస్థలం

ఉపదేష్టోపదేశ్యానాం సంశయచ్ఛేదకారకః
సమ్యగ్ జ్ఞానప్రదః సాక్షాదేష జ్ఞానగురుః స్మృతః ॥ 21 ॥

నిరస్త విశ్వసంభేదం నిర్వికారం చిదంబరం
సాక్షాత్కారోతి యో యుక్త్యా స జ్ఞానగురు రుచ్యతే ॥ 22 ॥

కలంకవానసౌ చంద్రః క్షయవృద్ధిపరిప్లుతః
నిష్కలంకః స్థితో జ్ఞానచంద్రమా న వికారవాన్ ॥ 23 ॥

పార్శ్వస్థం తిమిరం హంతి ప్రదీపో మణినిర్మితః
సర్వగామి తమో హంతి బోధదీపో నిరంకుశః ॥ 24 ॥

సర్వార్థసాధక జ్ఞానవిశేషాదేశ తత్పరః
జ్ఞానాచార్యః సమస్తానామనుగ్రహాకరః శివః ॥ 25 ॥

కటాక్ష చంద్రమా యస్య జ్ఞానసాగరవర్ధనః
సంసార తిమిరచ్ఛేది విభుర్దేశిక భాస్కరః ॥ 26 ॥

బహిస్తిమిరవిచ్ఛేత్తా భానురేష ప్రకీర్తితః
బహిరంతస్త మచ్ఛేదీ విభుర్దేశికభాస్కరః ॥ 27 ॥

కటాక్ష లేశమాత్రేణ వినా ధ్యానాదికల్పనం
శివత్వం భావయేద్యత్ర న వేధః శాంభవో మతః ॥ 28 ॥

శివవేధకరే జ్ఞానే దత్తే యేన సునిర్మలే
జీవన్ముక్తో భవేచ్ఛిష్యః స గురుర్ జ్ఞానసాగరః ॥ 29॥

ఉపదేశమునకు దగిన వేదాంత వాక్య రహస్యార్థములను ఉపదేశించువాడు. శిష్యుల సంశయములను నివారించువాడు, ఐన శిక్షాగురువే జ్ఞానమును చక్కగా అనుగ్రహించుట వలన జ్ఞానగురువని చెప్పఁబడును॥21॥ శక్తి విశిష్ట శివాతిరిక్త జగద్భేద శూన్యము, నిర్వికారము ఐన చిదాకాశరూపపరమాత్మ తత్వమును ఎవడైతే స్వాను భవ యుక్తిచేత ప్రత్యక్షమొనర్చునో ఆతడే జ్ఞానగురువని చెప్పఁబడును ॥22॥ చంద్రుడు క్షయవృద్ధులతో గూడికొని కళం కోపేతుడైనాడు. అవుతే ఈ జ్ఞాన చంద్రుడు మాత్రము క్షయవృద్ధులకు లోనుగాక నిష్క ళంకుడై యున్నాడు ॥23॥ రత్నముతో నిర్మించిన దీపము కుడియెడమలకు ప్రక్కనున్న చీకటిని మాత్రమే బోగొట్టును (నశింపఁజేయును) కాని అపరిచ్ఛిన్నమగు జ్ఞాన దీపము అంతట (సర్వత్ర) వ్యాపించి యున్న చీకటిని దొలగింప జేయును ॥24॥

భోగమోక్షరూపసమస్త ప్రయోజనములకు సాధకమైన జ్ఞాన విశేషమును ఉపదేశించుటలో తత్పరుడు. సమస్తముముక్షువులకు అనుగ్రహించువాడును సాక్షాత్తుగా పరమశివుడుగా నున్న వాడే జ్ఞాన గురువు అనబడును, ఇదే అభిఃప్రాయమును వాతులాగమము:-

"శివరూపానుసంధాయ - జ్ఞానం యేనో పదిశ్యతే!
ముముక్షోర్మోక్షసిద్ధ్యర్థం - సజ్ఞాన గురురుచ్యతే!!

అనే శ్లోకమునుండి, ముముక్షువు యొక్క మోక్షప్రాప్తికై ఏ గురువైతే శివ స్వరూపాను సంధానమొనర్చి జ్ఞానమును ఉపదేశించునో ఆతడే జ్ఞానగురువనియాదేశించుచున్నది.

(25) ఎవని కటాక్ష రూపచంద్రుడు జ్ఞానమనే సముద్రమును అభివృద్ధి పరచునో మరియు సంసారమనెడు చీకటిని తొలగింపజేయునో అట్టి గురువు పరాపరజ్ఞానపారంగతుడై యున్నాడు. (26) సూర్యుడు వెలుపలి చీకటిని తొలగించును కాని ఆ గురువనే సూర్యుడు లోన వెలుపల వ్యాపించి యున్న చీకటి నంతటిని తొలగించును (27) శిష్యుడు ధ్యాన ధారణాది సంకల్పముయొక్క ఆవశ్యకత లేకుండగనే శ్రీ గురువు యొక్క కృపాకటాక్షములేశ మాత్రముతోనె శివతత్త్వరూపలక్ష్య పరిజ్ఞానము నందు శివతత్త్వమని భావించునో అట్టి శివతత్త్వము (వేధము) శాంభవవేధమని చెప్పబడును (28) ఎవని చేత శివతత్త్వస్ఫుటీకరణ ప్రావీణ్యత, నిర్మలత్వము గల శివజ్ఞానమును అనుగ్రహించుటకర్హుడైన శిష్యుడు జీవన్ముక్తుడగునో అట్టి గురువు విజ్ఞాన సాగరుడనబడును (29)

## 4. క్రియా లింగ స్థలం

గురోర్విజ్ఞానయోగేన క్రియా యత్ర విలీయతే
తత్క్రియాలింగ మాఖ్యాతం సర్వైరాగమ పారగైః ॥ 30 ॥

పరానందం చిదాకారం పరబ్రహ్మైవ కేవలం
లింగస్వరూపతాపన్నం లక్ష్యతే విశ్వసిద్ధయే ॥ 31 ॥

లింగమేవ పరం జ్యోతిర్భవతి బ్రహ్మ కేవలం
తస్మాత్తత్పూజనాదేవ సర్వకర్మఫలోదయః ॥ 32 ॥

పరిత్యజ్య క్రియాః సర్వాలింగపూజైక తత్పరాః
వర్తంతే యోగినః సర్వే తస్మాల్లింగం విశిష్యతే ॥ 33 ॥

యజ్ఞాదయః క్రియాః సర్వా లింగపూజాంశసమ్మితాః
ఇతి యాత్పూజ్యతే సిద్ధైత్క్రియాలింగముచ్యతే ॥ 34 ॥

కిం యజ్ఞైరగ్ని హోత్రాద్యైః కిం తపోభిశ్చ దుశ్చరైః
లింగార్చనరతిర్యస్య స సిద్ధః సర్వకర్మసు ॥ 35 ॥

బ్రహ్మ విష్ణ్వాదయః సర్వే విబుధా లింగమాశ్రితాః
సిద్ధాః స్వస్వపదే భాంతి జగత్తంత్రాధికారిణః ॥ 36 ॥

జ్ఞాన గురువు యొక్క విశేష జ్ఞానయోగమునుండి ఏలింగమునందు క్రియలయమగునో అదె క్రియాలింగస్థలము అర్థాత్ ఇష్టలింగమని సమస్త శివాగమవేత్తల చేత చెప్పబడినది30

సిత్యానంద స్వరూపము, జ్ఞానస్వరూపమైన పరబ్రహ్మమే సమస్త సత్ఫలముల సిద్ధి కొరకు సద్రూపముతో గూడి క్రియా (ఇష్ట) లింగరూపముచేతనగపడు చుండును (31) పరంజ్యోతి స్వరూపము. అద్వితీయమునైన పరబ్రహ్మమే క్రియా (ఇష్టలింగ) మనబడును. అందుచేత అట్టి లింగార్చనతోడనె సమస్త సత్కర్మల ఫలములభించును - సనకాది -సమస్తయోగి పుంగవులు సకలయోగాది క్రియలనువదలి, ఇష్ట లింగపూజైక పరాయణులై యొప్పుచున్నారు. అందుచేత క్రియా లింగము శ్రేష్ఠమైన దనబడుచున్నది (33) సమస్తయజ్ఞాదిక్రియలు లింగపూజ యొక్క ఒక్క అంశమునకు సమానమైన పని దెల్పిన యోగులచేత (సిద్ధులు)యే లింగము పూజింపబడుచున్నదో క్రియాలింగమును బూజించవలెననుజే శ్రీ భగవత్పాదుల ఆశయమై యున్నది. (34) అగ్ని హోత్రాది యజ్ఞములతో నేమి ప్రయోజనమ్ము కఠినతరములైన తపంబులతో నేమి బ్రయోజనము? ఎవడికి లింగపూజలో ప్రేమ (భక్తి) యుండునో అతడు సమస్త కర్మముల సిద్ధిని బడయును ॥35॥ జగన్నిర్మాణాది క్రియాధికారులు. సుప్రసిద్ధులైన బ్రహ్మవిష్ణ్వాది సమస్తదేవతలు శివలింగమును భక్తిమీర ఆశ్రయించిన వారై తమ తమ స్థానము (పదవులను) లనుబొంది ప్రకాశించుచున్నారు (36)

## 5. భావలింగ స్థలం

క్రియా యథా లయం ప్రాప్తా తథా భావోऽపి లీయతే
యత్ర తద్దేశికైరుక్తం భావలింగమితి స్ఫుటం ॥ 37 ॥

భావేన గృహ్యతే దేవో భగవాన్ పరమఃశివః
కిం తేన క్రియతే తస్య నిత్యపూర్ణో హి స స్మృతః ॥ 38 ॥

అఖండ పరమానంద బోధరూపః పరః శివః
భక్తానాముపచారేణ భావయోగాత్ ప్రసీదతి ॥ 39 ॥

మృచ్ఛిలావిహితాల్లింగాద్భావ లింగం విశిష్యతే
నిరస్త సర్వదోషత్వాద్ జ్ఞానమార్గ ప్రవేశనాత్ ॥ 40 ॥

విహాయ బాహ్యలింగాని చిల్లింగం మనసి స్మర
పూజయేద్భావపుష్పైర్యో భావలింగీతి కద్యతే ॥ 41 ॥

మూలాధారేऽథవా చిత్తే భ్రూమధ్యే వా సునిర్మలం
దీపాకారంయజన్ లింగం భావద్రవ్యైఃసయోగవా ॥ 42 ॥

స్వానుభూతి ప్రమాణేన జ్యోతిర్లింగేన సంయుతః
శిలామృద్దారుసంభూతం న లింగం పూజయత్యసౌ ॥ 43 ॥

క్రియారూపాతు యా పూజా సాజ్ఞేయాస్వల్ప సంవిదాం
అంతరా భావపూజా తు శివస్య జ్ఞానినాం మతా ॥ 44 ॥

క్రియ మాదిరి గానె భావముగూడ ఏ లింగమునందు లయమును బొందునో అట్టి లింగము భావలింగమనబడునని ఆచార్యులు స్పష్టముగా నాదేశించి యున్నారు. (37) షడ్గుణైశ్వర్య సంపన్నుడైన పరమశివుడు భావముచేత గ్రహింపఁబడును. భావగ్రాహ్యుడైన ఆ పరమాత్మునకు బాహ్యపూజతో ఏ ప్రయోజనము సాధించబడదు? అన్నియు సాధించబడునని. భావము. ఎందులకనగా ఆతడు నిత్య తృప్తిగలవాడు గదా (38) అఖండ పరమానంద స్వరూపుడు, చిత్స్వరూపుడైన పరమ శివుడు మానసికోపచారముతోడను మనస్సన్నివేశముతోడను భక్తులకు బ్రసన్నుడగును (39)

మట్టి, శిలలతో జేయబడిన శివలింగము కంటెను భావమునకు గారణ భూతమైన ప్రాణలింగము శ్రేష్ఠమైనదిగా నెన్నబడును. ఏలననగా ఆ ప్రాణ లింగము భేదనచే భేదనాది దోష శూన్యమై యుండి జ్ఞాన మార్గమును గలుగజేయును (40) శిలాదినిర్మిత బాహ్య లింగములను పరిత్యజించి,

"తత్ప్రాణేష్వంతర్మన సోలింగ మాహుః"

అనే అర్థము గల అథర్వ శ్రుతి ప్రసిద్ధమగు చిన్మయ ప్రాణలింగమును ఎవడు దన హృదయ కమలమునందు స్మరించువాడై భావపుష్పములతో బూజించునో ఆతడు భావగోచర భూతప్రాణలింగియని జెప్పఁబడును ఎవడు అత్యంత నిర్మలమనస్కుడు జ్యోతిరాకారమైన ప్రాణలింగమును మూలాధారమునందు గాని, హృదయ కమలమునందు గాని. అథవా భ్రూ మధ్యన గాని మానసికోప చారములతో పూజించునో ఆతడు శివయోగియని చెప్పబడు చున్నాడు (42) స్వానుభవ ప్రమాణగమ్యమగు జ్యోతిర్లింగముతో గూడుకొనిన ఈ శివయోగి శిలామట్టి (మృత్తిక) కాష్టాదులతో నిర్మించబడిన లింగమును బూజింపడు. (43) శివుని విషయములో కర్మకాండ యుక్తమైన ఏ క్రియారూపమగు పూజయున్నదో అది అల్ప జనులకు మాత్రమే చెప్పబడినది. అంతరంగికమైన భావలింగ పూజ పరిపూర్ణ జ్ఞానులకు మాత్రమె చెప్పఁబడినది. మహాజ్ఞానులైనవారు శివుని గంధాక్షతధూప దీపాది బాహ్యోప చారములతో బూజింపక శాంతి వివేకాద్యాంతర్గత ఉపచారములతో బూజింతురు(44)

## 6. జ్ఞానలింగస్థలం

తద్భావజ్ఞాపకం జ్ఞానం లయం యత్ర సమశ్నుతే
తజ్ జ్ఞానలింగ మాఖ్యాతం శివతత్త్వార్థకోవిదైః ॥ 45 ॥

త్రిమూర్తి భేదనిర్ముక్తం త్రిగుణాతీత వైభవం
బ్రహ్మ యద్బోధ్యతే తత్తు జ్ఞానలింగ ముదాహృతం ॥ 46 ॥

స్థూలే క్రియాసమాపత్తిః సూక్ష్మే భావస్య సంభవః
స్థూలసూక్ష్మ పదాతీతే జ్ఞానమేవ పరాత్మని ॥ 47॥

కల్పితాని హి రూపాణి స్థూలాని పరమాత్మనః
సూక్ష్మాణ్యపిచ తైః కింవా పరబోధం సమాచరేత్ ॥ 48 ॥

పరాత్పరం తు యద్బ్రహ్మ పరమానందలక్షణం
శివాఖ్యం జ్ఞాయతే యేన జ్ఞానలింగీ స కథ్యతే ॥ 49 ॥

బాహ్యక్రియాం పరిత్యజ్య చింతామపి చ మానసీం
అఖండ జ్ఞానరూపత్వం యో భజేన్ముక్త ఏవ సః ॥ 50 ॥

అట్టి ప్రాణలింగ ప్రకాశకమగు జ్ఞానము ఏలింగమునందు లయమగునో, జ్ఞానాశ్రయీభూతమగునాలింగము జ్ఞానలింగము (తృప్తిలింగము) అని శివతత్వజ్ఞానుల చేత చెప్పబడినది. ఏ పరబ్రహ్మము బ్రహ్మ - విష్ణు - రుద్రరూపమూర్తిత్రయ భేదరహితమైనదని సత్వ - రజ - తమో గుణాతీతవైభవము గలదని బోధించబడినదో, ఆ పరబ్రహ్మమే జ్ఞానలింగము (తృప్తిలింగము) అని చెప్పబడును (46) స్థూలమైన ఇష్టలింగమున క్రియారూప పూజా ఫలితము లభించును, సూక్ష్మమగు ప్రాణలింగమునందు నిర్మల మగుభావ ప్రాప్తి, స్థూల సూక్ష్మాతీతమగు జ్ఞానలింగము (తృప్తి లింగము) నందు కేవలము జ్ఞాన ప్రాప్తి గలుగును (47) పరమేశ్వరునకు స్థూల సూక్ష్మ రూపములు కల్పితములైయున్నవి. వాటినుండి ప్రయోజన మేమి అందుచేత పరబ్రహ్మరూపమైన జ్ఞానలింగమునే సర్వ శ్రేష్ఠమైనదిగా దెలియవలెను.॥4॥ పరాత్పరము పరమానంద స్వరూపము ఐన శివనామక పరబ్రహ్మము ఎవని చేత తెలియ నగునో ఆతడు జ్ఞాలింగియని చెప్పఁబడును (49)

ఎవడు ఇష్టలింగ సంబంధమగు బాహ్య పూజను, ప్రాణలింగ సంబంధమగు అంతరంగిక ధ్యానపూజను వదలి, అఖండ జ్ఞాన లింగ స్వరూపమును బొందునో, ఆతడె జీవన్ముక్తుడనబడును(50)

తద్భావజ్ఞాపకం జ్ఞానం యత్రజ్ఞానే లయం వ్రజేత్
తద్వానేష సమాఖ్యాతః స్వాభిధానో మనీషిభిః ॥ 51 ॥

స్వచ్ఛందా చారసంతుష్టో జ్యోతిర్లింగపరాయణః
ఆత్మస్థసకలాకారః స్వాభిధో మునిసత్తమః ॥ 52 ॥

నిర్మమో నిరహంకారో నిరస్తక్లేశపంచకః
భిక్షాశీ సమబుద్ధిశ్చ ముక్తప్రాయో మునిర్భవేత్ ॥ 53 ॥

యదృచ్ఛాలాభసంతుష్టో భస్మనిష్ఠో జితేంద్రియః
సమవృత్తి ర్భవేద్యోగీ భిక్షుకే వా నృపేథవా ॥ 54 ॥

పశ్యన్ సర్వాణి భూతాని సంసారస్థాని సర్వశః
స్మయమానః పరానందే లీనాత్మా వర్తతే సుధీః ॥ 55 ॥

ధ్యానం శైవం తథా జ్ఞానం భిక్షా చైకాంతశీలతా
య తేశ్చత్వారి కర్మాణి న పంచమమి హేష్యతే ॥ 56 ॥

అట్టి జ్ఞాన లింగ స్వరూపమును చూయించే జ్ఞానము ఏ జ్ఞానములో లీనమగునో, అటు వంటి జ్ఞానము గలవాడె స్వజంగముడని మహా జ్ఞానుల (వీరశైవ తత్త్వవేత్తల) చేత చెప్పబడియున్నది. స్వయంజంగముడు స్వేచ్ఛా చారసంతుష్టుడు జ్యోతిర్లింగనిష్ఠుడును, సమస్త ప్రపంచ స్వరూపుని తనలో నైక్యపరచుకొనిన (తనలో లీనమొనర్చుకొనిన) వాడు మునిశ్రేష్ఠుడు నైయున్నాడు. విషయ మమతా రహితుడు శరీరాభిమాన శూన్యుడు అవిద్యాది పంచక్లేశ దూరష్ఠుడును, భిక్షాన్నభోక్తుడు, లోష్టాశ్మ (మట్టిముద్దరాయి) కాంచనము (బంగారు) మున్నగు వాటిలో సమాన బుద్ధిగలవాడును, ఐన ఈ మునీశ్వరుడు జీవన్ముక్తుడగును. తనంతట తానె వచ్చిన దానితో సంతసించువాడును. భస్మనిష్ఠుడును, జితేంద్రియుండైన యోగి యాచకుడియందును రారాజునందును సమాన బుద్ధిగల వాడగును (54) ఈ యోగి ప్రపంచమునందుండిన సమస్త ప్రాణులను సర్వథా (సర్వత్ర) ఆశ్చర్యముతో జూచువాడై పరమానంద స్వరూపమగు నట్టి మహలింగమునందు లీనమై యుండును (55) ఇట్టి స్వయజంగమునకు శివధ్యానము 2) శివజ్ఞానము 3) భిక్షాన్నభోజనము, 4) ఏకాంత వాసములను ఈ నాల్గుకర్మల పాటించదగినవి. ఐదవకర్మ ఏదియుండదు (56)

స్వరూపజ్ఞానసంపన్నో ధ్వస్తాహంమమతాకృతిః
స్వయమేవ స్వయం భూత్వా చరతీతి చరాభిధః ॥ 57 ॥

కామక్రోధాదినిర్ముక్తః శాంతిదాంతిసమన్వితః
సమబుద్ధ్యా చరేద్యోగీ సర్వత్ర శివబుద్ధిమాన్ ॥ 58 ॥

ఇదం ముఖ్యమిదం హీనమితి చింతామకల్పయన్
సర్వత్ర సంచరేద్యోగీ సర్వం బ్రహ్మేతి భావయన్ ॥ 59 ॥

న సమ్మా నేషు సంప్రీతిం నావమా నేషు చ వ్యథాం
కుర్వాణః సంచరేద్యోగీ కూటస్థే స్వాత్మని స్థితః ॥ 60 ॥

అప్రాకృతగుణైః స్వీయైః సర్వం విస్మాపయన్ జనం
అద్వైతపరమానందముదితో దేహివచ్చరేత్ ॥ 61 ॥

న ప్రపంచే న దేహే చ న ధర్మే న చ దుష్కృతే
గత వైషమ్యధీర్ధీరో యతిశ్చరతి దేహివత్ ॥ 62 ॥

ప్రాకృతైశ్వర్య సంపత్తి పరాఙ్ముఖమనఃస్థితిః
చిదానంద నిజాత్మస్థో మోదతే మునిపుంగవః ॥ 63 ॥

స్వస్వరూప జ్ఞాన సంపన్నుడు, అహంకారమమకారములు లేనివాడు ఐన స్వయజంగము దేతానె తానై సంచరించుటవలన చరజంగముడు తనకు చెప్పబడును. (57) కామ - క్రోధ - లోభ - మద - మత్సరముల చేత విముక్తుడైనవాడు. శాంతి - దాంత - గుణములతో గూడియున్న వాడును. సర్వత్రా శివభావనగలవాడు ఐన వాడు ఈ చరజంగమనామక శివయోగి సమ బుద్ధిచేత సంచరించును (58) ఈ శివయోగి. ఇది ముఖ్యమైనది, ఇది కనిష్టమైనది అని ఆలోచింపకుండ, సమస్తము పరమశివబ్రహ్మమే యని భావించు వాడై సర్వత్ర సంచరించుచుండును (59)

ఈ శివయోగి నన్మానములో ప్రీతినిగాని, అవమానమునందు వ్యథనుగాని, పట్టించుకొనక, కూటస్థుడైన పరమేశ్వరునియందు ఆసక్తి (భక్తి) గలవాడై తిరుగుచుండును (6) శివాద్వైత జ్ఞానము నుండి ఉత్పన్నమైన మహానందముతో సంతుష్టుడైన ఈ శివయోగి, తన యొక్క లోకోత్తర గుణములచేత సమస్త జనులను ఆశ్చర్య పరచువాడై దేహధారియైన

సామాన్యుని వలె వర్తించును. విధి నిషేధాది క్రియలలో విషమ బుద్ధికి దూరమైన శివయోగి ప్రాకృత మానవుని మాదిరిగా ప్రపంచమందుగాని, తన శరీర విషయమున గాని పుణ్య కార్యమునందు గాని, అథవాపాపకార్యమున గాని, ప్రవర్తింపడు (62) ప్రాకృతమగు బ్రహ్మ - విష్ణ్వాద్యైశ్వర్యములందాశలేని చిత్తవృత్తి గలవాడైన యతి శ్రేష్ఠుడు చిదానంద స్వరూపనిష్ఠుడై పరమానందమును బొందును (63)

## 9. పరస్థలం

స్వయమేవ స్వయం భూత్వా చరతః స్వస్వరూపతః
పరం నా స్తీతి బోధన్య పరత్వమభిధీయతే ॥ 64 ॥

స్వతంత్రః సర్వకృత్యేషు స్వపరత్వేన భావితః
తృణీకుర్వన్ జగజ్జాలం వర్తతే శివయోగిరాట్ ॥ 65 ॥

వర్ణాశ్రమసదాచార మార్గనిష్ఠాపరాఙ్ముఖః
సర్వోత్కృష్టం స్వమాత్మానం పశ్యన్ యోగీతు మోదతే ॥ 66 ॥

విశ్వాతీతం పరం బ్రహ్మ శివాఖ్యం చిత్స్వరూపకం
తదేవాహమితి జ్ఞానీ సర్వోత్కృష్టః స ఉచ్యతే ॥ 67 ॥

అచలం ధృవమాత్మానమనుపశ్యన్ని రంతరం
నిరస్త విశ్వవిభ్రాంతిర్జీవన్ముక్తో భవేన్మునిః ॥ 68 ॥

బ్రహ్మాద్యాః కిం ను కుర్వంతి దేవతాః కర్మమార్గగాః
కర్మాతీత పదస్థస్య స్వయం బ్రహ్మస్వరూపిణః ॥ 69 ॥

స్వేచ్ఛయా నంచరన్ యోగీ విముంచన్ దేహమానితాం
దర్శనైః స్పర్శనైః సర్వానజ్ఞానపి విమోచయేత్ ॥ 70 ॥

నిత్యే నిర్మలభావనే నిరుపమే నిర్ధూతవిశ్వభ్రమే
సత్తానంద చిదాత్మకే పరశివే సామ్యం గతః సంయమీ
ప్రధ్వస్తాశ్రమవర్ణధర్మనిగలః స్వచ్ఛందనం చారవాన్
దేహేప్యద్భుత వైభవో విజయతే జీవన్విముక్తః సుధీః ॥ 71 ॥

తనకు తానై నంచరించు (ఏకాకియై) శివయోగికి స్వస్వరూపము కంటెను శ్రేష్ఠమైనదేదియు లేదను జ్ఞానము. పరలింగమని చెప్పబడును. అర్థాత్ స్వస్వరూపజ్ఞానే

వరజంగముడని చెప్పబడునని భావము (64) తనను పరలింగ స్వరూపముతో భావించువాడు, సమస్త కృత్యములందును స్వతంత్రుడైయున్న శివయోగీశ్వరుడు జగజ్జాలమును దృణీకరించి వర్తించును (65) వర్ణాశ్రమ - సదా చారనిష్ఠతో విముఖుండైన శివయోగి స్వస్వరూపమును సర్వోత్కృష్టమని దెల్సినవాడై ఆనంద పరవశుడై యుండును. దీనితో శివయోగి. ప్రాకృత వర్ణాశ్రమ ఆచారములతో దూరస్థుడై యున్నాడనుటకు వీలులేదు. ఏలనన ఈ స్థలమునకు ముందున్న స్థలము క్రియాగమస్థలమునందు శ్రీరేణుకా చార్య భగవత్పాదులు

"నయథావిధిలోపః స్యాద్యథా దేవః ప్రసీదతి।
యథాగమః ప్రమాణాం స్యాత్తథాకర్మసమాచరేత్॥
జ్ఞానేనాచారయుక్తేన ప్రసీదతి మహేశ్వరః ।
తస్మాదాచారవాన్ జ్ఞానీ - భవేదాదేహపాతనం" ॥

ఇత్యాది శ్లోకములలో:- విధికి (క్రియకు) లోపము రానిరీతిగా కర్మము నాచరించ వలె ననియు ఆచారముతో గూడిన జ్ఞానముతోనె పరమేశ్వరుడు బ్రసన్నుడగుననియు. అందుచేత జ్ఞానియైనవాఁడు దేహమును వదలేవరకు ఆచారయుక్తుడయ్యి యుండవల యుననియు బోధించుటవలన ఈస్థలమునకు ముందున్న ధర్మాచారస్థలమునందు,

"జ్ఞానామృతేన తృప్తోపి - యోగీధర్మంన సంత్యజేత్ ।
ఆచారం మహతాం దృష్ట్వా - ప్రవర్తంతే హిలౌకికా ః ॥

అని గొప్పవారి అచారమును జూచి లౌకికులు గూడ ఆచారమునందు ప్రవర్తించుట వలన, శివయోగి జ్ఞానామృతము చేత తృప్తి జెందినను ధర్మమును వదలగూడదని స్పష్టముగ బోధించుట వలన శివ వర్ణాశ్రమ ధర్మములను త్యజించుటకు వలను పడదని (వీలులేదని) స్పష్టమైనది. ఆచారము వర్ణాశ్రమ నిష్ఠమైనదే గనుక వదలుటకు వీలుపడదు. ఇది వేరేగాదు. అందుకు పైనుటంకించిన శ్లోకాభిప్రాయము ప్రాకృత వర్ణాశ్రమాచారము దూరీకరణ విషయమునందున్నదేగాని, అ ప్రాకృత వర్ణాశ్రమాచార దూరీకరణమునందు లేదని దెలియవలెను (66)

శివనామకమైన పరబ్రహ్మమే విశ్వాతీతము, చిత్స్వరూపమునైయున్నది. అట్టి శివ బ్రహ్మము నేననుజ్ఞానము గలవాడు సర్వశ్రేష్ఠుడైనవాడని చెప్పబడును (67) అచలము నిత్యము ఐనస్వస్వరూపమును ఎడవిడకుండ అగుపడునట్టి శివయోగి ప్రాపంచిక భ్రాంతికి దూరమై జీవన్ముక్తుడనబడును. ఇతడు ఆహారవ్యవహారముల చేత గూడియున్నప్పటికిన్ని

పునర్జన్మ లేనికతమున (లేనందున) జీవన్ముక్తుడగునని భావము (68) స్వయం బ్రహ్మ స్వరూపుడు, పుణ్యపాపాది కర్మాతీత స్థానాపన్నుడునైన శివయోగిని కర్మమార్గముననున్నట్టి బ్రహ్మాది దేవతలు ఏమి జేయగలరు? ఏమియు జేయుటకు శక్తి చాలని వారని భావము. (69) దేహాభిమానమును బరిత్యజించిన శివయోగి స్వేచ్ఛగా సంచరించువాడై తనయొక్క దర్శన - స్పర్శనములతో సమస్త ప్రాకృతులను ముక్తులను గావింపఁ జేయును.

"సదాతృప్తింసమాసాద్య- సదానందీభవన్ స్వయం।
స్వపాదదర్శనాదేవ - భక్తానాంచాన్యదేహినా ॥
దత్వామోక్షం విధీంద్రాది - సురసందోహదుర్లభం।
నిరంజనస్సన్యే లోకే - చరేత్ సః పరజంగమః" ॥

అనే శివాగమ ప్రమాణముమేరకు, ఎవరైతె సదాసంతృప్తిని బొంది సంతోషముతో గూడుకున్నవాడై తన పాదదర్శనముచేత తన భక్తులకు మరియు ఇతరులకు బ్రహ్మ విష్ణ్వాది దేవేంద్రులకు సహదుర్లభమైన మోక్షమును అనుగ్రహించి లోకమునందు సంచరించువాడె పరజంగముడు అని చెప్పబడును (70) నిత్యుడు (శాశ్వతుడు) నిర్మల మనస్కుడు ఉపమారహితుడు, సర్వదోష నిరాకృతుడు. సచ్చిదానంద స్వరూపుడు. ఐన పరమశివునిలో జ్ఞాతృత్వము కర్తృత్వ యోగమునుండి సమానత్వమును బొందిన వాడు ప్రాకృత వర్ణాశ్రమ ధర్మరూప శృంఖలమునుండి విడువబడిన స్వేచ్ఛాచారము గలవాడును, జీవన్ముక్తుడు, ఐన శివయోగి దేహధారియైనను అద్భుతమైన మహిమా సంపదతో గూడి. యున్నవాడై సర్వశ్రేష్ఠుడై వర్తించు చుండును, ఈ శ్లోకమునందుక్తమైన వర్ణాశ్రమ ధర్మ దూరీకరణము, పాకృత వర్ణాశ్రమ ధర్మమునందు వర్తించును గాని-శివ వర్ణాశ్రమ ధర్మమునకు వర్తించదు. ఈ విషయము ఇదే పరిచ్ఛేదమున శ్లోకముయొక్క వ్యాఖ్యానమునందు స్పష్టీకరించబడినది, అట చూడవలెను,

*ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ లింగస్థలే*
*దీక్షా గురుస్థలాది నవవిధ స్థల ప్రసంగో నామ*
*పంచదశ పరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణి లింగస్థలమున
దీక్షాగురుస్థలాది నవ విధ స్థల విచారాత్మకమగు
పదునైదవ పరిచ్ఛేదము ఇక్కడికి పరిసమాప్తము.

# శ్రీసిద్ధాంత శిఖామణి

## షోడశపరిచ్ఛేదః

## పదునారవపరిచ్ఛేదము

అగస్త్య ఉవాచ:-

స్థలానాం నవకం ప్రోక్తం భక్తస్థలసమాశ్రయం
మహేశ్వరస్థలే సిద్ధం స్థలభేదం నిరూపయ ॥ 1 ॥

శ్రీ రేణుక ఉవాచ:-

మాహేశ్వరస్థలే సంతి స్థలాని నవ తాపస
క్రియాగమస్థలం పూర్వం తతో భావాగమస్థలం ॥ 2 ॥

జ్ఞానాగమస్థలం చాథ సకాయ స్థలమీరితం
తతో కాయస్థలం ప్రోక్తం పరకాయస్థలం తతః ॥ 3 ॥

ధర్మా చారస్థలం చాథభావాచార స్థలం తతః
జ్ఞానాచారస్థలం చేత క్రమాదేషాం భిదోచ్యతే ॥ 4 ॥

ఓ ఆచార్యా! భక్త స్థలము నాశ్రయించిన తొమ్మిది స్థలములు నిరూపించ బడినవి. ఇక మహేశ్వర స్థలమునందుండిన స్థల భేదమును బోధించుమని అగస్త్యమహా ర్షుల వారు ప్రశ్నింపగా, అద్దానికి శ్రీరేణుకాచార్య భగవత్పాదులు, ఓయీ! మహర్షీమహేశ్వర స్థలమునందు, క్రియాగమస్థలము, భావాగమ స్థలము, జ్ఞానాగమ స్థలము, సకాయ స్థలము, అకాయ స్థలము, పరకాయ స్థలము, ధర్మాచార స్థలము, భావాచార స్థలము, జ్ఞానాచార స్థలము, ఇట్లు తొమ్మిది స్థలములున్నవని ఉపదేశించిరి. (1-2-3-4)

### 10. క్రియాగమస్థలం

శివో హి పరమః సాక్షాత్ పూజా తస్య క్రియోచ్య తే
తత్పరా ఆగమా యస్మాత్త దుక్తోయం క్రియాగమః ॥ 5 ॥

ప్రకాశతే యథా నాగ్ని రరణ్యాం మథనం వినా
క్రియాం వినా తథాऽంతఃస్థోన ప్రకాశో భవేచ్ఛివః ॥ 6 ॥

న యథా విధిలోపః స్యాద్యథా దేవః ప్రసీదతి
యథాఽఽ గమః ప్రమాణం స్యాత్తథా కర్మసమాచరేత్ ॥ 7 ॥

విధిః శివనియోగోఽ యం తస్మాద్విహితకర్మణి
శివారాధనబుద్ధ్యైవ నిరతః స్యాద్విచక్షణః ॥ 8 ॥

గురోరాదేశ మాసాద్య పూజయేత్పరమేశ్వరం
పూజితే పరమేశానే పూజితాః సర్వదేవతాః ॥ 9 ॥

సదా శివార్చనోపాయసామగ్రీవ్యగ్రమానసః
శివయోగరతో యోగీ ముచ్యతే నాత్ర సంశయః ॥ 10 ॥

అంధపంగువదన్యోన్య సాపేక్షే జ్ఞానకర్మణీ
ఫలోత్పత్తౌ విరక్తస్తు తస్మాత్తద్ద్వ యమాచరేత్ ॥ 11 ॥

జ్ఞానే సిద్ధే పి విదుషాం కర్మాపి వినియుజ్యతే
ఫలాభిసంధిరహితం తస్మాత్కర్మ న సంత్యజేత్ ॥ 12 ॥

ఆచార ఏవ సర్వేషామలం కారాయ కల్పతే
ఆచారహీనః పురుషో లోకే భవతి నిందితః ॥ 13 ॥

జ్ఞానేనాచారయుక్తేన ప్రసీదతి మహేశ్వరః
తస్మాదాచారవాన్ జ్ఞానీ భవేదా దేహ పాతనం ॥ 14 ॥

పూర్వోక్త పరస్థల సంపన్నుడగు శివయోగీశ్వరుడే ప్రత్యక్షముగా సాకార అథవా సాక్షాత్తుగా శివుడనబడును. ఆతని పూజనేక్రియ అనబడును. శివుని పూజకై ఆగమములు క్రియా ప్రధానములై యున్నవి. (5) జంబి (జిమ్మి) కర్రలో రాపిడి (ఘర్షణ) లేనిది అగ్ని ఎట్లు ప్రకాశించదో అట్లే లింగమధ్య నున్న శివుడు "లింగమద్యే జగత్సర్వం' అను సూక్తి మేరకు పూజాక్రియ జరుగనిదే ప్రకాశింపబడు (6) విధిలోపముగాకుండ, శివుడు బ్రసన్నుడగునట్లుగా ఆగమ ప్రమాణముననుసరించి పూజాక్రమముల నాచరించవలెను

ఈ విధానము శివాజ్ఞరూపకమైనది. అందుచేత జ్ఞాని శాస్త్ర విహితమగు కర్మమునందు శివార్చన బుద్ధితో నాసక్తుడై యుండవలెను(8) గురూపదేశానుసారముగా శివలింగము నారాధించవలెను. శివలింగము నర్చించినయెడల సమస్త దేవతలను బూజించినట్లేయగును (9) ఎల్లప్పుడు శివలింగ పూజాసాధన సామగ్రి సంపాదనతో నాసక్తి గలవాడు, శివయోగ

నిరతుడు ఐన శివయోగి మలమాయాది పాశముక్తుడగును. ఈ విషయమున ఎలాంటి సంశయము లేదు. (10) కర్మ - మరియు జ్ఞానం ఈ రెండును గ్రుడ్డి మరియు కుంటివారి వలె అన్యోన్యముగా నభిలషించే విధముగా నున్నది (ఒకదానిపై మరొకటిగా నాధారపడి యున్నవి) గుడ్డివాడికి కుంటివాడి ఆవశ్యకత, కుంటివాడికి గుడ్డివాడి (ఆవశ్యకత వలె ముఖ్యముగా నున్నవి. అందుచేత శివయోగి పరాపరముక్తి రూపమైన ఫలోత్పత్తియందు కర్మ జ్ఞానముల రెండింటిని ఆచరించ (పాటించ)వలెను. అట్లుగాకుండ కేవలము ఒక్కొక్కదానితోనె మోక్ష సిద్ధిగలుగనేరదు (11) జ్ఞానులకు శివజ్ఞానము సహజ సిద్ధముగా నున్నను నిష్కామకర్మ వారికిని నిర్దేశింపఁబడినది. అంచేత ఫలాపేక్ష రహితమైన కర్మను వదలగూడదు! ఏ విధమైన ఫలమున పేక్షించకుండ శివపూజాకర్మము నాచరించవలయునని భావము (12) సమస్త వర్ణాశ్రమ ధర్మీయులకు ఆచారమే అలంకారమైయున్నది. ఆచార శూన్యుడైన మానవుడు లోకమునందు నిందలపాలగును (13) పరమేశ్వరుడు ఆచారయుక్త మగు జ్ఞానమునుండే ప్రసన్నుడగును. అందువలన జ్ఞాని స్థూల శరీరమును త్యజించువరకు ఆచారయుక్తుడై యుండవలెను.

## 11. భావాగమస్థలం

భావచిహ్నాని విదుషో యాని సంతి విరాగిణః
తాని భావాగమత్వేన వర్తంతే సర్వదేహి నాం ॥ 15 ॥

శివోऽ హమితి భావోహి శివతాపత్తి కారణం
న జ్ఞానమాత్రం నాచారో భావయుక్తః శివోభవేత్ ॥ 16 ॥

జ్ఞానం వస్తుపరిచ్ఛేదో ధ్యానం తద్భావ కారణం
తస్మాత్ జ్ఞాతే మహాదేవే ధ్యానయుక్తోభవేత్సుధీః ॥ 17 ॥

అంతర్బహిశ్చ సర్వత్ర పరిపూర్ణం మహేశ్వరం
భావయేత్పర మానంద లబ్ధయే పండితోత్తమః ॥ 18 ॥

అర్థహీనా యథా వాణీ పతిహీనా యథా సతీ
శ్రుతిహీనా యథా బుద్ధి ర్భావహీనా తథా క్రియా ॥ 19 ॥

చక్షుర్హీనో యథా రూపం న కించి ద్వీక్షితుం క్షమః
భావహీనస్తథా యోగీ న శివం ద్రష్టుమీశ్వరః ॥ 20 ॥

భావశుద్ధేన మనసా పూజయేత్పరమేశ్వరం
భావహీనాం న గృహ్ణాతి పూజాం సుమహతీమపి ॥ 21 ॥

నైరంతర్యేణ సంపన్నే భావే ధ్యాతుం శివంప్రతి
తద్భావో జాయతే యద్వత్ కీటే భ్రమరచింతనాత్ ॥ 22 ॥

నిష్కలంకం నిరాకారం పరబ్రహ్మ శివాభిధం
నిధ్యాతుమసమర్థోఽపి తద్విభూతిం విభావయేత్ ॥ 23 ॥

విరాగియైన జ్ఞానికి ఎలాంటి భావచిహ్నములుండునో అట్టి భావ చిహ్నములే సమస్త మానవుల ముక్తి కొరకు భావాగమ స్వరూపముతో ప్రవర్తించును (15) నేనె శివుడిననే భావన శివత్వప్రాప్తికి కారణమగును, కేవలము జ్ఞానముగాని కేవలము ఆచారముగాని శివత్వప్రాప్తికి హేతువుగాదు. అందుచేత శివభావన గలవాడే శివస్వరూపుడగును.

జ్ఞానము "ఈ వస్తువు ఇట్టిది" అని వస్తు స్వరూపాన్ని మాత్రమే నిర్ణయించును కాని ధ్యానము మాత్రము అట్లుగాక నిర్ణీతమైన ఆవస్తు ప్రాప్తికి కారణమగును. అంచేత జ్ఞాని శివుని గుర్తించుటకు - శివభావయుక్తుడగును. అధవా శివస్వరూపుడగునని భావము (17) జ్ఞానిలోపలవెలుపల అంతటను (సర్వత్ర) వ్యాపించియున్న శివుని పరమానంద ప్రాప్తి కొరకు ధ్యానింప వలెను (18) అర్థరహితమైన వాణి, పతిలేని స్త్రీ, వేదవి రుద్ధమగు జ్ఞానము ఎట్లు ఉపయోగపడదోఅట్లే భావశూన్యమగు క్రియ ప్రయోజన కారిగాదు. (19) గుడ్డివాడు రూపమునెట్లు దర్శించడో, అట్లే భావశూన్యుడైన యోగి శివుని దర్శించుటకు అసమర్థుడగును. పరమాత్ముని సందర్శించుటకు సాధకమైన సమస్త సాధనముల కంటెను భావ రూప సాధనము శ్రేష్ఠమైయున్నది, అందువలన శివయోగి భావ పూర్ణుడయ్యే ఉండవలెనని భగవత్పాదులైన శ్రీ రేణుకాచార్యులవారి సందేశము (సదాశయము) (20)

అందుచేత పరమేశ్వరుని ధ్యాన శుద్ధమగు మనస్సుతో బూజింపవలెను. ధ్యాన శూన్యమగు పూజ ఎంతటి మహత్వముగల దైనను అట్టి పూజ పరమేశ్వరునికి ఆమోదయోగ్యమైనదిగాదు (21) భ్రమరచింత వలన కీటకమునందు ఎట్లు భ్రమరస్వరూపము ప్రాప్తించునో అటులే మనస్సు శివుని నిరంతరము ధ్యానించుట వలన ఉద్యుక్తము, శివస్వరూపము ప్రాప్తమగును. నిష్కలంకము, నిరాకారము, శివనామకమగు పరబ్రహ్మమును ధ్యానించుటకై యసమర్థుడైన యెడల ఆ పరశివపరబ్రహ్మము యొక్క సర్వజ్ఞత్వాదిఐశ్వర్యమునైన భావించదగును (23)

## 12. జ్ఞానాగమస్థలం

పరస్య జ్ఞానచిహ్నాని యాని సంతి శరీరిణాం
తాని జ్ఞానాగమత్వేన ప్రవర్తంతే విముక్తయే ॥ 24 ॥

భావేన కిం ఫలం పుంసాం కర్మణా వా కిమిష్యతే
భావకర్మ సమాయుక్తం జ్ఞానమేవ విముక్తి దం ॥ 25 ॥

కేవలం కర్మమాత్రేణ జన్మకోటిశ తైరపి
నాత్మనాం జాయతే ముక్తిర్జ్ఞానం ముక్తేర్హి కారణం ॥ 26 ॥

జ్ఞానహీనం సదా కర్మ పుంసాం సంసారకారణం
తదేవ జ్ఞానయోగేన సంసారవినివర్తకం ॥ 27 ॥

ఫలం క్రియావతాం పుంసాం స్వర్గాద్యం నశ్వరం యతః
తస్మాత్ స్థాయిఫల ప్రాప్త్యై జ్ఞానమేవ సమభ్యసేత్ ॥ 28 ॥

శాస్త్రాభ్యాసాదియత్నేన సద్గురోరుపదేశతః
జ్ఞానమేవ సమభ్యస్యేత్ కిమన్యేన ప్రయోజనం ॥ 29 ॥

జ్ఞానం పరశివాద్వైతపరిపాక వినిశ్చయః
యేన సంసారసంబంధ వినివృత్తి ర్భవేత్ సతాం ॥ 30 ॥

శివాత్మక మిదం సర్వం శివాదన్యన్న విద్యతే
శివో2హమతి యా బుద్ధిస్త దేవ జ్ఞానముత్తమం ॥ 31 ॥

అంధో యథా పురఃస్థాని వస్తూని నహి పశ్యతి
జ్ఞానహీనస్తథా దేహీ నాత్మస్థం వీక్షతే శివం ॥ 32 ॥

శివస్య దర్శనాత్పుంసాం జన్మరోగనివర్తనం
శివదర్శనమప్యాహుః సులభం జ్ఞానచక్షుషాం ॥ 33 ॥

దీపం వినా యథా గేహే నాంధకారో నివర్తతే
జ్ఞానం వినా తథా చిత్తే మోహోపి ననివర్తతే ॥ 34 ॥

భావాగమ స్థలసంపన్నుడైన శివయోగీశ్వరునకు ఏ జ్ఞాన చిహ్నములున్నవో, అట్టి చిహ్నములే మానవుల ముక్తి కొరకు జ్ఞానాగమ స్వరూపముతో ప్రవర్తించు చుండును

(24) మానవులకు కేవలము భావమునుండి గాని కేవలము కర్మనుండి గాని యెలాంటి ఫలము లభించదు. అని భావము. భావకర్మలతో గూడిన జ్ఞానమే మోక్షదాయకమై యొప్పుచున్నది (25)

కేవలము కర్మతో నాత్మ వ్యక్తులకు కోటి జన్మముల నుండియైనను ముక్తి లభించదు కర్మోపేతమగు జ్ఞానమే ముక్తికి గారణమగును ॥26॥ జ్ఞాన శూన్యమైన కర్మ ఎల్లప్పుడు మానవుల సంసార ప్రవృత్తికి గారణమై యున్నది. అట్టి కర్మజ్ఞాన సంబంధముతో సంసార నివృత్తి గారణమగును అర్థాత్ కర్మజ్ఞాన యోగమే ముక్తికి గారణమని భావము (27) కేవలం కర్మము నాచరించువారికి (అట్టివారికి కేవలముచేత) లభించే స్వర్గాది ఫలము నశ్వర (అనిత్య) మైనదికనుక, శాశ్వత ఫలప్రాప్తి కొరకు కర్మతో పాటు జ్ఞానాన్ని ప్రధానముగ అధ్యయనము జేయవలెను. ॥ 28 ॥ నిగమాగమ ప్రసిద్ధమగు వీరశైవ శాస్త్రాభ్యాసాది ప్రయత్నము వలన, సదురువుయొక్క ఉపదేశముతో జ్ఞానమునే ప్రధానముగా నిడుకొని అభ్యసించవలెను. నశించే స్వర్గాది ఫలము జ్ఞానరహిత ఫలముతో బ్రయోజనమేమి (29) శివతత్వమున కంటెను వ్యతిరేకమైన తత్వములేని కతమున సమస్త చరాచర వస్తువులకు శివుని తోడ సిద్ధమగునట్టియద్వైతమే స్థిరమైనదని విశ్వసించిన పరరిపక్వ నిర్ణీత జ్ఞానమే నిత్యమైనదని భావము అట్టి జ్ఞానము తోనె సత్పురుషునకు సంసారబంధనము నుండి ముక్తి లభించును (30) సమస్త ప్రపంచము శివస్వరూపమైనది. శివుడు దప్ప మరొకటేదియును లేదు. నేను శివుడిని అనుబుద్ధి యెవరి యందుండునో వారిదే శ్రేష్ఠమైన దివ్య జ్ఞానమనబడును (31)

గ్రుడ్డివాడుదన ఎదుటనున్న వస్తుసముదాయములనే విధముగ జూడజాలడో అదే రీతిగా జ్ఞాన శూన్యుడైన మానవుడు అత్మస్థితుడైన శివుని దర్శింపలేడు. (32) శివుని దర్శనమునుండె మానవులకు భవరోగము నివృత్తియగును. శివుని సందర్శనమును గురించి శాస్త్రజ్ఞులు జ్ఞాన నేత్రము లున్నవారికి సులభ సాధ్యుడని చెప్పుదురు (33) దీపము లేనిదే ఇంట్లోని జీకటి యెట్లు దొలగిపోదో అట్లే జ్ఞాన శూన్యునిలోనున్న అజ్ఞానాంధకారము తొలగి పోదు (34)

## 13. సకాయస్థలం

పరస్య యా తనుర్జ్ఞేయా దేహకర్మాభిమానినః
తయాసకాయోలోకోక యంతదాత్మత్వనిరూపణాత్ ॥ 35 ॥

కాయం వినా సమస్తానాం న క్రియా న చ భావనా
న జ్ఞానం యత్తతో యోగీ కాయవానేవ సంచరేత్ ॥ 36 ॥

శివైక్యజ్ఞానయుక్తస్య యోగినో పి మహాత్మనః
కాయయోగేన సిద్ధ్యంతి భోగమోక్షాదయః సదా ॥ 37 ॥

కాష్ఠం వినా యథా వహ్నిర్జాయతే న ప్రకాశవాన్
మూర్తింవినా తథాయోగీ నాత్మతత్త్వ ప్రకాశవాన్ ॥ 38 ॥

మూర్త్యాత్మ నైవ దేవస్య యథా పూజ్యత్వకల్పనా
తథా దేహాత్మ నైవాస్య పూజ్యత్వం పరయోగినః ॥ 39 ॥

నిష్కలో హి మహాదేవః పరిపూర్ణః సదాశివః
జగత్సృష్ట్యాది సంసిద్ధ్యై మూర్తి మానేవ భాసతే ॥ 40 ॥

బ్రహ్మాద్యా దేవతాః సర్వా మునయోపి ముముక్షవః
కాయవంతో హి కుర్వంతి తపః సర్వార్థ సాధకం ॥ 41 ॥

తపో హి మూలం సర్వాసాం సిద్ధీనాం యజ్జగత్త్రయే
తపస్తత్కాయమూలం హితస్మాత్కాయం న సంత్యజేత్ ॥ 42 ॥

దేహాభిమాన కర్మాభిమానములతో శూన్యుడైన శివయోగి శరీరము జనములకు జ్ఞేయమో (తెలియదగినదో) అంతటి శరీరమునకు ఆశివయోగి ఆత్మ యని చెప్పబడినది. అట్టి శరీరము నుండి ఆ శివయోగి సకాయుడగును" (35) శరీరము లేనిదే సమస్త జనులకు క్రియ సంభవించదు. భావన గూడ సంభవించదు. జ్ఞానము సంభవించదు అంచేత శివయోగి శరీరము గలవాడయ్యే సంచరించవలెను (36) శివైక్య జ్ఞానయుక్తుడు మహాత్ముడై శివయోగికి గూడ భోగ మోక్షాదులు శరీర సంబంధమునుండే జరుగును (సిద్ధించును) ॥32॥ కఱ్ఱలు (కట్టెలు) లేనిదే అగ్ని యెట్లు ప్రకాశింపదో. అట్లే శరీరము లేనిదే శివయోగి ఆత్మతత్త్వ ప్రకాశమున్నవాఁడు కాలేడు (38) పరమేశ్వరునికి మూర్తిస్వరూపముతోనె ఎట్లు పూజ్యత్వము గలుగుతుందో (ఏర్పడుతుందో) అట్లే ఈ శివయోగికి శరీరాకారమునుండే పూజ్యత్వమేర్పడును.(39) నిష్కలుడు, పరిపూర్ణుడు మహాదేవుడు ఐన పరమేశ్వరుడు జగత్సృష్ట్యాది సిద్ధికొరకు సాకారుడయి అగుపడు చుండును. (40) బ్రహ్మాది సమస్త దేవతలు, మోక్షాపేక్షులైన మునీశ్వరులు శరీరధారులయ్యే సర్వార్థ సాధకమైన తపమ్ము నాచరింతురు (41) ముల్లోకములోను సమస్త సిద్ధులకు తపస్సే మూలకారణము.

ఆతపస్సునకు శరీర మేమూల కారణము, అందుచేత శరీరమును వదలగూడదు "శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం" అను ఆర్యోక్తి వలె శరీరమే ధర్మమునకు మూలము (సాధనము) ఈ సాధనమున శివయోగి శరీరమును ధరించె సమస్త సిద్ధులను బొందవలెనను భావము (42)

## 14. అకాయస్థలం

ఔపచారిక దేహిత్వాజ్జగ దాత్మత్వ భావనాత్
మాయా సంబంధరాహిత్యాద కాయో హిపరఃస్మృతః ॥ 43 ॥

పరస్య దేహయోగేకపి న దేహాశ్రయవిక్రయా
శివస్యేవ యతస్తాస్మాదకాయో యం ప్రకీర్తితః ॥ 44 ॥

పరలింగే విలీనస్య పరమానంద చిన్మయే
కుతో దేహేన సంబంధో దేహివద్భావనం భ్రమః ॥ 45 ॥

దేహాభిమానహీనస్య శివభావే స్థిరాత్మనః
జగదేతచ్ఛరీరం స్యాద్దేహేనైకేన కా వ్యథా ॥ 46 ॥

శివజ్ఞానైక నిష్ఠస్య నాహంకారభవో భ్రమః
న చేంద్రియభవం దుఃఖం త్యక్త దేహాభిమానినః ॥ 47 ॥

న మనుష్యో న దేహోక హం న యక్షో నైవ రాక్షసః
శివో హమితి యో బుద్ధ్వాత్తస్థ కిందేహ కర్మణా ॥ 48 ॥

శివయోగి ఔపచారిక దేహము గలవాడైయుండుటవలన సమస్త ప్రపంచమును స్వస్వరూపముగా భావించుట వలన, మాయా విషయిక సంబంధ శూన్యుడగుట వలనను అకాయుడు (దేహరహితుడు) అనబడును. శివునకు శరీరసంబంధమైన వికారములుండవు. కనుకనే ఇతడును అకాయుడనబడును శివయోగికి కూడా అట్టి వికారములుండవు. మహా నంద స్వరూపము, చిత్స్వరూపం, ఐన శివలింగమున లీనమైన వాడికి దేహ సంబంధమెక్కడిది. చూచువారికి శరీరధారివలె అగుపడుట కేవలము భ్రాంతే శివస్వరూపమున స్వస్వరూపమును స్థిపరచుకొన్నవాడు దేహాభిమాన శూన్యుడునైన శివయోగికి యీజగమే శరీరమగును. ఆతనికి దనయొక్క శరీరము వలన ఏలాంటి దుఃఖము గలుగనేరదు (ఎటువంటి వ్యసనమున కలలోను గాదు) శివజ్ఞానైక నిష్ఠుడు,

దేహాభిమాన శూన్యుడు ఐన శివయోగికి, అహంకారము నుండి యుత్పన్నమైన భ్రాంతి యుండదు. ఇంద్రియములనుండి ఉత్పన్నమైన దుఃఖము తారసిల్లదని తాత్పర్యము. (47) నేను మనిషిని కాను, దేవతను గాను యక్షుడిని గాను, రాక్షసుడిని గాను, ఐతేనేను శివుడిననియె ఎవడు దెల్సికొనునో ఆతనికి శరీర సంబంధమగు కర్మచేత ఏమి ప్రయోజనము? ఏలాభము లేదని తాత్పర్యము (48)

## 15. పరకాయస్థలం

వశీకృతత్వాత్ ప్రకృతేర్మాయామార్గాతివర్త నాత్
పరకాయో కయమాఖ్యాతః సత్యజ్ఞాన సుఖాత్మకః ॥ 49 ॥

పరబ్రహ్మ వపుర్యస్య ప్రబోధానందభాసురం
ప్రాకృతేన కిమేతేన శరీరేణాస్య జాయతే ॥ 50 ॥

సమ్యగ్ జ్ఞానాగ్ని సందగ్ధ జన్మ బీజకలేవరః
శివతత్త్వావలంబీ యః పరకాయః స ఉచ్యతే ॥ 51 ॥

ఇంద్రియాణి మనోవృత్తి ర్వాసనాః కర్మ సంభవాః
యత్ర యాంతి లయం తేన సకాయోయం పరాత్మనా ॥ 52 ॥

పరాహంతామనుప్రాప్య పశ్యేద్విశ్వం చిదాత్మకం
న దేహీతిభ్రమస్తస్య నిశ్చితా హి శివాత్మతా ॥ 53 ॥

స్వస్వరూపం శివాకారం జ్యోతిస్సాక్షాద్విచింతయన్
దేహవానపి నిర్దేహో జీవన్ముక్తోహి సాధకః ॥ 54 ॥

దేహస్తిష్ఠతు వా యాతు యోగినః స్వాత్మబోధినః
జీవన్ముక్తిర్భవేత్ సద్యశ్చిదానందప్రకాశినీ ॥ 55 ॥

ఆత్మజ్ఞానావసానం హి సంసారపరిపీడనం
సూర్యోదయేऽపి కిం లోకస్తిమిరేణోపరుధ్యతే ॥ 56 ॥

దేహాభిమాన నిర్ముక్తః కులాతీతపదాశ్రయః
కథం యాతి పరిచ్ఛేదం శరీరేషు మహాబుధః ॥ 57 ॥

అకాయుడైన ఆశివయోగి ప్రకృతిని జయించితాను వశపరచుకొనుట వలన మాయా మార్గమును తరించుటచేతను, సచ్చిదానంద స్వరూపుడగు నాతడు పరకాయుడని

చెప్పబడును (49) జ్ఞానానందముల చేత ప్రకాశమానమైన పరబ్రహ్మము ఎవనికి శరీరమై యున్నదో, అట్టి పరకాయ శివయోగికి ప్రకృతికి సంబంధించిన ఈ శరీరముతో నేమి ప్రయోజనము. ఎలాంటి ప్రయోజనము లేదని భావము (50) ఎవడైతె శివజ్ఞానాగ్నితో భవబీజావయవమును బాగుగా దహింపఁజేసియున్నాడో మరియు శివతత్వావలంబియై యున్నాడో నాతడే నిజమైన పరకాయుడనఁబడును (51) కర్మనుండియుత్పన్నమగు విషయవాసనలు మనోవ్యాపారము మరియు ఇంద్రియ వ్యాపారములు దేవిలో గల్సిపోవునో, అట్టి పరబ్రహ్మము నుండి యిట్టి పరకాయుడు దేహధారియనఁబడును. అర్థాత్ ఈతని శరీరము పరబ్రహ్మ మయమైనదనియు భావము (52) ఎవడైతె పరబ్రహ్మమును నేననే భావనగలిగి సమస్త ప్రపంచమును పరబ్రహ్మ స్వభావభూత చిత్క్రియాస్వరూపముగా జూచునో, అతనికిదే హిత్వస్వరూప భ్రాంతి యుండనేరదు. ఆతనికి శివస్వరూపమే నిశ్చితమైనది (53) స్వస్వరూపమును సాక్షాత్తుగా శివస్వరూపమగు జ్యోతిగా భావించు నట్టి సాధకుడు (శివయోగి) దేహము గలవాడైనను, దేహ శూన్యుడైన జీవన్ముక్తుడనఁబడును. (54) స్వస్వరూపమును జక్కగాదెలసి కొనిన శివయోగికి ఈజడదేహముండదు అథవానశించని గాక తత్కాలమునందే ఆతనికి చిదానంద ప్రకాశికమైన జీవన్ముక్తి లభించును (55) ఆత్మ జ్ఞానమయ్యే వరకు సంసార దుఃఖముండే తీరును, ఆత్మ జ్ఞానమైన తరువాత ఇఁక సంసారదు:ఖమెక్కడిది? సూర్యోదయమైన పిదప ప్రపంచము చీకటి చేత నావరించబడదు? సూర్యోదయ మవగానే చీకటి నశించునట్లుగా ఆత్మ జ్ఞానము గలుగ గానె సంసారదుఃఖము నశించునని భావము (56) దేహాభిమాన శూన్యుడు నివృత్యాది కలాతీత పరబ్రహ్మ పదాశ్రయుడు ఐన పరకాయుడు శరీరములుండి, ఇది నాది, ఇది ఇతరునిది, అనే భేద భావమును ఎట్లు బొందును? సమస్త శరీరములను స్వస్వరూపములుగా భావించునని భావము (57)

## 16. ధర్మాచారస్థలం

తస్యైవ పరకాయస్య ధర్మాచారో య ఇష్యతే
స ధర్మః సర్వలోకానాముపకారాయ కల్పతే ॥ 58 ॥

అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం దయా క్షమా
దానం పూజా జపో ధ్యానమితి ధర్మస్య సంగ్రహః ॥ 59 ॥

శివేన విహితో యస్మాదాగ మైర్ధర్మ సంగ్రహః
తస్మాత్త మాచరన్ విద్వాన్ తత్ప్రసాదాయ కల్పతే ॥ 60 ॥

అధర్మం నస్పృశేత్ కించిద్విహితం ధర్మమాచరేత్
తం చ కామ వినిర్ముక్తం తమపి జ్ఞాన పూర్వకం ॥ 61 ॥

ఆత్మ వత్సర్వభూతాని సంపశ్యేద్యోగ విత్తమః
జగదేకాత్మతా భావాన్నిగ్రహాది విరోధతః ॥ 62 ॥

ఏక ఏవ శివస్సాక్షాజ్జగదేతదితి స్ఫుటం
పశ్యతః కిం న జాయేత మమకారో హి విభ్రమః ॥ 63 ॥

ధర్మ ఏవ సమస్తానాం యతః సంసిద్ధి కారణం
నిః స్పృహోపి మహాయోగీ ధర్మమార్గంహి నత్యజేత్ ॥ 63 ॥

జ్ఞానామృతేన తృప్తో2పి యోగీ ధర్మం న సంత్యజేత్
ఆచారం మహతాం దృష్ట్వా ప్రవర్తం తేహి లౌకికాః ॥ 65 ॥

సదాచారప్రియః శంభుః సదాచారేణ పూజ్యతే
సదాచారం వినా తస్య ప్రసాదో నైవ జాయతే ॥ 66 ॥

పరబ్రహ్మ శరీరమగు నాశివయోగికి యెట్టి ధర్మాచారము ఇష్టమగునో, అట్టి ధర్మాచారమే సర్వజనుల కల్యాణమునకై సమర్థమైనదగును. (58) హింసించకుండ ఉండడం. కలహించకుండ ఉండడం. సత్యమునే బలుకుట. బ్రహ్మచర్యమును పాటించుట. దయ, క్షమ, దానము, శివ పూజ, పంచాక్షర మంత్రజపము, శివధ్యానము. వీటిని దప్పకుండ పాటించుటే ధర్మ సంగ్రహమనబడును.

"అహింసా సత్యమస్తేయం - బ్రహ్మచర్యం దయాక్షమా!
దానం పూజాజపోధ్యానమితి ధర్మస్యసంగ్రహః (59)

ఈ విధముగ శివాగమాలలో శివుని వలన అహింసాది ధర్మసంగ్రహమును గురించి చెప్పఁబడినది, అట్లు ధర్మ సంగ్రహము నాచరించునట్టి విద్వాంసుడు శివానుగ్రహమునకు పాత్రుడగును. అహింసాది ధర్మాచరణము నాచరింపమి శివానుగ్రహమునకు బాత్రుడుగాడని భావము. (6) విద్వాంసుడు అధర్మమును కొంచమైనను స్పర్శింపఁగూడని. శివాగమము లందాదేశించ బడినది. ఆకారణమున శివయోగి ధర్మమునే ఆచరించవలెను. ఆ ధర్మాచరణ గూడ నిష్కామ బుద్ధితో జ్ఞానపూర్వకముగ నుండవలెను (61) శివయోగి యైనవాఁడు సమస్త ప్రపంచమును ఏకాత్మ స్వరూపముతో గుర్తించడము వలన నిగ్రహాదుల

కవకాశమునొసఁగుట వలన, సమస్త ప్రాణులను దనవలె జూచును (62) ఒక్క శివుడే ప్రత్యక్ష మగు నీ జగత్తనియు తెలిసికొని స్పష్టముగా జూచునాతనికి యేది సిద్ధించదు? సర్వము సిద్ధించునని భావము. జగత్తులోని మమకారమనునదే కేవలము భ్రాంతి (63) ధర్మమే సమస్త జనులకు భోగమోక్షముల ప్రాప్తికి గారణభూతమైనది. అందుచేత శివయోగి దాను నిష్పృహుడైనను ధర్మ మార్గమును వదలగూడదు (64) శివయోగి తాను జ్ఞానామృతము నుండి తృప్తి జెందినను ధర్మచ్యుతుడుగాగూడదు. ఏలనన లౌకికులు గొప్ప వారి ఆచారవ్యవహారములను జూచి వారివలె ఆచరింపయత్నింతురు గదా (65) శివుడు సదాచార ప్రియుడు గనుక సదాచారము నుండే పూజింపఁబడును, సదాచారములేనిదే శివుని ప్రసాదమే సిద్ధించదు (66)

## 17. భావాచారస్థలం

భావ ఏవాన్య సర్వేషాం భావాచారః ప్రకీర్తితః
భావో మానస చేష్టాత్మా పరిపూర్ణ శివాశ్రయః ॥ 67 ॥

భావనావిహితం కర్మ పావనాదపి పావనం
తస్మాద్భావనయా యుక్తం పరధర్మం సమాచరేత్ ॥ 68 ॥

భావేన హి మనశ్శుద్ధిర్భావాత్ సిద్ధిశ్చ కర్మణాం
ఇతి సంచిత్య మనసా యోగీ భావం న సంత్యజత్ ॥ 69 ॥

శివభావనయా సర్వం నిత్య నైమిత్తి కాదికం
కుర్వన్నపి,మహాయోగీ గుణదో షైర్న బాధ్యతే ॥ 70 ॥

అంతఃప్రకాశమానస్య సంవిత్సూర్యస్య సంతతం
భావేన యదుపస్థానం తత్ సంధ్యావందనం విదుః ॥ 71 ॥

ఆత్మజ్యోతిషి సర్వేషాం విషయాణాం సమర్పణం
అంతర్ముఖేన భావేన హోమకర్మేతి గీయతే ॥ 72 ॥

భావయేత్ సర్వకర్మాణి నిత్య నైమిత్తి కాని చ
శివప్రీతికరాణ్యేవ సంగరాహిత్యసిద్ధయే ॥ 73 ॥

శివే నివేశ్య సకలం కార్యాకార్యం వివేకతః
వర్తతే యో మహాభాగః ససంగ రహితో భవేత్ ॥ 74 ॥

ఆత్మానమఖిలం వస్తు శివమానందచిన్మయం
ఏకీభావేన సతతం సంపశ్యన్నేవ పశ్యతి ॥ 75 ॥

ఈ ధర్మాచార సంపన్నుడైన శివయోగి యొక్క శివభావనే భావాచారమునఁబడును, ఈ భావన మనో వ్యాపారస్వరూపమై పరిపూర్ణమై, శివస్వరూపముగా నుండవలెను. (67) భావయుక్తమగు శివపూజాది కర్మము అత్యంత పవిత్రమై యున్నది. అందుచేత శ్రేష్ఠమగు ఆచారధర్మమును భావసహితముగా ఆచరించవలెను. (68) భావము నుండే మనస్సు శుద్ధియగుననియు భావమునుండే కర్మములు సిద్ధించుననియు శివయోగి మనస్సులో నాలోచించి భావమును వీడవలదు (69) శివయోగి సమస్త నిత్యనైమిత్తికాది కర్మలను ఆచరించినప్పటికిని శివభావనతో జేయు పక్షమున అతడు ఏలాంటి గుణదోషముల నుండి బంధించబడడు. (70) హృదయకమలమునందు బ్రకాశించు జ్ఞాన సూర్యుడిని ఎల్లప్పుడు భావనతో నారాధించుట అనునదేది గలదో దానినే జ్ఞానులు సంధ్యావందనముగ తెలిసి కొనియునుష్ఠింతురు. (71) అంతర్ముఖమైన భావనతో ఆత్మాగ్నిలో సమస్త విషయముల సమర్పించుటనునదేది గలదో అదేహోమ కర్మమని చెప్పబడును. (72) సంసార సంబంధ నివృత్తి కొరకు నిత్య నైమిత్తికాది సమస్తకర్మలను శివానుగ్రహమునకనియే భావించవలెను (73) ఏమహాత్ముడు వివేకముతో సకల కార్యాకార్యములను శివునకే సమర్పించునో అతడు సంసారబంధము నుండి దూరమగును (74) తనను సమస్త వస్తువులను, చిదానంద స్వరూపుడైన నట్టి శివుని యెల్లప్పుడు ఏక రూపముతో జూచువాడే శివుని జూచువాడనఁబడును, సకలమును శివస్వరూపమున దర్శించు నాతడే శివస్వరూపుండగునని భావము (75)

## 18. జ్ఞానాచారస్థలం

అన్య జ్ఞానసమాచారో యోగినః సర్వదేహి నాం
జ్ఞానాచారో యదుక్తో యం జ్ఞానాచారః స కథ్యతే ॥ 76 ॥

పరిపూర్ణం మహాజ్ఞానం పరతత్త్వ ప్రకాశకం
అవలంబ్య ప్రవృత్తో యో జ్ఞానాచారస్స ఉచ్యతే ॥ 77 ॥

నిర్వికల్పే పరే ధామ్ని నిష్కలే శివనామని
జ్ఞానేన యోజయన్ సర్వం జ్ఞానాచారీ ప్రకీర్తితః ॥ 78 ॥

కర్మ జ్ఞానాగ్నినా దగ్ధం న ప్రరోహేత్ కథంచన
యదాహుస్సంసృతేర్మూలం ప్రవాహానుగతం బుధాః ॥ 79 ॥

జ్ఞానేన హీనః పురుషః కర్మణా బధ్యతే సదా
జ్ఞానినః కర్మసంకల్పా భవంతి కిల నిష్ఫలాః ॥ 80 ॥

జ్ఞానం ముక్తిప్రదం ప్రాప్య గురుదృష్టిప్రసాదతః
కః కుర్యాత్కర్మ కార్పణ్యే వాంఛాం సంసారవర్ధనే ॥ 81 ॥

శివాద్వైతపరం జ్ఞానం జ్ఞానమిత్యుచ్యతే బుధైః
సిద్ధేన వాప్యసిద్ధేన ఫలం జ్ఞానాంతరేణ కిం ॥ 82 ॥

నిర్మలం హి శివజ్ఞానం నిఃశ్రేయసకరం పరం
రాగ ద్వేషాదికలుషం భూయః సంసృతికారణం ॥ 83 ॥

శుద్ధాచారః శుద్ధభావో వివేకీ
జ్యోతిఃపశ్యన్ సర్వతః శైవమేకం
జ్ఞానధ్వస్త ప్రాకృతాత్మప్రపంచో
జీవన్ముక్త శ్చేష్టతే దివ్యయోగీ॥ ॥ 84 ॥

భావాచార సంపన్నుడైన ఈ శివయోగి జ్ఞానపూర్వకమైన ఆచారమె సకలమానవుల ఉద్ధారమునకు జ్ఞానాచారమని చెప్పబడును (76) పరతత్త్వ ప్రకాశకము పరిపూర్ణమునైన శివాద్వైత జ్ఞానమును ఏది దేనిని ఆధారముగ జేసికొని ప్రవర్తించునో అదేజ్ఞానాచారమని చెప్పబడును (77) నిర్వికల్పము నిష్కలము, శివనామకమునైన పరబ్రహ్మమునందు సమస్త జగత్తును అభేదజ్ఞానము చేత యోచించువాడు జ్ఞానాచారియనిజెప్పబడును (78) జ్ఞానులు అనాది కాలము నుండి ప్రవాహ రూపమున వచ్చియున్న ఏకర్మమును సంసారమునకు మూలకారణముగాను బేర్కొందురో అట్టి కర్మము జ్ఞానాగ్నిచేత దహింప బడినచో ఏ విధము గాను అంకురించదు (79) జ్ఞానశూన్యుడైనపురుషుడు సదాకర్మముచేత బంధించబడును, జ్ఞానికి కర్మసంకల్పములు నిష్ఫలములగును ('80) గురు కటాక్షానుగ్రహమువలన మోక్షప్రదమగు జ్ఞానమును బడసి, మరల నెవడు దానెసంసారమును అభివృద్ధి పరచు కర్మము యొక్క బంధనమునకిష్టపడును? ఇష్టపడడని భావము" (81)

శివాద్వైత పరమగు జ్ఞానమే నిజమగు జ్ఞానమనియు జ్ఞానుల జెప్పుదురు, శాస్త్ర సిద్ధమైనదేగానిమ్ము అథవా అట్లు సిద్ధముగాక పోనిమ్ము, శివజ్ఞానేతర జ్ఞానము నుండి ఏమి ప్రయోజనము ఏమియు ప్రయోజనము లేదని భావము (82) శివజ్ఞానము

అణవాదిమల సంబంధరహితమై యుండి మోక్షమును గలుగజేయునదై యున్నది. ఔతే శివజ్ఞానమునకు భిన్నమైనట్టి జ్ఞానము రాగద్వేషాదులతో గలిసియుండి మరల మరల సంసారమునకు గారణమైయున్నది (83) పరిశుద్ధాచారము గలవాఁడు, పరిశుద్ధ భావము గలవాడు, జ్ఞాని, అన్ని వైపుల నుండి ఒకే ఒకటై యున్న శైవ తేజస్సును నిరీక్షించువాఁడు, శివాద్వైత జ్ఞానాగ్ని నుండి ప్రకృతి జన్యమగు దేహ ప్రపంచమును నశింపజేసిన వాఁడునైన శివయోగి జీవన్ముక్తుడై లౌకికుల మాదిరిగా వ్యవహరించుచుండును (84)

ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ లింగస్థలీయ మహేశ్వర స్థల
క్రియాగమ స్థలాది నవవిధస్థల ప్రసంగో నామ
షోడశ పరిచ్ఛేదః పరిసమాప్తః

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణియొక్క లింగ స్థలయ
మాహేశ్వర స్థలమున క్రియా స్థలాది నవ విధస్థల
విచారాత్మకమగు పదియారవ పరిచ్ఛేదము
పరిసమాప్తము



# శ్రీసిద్ధాంత శిఖామణి

## సప్తదశ పరిచ్ఛేదః

## పదునేడవ పరిచ్ఛేదము

- ప్రసాది స్థలగతాని -

అగస్త్య ఉవాచః-

స్థలాని తాని చోక్తాని యాని మాహేశ్వరస్థలే
కథయ స్థలభేదం మే ప్రసాదిస్థల సంశ్రితం ॥ 1 ॥

శ్రీరేణుక ఉవాచః-

స్థలభేదా నవప్రోక్తాః ప్రసాదిస్థల సంశ్రితాః
కాయానుగ్రహణం పూర్వమింద్రియానుగ్రహస్తతః ॥ 2 ॥

ప్రాణాను గ్రహణం పశ్చాత్తతః కాయార్పణం మతం
కరణార్పణమాఖ్యాతం తతో భావార్పణం మతం ॥ 3 ॥

శిష్యస్థలం తతః ప్రోక్తం శుశ్రూషుస్థలమేవచ
తతః సేవ్యస్థలం చైషాం క్రమశః శ్రుణు లక్షణం ॥ 4 ॥

ఓయీ! రేణుకాచార్యా! మాహేశ్వరస్థలములో ఏ స్థలములున్నవో, ఆ స్థలములన్నియు నాశ్రయించియున్న స్థలభేదమును నాకుపదేశింపుమని అగస్త్యమహర్షి ప్రశ్నించగా అద్దానికి శ్రీ రేణుకాచార్య భగవత్పాదులు ప్రసాది స్థలమునందలి కాయాను గ్రహస్థలము, ఇంద్రియాను గ్రహస్థలము, ప్రాణానుగ్రహస్థలము, కాయార్పణాను గ్రహస్థలము కరణార్పణ స్థలము, శిష్యస్థలము, శుశ్రూషుస్థలము, సేవ్యస్థలములని తొమ్మిది స్థలము లున్నవనియు, అనుక్రమముగా వాటియొక్క లక్షణములను చిత్తగించుమని యుపదేశించిరి (1-2-3-4)

### 19. కాయానుగ్రహస్థలం

అనుగృహ్ణాతి యల్లోకాన్ స్వకాయం దర్శయన్న సౌ
తస్మాదేవ సమాఖ్యాతః కాయానుగ్రహ నామకః ॥ 5 ॥

యథా శివోऽ నుగృహ్ణాతి మూర్తి మావిశ్య దేహినః
తథా యోగీ శరీరస్థః సర్వాను గ్రాహకోభవేత్ ॥ 6 ॥

శివః శరీరయోగేऽ పి యథా సంగవివర్జితః
తథా యోగీ శరీరస్థో నిస్సంగో వర్తతే సదా ॥ 7 ॥

శివభావనయా యుక్తః స్థిరయా నిర్వికల్పయా
శివో భవతి నిర్ధూతమాయాలేశ పరిప్లవః ॥ 8 ॥

గలితాహంకృతిగ్రంథిః క్రీడాకల్పిత విగ్రహః
జీవన్ముక్తశ్చరేద్యోగీ దేహివన్ని రుపాధికః ॥ 9 ॥

జ్ఞానాభావ సంపన్నుడైన శివయోగి తన శరీరమును జూపించువాడై ప్రాకృత జనులను అనుగ్రహించుట వలన. ఇతడు కాయానుగ్రహముగల వాడని చెప్పబడును. ఇదే కాయానుగ్రహస్థలమనబడును (5) శివుడు నానావిధ విగ్రహములను బ్రవేశించి ప్రాణులను ఎట్లు అనుగ్రహించునో అట్లే శివయోగి శరీర ధారియై సమస్త మానవులను అనుగ్రహించును (6) శివుడు శరీర సంబంధము నుండి కూడి యున్నప్పుడు ఎట్లు సంసర్గ దూరమైయుండునో అట్లే శివయోగి శరీర ధారియై యున్నప్పుడు గూడ సదా సుఖదు:ఖ శూన్యుడై యుండును. (7) వికల్ప శూన్యము దృఢతరమునైన శివోహంభావనతో గూడిన శివయోగి మాయిక (మాయా ఆశ) అనుదు:ఖమును దొలగింపజేసిన వాడై సాక్షాత్తుగా శివుడేయగును (8) శరీరాద్యమాన రూపగ్రంథిని ఛేదించిన వాడును, లీలావినోదమనమునకై శరీరమును దాల్చిన వాడును, ప్రతిబంధరహితుడు ఐన శివయోగి జీవన్ముక్తుడై మానవ మాత్రుడిగా సంచరించుచుండును (9)

## 20. ఇంద్రియానుగ్రహస్థలం :

దర్శనాత్ పరకాయస్య కరణానాం వివేకతః
ఇంద్రియానుగ్రహః ప్రోక్తస్సర్వేషాంతత్త్వ వేదిభిః ॥ 10 ॥

ఇంద్రియాణాం సమస్తానాం స్వార్థేషు సతి సంగమే
రాగో వా జాయతే ద్వేషస్తౌ యోగీ పరివర్జయేత్ ॥ 11 ॥

ఇంద్రియాణాం బహిర్వృత్తిః ప్రపంచస్య ప్రకాశినీ
అంతః శివే సమావేశో విష్ప్రపంచస్య కారణం ॥ 12 ॥

క్షణమంతః శివం పశ్యన్ కేవలే నైవ చేతసా
బాహ్యార్థానామనుభవం క్షణం కుర్వన్ దృగాదిభిః ॥ 13 ॥

సర్వేంద్రియనిరూఢోఽపి సర్వేంద్రియవిహీనవత్
శివాహితమనా యోగీ శివం పశ్యతి నాపరం ॥ 14 ॥

న జరా మరణం నాస్తి న పిపాసా న చక్షుధా
శివాహితేంద్రియస్యాస్య నిర్మానస్య మహాత్మనః ॥ 15 ॥

మనో యత్ర ప్రవర్తేత తత్ర సర్వేంద్రియస్థితిః
శివే మనసి సంలీనే క్వచేంద్రియవిచారణా ॥ 16 ॥

యద్యత్పశ్యన్ దృశా యోగీ మనసా చింతయత్యపి
తత్తత్సర్వం శివాకారం సంవిద్రూపం ప్రకాశతే ॥ 17 ॥

శరణైః సహితం ప్రాణం మనస్యాధాయ సంయమీ
యోజయేత్తచ్ఛివే సాక్షాద్యత్ర నాస్తి జగద్భ్రమః ॥ 18 ॥

సర్వేంద్రియప్రవృత్యా చ బహిరంతః శివం యజన్
స్వచ్ఛందచారీ సర్వత్ర సుఖీ భవతి సంయమీ ॥ 19 ॥

శివయోగియొక్క దర్శనము వలనను, ఇంద్రియముల వివేకము చేతను సమస్త జీవులకు ఇంద్రియానుగ్రహము కలుగుట వలన తత్వజ్ఞానులు దీనిని ఇంద్రియానుగ్రహమని చెప్పుదురు. ఇదే ఇంద్రియానుగ్రహ స్థలమనబడును (10) శ్రోత్రాది సమస్తేంద్రియములకు స్వస్వవిషయములతో సంబంధమేర్పడుటకు ప్రీతిగాని, అథవాద్వేషముగాని. ఉత్పన్న మగుచుండును, అందుచేత శివయోగి ఆరెంటిని పరిత్యజింపవలెను (11) ఇంద్రియముల బహిర్వ్యాపారము (దుఃఖరూపమగు) ప్రపంచమును ప్రకాశింపఁజేయును, అట్టి ఇంద్రియ ముల వృత్తి అంతర్ముఖమై శివునియందు సంబంధమేర్పడుటకు అదే మోక్షమునకును మూలమగును (12) బాహ్యేంద్రియముల సంసర్గము శూన్యమైన బిదప నిర్మలమైన మనస్సుతో అంతర్ముఖుడై క్షణకాలం శివుని దర్శించువాడు, క్షణకాలమునేత్రాది బాహ్యేం ద్రియములతో బాహ్య విషయములను అనుభవించువాఁడును, శివునియందు మనస్సును నిల్చినవాడును, ఐన శివయోగి సమస్తేంద్రియములతో గూడియున్నను వాటితో సంబంధము లేనివాడై, అంతర్బాహ్యములందును కేవలము శివుడినె దర్శించు చుండునే గాని శివేతర వస్తువులను నిరీక్షించడు (13-14) ఇంద్రియ వ్యాపారములను శివుని యందుంచు

వాడును. దేహాభిమానములేనివాడును. మహాత్ముడైన ఈ శివయోగికి జరామరణములు గాని, క్షుత్- తృషలు (ఆకలిదప్పికలుగాని ఉండవు. సర్వేంద్రియములను శివుని యందే లయ మొనర్చిన శివయోగి ఆకలి దప్పికల బాధనుండి మరియు జరామరణముల బాధ నుండియు దూరమై సాక్షాత్తుగా శివునివలెనె ప్రకాశించునని భావము (15) మనస్సెక్కడ ప్రవర్తించునో అక్కడె సర్వేంద్రియములు స్థిరపడుచుండును, మనస్సు శివుడితో లయమగుట వలన (అయినప్పుడు) ఇంక ఇంద్రియవ్యాపారమెక్కడుండును? ఇంద్రియములన్నియు శివస్వరూపమగునని భావము" (16) శివయోగి నేత్రములతో ఏయే పదార్థములను దిలకించి నప్పటికి (జాతనను) మనస్సుతో నాలోచించునో ఆపదార్థములన్ని (అవన్ని)యు శివాకారమై జ్ఞాన స్వరూపమై ప్రకాశించును (17) శివయోగినేత్రాది ఇంద్రియములతో గూడిన ప్రాణమును మనస్సున స్థిరపరచి, ఆమనస్సును. సాక్షాత్తుగా శివునిలో స్థిరపరచవలెను. ఇట్లొనర్చిన యెడల జగత్తుయొక్క చలనము (చంచలత్వము) ఉండదు. సర్వత్ర స్వేచ్ఛాచారియగు శివయోగి అంతర్బాహ్యేంద్రియ వృత్తినుండి ఇష్టప్రాణ రూపమై న శివలింగమును అంతర్బహి స్థానములందు పూజించినవాడగుటవలన సాక్షాత్తు శివ సుఖమునే అనుభవించిన వాడగును (19)

## 21. ప్రాణానుగ్రహస్థలం

శివస్య పర కాయస్య యత్తాత్పర్యావలోకనం
స ప్రాణానుగ్రహః ప్రోక్తస్సర్వేషాం తత్త్వదర్శిభిః ॥ 20 ॥

ప్రాణో యస్య లయం యాతి శివే పరమకారణే
కుతస్తస్యేంద్రియస్ఫూర్తిః కుతః సంసారదర్శనం ॥ 21 ॥

కరణేషు నివృత్తే షు స్వార్థసంగప్రయత్నతః
తైస్సమంప్రాణమారోప్య స్వాంతేశాంతమతిః స్వయం ॥ 22 ॥

శాంతత్వే ప్రాణవృత్తీనాం మనః శామ్యతి వృత్తిభిః
తచ్ఛాంతౌ యోగినాం కించిచ్ఛి వాదన్యన్న దృశ్యతే ॥ 23 ॥

ప్రాణ ఏవ మనుష్యాణాం దేహధారణ కారణం
తదాధారః శివః ప్రోక్తః సర్వకారణకారణం ॥ 24 ॥

నిరాధారః శివః సాక్షాత్ ప్రాణస్తేన ప్రతిష్ఠితః
తదాధారః తనుర్జ్ఞేయా జీవో యేనైవ చేష్టతే ॥ 25 ॥

శివే ప్రాణో విలీనోఽపి యోగినో యోగమార్గతః
స్వశక్తి వాసనాయోగాద్ధారయ త్యేవ విగ్రహం ॥ 26 ॥

స చాభ్యాసవశాద్భూయః సర్వతత్త్వాతివర్తిని
నిష్కలంకే నిరాకారే నిరస్తాశేషవిక్లవే ॥ 27 ॥

చిద్విలాసపరిస్ఫూర్తి పరిపూర్ణ సుఖాద్వయే
శివే విలీనసర్వాత్మా యోగీ చలతి న క్వచిత్ ॥ 28 ॥

ప్రధ్వస్త వాసనాసంగాత్ ప్రాణవృత్తి పరిక్షయాత్
శివై కీభూతసర్వాత్మా స్థానువద్భాతి సంయమీ ॥ 29 ॥

సర్వోత్కృష్ట శరీరధారియైన శివయోగికి ప్రాణవాయువు నిరోధమునుండియే శివలింగ దర్శనము జరుగుతుందో దాని నే తత్త్వ జ్ఞానులు ప్రాణానుగ్రహమని చెప్పుదురు. దీనినే ప్రాణానుగ్రహస్థలమందురు. (20) ఏ శివయోగి ప్రాణము కేవలము కుంభక యోగమునుండి బ్రహ్మాది సకల ప్రపంచమునకు మూలకారణీ భూతుడైన శివునిలోలయమును బొందునో అట్టి శివయోగికి ఇంద్రియ స్ఫూర్తిగాని జనన మరణరూప సంసారదర్శనముగాని యెక్కడ ? ఈ రెండును ఉండవని భావము (20) శ్రోత్రాది ఇంద్రియములు తమ తమ విషయములతో నివృత్తి యగుటకు, శివయోగి ఆ ఇంద్రియములతోనే ప్రాణమును మనస్సులో అనుసంధాన మొనర్చితానై శాంతబుద్ధి గలవాడగును (22) రేచకపూరక రూపకప్రాణవృత్తులు శాంతించుటకు మనస్సు సంకల్పవికల్ప రూపవృత్తులతో శాంతించును, అట్టి మనస్సు శాంతించుటకు యోగులకు శివుడు దప్ప మరొకటి లేదు (20) ప్రాణమే మానవుల శరీరధారణకు ప్రధాన కారణమగును అట్టి ప్రాణమునకు సమస్త కారణములకు గారణమైన శివుడు ఆధారభూతుడై యున్నాడు (24) శివుడు నిరాధారుడై యున్నాడు. ప్రాణము ప్రత్యక్షముగానా శివస్వరూపమగు నాధారముతో బ్రతిష్ఠించబడినది. జీవుడు ఏ ప్రాణముతో చలన క్రియులు గలవాడై యున్నాడో, అట్టిప్రాణమే శరీరమునకు ఆధార భూతమై యున్నది (25) శివయోగి ప్రాణము కేవలము కుంభక రూపయోగ మార్గము నుండి శివునిలో నైక్యమైనను. నిజ సంస్కార బలముతో నాయోగి శరీరమును దాల్చియున్నాడు (26) సర్వతత్త్వములను మీరినవాడు, నిష్కలంకుడు ప్రాకృతాకారశూన్యుడు, సమస్త విప్లవ దూరుడు, జ్ఞానవిలాస పరిస్ఫురణతో పరిపూర్ణమైన ఆనందమయుడు (రూపుడు) అద్వయుడైన పరమశివునియందు, విశేషముగా శివయోగాభ్యాసబలముతో లీనమైన సర్వేంద్రియ వ్యాపారముగల ఆశివయోగి ఎక్కడ ఎన్నడు చలించడు. (27-28)

శివయోగి నశించిన వాసనా సంపర్కముతో ప్రాణ వ్యాపారము నశించుట వలన శివునిలో సమరస భూతమగు సర్వేంద్రియ వ్యాపారముగలవాడై మోటు (ఎండిన) వృక్షమువలె అచలమై (స్థిరపడి) విరాజిల్లును. విషయ వాసన దొలగిపోయి, ప్రాణ వ్యాపారము - ఇంద్రియ వ్యాపారము - మనో వ్యాపారములను దొలగించి శివునితో ఏకాకారుడై ఐక్యమునంది, మోడు బారిన వృక్షమువలె చలన శూన్యమై ఊరేగువాడే నిజమైన శివయోగియనబడునని భావము (29)

## 22. కాయార్పణస్థలం

శివస్య పరరూపస్య సర్వానుగ్రాహిణోఽర్చనే
త్యాగో దేహాభిమానస్య కాయార్పణముదాహృతం ॥ 30 ॥

యదా యోగీ నిజం దేహం శివాయ వినివేదయేత్
తదా భవతి తద్రూపం శివరూపం న సంశయః ॥ 31 ॥

ఇంద్రియప్రీతి హేతూని విషయాసంగ జాని చ
సుఖాని సుఖచిద్రూపే శివయోగీ నివేదయేత్ ॥ 32 ॥

దర్శనాత్ స్పర్శనాద్భుక్తేః శ్రవణాద్ఘ్రాణనాదపి
విషయేభ్యో యదుత్పన్నం శివే తత్సుఖమర్పయేత్ ॥ 33 ॥

దేహద్వారేణ యద్యత్ స్యాత్ సుఖం ప్రాసంగ మాత్మనః
తత్తన్ని వేదయన్ శంభోర్యోగీ భవతి నిర్మలః ॥ 34 ॥

సర్వానుగ్రహకారకుడు, పరమశివ స్వరూపుడు ఐన శివయోగికి శివలింగ పూజయందు దేహాభిమాన త్యాగము కాయార్పణమని చెప్పఁబడును (30) శివయోగితన శరీరమును ఏ సమయమున శివునకు సమర్పించునో అప్పుడా శివయోగి స్వరూపము శివస్వరూపమే అగును. ఈ విషయములో నేలాంటి సందేహము లేదు. శివయోగి ఇంద్రియ ప్రీతి నిమిత్తమున కైవిషయ సంబంధమునుండి గలిగిన సుఖములను చిదానంద స్వరూపమగు శివునియందు సమర్పించవలెను (32) విషయముల కొరకు వాటియొక్క దర్శనమునుండి, స్పర్శము నుండియు, చర్వణము (నములుట) శ్రవణమునుండియు, ఆఘ్రాణించుట చేతను ఏ సుఖమూ గలుగునో అట్టి సుఖమును శివునికి సమర్పించవలెను ॥33॥ దేహముయొక్క పంచజ్ఞానేంద్రియ పంచ కర్మేంద్రియ సంబంధము చేత ఏయే సుఖము

తనకు సంక్రమించు చున్నదో ఆయా యసుఖమును శివయోగి శివునికి సమర్పించు వాడుగనుక నిర్మలుండు (పరిశుద్ధుడు) అగును ఇట్లు కాయక సుఖమును సమర్పించుటే కాయార్పణ స్థలమనఁబడును (39)

## 23. కరణార్పణస్థలం

అనంజనం సమస్తానాం కరణానాం పరాత్పరే
శివే యత్తదిదం ప్రోక్తం కరణార్పణమాగమే ॥ 35 ॥

యద్యత్కరణమాలంబ్య భుంక్తే విషయజం సుఖం
తత్తచ్ఛివే సమర్ప్యైష కరణార్పక ఉచ్యతే ॥ 36 ॥

అహంకారమదోద్రిక్త మంతఃకరణవారణం
బధ్నీయాద్యః శివాలానే సధీరః సర్వసిద్ధిమాన్ ॥ 37 ॥

ఇంద్రియాణాం సమస్తానాం మనః ప్రథమముచ్యతే
వశీకృతే శివే తస్మిన్ కిమన్యైస్తద్వశాను గై ॥ 38 ॥

ఇంద్రియాణాం వశీకారో నివృత్తిరితి గీయతే
లక్ష్యీకృతే శివే తేషాం కుతః సంసారగాహనం ॥ 39 ॥

సంసారవిషకాంతారసముచ్ఛేదకుఠారికా
ఉపశంతిర్భవేత్ పుంసామింద్రియాణాం వశీకృతౌ ॥ 40 ॥

ఇంద్రియైరేవ జాయంతే పాపాని సుకృతాని చ
తేషాం సమర్పణాదీశే కుతః కర్మనిబంధనం ॥ 41 ॥

ప్రకాశమానే చిద్వహ్నౌ బహిరంతర్జగన్మయే
సమర్ప్య విషయాన్, సర్వాన్ ముక్త వజ్జాయతే జనః ॥ 42 ॥

చిత్తద్రవ్యం సమాదాయ జగజ్జాతం మహాహవిః
చిద్వహ్నౌ జుహ్వతామంతః కుతః సంసారవిప్లవః ॥ 43 ॥

ఆత్మజ్యోతిషి చిద్రూపే ప్రాణవాయు నిబోధితే
జుహ్వాత్ సమస్త విషయాన్ తన్మయో భవతిధ్రువం ॥ 44 ॥

ఇంద్రియాణి సమస్తాని శరీరం భోగసాధనం
శివపూజాంగభావేన భావయన్ ముక్తి మాప్నుయాత్ ॥ 45 ॥

పరాత్పరుడైన శివునిలో సమస్తేంద్రియముల ఏది సంయోజన కర్తృత్వము గలదో అది కరణార్పణమని శివాగమాల్లో చెప్పబడినది (35) ఏ ఇంద్రియము నాశ్రయించి యే విషయ సుఖమును అనుభవించు చుండునొ అట్టి ఇంద్రియ సంబంధమగు ఆ విషయ సుఖమును శివునికి సమర్పించినచో నితడుకరణార్పకుడని చెప్పఁబడును (36) అహంకారమమకార స్వరూప మదముతో నున్మత్తతకు లోనై మనో - బుద్ధి - అహంకార - చిత్తము (అంత:కరణము) ఆకారగజమును ఎవడు శివస్వరూప బంధన స్తంభమునందు కట్టివేయునో ఆతడు సమస్త సిద్ధులున్న జ్ఞానియని చెప్పనగును 370 సర్వేంద్రియములకు మనస్సు ముఖ్యమైనది. ఆ మనస్సు శివుని యధానమై యుండుటకు ఆ మనస్సును అనుసరించుచున్న ఇతర ఇంద్రియముల తోనేమి ప్రయోజనము? చిత్తము శివునిలో లీనమగుటకు సమస్తేంద్రియములు లీనమగునని భావము ॥38॥ ఇంద్రియ వశీకరణమే నివృత్తి (ముక్తి) యని చెప్ప ఁబడినది. విషయ గ్రాహకమగునా ఇంద్రియములకు శివుడినే విషయముగా జేసికొనినచో సంసార సాగర మజ్జన మెక్కడుండును. (39)

సంసార రూప విషారణ్యమును నశింప (తొలగింప) జేయుటలో గొడ్డలి వలెనున్న, శాంతి, మానవులకు ఇంద్రియముల వశీకరణమునుండి యుత్పన్నమగును (40) పాప పుణ్యములు ఇంద్రియములనుండేయుత్పన్నమగును, వాటిని శివుని కర్పించుటచే ఇక కర్మబంధమెక్కడిది? (41) లోపల వెలుపల ప్రకాశించు చున్న శివపరిణామ భూతమగు జగ ద్రూపమైన జ్ఞానాగ్నిలో మానవుడు సర్వవిషయములను సమర్పించి ముక్తుడగును చిత్తరూపమైన ద్రవ్యమును, సమస్త చరాచర ప్రపంచ స్వరూపమైన మహా హవిస్సును దీసికొని హృదయ కమలమునందున్న జ్ఞానాగ్నితో హవనము జేయు శివయోగులకు సంసారబంధనమెక్కడిది? ఇటువంటి దివ్య జ్ఞానులకు జనన మరణ రూపమగు సంసార బంధములేదని భావము (42-43) ప్రాణవాయు ప్రకాశితము చిద్రూపమునైన శివాగ్నిలో ఇంద్రియ గ్రాహకములైన సమస్త విషయములను హవనమొనర్చెడియోగి నిశ్చయముగా (ఖచ్చితంగా) చిన్మయ శివస్వరూపు డేయగును (44) శివయోగి సర్వేంద్రియములను సుఖ సాధనమగు శరీరమును శివ పూజాంగ భావముతో తెల్సి కొనిన వాడైమోక్షమును బడయు నుంశివ యోగియైన వాఁడు శరీరము మరియు ఇంద్రియములు శివ పూజకు అంగముగా దెలియవలెనని భావములు (45)

## 24. భావార్పణస్థలం

శివే నిశ్చలభావేన భావానాం యత్సమర్పణం
భావార్పణమిదం ప్రోక్తం శివసద్భావవేదిభిః ॥ 46 ॥

చిత్తస్థసకలార్థానాం మననం యత్తుమానసే
తదర్పణం శివే సాక్షాన్మానసో భావ ఉచ్యతే ॥ 47 ॥

భావ ఏవ హి జంతూనాం కారణం బంధమోక్షయోః
భావశుద్ధౌ భవేన్ముక్తిర్విపరీతేతు సంవృతిః ॥ 48 ॥

భావస్య శుద్ధిరాఖ్యాతా శివో హమితి యోజనా
విపరీత సమాయోగే కుతో దుఃఖనివర్తనం ॥ 49 ॥

భోక్తా భోజ్యం ప్రేరయితా సర్వమేతచ్చరాచరం
భావయన్ శివరూపేణ శివో భవతి వస్తుతతః ॥ ॥ 50 ॥

సర్వం కర్మార్చనం శంభోర్వచనం తస్య కీర్తనం
ఇతి భావయతో నిత్యం కథం స్యాత్ కర్మ బంధనం ॥ 51 ॥

సర్వేంద్రియగతం సౌఖ్యం దుఃఖం వా కర్మ సంభవం
శివార్థం భావయన్ యోగీ జీవన్ముక్తో భవిష్యతి ॥ 52 ॥

శివలింగ విషయమునందు భావములో ఎలాంటి సమర్పణ భావముంటుందో, అద్దానిని శివరహస్య జ్ఞానులు భావార్పణమని చెప్పుదురు (46) మనస్సునందు చిత్త నిష్ఠ సమస్త పదార్థముల యొక్క ఎలాంటి అనుభవ సరూపమగు చింతన ఉంటుందో, ప్రత్యక్షముగా శివునిలో నా అనుభవ స్వరూప చింతన సమర్పణమే మనోభావార్పణ మనఁబడును (47) సమస్త ప్రాణుల బంధనమునకుగాని అథవామోక్షమునకు గాని మనోభావనమే మూలకారణీ భూతమైయున్నది, మనో భావము పరిశుద్ధమైన మోక్షప్రాప్తియగును. అశుద్ధమైన జనన మరణ రూపదు:ఖమయ సంసార ప్రాప్తి యగును (48) శివోకహం నేను శివుడిని అనుస్వస్వరూ పాను భవయోగమే భావశుద్ధియనబడును: నాహం శివః నేను శివుణ్ణిగా నను విపరీత భావన గలిగిన సాంసారిక దుఃఖ నివృత్తి యెక్కడిది (49) ఉపభోగమొనర్చు జీవుడు, ఉపభోగమునకు దగిన వస్తువును ఉపభోగించుటకు ప్రేరేపించు శివుడు మరియు సకల చరాచరాత్మకమైన ఈ జగత్తునంతటిని శివస్వరూపముతో భావించువాఁడు

పారమార్థికముగ శివుడే యగును (50) తానాచరించునట్టి కర్మము లన్నియు శివుని పూజలేయనియు, తాను బలుకు వాక్యములన్నియు శివస్తోత్రములే యనియు ఎల్లప్పుడు భావించువాడికి కర్మ బంధనము ఎట్లు సంభవించును. ఈ విధముగ సమస్తము శివస్వరూపముగా భావించు మహాత్మునకు ఎన్నటికిని కర్మబంధన ముండదని భావము. (51) సర్వేంద్రియములనుండి యుత్పన్న మగు సుఖదుఃఖములు రెండును శివసంబంధములని భావించునట్టి శివయోగి జీవన్ముక్తుడన బడును (52)

## 25. శిష్యస్థలం

శాసనీయో భవేద్యస్తు పరకాయేన సర్వదా
తత్ప్రసాదాత్తు మోక్షార్థీ స శిష్య ఇతి కీర్తితః ॥ 53 ॥

భావో యస్య స్థిరో నిత్యం మనో వాక్కాయకర్మభిః
గురౌ నిజే గుణోదారే స శిష్య ఇతి గీయతే ॥ 54 ॥

శాంతో దాంతస్తపశ్శీలః సత్యవాక్ సమదర్శనః
గురౌ శివే సమానస్థః స శిష్యాణా మిహోత్తమః ॥ 55 ॥

గురుమేవ శివం పశ్యేచ్ఛివ మేవ గురుం తథా
నైతయోరంతరం కించిద్విజానీయాద్విచక్షణః ॥ 56 ॥

శివాచారే శివధ్యానే శివజ్ఞానే చ నిర్మలే
గురోరాదేశమాత్రేణ పరాం నిష్ఠామవాప్నుయాత్ ॥ 57 ॥

న లంఘ యేద్గురోరాజ్ఞాం జ్ఞానమేవ ప్రకాశయన్
శివాసక్తేన మనసా సర్వసిద్ధిమవాప్నుయాత్ ॥ 58 ॥

గురోర్లబ్ధ్వా మహాజ్ఞానం సంసారామయ భేషజం
మోదతే యః సుఖీ శాంతః స జీవన్ముక్త ఏవ హి ॥ 59 ॥

ఎవడైతె ఎల్లప్పుడు శివయోగి చేత పారమార్థిక శిక్షణను బడయునో (బొందునో) మరియు ఆ శివయోగి యొక్క ప్రసాదముతో మోక్షమునపేక్షించునో, అతడే నిజమైన శిష్యుడని చెప్పబడును. (53) ఎవని భావము జ్ఞాన. వైరాగ్యాదిగుణములచేత శ్రేష్ఠుడనబడిన తన గురువునందు మనోవాక్కాయజన్యము ధ్యానము స్తోత్రపూజారూపమైన కర్మలతో ఎల్లప్పుడు స్థిరముగా నుండునో ఆతడే నిజమగు శిష్యుడనియు చెప్పంబడును (54)

ఎవడంతరింద్రియ నిగ్రహముగల వాడయ్యె. మరియు బహిరింద్రియ నిగ్రహము గలవాడయ్యును, యమనియమాద్యష్టాంగ యోగ నిష్ఠుడయ్యును, సత్యవాదియై, మట్టి ముద్ద బంగారము నందును సమానభావముగలిగిన వాడై గురువునందును - శివుని యందును సమాన బుద్ధిగలవాడై యుండునో ఆతడే శిష్య శ్రేష్ఠుడనబడును (55) బుద్ధిశాలి యగు శిష్యుడు గురువునే శివునిగాను, శివుని గురువుగాను దెలియవలెనువీరిరువురిలో యత్కించిత్ (ఏకొద్ది) భేదమును గూడ పాటించగదగదు (56) శిష్యుడు శ్రీగురువుయొక్క ఆజ్ఞా మాత్రము చేత వాచారము నందును శివధ్యానమునందును నిర్మలమగు శివజ్ఞానమునందును అత్యంత విశ్వాసముంచ వలెను. (57) కేవలము జ్ఞానమునే ప్రకాశింపజేయు శిష్యుడు శ్రీగురువు యొక్క ఆనతిని మీరగూడదు, శిష్యుడు శివసంబంధమగు మనస్సుతో సర్వసిద్ధులను బొందును (58) ఎవడు భవరోగమునకు ఔషధ స్వరూపమగు మహాజ్ఞానమును శ్రీగురువునుండి బొంది సుఖ శాంతులతో గూడియుండునో సంతోషించునో ఆతడే జీవన్ముక్తుడనఁబడును (59)

## 26. శుశ్రూషుస్థలం

బోధ్యమానః స గురుణా పరకాయేన సర్వదా
తచ్ఛుశ్రూషారతః శిష్యః శుశ్రూషురితి కీర్త్యతే ॥ 60 ॥

శ్రుత్వా శ్రుత్వా గురోర్వాక్యం శివసాక్షాత్క్రియావహం
ఉపశామ్యతి యః స్వాంతే సముక్తి పదమాప్నుయాత్ ॥ 61 ॥

న బుధ్యతి గురోర్వాక్యం వినాశిష్యస్య మాననం
తేజో వినా సహస్రాంశోః కథం స్ఫురతి పంకజం ॥ 62 ॥

సూర్యస్యోదయ మాత్రేణ సూర్యకాంతః ప్రకాశతే
గురోరాలోక మాత్రేణ శిష్యో బోధేన భాసతే ॥ 63 ॥

అద్వైత పరమానంద ప్రబోధైకప్రకాశకం
ఉపాయంశ్రుణుయాచ్ఛిష్యః సద్గురుంప్రాప్య సాంజలిః ॥ 64 ॥

కిం తత్త్వం పరమం జ్ఞేయం కేన సర్వే ప్రతిష్ఠితాః
కస్య సాక్షాత్క్రియా ముక్తిః కథయేతి సమాసతః ॥ 65 ॥

ఇతి ప్రశ్నే కృతే పూర్వం శిష్యేణ నియతాత్మనా
బ్రూయాత్తత్త్వం గురుస్తస్మై యేనస్యాత్సంస్ప తేర్ణయః ॥ 66 ॥

శివ ఏవ పరం తత్త్వం చిదానంద సదాకృతిః
స యథార్థస్తదన్యన్య జగతో నాస్తి నిత్యతా ॥ 67 ॥

శివోఽ హమితి భావేన శివే సాక్షాత్కృతే స్థిరం
ముక్తో భవతి సంసార మోహగ్రంథివిభేదతః ॥ 68 ॥

శివం భావయ చాత్మానం శివాదన్యన్న చింతయ
ఏవం స్థిరే శివాద్వైతే జీవన్ముక్తో భవిష్యసి ॥ 69 ॥

ఏవం ప్రబోధితః శిష్యో గురుణా గుణశాలినా
శివమేవ జగత్ పశ్యన్ జీవన్ముక్తోఽభిజాయతే ॥ 70 ॥

పరశివ శరీర ధారియగు శ్రీగురువు చేత నెల్లప్పుడు పదేశింపబడినవాఁడు, ఆ గురువు సేవలోనే ఆసక్తిగలవాఁడు అట్టి శిష్యుడు శుశ్రూషుడు అని చెప్పబడును (60) ఏ శిష్యుడైతె శివసాక్షాత్కారకమగు శ్రుతి వాక్యములను శ్రీ గురువు నుండి విని విని మనస్సులో శాంతి గుణము గలవాడగునో అట్టి శిష్యుడు మోక్షమును బొందును (61) సూర్య ప్రకాశములేనిదే కమలము ఎట్లు వికసింప జాలదో అట్లే శ్రీగురువుయొక్క ఉపదేశములేనిదే, శిష్యుని హృదయ కమలము వికసింపజాలదు (62) కేవలము సూర్యోదయము మాత్రముతోనె సూర్యకాంత శిలయు ఎట్లు ప్రకాశించునో, అట్లే శ్రీ గురువు యొక్క కృపాకటాక్ష వీక్షణము మాత్రముతో శిష్యుడు జ్ఞానము చేత ప్రకాశించును. శిష్యుడు సద్గురువు నాశ్రయించి ముకుళిత హస్తుడై శివాద్వైత పరమానంద జ్ఞానమును ముఖ్యముగ ప్రకాశపరచు ఉపాయమును ప్రశ్న పూర్వకముగా నడుగవలెను. (64) ఓ! శ్రీ గురుమూర్తి తెలసి కొనుటకు దగిన శ్రేష్టమైన తత్త్వమేది? దేని వలన సమస్తవస్తువులు ప్రతిష్ఠింపఁ బడినవి? దేని సాక్షాత్కారముచేత మోక్షము లభించును? అను విషయములు బోధించుము, అని ప్రశ్నించవలెను (65) ఏకాగ్ర మనస్సుగల శిష్యుడు ఇట్లు ప్రశ్నించగా శ్రీగురువాతనికీ దేనినుండి యాసంసారము నశించునో, ఆతత్త్వమును బోధించవలెను (66) సచ్చిదానంద స్వరూపుడగు, శివుడే శ్రేష్ఠమైన తత్వము, ఆ శివుడే శాశ్వతుడు (నిత్యుడు) ఆశివుడు దప్పవేరులేదు. జగత్తు నిరంతర పరిణామ కారియై యుండి ఏకరూపత్వము లేనికతమున దీనికి నిత్యత్వముండదు (67) "శివోఽహం, నేనే శివుడిని. అను దృఢ భావముతో శివుడు సాక్షాత్కరింప శిష్యుడు సంసారరూపమగు మోహగ్రంధిని ఛేదించుట వలన ముక్తుడగును (68) ఓరీ! శిష్యుడా! నీవు నిన్నే శివుని గాభావించుకొనుము, శివునికిథి తరమైనదానినిదేనిని భావించుకుము, అర్థాత్ సమస్తమును శివ స్వరూపముగానె భావించుమని అర్థము.

ఇట్లు నీలో శివాద్వైతముస్థిరపడిన జీవన్ముక్తుడవగుదువు (69) జ్ఞానవైరాగ్యాదిగుణ శాలియగు శ్రీగురువునుండి ఈవిధముగ ఉపదేశింపఁబడిన శిష్యుడు సమస్త జగజ్జాలమును శివమయముగానే దర్శించువాడై జీవన్ముక్తుడగును (70)

## 27. సేవ్యస్థలం

గురువాక్యామృతాస్వాదాత్ ప్రాప్త బోధమహాఫలః
శుశ్రూషరేవసర్వేషాం సేవ్యత్వాత్ సేవ్య ఉచ్యతే ॥ 71 ॥

గురూపదిష్టే విజ్ఞానే చేతసి స్థిరతాం గతే
సాక్షాత్కృతశివః శిష్యో గురువత్పూజ్యతే సదా ॥ 72 ॥

జ్ఞానాదాధిక్యసంపత్తి ర్గురోర్యస్మాదుపస్థితా
తస్మాద్ జ్ఞానాగ మాచ్ఛిష్యోగురువత్పూజ్యతాం వ్రజేత్ ॥ 73 ॥

శివోఽ హమితి భావస్య నైరంతర్యవిశేషతః
శివభావే సముత్పన్నే శివవత్పూజ్య ఏవ సః ॥ 74 ॥

బ్రహ్మాండబుద్బుదోద్భాసి మాయాసింధుం మహత్తరం
గురోః కబలయత్యాశు కటాక్ష బడబానలః ॥ 75 ॥

గురోః కటాక్ష వేధేన శివోభవతి మానవః
రసవేధాద్యథా లోహో హేమతాం ప్రతిపద్యతే ॥ 76 ॥

విషయాసక్త చిత్తో పి విషయాసంగవర్జితః
శివభావయుతో యోగీ సేవ్యః శివ ఇవాపరః ॥ 77 ॥

ముక్తః సంశయపాశతః స్థిరమనా భోధే చ ముక్తి ప్రదే
మోహం దేహభృతాం దృశా విఘటయన్మూలం మహా సంసృతే

సత్తానంద చిదాత్మకే నిరుపమే శైవే పరస్మిన్ పదే
లీనాత్మా విదితప్రపంచవిభవోయోగీ జనైః సేవ్యతే ॥ 78 ॥

గురూపదేశ వాక్యామృతా స్వాదనచేత శివాద్వైత జ్ఞానరూప మహాఫలమును సంపాదించు కొన్నటి (శిష్యుడు) సమస్త జనులకు సేవ్యుడగుటవలన అతడు సేవ్యుడని చెప్పబడును (71) శ్రీగురువు చేత ఉపదేశింప బడిన శివాద్వైత జ్ఞానము మనస్సుందు స్థిరపడగ శివుని

సాక్షాత్కరించుకొనిన శిష్యుడు గురువువలె సదా పుణ్యవంతుడే యగును (72) శ్రీ గురువువలన లభించిన ఏ జ్ఞానమునుండి జ్ఞానాధిక్య సంపత్తు లభించునో అట్టి జ్ఞాన సంపత్తువలన శిష్యుడు గురువు వలెనే పూజ్యత్వమును బడయును (73) శివోऽహం నేను శివుడిని అనుభావన యొక్క నిరంతరా భ్యాస విశేషముతో శివభావము దృఢపడిన అట్టి శిష్యుడు శివునివలె పూజ్యడగును (74) మహత్తర మగు అనంత బ్రహ్మాండములను బుద్బుదము (నీటి బుగ్గవెగా ప్రకాశించుచున్న మాయా సముద్రమును శ్రీ గురువు యొక్క కృపా కటాక్షమువలన బడబాగ్ని (కారుచిచ్చు) అత్యంత శీఘ్రముగా మ్రింగివేయును. శ్రీ గురువు కృపా కటాక్ష వీక్షణ మాత్రముచేత మాయనశించునని భావము (75)

తామ్రము - లోహము - పాదరసము సంబంధము వలన ఎట్లు సువర్ణముగా మారునో అట్లే శిష్యుడు శ్రీ గురువు యొక్క కృపా కటాక్ష పాత్ర మాత్రము చేత శివుడగు చున్నాడు (76) శివ భావనచేత గూడిన సేవ్య నామ శివయోగి విషయాసక్త చిత్తమగల వాడైనను విషయ సంబంధమునకు దూరముగనున్న వాడై రెండవ (అపర) శివుడి వలె పూజింపఁదగిన వాడగును (77) నేను శివుడినో కానో అను సంశయ పాశము వలన ముక్తుడైనవాడు మోక్ష ప్రదాయకమైన శివజ్ఞానమునందు దృఢమైన మనస్సు గలవాడు, మహా సంస్కారమునకు మూలకారణ భూతమగు మానవుల అజ్ఞానమును కృపాదృష్టితో నివారించువాడు సచ్చిదానంద స్వరూపము ఉపమాతీతము. శివ సంబంధము గలదైన పరాత్పర పదమున (పరబ్రహ్మమున) ఆత్మను లయమొనర్చిన వాడు, విశ్వ ప్రపంచ వైభవమును దెలిసినవాఁడు ఐన శివయోగి సమస్త జనుల చేత పూజింపఁబడును (78)

*ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ లింగస్థలీయ ప్రసాదిస్థలే*
*కాయానుగ్రహాది నవ విధస్థల ప్రసంగోనామ*
*సప్తదశ పరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణి లింగస్థలీయ ప్రసాది స్థలమున
కాయానుగ్రహాది నవ విధ స్థల విచారాత్మకమగు
పదునేడవ పరిచ్ఛేదము పరిసమాప్తము.



# శ్రీ సిద్ధాంత శిఖామణి

## అష్టాదశ పరిచ్ఛేదః

## పదునెనిమిదవ పరిచ్ఛేదం

అగస్త్య ఉవాచ:-

ప్రసాదిస్థలసంబద్ధాః స్థలభేదాః ప్రకీర్తితాః
ప్రాణలింగస్థలారూఢాన్ స్థల భేదాన్నిరూపయ ॥ 1 ॥

శ్రీ రేణుక ఉవాచ:-

స్థలానాం నవకం ప్రోక్తం ప్రాణలింగిస్థల శ్రితం
ఆదావాత్మస్థలం ప్రోక్తమంత రాత్మస్థలం తతః ॥ 2 ॥

పరమాత్మస్థలం పశ్చాన్ని ర్దేహాగమ సంజ్ఞకం
నిర్భావాగమసంజ్ఞంచ తతో నష్టాగమస్థలం ॥ 3 ॥

ఆదిప్రసాదినామాథ తతశ్చాంత్యప్రసాదికం
సేవ్య ప్రసాదికం చాథశ్రుణు తేషాం హి లక్షణం ॥ 4 ॥

ఓ! రేణుకాచార్యా! ప్రసాది స్థలమునకు సంబంధించిన స్థల భేదములు నీ చే ఉపదేశించబడినవి. ఇక మీదట ప్రాణలింగి స్థలమునకు సంబంధించిన స్థల భేదములను ఉపదేశింపుము. అని అగస్త్య మహర్షి ప్రశ్నింపగా అందుకు శ్రీ రేణుకా చార్యుల వారు ప్రాణ లింగి స్థలములోని ఆత్మస్థలము- అంతరాత్మ స్థలము-పరమాత్మ స్థలము-నిర్దేహాగమ స్థలము, నిర్భావాగమ స్థలము ఆది ప్రసాది స్థలము, అంత్య ప్రసాది స్థలము, సేవ్య ప్రసాది స్థలము అను తొమ్మిది స్థలములున్నవనియు, వాటి లక్షణములను వినుమనియాదేశించిరి.

### 28. ఆత్మ స్థలం

జీవ భావం పరిత్యజ్య యదా తత్త్వం విభావ్యతే
గురోశ్చ బోధయోగేన తదాత్మాయం ప్రకీర్తితః ॥ 5 ॥

వాలాగ్రశతభాగేన సదృశో హృదయే స్థితః
అశ్నన్ కర్మఫలం సర్వమాత్మా స్ఫురతి దీపవత్ ॥ 6 ॥

ఆత్మాకపి సర్వభూతానా మంతః కరణమాశ్రితః
అణుభూతో మలాసంగాదాదికర్మనియంత్రితః ॥ 7 ॥

అశరీరోకపి సర్వత్ర వ్యాపకోకపి నిరంజనః
ఆత్మా మాయాశరీరస్థః పరిభ్రమతి సంసృతౌ ॥ 8 ॥

ఆత్మస్వరూప విజ్ఞానం దేహేంద్రియ విభాగతః
అఖండబ్రహ్మ రూపేణ తదాऽऽత్మప్రాప్తి రుచ్యతే ॥ 9 ॥

జపాయోగాద్యథా రాగః స్ఫటికస్య మణేర్భవేత్
తథా హంకారసంబంధాదాత్మనో దేహమానితా ॥ 10 ॥

న చాస్తి దేహసంబంధో నిర్దేహస్య స్వభావతః
అజ్ఞాన కర్మయోగేన దేహీ భవతి భుక్తయే ॥ 11 ॥

నాసౌ దేవో న గంధర్వో న యక్షోనైవ రాక్షసః
న మనుష్యో న తిర్యక్చ న చ స్థావర విగ్రహః
తత్త చ్ఛరీరయో గేన తత్తన్నామ్నా విరాజతే ॥ 12 ॥

నానాకర్మ విపాకాచ్చ నానాయోనిసమాశ్రితాః
నానాయోగసమాపన్నా నానా బుద్ధివిచేష్టితాః ॥ 13 ॥

నానా మార్గస మారూఢా నానాసంకల్ప కారిణః
అస్వతంత్రాశ్చ కించిజ్ జ్ఞాః కించిత్కర్తృ హేతవః
లీలాభాజనతాం ప్రాప్తాః శివస్య పరమాత్మనః ॥ 14 ॥

చోదితాః పరమేశేన స్వస్వకర్మాను రూపతః
స్వర్గం వా నరకం వాపి ప్రాణినో యాంతి కర్మిణ : ॥ 15 ॥

పునః కర్మావశేషేణ జాయంతే గర్భ కోటరాత్
జాతా మృతాః పునర్జాతాః పునర్మరణ భాజనాః
భ్రమంతి ఘోర సంసారే విశ్రాంతికథయా వినా ॥ 16 ॥

జీవత్వం దుఃఖ సర్వస్వం తదిదం మలకల్పితం
నిరస్యతే గురోర్బోధాద్ జ్ఞానశక్తిః ప్రకాశతే ॥ 17 ॥

శ్రీ గురువు యొక్క ఉపదేశ యోగము చేత జీవభావమును త్యజించి ఎప్పుడైతె శివతత్త్వము అనుభవించబడుచున్నదో అప్పుడీతడు ఆత్మయని చెప్పఁబడుచున్నాడు॥5॥ వెంట్రుక యొక్క కొనభాగమును నూరుభాగములు జేయగా అందులోని మరొక భాగమునకు సమానమైన అత్యంత సూక్ష్మభాగమనబడిన ఆత్మసమస్తప్రాణుల హృదయములందుండి, స్వార్జిత సమస్త కర్మఫలమును అనుభవించునదై దీపము వలె ప్రకాశించుచుండును. దీపము ఇంట్లో నే భాగమునందున్నను తనకాంతి ప్రకాశము చేత గృహమంతట ప్రకాశింపజేయునట్లు ఆత్మ హృదయస్థానమునందున్నప్పటికిన్నీ తన యొక్క జ్ఞాన ప్రభచేత శరీరమునందంతటను వ్యాపించి, సర్వావయచైతన్యమును అనుభవించువాడై ప్రకాశించుచుండునని భావము ॥6॥అణు రూపమగు ఆత్మ సర్వ జీవుల అంతఃకరణమును ఆశ్రయించిన వాడై అణవాదిమలత్రయ సంబంధముచేత ప్రాచీన కర్మ పాశముతో బంధింపఁబడి యున్నాడు. ప్రాచీన కర్మ పాశముతో బంధనమే ఆత్మను సదా సంసారమునందు ఆసక్తి గలవాడిగా జేయుచున్నది అని భావము ॥7॥ శరీరము లేకున్నను, సర్వత్ర వ్యాపించి యున్నది ఐనను సర్వత్ర వ్యాపించి యున్నను నిర్లిప్తుడైన ఆత్మ, మాయామయ శరీరమునందున్నదై జనన-మరణరూప సంసారమునందు భ్రమించుచుండును. ॥8॥ దేహము ఆత్మగాదు, ఇంద్రియము, ఆత్మగాదు, బుద్ధి ఆత్మగాదు, వీటన్నింటి కంటెను ఆత్మ భిన్నముగా నున్నదని గుర్తించి, అపరిచ్ఛిన్న పరబ్రహ్మ రూపముతో స్వస్వరూప జ్ఞానము ఎప్పుడు గల్గుచున్నదో, అప్పుడే ఆత్మ ప్రాప్తిఅని చెప్పబడును. ॥9॥ స్ఫటిక మణికి జపాకుసుమము (ఎఱ్ఱదాసానిపువ్వు) యొక్క సంబంధము నుండి ఎఱుపురంగుగా ఏట్లుగా నేర్పడుచున్నదో అట్లే అహంకారసంబంధముతో ఆత్మకు దేహాభిమానముగలుగును ॥10॥ శరీరశూన్యమైన ఆత్మకు సహజముగ దేహ సంబంధముండదు, అజ్ఞాన కర్మసంబంధముచేత కర్మ ఫలమును అనుభవించుటకై శరీరముగల వాడగును ॥11॥ ఆత్మ దేవుడుగాడు, గంధర్వుడుగాడు, యక్షుడుగాడు, రాక్షసుడుగాడు, మానవుడు గాడు, పశుపక్షి రూపతిర్యక్ ప్రాణిగూడగాదు. శిలాది స్థావర వస్తువు గాదు. ఐతే ఆయాశరీర సంబంధముచేత ఆయానామములతో ప్రకాశించు చున్నాడు ॥12॥ ప్రాణులు నానా విధమైన ప్రాచీన కర్మ పరిపాకము వలన దేవతిర్యక్మనుష్యాది నానావిధమైన యోనులందు జన్మించిన వారైనా నానావిధా కృతులతో గూడియున్న వారై పలురకాల బుద్ధులతో చంచలమతులయ్యు రకరకాల శాస్త్ర మార్గ ప్రవిష్టులై పలురకాల సంకల్ప కారులై స్వాతంత్ర్య రహితులై కించిత్ (అల్పజ్ఞ) వక్తృత్వ శాలురై యుండి శివ పరమాత్మునకు క్రీడా భాండస్వరూపులై యున్నారు. ॥13-14॥ తమతమకర్మాను గుణ్యముగా

పరమేశ్వరునిచేత(ప్రేరితులైన ప్రాణులు, (ప్రేరితమైన) స్వర్గమును గాని అథవా నరకమును గాని బొందుదురు ॥15॥స్వర్గము నరకము ఫలాను భవానంతరమున అల్పావశిష్టమైయున్న అట్టి కర్మ ఫలమును అనుభవించుటకై పునః గర్భమునుండి జన్మింతురు, మళ్ళీ మరణింతురు, "పునరపిజననంపునరపిమరణం" అను సూక్తి మేరకు అనుసరింతురు. ఇదే విధముగా విశ్రాంతి యనేదే లేకుండా భయంకరమగు సంసారమునందు సదా పరిభ్రమించుచుందురు ॥16॥ అణవాది మలబద్ధము దుఃఖమయము ఐన జీవత్వము (జీవభావము) శ్రీ గురువు యొక్క ఉపదేశము వలన దొలగిపోయి జ్ఞానశక్తి ప్రకాశించు చుండును ॥17॥

## 29. అంతరాత్మస్థలం

॥శ్లో॥ యదా నిరస్తం జీవత్వం భవే ద్గుర్వనుబోధతః
తదాఽంతరాత్మ భావో హి నిరస్తస్య భవేద్ధ్రువం ॥ 18 ॥

దేహస్థితో వ్యయం జీవో దేహ సంగ వివర్జితః
బోధాత్ పరమాత్మ భావిత్వాదంతరాత్మేతి కీర్తితః ॥ 19 ॥

ఆత్మాంతరాలవర్తిత్వాజ్జీవాత్మ పరమాత్మనోః
యోగాదుభయ ధర్మాణా మంతరాత్మేతి కీర్తితః ॥ 20 ॥

అహంకారస్య సంబంధాన్మనుష్యత్వాదివిభ్రమః
న స్వభావ ఇతి జ్ఞానాదంతరాత్మేతి కథ్యతే ॥ 21 ॥

యథా పద్మపలాశస్య న సంగో వారిణా భవేత్
తథా దేహజుషోస్యస్య న శరీరేణ సంగతిః ॥ 22 ॥

నీడస్థితో యథా పక్షీ నీడాద్భిన్నః ప్రకాశతే
దేహస్థితస్త థాత్మాయం దేహదన్య! ప్రకాశతే ॥ 23 ॥

ఆచ్ఛాద్యతే యథా చంద్రో మేఘైరాసంగవర్జితః
తథాత్మా దేహ సంఘాతైరనంగః పరివేష్టితః ॥ 24 ॥

నిర్మమో నిరహంకారో నిరస్తోపాధి విప్లవః
దేహస్థోఽపి సదా హ్యాత్మా శివం పశ్యతి యోగతః ॥ 25 ॥

భోక్తుర్భోజ్య పరిత్యాగాత్ ప్రేరకస్య ప్రసాదతః
భోక్తృ తా భోగ గలితః స్ఫురత్యాత్మా స్వభావతః ॥ 26 ॥

సర్వేషాం ప్రేరకత్వేన శంభురంతః స్థితః సదా
తత్పర జ్ఞానయోగేన యోగీ నందతి ముక్తవత్ ॥ 27 ॥

శ్రీ గురువు యొక్క ఉపదేశము చేత జీవభావము ఎప్పుడైతే తొలగిపోవునో అప్పుడు జీవభావ శూన్యుడైన ఆత్మకునిశ్చయముగ అంతరాత్మ భావముగలుగును. ఈ జీవాత్ముడు దేహమునన్నప్పటికిని దేహ సంబంధముతో దూరమై స్వస్వరూపజ్ఞానములోను పరమాత్మభావములుండుటచేత అంతరాత్మయని చెప్పబడును. జీవభావము చేత దూరమైన ఆత్మజీవాంతత్వము మరియు పరమాత్మత్వ ములను ఈ రెండు అవస్థల మధ్యలో ఉండి, జీవ ధర్మము మరియు శివ ధర్మములను ఇరుతెరుంగులైన ధర్మముల సంబంధముతో అంతరాత్మయని చెప్పబడును ॥20॥ నేను మనిషిని నేను శ్రేష్ఠుడిని (గొప్పవాడిని) నేను చిన్నవాడిని, అను కల్పన అహంకార సంబంధముతో వచ్చియున్నది. ఇది స్వభావికమైనదిగాదు అను జ్ఞాన అంతరాత్మయని చెప్పబడును ॥21॥ కమలపు ఆకు నీటిలోనున్నప్పటికినీ,దానికి నీటి సంబంధముండదు. అదెట్లాగ ఉండదో అట్లే ఆత్మ శరీరములోనున్నప్పటికిని శరీర సంబంధమునుండి దూరముగనుండును ॥22॥ పక్షిగూటిలోనున్నను ఆ గూటి నుండి యెట్లు భిన్నముగానగుపడుచున్నదో, అట్లే ఆత్మ శరీరములోనున్నను శరీరమునుండి భిన్నముగా నుండి ప్రకాశించుచుండును ॥23॥మేఘములతో సంబంధములేని చంద్రుడు మేఘములతో నెట్లు ఆచ్ఛాదింపబడునో అట్లే ఆత్మ శరీర సంబంధములేని వాడైనను అనేక రకములైన దేహ సంబంధములతో పరివేష్టితుడై యుండును ॥24॥ మమకార అహంకారశూన్యుడైనను ఉపాధి బాధ రహితుడైన ఆత్మ దేహమునందున్నను యోగ సాధన చేత నెల్లప్పుడు శివుని దర్శించు చుండును ॥25॥ భోక్తయైన ఆత్మకు ప్రేరేపుడైన శివుని అనుగ్రహము వలన భోగ్యవస్తువుల పరిత్యాగమగుట వలన ఆతడు భోక్తృరూపభోగమునుండి దూరమై స్వస్వరూపముతో ప్రకాశించుచుండును. ॥26॥ శివుడు సర్వ ప్రాణులకు ప్రేరకుడై యుంట వలన సమస్త ప్రాణులహృదయములందు ఎల్లప్పుడును నివసించి యుండును. అట్టి పరమ శివుని యథార్థజ్ఞాన సంబంధముతో శివయోగిముక్తుని వలె సంతుష్టుడై యుండును. శివయోగి శివజ్ఞాన సంబంధముతో ఆనంద భరితుడై యుండునని భావము ॥27॥

## 30. పరమాత్మస్థలం

॥శ్లో॥ నిర్ధూతే తత్ప్రబోధేన మలే సంసారకారణే
సామరస్యాత్ పరాత్మస్థః పరమాత్మాయముచ్యతే ॥ 28 ॥

సర్వేషామాత్మ భేదానాముత్కృష్టత్వాత్ స్వతేజసా
పరమాత్మా శివఃప్రోక్తః సర్వ గోపి ప్రకాశవాన్ ॥ 29 ॥

బ్రహ్మాండబుద్బుదస్తోమా యస్య మాయామహోదధౌ
ఉన్మజ్జంతి నిమజ్జంతి పరమాత్మా స ఉచ్యతే ॥ 30 ॥

యస్మిన్ జ్యోతిర్గణాః సర్వే స్ఫులింగా ఇవ పావకా
ఉత్పద్య విలయం యాంతి తద్రూపం పరమాత్మనః ॥ 31 ॥

యస్మిన్ సమస్తతత్త్వాని కల్లోలా ఇవ వారిధౌ
సంభూయ లయమాయాంతి తద్రూపం పరమాత్మనః ॥ 32 ॥

నిరస్త మల సంబంధమశేషజగదాత్మకం
సర్వతత్త్వే పరిప్రోక్తం స్వరూపం పరమాత్మనః ॥ 33 ॥

యథా వ్యాప్య జగత్సర్వం స్వభాసా భాతి భాస్కరః
తథా స్వశక్తి భిర్వ్యాప్య పరమాత్మా ప్రకాశతే ॥ 34 ॥

విశ్వతో భావమానోపి విశ్వమాయా విలక్షణః
పరమాత్మా స్వయం జ్యోతీరూపో జీవాత్మనాంభవేత్ ॥ 35 ॥

జనన మరణరూపసంసారమునకు మూలకారణభూతమగు అజ్ఞానము శివాద్వైత జ్ఞానము చేతనశించగా, ఈ అంతరాత్మకు పరమాత్మునిలో సామరస్యముగలుగుట వలన పరమాత్మకునిలయమైన (పరమాత్మునిలో సమరసభూతుడైన) ఇతడు పరమాత్ముడే యని చెప్పబడుచున్నాడు.

"యథానద్యఃస్యందమానాః సాగరే (సముద్రే) అస్తంగచ్ఛంతి నామరూపే (పం) విహాయతథా విద్వాన్నామరూపాద్వి ముక్తః! పరాత్పరం పురుషముపైతి దివ్యం"

అను ముండకోపనిషత్తు వాక్యము మేరకు ఇదే అభిఃప్రాయమును బోధించుచున్నది ॥28॥ శివుడు తన యొక్క అప్రతిహతతేజస్సుతో అనంతాత్ములలో ఉత్కృష్టుడగుటవలన

పరమాత్ముడని చెప్పబడుచున్నాడు. ఈ పరమాత్ముడు సమస్త చరాచర ప్రపంచమునందు వ్యాపించి యున్నను మిగతా ఆత్మలవలె తేజో హీనుడుగాకుండ నుండి ఉజ్జ్వలుడయ్యే ప్రకాశించుచుండును" "సఉశ్రేయాన్ భవతిజాయమానః" అనుశ్రుతి వాక్యము చాటి చెప్పుచున్నది. అనేక బ్రహ్మాండములను బుద్బుదసమూహములు ఎవని మాయరూపమగు మహాసముద్రమున వాటివలె, జీవుడు పరమాత్ముడని చెప్పుకొనును. అగ్నినుండి మిణుగురులు ఉత్పన్నములై అందులోనే లీనమగు నట్లుగా దేని నుండి జీవ సముదాయములు ఉత్పన్నములై దేనియందు లయమగునో అదే పరమాత్మ స్వరూపమనబడును. సముద్రమున తరంగములు ఉత్పన్నములై లీనమగునట్లుగా దేని నుండి జీవసముదాయములు ఉత్పన్నములై దేని యందు లయమగునో అదే పరమాత్మ స్వరూపమనబడును. సముద్రమున తరంగములు ఉత్పన్నములై లయమును బొందుచున్నవో అదే పరమాత్మని స్వరూపమనబడును. ॥32॥ అణవాదిమల సంబంధ శూన్యమైనదగు అథవాఅత్యంత పవిత్రమైనదగు, సకల చరాచర ప్రపంచరూపమైనదగు పరమాత్మని స్వరూపము భూమ్యాది సమస్త తత్వములకంటెను శ్రేష్ఠమై యున్నది. సూర్యుడు తనతేజస్సు చేత సమస్త జగత్తును వ్యాపించి ఎట్లు ప్రకాశించుచున్నాడో అట్లే పరమాత్ముడు తనతో నున్న అనంత శక్తులతో సమస్త జగత్తును వ్యాపించి ప్రకాశించు చున్నాడు. ॥34॥ విశ్వమాయావిలక్షణమగు పరమాత్ముడు జీవాత్ములలో సర్వత్ర ప్రకాశించుచున్నను స్వయం జ్యోతి స్వరూపుడయ్యె ప్రకాశించును. అనశ్నన్నన్యో అభిచాకశీతి" అనునట్లు శ్రుతియు (వేదము) ఇదే అభిప్రాయమును బోధించుచున్నది॥35॥

## 31. నిర్దేహాగమస్థలం

॥శ్లో॥ దేహినోఽపి పరాత్మత్వ భావినో నిరహంకృతేః
నిరస్త దేహధర్మస్య నిర్దేహాగమ ఉచ్యతే ॥ 36 ॥

శివోఽ హమితి యస్యాస్తి భావనా సర్వగామినీ
తస్య దేహేన సంబంధః కథం స్యాదమితాత్మనః ॥ 37 ॥

గలితే కృత్రి మాహంత్వే సంసారభ్రమ కారణే
పరాహంతాం ప్రవిష్టస్య కుతో దేహః కుతో రతిః ॥ 38 ॥

నిష్కలే నిష్ప్రపంచౌఘే గభీరే చిన్మహోదధౌ
నిమగ్న మానసో యోగీ కథం దేహం విచింతయేత్ ॥ 39 ॥

అపరిచ్ఛేద్యమాత్మానం చిదంబర మితి స్మరన్
దేహయోగేఽపి దేహస్థైర్వికారైర్న విలిప్యతే ॥ 40 ॥

అఖండనం విదాకారమద్వితీయం సుఖాత్మకం
పరమాకాశ మాత్మానం మన్వానః కుత్ర ముహ్యతి ॥ 41 ॥

ఉపాధివిహితా భేదా దృశ్యంతే చైకవస్తుని
ఇతి యస్య మతిః సోఽయం కథం దేహమితో భవేత్॥ 42 ॥

భేదబుద్ధిః సమస్తానాం పరిచ్ఛేదన్య కారణం
అభేదబుద్ధౌ జాతాయాం పరిచ్ఛేదస్య కా కథా ॥ 43 ॥

పరమాత్ముని స్వరూపమును భావించువాడు, అహంకారమమకారశూన్యుడు, శరీరము గలిగియున్నప్పటికిన్ని, దేహధర్మములతో విముక్తుడైన వాడును ఐన శివయోగికి నిర్దేహత్వ ప్రాప్తి చెప్పబడినది ॥36॥ శివోఽహం నేను శివుడిని సర్వ వ్యాపకమైనానను భావన ఎవని యందున్నదో, మహాత్ముడైన ఆ శివయోగికి శరీర సంబంధము ఎట్లు ఏర్పడును? ఎన్నటికి యేర్పడదని భావము ॥37॥ సంసార భ్రాంతికి మూలకారణమగు కృత్రిమ అహంకారము నశించగా శివభావమును బొందిన శివయోగికి శరీరమెక్కడుండును. మరియు శరీర సంబంధమగు అభిమానము (ప్రేమ) ఎక్కడుంది? ఈ రెండును ఉండవని భావము ॥38॥ నిష్కలము, చరాచర ప్రపంచసమూహశూన్యము అత్యంత గంభీరము ఐన జ్ఞానసముద్రమున మనసును లీన మొనర్చిన శివయోగి దేహమునుగూర్చి ఎట్లు చింతించును? ఇంతటి శివ యోగికి తన దేహము విషయమున జ్ఞాపకముండదని భావము ॥39॥ తనను అపరిచ్ఛిన్న జ్ఞానాకాశస్వరూపునిగా భావించునట్టి శివయోగి దేహముతో గూడియున్న నుదేహమునసుండు ఇంద్రియ వికారములచేత లిప్తుడైన వాడుగా కాడు. తనను అఖండ జ్ఞాన స్వరూపునిగాను, అద్వితీయునిగాను ఆనంద స్వరూపునిగాను, దెలిసి కొనిన (భావించిన)శివయోగి ఎక్కడను మోహమునకులోనుగాడు? మోహమునకు వశుడుగాడని భావము ॥41॥ ఒకే వస్తువులో అనేక విధములైన భేదములు ఉపాధులతోను గూడి యున్నవై అగుపడుచున్నవనే భావము ఎవని కుండునో వాడు దేహ సంబంధమున్న వాడెట్లగును? (జ్ఞానము) సర్వమును అభేద బుద్ధితో నిరీక్షిస్తు సాక్షాత్తుగా శివ స్వరూపుడైయున్న శివయోగికి దేహ సంబంధమేమాత్రము లేదని భావము ॥42॥ భేద బుద్ధే సమస్త వస్తువుల భిన్న భిన్నతకుమూలకారణీభూతమై యున్నది. అభేద బుద్ధి చేతనుత్పన్నమగుటకు పరిచ్ఛేదమునకు (భిన్నభిన్నతకు) అవకాశమెక్కడిది? అభేద

బుద్ధియున్నవాడు ఏ వస్తువును భిన్న భిన్నముగా జూడకుండ సమస్తమును శివస్వరూపముగానె జూచునని భావము ॥43॥

## 32. నిర్భావాగమస్థలం

॥శ్లో॥ వ్యతిరేకాత్ స్వరూపస్య భావాంతరనిరాకృతేః
భావో వికారనిర్ముక్తో నిర్భావాగమ ఉచ్యతే ॥ 44 ॥
అహం బ్రహ్మేతి భావస్య వస్తుద్వయసమాశ్రయః
ఏకీభూతస్య చిద్వ్యోమ్ని తదభావో వినిశ్చితః ॥ 45 ॥

ఏక భావేన రూఢస్య నిష్కలంకే చిదంబరే
క్వ జాతివాసనాయోగః క్వ దేహిత్వం పరిభ్రమః ॥ 46 ॥

శూన్యే చిదంబరే స్థానే దూరే వాఙ్మానసాధ్వనః
విలీనాత్మా మహాయోగీ కేనకింవాపి భావయేత్ ॥ 47 ॥

అవిశుద్ధే విశుద్ధే వా స్థలే దీప్తి ర్యథా రవేః
పతత్యేవం సదా ద్వైతీ సర్వత్ర సమవృత్తి మాన్ ॥ 48 ॥

న బిభేతి జరామృత్యోర్న క్షుధాయా వశం వ్రజేత్
పరిపూర్ణ నిజానంద సమాస్వాదాన్మహాసుఖీ ॥ 49 ॥

నేను వేరే, శివుడు వేరే, జగత్తు వేరే, అనుభావనను నిరాకరరించుట వలనను అందుచే పూర్వస్వరూపము యొక్క వైలక్షణ్యము చేతను, ఇంద్రియ వికారముల చేత ముక్తుడగుట వలన మనో భావనయే నిర్భావాగమ స్థలమనబడును ॥44॥

"అహం బ్రహ్మ"అనే భావనకు నేను మరియు బ్రహ్మ అను రెండు వస్తువుల సంబంధ మేర్పడును, చిదాకాశమునందు సమరసభూతమగు భావనకు అహం-బ్రహ్మ అను రెండు వస్తువుల అభావమును జెప్పబడినది. శివోఅహం భావన గూడ నశించి తన్ను తను ప్రకాశించు చున్నదే నిర్భావాగమ స్థలము ॥45॥ నిష్కలంకమైన చిదాకాశములో ఏకత్వము (సామరస్యము) భావము చేత దృఢమగు శివయోగికి వర్ణాశ్రమ వాసనాసంబంధము, శరీరముండుట సంసార చక్రభ్రమణ మెక్కడిది? ఇవేమియు ఉండవని భావము ॥46॥ వాఙ్మనో మార్గమునకు అతీతమైనది. నీల పీతాద్యాకారములు లేని దగు చిదాకార స్థానము నందుగాని అథవా అపవిత్ర స్థలమునందు గాని, భేదభావనము లేకుండా సమాన

బుద్ధిగలవాడై యున్నాడు. సూర్యుని ప్రకాశము పవిత్రమునందుగాని, లేక అపవిత్రమునందుగాని భేద భావములేకుండా ఎట్లు తన కిరణములను ప్రసరింపజేయునో అట్లే శివాద్వైతి సమాన బుద్ధి కలవాడై యుండును. ॥48॥ ఇట్లు శివయోగి జరామరణములకు భయపడడు, మరియు ఆకలి బాధకులోనుగాడు, ఇతడు పరిపూర్ణాత్మానందమును అనుభవించుటచేత మహానందమును అనుభవించును ॥49॥

## 33. నష్టాగమస్థలం

॥శ్లో॥ భేదశూన్యే మహాబోధే జ్ఞాత్రాదిత్రి యహానితః ॥ 50 ॥
జ్ఞానస్య నష్ట భావేన నష్టాగమ ఇహోచ్యతే

అద్వైతవాస నావిష్ట చేతసాం పరయోగినాం
పశ్యతామంతరాత్మానం జ్ఞాతృత్వం కథమన్యథా ॥ 51 ॥

అకర్తాహమవేత్తాహమదేహోఽహం నిరంజనః
ఇతి చింతయతః సాక్షాత్ సంవిదేవ ప్రకాశతే ॥ 52 ॥

నిరస్తభేద జల్పస్య నిరీహస్య ప్రశామ్యతః
స్వే మహిమ్ని విలీనస్య కిమన్యద్ జ్ఞేయముచ్యతే ॥ 53 ॥

ఏకీభూతే నిజాకారే సంవిదా నిష్ప్రపంచయా
కేన కిం వేదనీయం స్యాద్వేత్తా కః పరిభాష్యతే ॥ 54 ॥

మహాసత్తా మహాసంవిద్విశ్వరూపా ప్రకాశతే
తద్వినా నాస్తి వస్త్వేకం భేద బుద్ధిం విముంచతః ॥ 55 ॥

భేద శూన్యమైన మహాజ్ఞానమునందు జాతృ-జ్ఞాన-జ్ఞేయ రూపమగుత్రిపుటిమయమైన ప్రపంచము శూన్యమై యుంటవలన నిర్భావాగమ స్థల సంపన్నుడగు ఈ శివయోగి విషయమున భేద జ్ఞానము నష్టమగుట వలన ఇది నష్టాగమ స్థల మనబడును ॥50॥ శివాద్వైతవాసనతో గూడిన వారైనను, తమ హృదయకమలమునందు పరమేశ్వరుని దర్శించువారు ఐన శివయోగులకు స్వాతిరిక్తపదార్థాంతర జ్ఞాతృత్వము ఎట్లు సంభవించును? శివయోగులు తమకు దప్ప ఏ పదార్థములను గమనించక, సమస్త పదార్థములను స్వస్వరూపముతోనే జూతురని భావము. ॥51॥ నేను కర్తనుగాను నేను దెల్సిన (జ్ఞానిని) వాడిని గాను నేనదేహిని గాను, నేను నిరంజనుడను అని ఆలోచించు శివయోగికి సాక్షాత్తుగా

శివాద్వైత జ్ఞానమే ప్రకాశించుచుండును. ॥52॥ భేద భావమును నిరసించిన వాడు, రాగద్వేష రహితుడు, విరక్తుడు, నిజమైన మహిమయందే లీనమైన వాడునైన శివయోగికి తన కన్యమగు జ్ఞేయ వస్తువు ఏది యున్నది? ఏదియు లేదనే భావము ॥30॥ స్వస్వరూపభేద రహితమైన శివాద్వైత జ్ఞానముతో సమరస భావమును బొందుటకు దేని చేత ఏ వస్తువును దెలియ వలెను?దెలుసుకున్న (ఎఱింగిన) వాడు ఎవడని చెప్పవలెను?

"నా తః పరంవేదితవ్యం హి కించిత్"అను శ్రుతి వాక్యాను సారముగా శివయోగికి జ్ఞాతృజ్ఞేయ-జ్ఞానము లేవియును ఉండవు, అని భావము ॥54॥ గొప్ప సత్తా స్వరూపమగు మహాజ్ఞానము జగద్రూపమై ప్రకాశించును. ఔపాధిక భేద బుద్ధిని విడిచిన వాడికి ఏ ఒక వస్తువు అగుపడదు॥55॥

## 34. ఆదిప్రసాది స్థలం

॥శ్లో॥ సర్వాధిష్ఠాతృకః శంభురాదిస్తస్య ప్రసాదతః
ఆదిప్రసాదీత్యుక్తో యం నిర్వికారపదే స్థితః ॥ 56 ॥

అనేక జన్మ శుద్ధస్య నిరహంకార భావినః
ప్రసన్నస్య మహాదేవః ప్రసీదతి విముక్తయే ॥ 57 ॥

శివ ప్రసాదసంపత్త్యా శివభావముపేయుషా
శివాదన్యజ్జగజ్జాలం దృశ్యం తే న చ దృశ్యతే ॥ 58 ॥

శంభోరేవ ప్రసాదేన సంసారచ్ఛేదకారిణా
మోహగ్రంథిం వినిర్భిద్య ముక్తిం యాంతి వివేకినః ॥ 59 ॥

వినాప్రసాదమీశస్య సంసారో న నివర్తతే
వినా సూర్యోదయం లోకే కుతః స్యాత్తమసో లయః ॥ 60 ॥

సర్వాను గ్రాహకః శంభుః కేవలం కృపయా ప్రభుః
మోచయేత్ సకలాన్ జంతూన్నకించిదిహ కారణం ॥ 61 ॥

సమస్తమునకు ఆధార భూతమైన పరమ శివుడు సృష్ట్యాది పంచకృత్యములకు ఆది కారణభూతుడైయున్నాడు. సమస్తమునకు ఆది భూతుడైన ఆ పరమ శివుని ప్రసాదము చేత వికార శూన్యమగు నష్టాగమ స్థలమునందున్న శివయోగికి మోక్షమును అనుగ్రహించుటకై శివుడు బ్రసన్నుడగును ॥57॥

శివ ప్రసాద సంపత్తు వలనశివ స్వరూపాన్ని బొందిన ఆ శివయోగి, దృష్టిగోచరమగు నీచరాచరాత్మకమగు ఈ ప్రపంచ సమూహమును శివేతరమైనదిగాను అగుపడదు. సాగర తరంగముల న్యాయము పగిది అనగా సముద్రమునుండి యత్పన్నమగు తరంగము లకు భేదరహితమైనట్లుగా శివునికి, శివుడి వలన ఉత్పన్నమగు నీచరాచరాత్మక ప్రపంచ మునకు అభేదమని గుర్తించువాడు అని భావము ॥58॥ వివేకవంతులు సంసారనాశనమునకు మూలమైన శివ ప్రసాదమునుండే అజ్ఞాన గ్రంధిని ఛేదించి ముక్తిని పొందుదురు. శివాను గ్రహములేనిదే సంసార నివృత్తి పొందలేరు. లోకమున సూర్యోదయమునుండే అంధకారము నశించునట్లుగా, శివ ప్రసాదము వలన సంసార బంధనమునశిస్తుందని భావము ॥60॥ అనంత బ్రహ్మాండ నాయకుడు సర్వానుగ్రహ కారకుడైన శివుడు కేవలము తన అనుగ్రహము చేత సమస్త ప్రాణులను సంసారబంధమునుండి విడిపించును. ఈ విషయమున ఆతని యనుగ్రహమే కారణముగా కమరే కారణముండదు. సమస్త ప్రాణుల సంసార బంధనివృత్తికి పరశివ మూర్తియొక్క అనుగ్రహమే ప్రధానమైన కారణమని భావము॥61॥

## 35. అంత్య ప్రసాది స్థలం

॥శ్లో॥ లయః సర్వపదార్థానామంత్య ఇత్యుచ్యతే బుధైః
ప్రసాదోనుభవస్తస్య తద్వానంత్య ప్రసాదవాన్ ॥ 62 ॥

దేవతిర్యఙ్మనుష్యాది వ్యవహారవికల్పనా
మాయాకృతా పరేతత్త్వే తల్లయేతత్ క్షయోభవేత్ ॥ 63 ॥

సాక్షాత్కృతే పరే తత్త్వే సచ్చిదానంద లక్షణే
క్వ పదార్థ పరిజ్ఞానం కుతో జ్ఞాతృత్వ సంభవః ॥ 64 ॥

సుషుప్తస్య యథావస్తు న కించిదపి భాసతే
తథా ముక్తస్య జీవస్య న కించిద్వస్తు దృశ్యతే ॥ 65 ॥

యథాకాశమవిచ్ఛిన్నం నిర్వికారం స్వరూపతః
తథా ముక్తస్య జీవస్య స్వరూపమవ శిష్యతే ॥ 66 ॥

న కించిదపి ముక్తస్య దృశ్యం కర్తవ్యమేవ హి
సుఖస్ఫూర్తి స్వరూపస్య నిశ్చలా స్థితి రుచ్యతే ॥ 67 ॥

శివాద్వైత పరిజ్ఞాన శిథిలా శేష వస్తునః
కేవలం సంవిదుల్లాసదర్శినః కేన కిం భవేత్ ॥ 68 ॥

భూమ్యాది శివాంతమగు సమస్త పదార్థముల (తత్త్వముల) లయమునకు ఆశ్రితుడైన శివుడు చిరస్థాయి(చివరి) వాడని చెప్పబడును. అట్టి శివుని సాక్షాత్కారమే ప్రసాదియనబడును. . అట్టి ప్రసాదముగల ఆది ప్రసాదె అంత్య ప్రసాది యనబడును ॥62॥ దేవుడు మానవుడు-పశువులు-పక్షులు మున్నగు వ్యవహార కల్పనము మాయచేతనుత్పన్నమై యున్నది. పర్మతత్వమునందు ఆ మాయలీనమగుటకు దేవ మనుష్యాది కల్పన వెంటనే నశిస్తుంది. ॥63॥ సచ్చిదానంద స్వరూపమగు పరశివ తత్త్వము ప్రత్యక్షమగుటకు వృథివ్యాది పరదార్థపరిజ్ఞానమెక్కడిది? తెల్సిన వాడైనను ఎవడు, అప్పుడు జ్ఞాతృ -జ్ఞానము - జ్ఞేయము ఈ మూడు ఉండవని భావము.॥64॥ గాఢ నిద్రలోనున్న వాడికి ఏ వస్తువు ఎట్లు గోచరించదో అట్లే జీవన్ముక్తునకు ఏ వస్తువు అగుపడదు. జీవన్ముక్తునకు సమస్తము శివ స్వరూపముగానె గోచరిస్తుందని భావము ॥65॥ అకాశము స్వాభావికముగ ఎట్లు వ్యాపకము వికార శూన్యము అయి ఉన్నదో, అట్లే జీవన్ముక్తుడు సర్వ వికారములనుండి దూరమై స్వరూపము మాత్రమే మిగిలియుండును ॥66॥ జీవన్ముక్తునకు చూడదగినదిగాని, అథవా చేయదగినదిగాని, ఏదియుండదు. ఆనందస్వరూపుడైన జీవన్ముక్తుని స్థితినిశ్చలముగా నుండును ॥67॥ శివాద్విత జ్ఞానము చేత నివృత్తి జేయబడిన సమస్త వస్తువులున్నవాడు కేవలముగా చిద్విలాసమునే దిలకించువాడు ఐన శివయోగికి దేనినుండియేమికానున్నది? ఏవిధమైన ప్రయోజనము గలుగదని భావము ॥68॥

## 36. సేవ్య ప్రసాదిస్థలం

॥శ్లో॥ సేవ్యో గురుః స్మృతో హ్యస్య ప్రసాదోనుభవోమతః
తదేకావేశ రూపేణ తద్వాన్ సేవ్య ప్రసాదవాన్ ॥ 69 ॥

సేవ్యో గురుః సమస్తావాం శివ ఏవ న సంశయం
ప్రసాదోస్య పరానందప్రకాశః పరికీర్త్యతే ॥ 70 ॥

గురురేవ పరం తత్త్వం పరతత్త్వం గురుః స్మృతః
తదేకత్వానుభావేన న కించిదవ శిష్యతే ॥ 71 ॥

అపరిచ్ఛేద్యమాత్మస్థ మవాఙ్మానసగోచరం
ఆనందం పశ్యతాం పుంసాం రతిరస్యత్ర కా భవేత్ ॥ 72 ॥

జ్ఞానామృతేన తృప్తస్య కిమన్యైర్భోజ్య వస్తుభిః
జ్ఞానమేవ పరానందం ప్రకాశయతి యచ్ఛివం ॥ 73 ॥

ముక్తిరేవ పరాతృప్తిః పరమానంద లక్షణా
నిత్యతృప్తస్య ముక్తస్యకిమన్యైర్భోగ సాధనైః ॥ 74 ॥

న బాహ్యా కర్మ తస్యాస్తి న చాంతర్నైవ కుత్రచిత్
శివైక్య జ్ఞాన రూఢస్య దేహ భ్రాంతిం విముంచతః ॥ 75 ॥

న కర్మబంధేన తపో విశేషే
న మంత్రయోగాభ్యసనేతథైవ
ధ్యానే భోధే చ తథాత్మ తత్త్వే
మనః ప్రవృత్తిః పరయోగభాజాం ॥ 76 ॥

శివ స్వరూపుడైన శ్రీ గురువు సేవ్యుడని చెప్పబడును. ఇట్టి శ్రీ గురువు యొక్క ఉపదేశానుభవమే ప్రసాదమనబడును. గురువు మరియు ప్రసాదము ఈ రెండింటి కలయిక (సంబంధము) శిష్యుని యందు గలుగుట వలన ఇట్టి యేకీభావము గలవాడే సేవ్య ప్రసాదియనబడును. ॥79॥ సమస్త జనులకు బూజ్యుడైన శ్రీ గురువు సాక్షాత్తుగ శివుడే అయియున్నాడు. ఆ పరత్తత్వమే శ్రీ గురువై యున్నాడు. ఆ గురుతత్వ- పరత్తత్వముల ఐక్యజ్ఞానముచేత ఏమేమియు మిగులదు. ఆరెండింటిలో ఎట్టి భేదభావము మిగులకుండ ఒకే ఒకటియై యుండునని భావము ॥71॥

అఖండము స్వస్వరూపము. వాఙ్మనస్సులకు అగోచరము ఐన పరమానందమును ప్రత్యక్షమొనర్చునట్టి శివయోగులకు వేరు విషయములందు ఏ ప్రీతి గలుగదని భావము ॥72॥ ఏ జ్ఞానము సచ్చిదానంద స్వరూపుడైన శివున్ని ప్రకాశింపఁజేయునో అట్టి జ్ఞానామృతము వలన తృప్తినందిన శివయోగికి వేరేయైన భోజ్య వస్తువులతో ఏమి ప్రయోజనము? ఏ విధమైన ప్రయోజనము లేదని భావము ॥73॥ పరమానంద స్వరూపమగు ముక్తే శ్రేష్ఠమగు తృప్తియనిపించును నిత్య తృప్తుడైన జీవన్ముక్తునకు అన్యమగు భోగ సాధనములతో బ్రయోజనమేమి? ॥74॥

శివైక్య జ్ఞాన సంపన్నుడు దేహభ్రాంతి విముక్తుడును ఐ యున్నఆ శివయోగికి బాహ్యపూజాకర్మముగాని, ఏదియు ఉండదు శివజ్ఞాన సంపన్నుడైన శివయోగి సమస్తమును శివస్వరూపముగానే భావిస్తూ తానే తానైప్రకాశించుచున్నప్పుడు అటువంటి శివయోగికి బాహ్యక్రియ నుండిగాని. లేదా అంతరంగికమైన ధ్యానమునుండిగాని, యేలాంటి ఫలముండబోదుయద్యపి శివయోగిపూజాది క్రియలను ఆచరించినవాడైనచో అట్టి ఆచరణ ఇతరుల ఉద్ధారమునకై అనుష్ఠింపబడుచున్నదని భావింపవలెనే గాని ఆతని ఉద్ధారమునకై అనుష్ఠింపబడుతున్నదని భావించకూడదు అందుచేతనే శ్రీ రేణుకా చార్య భగవత్పాదులు అట్టి శివయోగికి బాహ్యపూజగాని లేదా ఆంతరంగిక ధ్యానముగాని ఏదియుండనేరదు అని యాదేశించిరి ॥75॥ అత్యుత్తమమైన శివయోగమును బడసిన (పొందిన) శివయోగిచిత్తవృత్తి షట్కర్మాది రూపమగు హఠయోగమున గాని లేదా తపోవిశేషమనబడిన రాజయోగమునందుగాని, అజపగాయత్రి రూపమగు సోఽ హంమంతయోగా భ్యాసమునందుగాని. ఆ జపగాయత్రి రూపములైన యోగములకు ఆత్మస్వరూపమైన స్వస్వరూపమగు జ్ఞానమునందు గాని ఇమిడి యున్నది. ॥76॥

*ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ లింగస్థలీయ ప్రాణలింగి*
*స్థలే ఆత్మస్థలాది నవవిధ స్థల ప్రసంగోనామ*
*అష్టాదశ పరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది శ్రీ సిద్ధాంతశిఖామణిలో లింగస్థలీయ
ప్రాణ లింగిస్థలము నందు ఆత్మ స్థలాది నవ విధమైన
స్థల ప్రసంగము పదునెనిమిదవ పరిచ్ఛేదము పరిసమాప్తము.



# శ్రీసిద్ధాంత శిఖామణి

## ఏకోన వింశతి పరిచ్ఛేదః

## పందొమ్మిదవ పరిచ్ఛేదం

అగస్త్య ఉవాచ:-

స్థలభేదాః సమాఖ్యాతాః ప్రాణలింగిస్థలాశ్రయాః
కథయ స్థలభేదం మే శరణస్థల సంశ్రితం ॥ 1 ॥

శ్రీ రేణుక ఉవాచ:-

శరణస్థలమాశ్రిత్య స్థలద్వాదశకం మయా
ఉచ్యతే నామ సర్వేషాం స్థలానాం శ్రుణు తాపస ॥ 2 ॥

దీక్షాపాదోదకం పూర్వం శిక్షాపాదోదకం తతః
జ్ఞానపాదోదకం చాథ క్రియానిష్పత్తికం తతః ॥ 3 ॥

భావనిష్పత్తికం చాథ జ్ఞాననిష్పత్తికం తతః
పిండాకాశస్థలం చాథ బింద్వాకాశస్థలం తతః ॥ 4 ॥

మహాకాశస్థలం చాథ క్రియాయాశ్చ ప్రకాశనం
భావప్రకాశనం పశ్చాత్తతో జ్ఞానప్రకాశనం
స్వరూపం పృథగేతేషాం కథయామి యథాక్రమం ॥ 5 ॥

ఓయీ రేణుకాచార్యా! ప్రాణలింగి స్థలమునకు సంబంధించిన భేదము మీనుండి ఉపదేశింపబడినవి. ఇఁక శరణ సంబంధములైన భేదములను ఉపదేశింపుము అని అగస్త్య మహర్షి ప్రశ్నించగా దానిని (అందుకు)శ్రీ రేణుకాచార్య భగవత్పాదులు శరణ స్థలమునందు దీక్షా పాదోదకస్థలము,శిక్షాపాదోకస్థలము-జ్ఞానాపాదోదక స్థలము-క్రియా నిష్పత్తి స్థలము -భావ నిష్పత్తి స్థలము-జ్ఞాన నిష్పత్తి స్థలము- క్రియా ప్రకాశ స్థలము-బింద్వాకాశ స్థలము-జ్ఞానాప్రకాశన స్థలము-జ్ఞాన ప్రకాశన స్థలములని పంద్రెండు స్థలములున్నవనియు, వాటి లక్షజ్ఞాన ప్రకాశన స్థలములని పంద్రెండు స్థలములున్న వనియు, వాటి లక్షణములను అనుక్రమముగానుపదేశింతును వినుమని ఆజ్ఞాపించెను॥ 5॥.

## 37. దీక్షాపాదోదక స్థలం

దీక్షయోపగతాద్వైతం యద్ జ్ఞానం గురు శిష్యయోః
ఆనందస్యైక్యమే తేన దీక్షాపాదోదకం స్మృతం ॥ 6 ॥

పరమానంద ఏవోక్తః పాదశబ్దేన నిర్మలః
జ్ఞానం చోదకశబ్దేన పాదోదకమితిస్మృతం ॥ 7 ॥

అథవా పాదశబ్దేన గురురేవ నిగద్యతే
శిష్యశ్చోదకశబ్దేన తయోరైక్యం తు దీక్షయా ॥ 8 ॥

పరసంవిత్ర్పకాశాత్మా పరమానంద భావనాం
అధిగమ్య మహాయోగీ న భేదం క్వా పి పశ్యతి ॥ 9 ॥

దేశ కాలాద్యవచ్ఛేద విహీనం నిత్య నిర్మలం
ఆనందం ప్రాప్య బోధేన నాన్యత్ కాంక్షతి సంయమీ ॥ 10 ॥

జ్ఞానామృత మతిస్వచ్ఛం గురుకారుణ్యసంభవం
ఆస్వాద్య రమతే యోగీ సంసారామయవర్జితః ॥ 11 ॥

చిత్క్రియాదీక్షచేతలభించిన ఏ అద్వైత జ్ఞానముందో అట్టి జ్ఞానముతో బాట గురు శిష్యుల ఆనందాతిశయము యొక్క ఐక్యతయే దీక్షాపాదోదక స్థలమని చెప్పబడును. పాద శబ్దము వలన మహానందము అని చెప్పబడుతుంది. ఉదక శబ్దము వలన జ్ఞానమని చెప్పబడుతుంది. ఈ రెండింటి సంబంధమున్నదే పాదోదకమనబడుతుంది. అథవా పాదశబ్దమునుండి గురువని చెప్పబడును. ఉదక శబ్దము చేత శిష్యుడని చెప్పబడును. శిష్య మస్తక అఘ్రాణ (వాసన జూచుట) స్వరూపమైన దీక్షా విశేషముచేత గురు-శిష్యులైక్యతఅని చెప్పబడును. (6 - 7 -8) బ్రహ్మజ్ఞాన స్వరూపుడైన శివయోగిపరమానంద స్వరూపమును బొంది, భిన్నత (భేద మును)ఎక్కడనుఅగుపడడు (9) శివయోగి దేశకాలాదివిచ్ఛిత్తి శూన్యమైనది. నిత్యనిర్మలమైనది, ఐన బ్రహ్మానందమును బొంది రెండవ దానిదైనను అపేక్షింపడు. బ్రహ్మానందమునకు భిన్న మైన రెండవ వస్తువేదియు లేని కతమున శివయోగి అట్టి బ్రహ్మానందమునే అనుభవించునని భావము (10) భవరోగమునకు దూరమైన శివయోగి గురుకృపాప్రాప్తము అత్యంత నిర్మలమైన జ్ఞానామృతమును సేవించి స్వస్వరూపమునందే క్రీడించుచున్నాడు (11)

## 38. శిక్షాపాదోదక స్థలం

గురుశిష్యమయం జ్ఞానం శిక్షామననమీర్యతే
తయోః సమరసత్వం హి శిక్షాపాదోదకం స్మృతం ॥ 12 ॥

మథితాచ్ఛాస్త్ర జలధేర్యుక్తి మంథాన వైభవాత్
గురుణా లభ్యతే బోధసుధా సుమనసాం గణైః ॥ 13 ॥

జ్ఞానచంద్రసముద్భూతాం పరమానంద చంద్రికాం
పశ్యంతి పరమాకాశేముక్తి రాత్రౌ మహాధియః ॥ 14 ॥

దృష్టే తస్మిన్ పరానందే దేశ కాలాదివర్జితే
ద్రష్టవ్యం విద్యతే నాన్య చ్ఛ్రోతవ్యం జ్ఞేయమేవవా ॥ 15 ॥

ఆత్మానందేన తృప్తస్య కా స్పృహా విషయే సుఖే
గంగాజలేన తృప్తస్య కూపతోయే కుతో రతిః ॥ 16 ॥

యస్మిన్న ప్రాప్తకల్లోలే సుఖసింధౌ నిమజ్జతి
సామరస్యాన్మహాయోగీ తస్య సీమా కుతో భవేత్ ॥ 17 ॥

గురు ప్రసాదచంద్రేణ నిష్కలంకేన చారుణా
యన్మనః కుముదం నిత్యం బోధితం తస్య కో భ్రమః ॥ 18 ॥

గురు శిష్య స్వరూపైక్య జ్ఞానము శిక్షా జ్ఞానమని జెప్పబడును. అట్టి గురు శిష్యుల సామరస్యమే శిక్షా పాదోదకమనబడును శ్రీ గురువు చేతయుక్తి రూపమైన మంథన దండసామర్థ్యముతోచిలుక (మథించ)బడిన వీర శైవ శాస్త్రస్వరూపమగు సముద్రమునుండి లభించినట్టి జ్ఞానామృతమును నిర్మలమనస్సు గల శివయోగుల నవయోగుల సముదాయము మాత్రమే బొందును (13) మహాజ్ఞానులైన శివయోగులు పరరూపమగు రాత్రితో గూడిన హృదయాకాశమునందమును దర్శించుటకు, రెండవ దేశము చూడదగినది గాని, వినదగినది గాని, తెలుసుకొనదగినదిగాని, దేదియుండదు(15) నిత్య మైనది ఆనందము చే తృప్తి బొందిన వాడికి క్షణికమగు విషయ సుఖమునందు ఏ విధమైన కోరికగలుగును? ఏలాంటి కోరికగలుగదని భావము. గంగాజలముతో తృప్తి బొందిన వాడికి బావినీటి యందు ప్రీతి యెట్లు గలుగును? ఏ శివయోగి తరంగశూన్యమగు ఏ ఆనందసాగరమునందు సమరసభావము చేత గ్రుంకు (మునుగట) లిడునో ఆతనికి

ఆనందమనెడు హద్దు ఎక్కడిది? ఆతని ఆనందమునకుమేర(హద్దు-సీమితి) ఎక్కడిది? లేదని భావము (17) కళంకరహితమగు మనోహరమైన గురు ప్రసాదమను చంద్రుని చేత, ఎవని మనస్సెన్నడు కలువపూవు వలె ఎల్లప్పుడు వికసింపబడి యున్నదో, ఆతనికి సాంసారిక భ్రాంతి యెక్కడుంది? (18)

## 39. జ్ఞాన పాదోదక స్థలం

సద్వైక్యసంపదానందో యోऽసౌ జ్ఞానగురుర్మతః
తత్సామరస్యం శిష్యస్య జ్ఞానపాదోదకం విదుః ॥ 19 ॥

అవిద్యారాహునిర్ముక్తో జీవచంద్రః సునిర్మలః
ప్రకాశతే పరాకాశే పరానంద మహాద్యుతిః ॥ 20 ॥

అజ్ఞానమేఘ నిర్ముక్తః పూర్ణో జీవసుధాకరః
ఆనందజలధేర్వృద్ధి మనుపశ్యన్ విభావతే ॥ 21 ॥

అజ్ఞానచంద్రోదయే జాతే ధ్వస్త మోహత మోభరాః
పశ్యంతి పరమాం కాష్ఠాం యోగినః సుఖరూపిణీం ॥ 22 ॥

మాయారజన్యా విరయే బోధసూర్యే ప్రకాశితే
నిరస్త సర్వవ్యాపారశ్చిత్రం స్వపితి సంయమీ ॥ 23 ॥

అనాద్య విద్యా విచ్ఛిత్తి వేలాయాం పరయోగినః
ప్రకాశతే పరానందః ప్రపంచేన వినాకృతః ॥ 24 ॥

నిత్యానందే నిరాకారే నిర్మలే పర తేజసి
విలీన చేతసాం పుంసాం కుతో విశ్వవికల్పనా ॥ 25 ॥

కుతో బ్రహ్మ కుతో విష్ణుః కుతో రుద్రః కుతో రవిః
సాక్షాత్కృత పరానందజ్యోతిషః సామ్యకల్పనే ॥ 26 ॥

అపరోక్ష పరానందవిలాసస్య మహాత్మనః
బ్రహ్మవిష్ణ్వాదయో దేవా విశేషాః సుఖబిందవః ॥ 27 ॥

యన్మాత్రసహితు లోకే వాంఛంతి విషయం నరాః
తమప్రమేయమానందం పరమం కోన వాంఛతి ॥ 28 ॥

ఎవడు సద్రూప పరబ్రహ్మ సామరస్య సంపత్తి నుండి ఉత్పన్నమైన ఆనందముతో గూడిన వాడో, ఆతడే జ్ఞాన గురువని చెప్పబడును. అట్టి జ్ఞాన గురువుతో శిష్యుని సామరస్యమే జ్ఞానపాదోదకమని జ్ఞానులు దెలసికొందురు (గ్రహించెదరు) (19) అట్టి జ్ఞానమనే రాహువునుండి ముక్తుడైన వాడు అత్యంత నిర్మలవైన వాడు పరమానందరూపమైన గొప్ప ప్రకాశముగలవాడైన జీవుడనెడు చంద్రుడు సర్వోత్కృష్టమగు హృదయా కాశము నందు ప్రకాశించు చుండును. ॥20॥ అజ్ఞానమనెడి మేఘావరణముచేత ముక్తుడైనట్టి జీవుడనెడు పూర్ణిమ చంద్రుడు, ఆనందమనెడి సముద్రపు వృద్ధిని నిరీక్షించువాడై ప్రాకాశించుచున్నాడు జ్ఞాన రూపమైన చంద్రోదయ మవడముతోనే అజ్ఞానాంధకారమునుండి దూరముననున్న శివయోగులు పరమానంద స్వరూపమగుస్వస్వరూపస్థితిని దర్శింతురు (22) మాయా రూపమగు రాత్రియొక్క అంత్య సమయమునందు జ్ఞాన రూపకమైన సూర్యుడు బ్రకాశింపగా శివయోగి సమస్త వ్యాపార శూన్యుడైనిద్రించును. ఇట్టి చిత్ర విచిత్రమైన సన్ని వేశమే యననొప్పును. ఏలనన సమస్త ప్రాణులు రాత్రియందు నిద్రించి సూర్యోదయమవగానే లేచి తమతమ వ్యవహారము లలో నిరతులగుదురు. ఇది సర్వానుభవసిద్ధమైనది. ఐతే శివయోగి ఆచరణ దీనికి ప్రతికూల మైనది. ఆతడు జ్ఞాన సూర్యుడుదయించడంతోనే సమస్త వ్యవహార ముల నుండి దూరమై నిద్రించును. ఇదియే వై చిత్రమునకు గారణమై యున్నది. ఇదే ఆశయమును గీతలోను చెప్పఁబడినది.

యానిశా సర్వభూతానాం- తస్యాంజాగంస్తంయమి।
యస్యాంజాగర్తి)భూతాని -సానిశాపశ్యతోమునేః॥

అనే ఈ శ్లోకము చేత సమర్థించుచున్నది (23) ప్రపంచముతోనుండి వేరుగానున్న, నిరు పాధిక పరమానందము శివయోగికి యనాదియగు అజ్ఞానము యొక్క అంతిమ సమయమున ప్రకాశించును (24) నిత్యానందరూపమైనది. నిజస్వరూపమైనది. పరిశుద్ధమైనది. యోగులకు స్థూల ప్రపంచము యొక్క కల్పన యెక్కడిది? (25) బ్రహ్మానంద జ్యోతిని సాక్షాత్కరించుకొనిన శివయోగికి సామ్య కల్పనలో చతుర్ముఖ బ్రహ్మ ఎక్కడి వాడు? విష్ణువు ఎక్కడివాడు? రుద్రుడు ఎక్కడివాడు? సూర్యుడు ఎక్కడివాడు? విష్ణువు ఎక్కడివాడు? వీరెవరును శివయోగికి సమానమైన వారుకారని భావము (26) ప్రత్యక్షముగా బ్రహ్మానందమునందు క్రీడించుచున్న శివయోగికి, బ్రహ్మ విష్ణు మున్నగు దేవతలు అత్యల్ప మగు సుఖవిశేషములై యున్నవి. శివయోగి దృష్టిలో బ్రహ్మ-విష్ణ్వాది దేవతలు అత్యల్ప

సుఖప్రదాయకులై అగుపడుదురని భావము (27) లోకమున మానవులు అత్యల్ప పరిమాణముగల విషయమును అభిలషింతురుగదా? అయితె పరమాతీతమగు అట్టి పరమానందమును ఎవడు తానె గోరుకొనడు? అందరు ఆ పరమానందమును అభిలషింతురని భావము (28)

## 40. క్రియా నిష్పత్తి స్థలం

జ్ఞానినో యాని కర్మాణి తాని నో జన్మ హేతవః
అగ్ని దగ్ధాని బీజాని యథా నాంకురి కారణం ॥ 29 ॥

కర్మణా కింకృతేనాపి జ్ఞానినో నిరహంకృతేః
విక్రియా ప్రతిబింబస్థా కిం కరోతి హిమద్యుతేః ॥ 30 ॥

జ్ఞానీ కర్మ నిరూఢోకపి లిప్యతే న క్రియాఫలైః
ఘృతాదినా యథా జిహ్వా భోక్త్రీ చాపి న లిప్యతే ॥ 31 ॥

నిరస్తోపాధి సంబంధే జీవే యా యా క్రియాస్థితిః
సా సా ప్రతీతిమాత్రేణ నిష్ఫలా తత్ర లీయతే ॥ 32 ॥

గచ్ఛంస్తిష్ఠన్ స్వపన్వాపి న నిష్కర్మాస్తి కశ్చన
స్వభావో దేహినాం కర్మ జ్ఞానినాం తత్తు నిష్ఫలం ॥ 33 ॥

పరిపూర్ణ మహానంద భావినః శుద్ధచేతనః
న భవేత్ కర్మ కార్పణ్యం నానాభోగ ఫలప్రదం ॥ 34 ॥

నిప్పునుండి గాల్చబడిన విత్తనము విత్తులు (బీజములు)అంకురించుటకు ఎలా కారణము (ప్రయోజనకారి)గావో అట్లె శివజ్ఞాని యొక్క ఏ కర్మములున్నవో ఆ కర్మలు అతని పునర్జన్మకు గారణముగాదు (29) మూలాహంకార శూన్యుడైన శివజ్ఞాని కర్మము నాచరించినను ఏమి ప్రయోజనము ? చంద్రుని ప్రతిబింబములోనున్న కళంకము చంద్రునేమి జేయగలదు? జలమునందున్న చంద్రుని ప్రతిబింబమునకు జల సంబంధం చేతనే దేని కళంకము (వికారము)ఏర్పడినచో అట్టి కళంకము చంద్రునికియే విధముగ సంబంధముండదో అట్లే శివజ్ఞాని కర్మము నాచరించినను ఆకర్మ ఫలము అతనికి సంబంధముండదు అని భావము (30) నాలుక నెయ్యి మొదలగు షడ్రసములను (పదార్థము) ఆస్వాదించినను వాటి నుండి నాలుక ఎట్లు ప్రభావితంగాదో (31) ఉపాధి

సంబంధము చేత దూరమైన జీవన్ముక్తునిలో ఏ ఏక్రియ లుండునో ఆయా క్రియలు "దగ్గరగా న్యాయానుసారముగ చూచు టకు మాత్రమే ఉండి ఫలరహితమై అతనిలో లీనమై యుండును (32) మనిషి పోవుట కూర్చుండుట అథవా పరుండుట మున్నగు కర్మలందు ఏదేని యొక కర్మచేత గూడుకొన్నవాడై యున్నాడు. ఎవడును కర్మలేనిదే ఉండనేరడు. కర్మమానవులకు సహజముగా నుండును. ఐతే జ్ఞానులకు మాత్రము ఆ కర్మ నిష్ఫలమైనది (33) పరిపూర్ణమగు బ్రహ్మానందమును అనుభవించువాడు, నిర్మాలాంతః కరణుడైన శివయోగికి పుణ్య పాపరూపమైన నానా విధంబైన భోగ ఫలమును ఇచ్చే కర్మ బాధ గలుగనేరదు (34)

## 41. భావ నిష్పత్తి స్థలం

భావేన నాస్తి సంబంధః కేవల జ్ఞానయోగినః
తథాపి భావం కుర్వీత శివే సంసారమోచకే 35

పరిపూర్ణ ప్రబోధోపి భావం శంభౌ న వర్జయేత్
భావో హి నిహితస్తస్మిన్ భవసాగరతారకః 36

నివర్త్య జన్మజం దుఃఖం భావః శైవో నివర్తతే
యథా కష్టాదికం దగ్ధ్వా స్వయం శామ్యతి పావకః 37

ప్రకాశితే శివానందే తద్భావైః కిం ప్రయోజనం
సిద్ధే సాధ్యేఽచిరేణాపి సాధనైః కిం ప్రయోజనం 38

ఏకీకృతే శివే భావే జ్ఞానేన సహ సంయమీ
విస్మృతాత్మ సమావేశః శివభావే విభానతే 39

న భావేన వినా జ్ఞానం న భావో జ్ఞానమంతరా
మోక్షాయ కారణం ప్రోక్తంతస్మాదుభయమా శ్రయేత్ 40

శివజ్ఞాని యగు శివయోగికి భావముతో సంబంధము లేదు. ఐనను అతడు సంసారమును విసర్జించిన వాడై శివుని యందే స్థిర భావమును ఉంచవలెను (35) శివయోగి పరిపూర్ణ జ్ఞానియైనప్పటికిన్ని శివుని యందు భావముంచవలెను అతనిలో స్థిరపరచిన భావము సంసార సాగరతారకమైయున్నది (36) అగ్నికట్టెలను మున్నగు వాటిని గాల్చినను పిదప తానే ఎట్లు శాంతించునో, అట్లే శివ సంబంధమైన భావము భవరోగ

దుఃఖమును దొలగించి తాను నివృత్తి నొందును (32) శివానందము ప్రకాశింపగానే అట్టి శివభావములతోనేమి బ్రయోజనము? శ్రీఘ్రముగా సాధ్యము సఫలము కాగా ఇక సాధనములతో బ్రయోజనమేమి? (38) భావము జ్ఞానముతోనే శివునిలో సమరసం కాగానే ఆత్మ సమావేశమును మరచిన శివయోగి శివోహం భావనలో ప్రకాశించును. (39) భావమును వీడి జ్ఞానముండనేరదు. అట్టే జ్ఞానమును వీడి భావముండనేరదు. ఈ రెండును మోక్షమునకు గారణమై యుంటవలన శివయోగి ఈ రెండింటిని ఆశ్రయించవలెను (40)

## 42. జ్ఞాన నిష్పత్తి స్థలం

పరిపూర్ణే మహానందే పరమాకాశ లక్షణే
శివే విలీనచిత్తస్య కుతో జ్ఞేయాంతరే కథా ॥ 41 ॥

జ్ఞాతా చాహం జ్ఞేయమిదమితి వ్యవహృతిః కుతః
అభేదబ్రహ్మ సారస్యే నిరస్తాఽలవస్తుని ॥ 42 ॥

పరిపూర్ణుడు మహానంద స్వరూపుడు, పరమాకాశస్వరూపుడు ఐన శివునిలో చిత్తమును లీనమెనర్చిన శివయోగికి, ఇట్టిదాన్ని తెలిసి కొనవలెననుటలో బుద్ధి యెక్కడిది? ఆతడు సర్వజ్ఞుడనిపించుకొనిన శివుని వలె సాక్షాత్తుగా సర్వజ్ఞమూర్తియై సర్వమును తెల్సికొన్నవాడగుటవలన, ఆతనికి దెల్సికొనవలసినదేదియులేదు. అద్వితీయమైన పరబ్రహ్మమునందు సామరస్యమున్నవాడు, సమస్త ప్రాపంచికభేదమును దూరమొనర్చిన వాడును. ఐన శివయోగియందు నేను జ్ఞాతృవును. ఇదిజ్ఞేయము. అను భేదవ్యవహారము ఎక్కడిది? పరశివబ్రహ్మమునందు సమరస భావమును బొందిన శివయోగిలో జ్ఞాతృజ్ఞేయరూపమగు భేదజ్ఞానవ్యవహారము సంపూర్ణముగా నష్టమగునని భావము (42)

## 43. పిండాకాశ స్థలం

యథా పిండస్థ ఆకాశస్తథాఽఽత్మా పూర్ణ ఉచ్యతే
ఏతదర్థ వివేకోయః పిండాకాశస్థలం విదుః ॥ 43 ॥

ఘటోపాధిర్యథాఽఽ కాశః పరిపూర్ణః స్వరూపతః
తథా పిండస్థితోహ్యాత్మా పరిపూర్ణః ప్రకాశతే ॥ 44 ॥

అంతఃస్థితం పరాకాశం శివమ ద్వైతలక్షణం
భాయేద్యఃః సుమనసా పిండాకాశఃస ఉచ్యతే ॥ 45 ॥

శివాగారమిదం ప్రోక్తం శరీరం బోధదీపితం
షట్త్రింశత్తత్త్వఘటితం సుమనః పద్మపీఠకం ॥ 46 ॥

పరాకాశ స్వరూపోహి ప్రకాశః పరమేశ్వరః
హృదాకాశగుహాలీనో దృశ్యతేఽంతః శరీరిణాం ॥ 47 ॥

ఏతచ్ఛివపురం ప్రోక్తం సప్తధతు సమావృతం
అత్ర హృత్పంకజం వేశ్మ సూక్ష్మాంబరమనోహరం ॥ 48 ॥

తత్ర సన్నిహితః సాక్షాత్ సచ్చిదానందలక్షణః
నిత్యసిద్ధః ప్రకాశాత్మా జలస్థాకాశవచ్ఛివః ॥ 49 ॥

అంతరాకాశమధ్యస్థమశేషోపాధివర్జితం
ఘటాకాశమివాచ్ఛిన్నం భావయేచ్చిన్మయం శివం ॥ 50 ॥

శరీరమందున్న ఆకాశము శరీరోపాధివశముచేత అపూర్ణముగా (అసంపూర్తిగా) నున్నట్లు అగుపించినను, ఉపాధి రూపము సమాప్తియైన పిదప తన యొక్క నిజస్వరూపమగు పూర్ణత్వమును బొందినట్లుగా, శరీరమునందున్న ఆత్మగూడ పరిపూర్ణుడై యుండి పూర్ణుడని చెప్పుకొనును. ఈ అర్థము యొక్క జ్ఞానమేదైతే ఉన్నదో దానిని పిండాకాశ స్థలమని గుర్తింతురు (44) ఘటోపాధివిశిష్టమగు ఆకాశము స్వస్వరూపము చేత ఎట్లు సంపూర్ణమై యున్నదో అట్లే శరీరమునందున్నట్టి ఆత్మతనయొక్క సచ్చిదానంద స్వరూపము చేత పరిపూర్ణమై ప్రకాశించుచుండును. ॥హృదయాకాశస్థుడు, మహాచిదానంద స్వరూపుడు,అద్వితీయుడు ఐన శివుని పరిశుద్ధమగు మనస్సుచేత ఎవడు భావించునో అతడు పిండాకాశ స్వరూపుడని చెప్పబడును (46) శివాది భూమ్యాంతమగు త్తత్వము రూప స్తంభములతో నిర్మితమైన హృత్కమల రూప పీఠముతో గూడి యున్నజ్ఞానరూపముచేత ప్రకాశించుచున్నదైన శరీరము శివ మందిరమని చెప్పబడును (47) చిదాకాశస్వరూపుడు, ప్రకాశ స్వరూపుడు ఐన పరమేశ్వరుడు సమస్త ప్రాణుల హృదయాకాశ రూపమైన గుహలో అణిగి యున్నవాడై అంతర్గతమై యున్నాడు(48) రక్తము-మజ్జా-మాంసా దులు, సప్తధాతువులతో వ్యాపించిన ఈ శరీరము శివరాజధానియని చెప్పబడును, శరీరరూపమగు ఈ శివరాజధానిలో సూక్ష్మాకాశము చేత విరాజిల్లు నట్టి హృదయకమలము అంతఃపురముగా నున్నది. అట్టి అంతఃపురములో సచ్చిదానంద స్వరూపుడు, నిత్య పరిపూర్ణుడు, ప్రకాశస్వరూపుడు, ఐన శివుడు నిర్మలమగు జలమున అగుపడునట్టి ఆకాశమువలె

ప్రత్యక్షముగా గోచరించుచున్నాడు. ఇట్లు ఉపాధికి దూరమైన ఘటాకాశము స్వభావతః అపరిచ్ఛిన్నమై యున్న రీతిగా హృదయాకాశమధ్యలో నున్న వాడు సమస్తోపాధుల చేత దూరమైనవాడు, చిత్స్వరూపుడు ఐన శివున్ని అపరిచ్ఛిన్నమగువాడిగా భావించవలెను (51)

## 44. బింద్వాకాశస్థలం

యథాకాశో విభుర్జ్ఞేయః సర్వప్రాణ్యుపరిస్థితః
తథాత్మేత్యుపమానార్థం బింద్వాకాశస్థలం విదుః ॥ 51 ॥

యథైకోవాయురాఖ్యాతః సర్వప్రాణిగతో విభుః
తథాऽऽ త్మా వ్యాపకః సాక్షాత్ సర్వప్రాణిగతః స్వయం ॥ 52 ॥

యథావహ్నిరమే యాత్మా సర్వత్రైకోక పిభావతే
తథాశంభుఃసమస్తాత్మా పరిచ్ఛేద వివర్జితః ॥ 53 ॥

సర్వేషాందేహినామంత శ్చిత్తతోऽయం ప్రకాశతే
తస్మిన్ ప్రతిఫలత్యాత్మా శివో దర్పణవద్విభుః ॥ 54 ॥

ఏకః పరిమితః సంవిత్ప్రకాశాత్మా పరాత్పరః
సర్వప్రాణిగతో భాతి తథాపి విభురుచ్యతే 55

ఏక ఏవ యథా సూర్యస్తేజసా భాతి సర్వగః
తథాత్మా శక్తి భేదేన శివః సర్వగతో భవేత్ 56

ఆకాశము సర్వ ప్రాణులయందున్నదై సర్వత్ర వ్యాపించి తెల్సికొనుటకై యెట్లు యోగ్యముగా నున్నదో, అట్లే ఆత్మ సర్వ ప్రాణులలో ఉండి సర్వత్ర వ్యాపించి తెలిసికొనుటకు యోగ్య ముగా నున్నది ఈ ఉపమానమునకై జ్ఞానులు దీనినే బింద్వాకాశస్థలమని గుర్తించిరి(52) పంచభూతములలో మరొకటియైన వాయువు, సమస్త ప్రాణులయందుండి ఎట్లు వ్యాప్తకమైనదని చెప్పబడుచున్నదో. అట్లే ఆత్మగూడ తాను ప్రత్యక్షముగ సమస్త ప్రాణులలో ఉండి వ్యాపకమైనదో చెప్పబడుచున్నది (53) అపరిమిత స్వరూపమైన అగ్ని ఒకటై యున్నను వైద్యుతాగి-దావాగ్ని-బడబాగ్ని(కార్చిచ్చు) రూపముచేత విశ్వ వ్యాపకమై ఏ విధముగ ప్రకాశించుచున్నదో, అట్లే సమస్త చైతన్య స్వరూపమగు పరమశివుడేకాకియై యున్నను పరిచ్ఛేదరహితుడై దేవ-దానవ-మానవ- పశు పక్షిరూపమైన ఈ చరా చర ప్రపంచమున వ్యక్తావ్యక్త రూపముతో వ్యాపించి ప్రకాశించుచున్నాడు.

సమస్త ప్రాణుల యొక్క అంతరంగమున నిర్మలమగు జలమువలెనున్నచిత్తము ప్రకాశించుచున్నది. దర్పణము (అద్దం)లో ముఖము మొదలగునవి ప్రతిబింబించునట్లుగా నిర్మలమగునాచిత్తమునందు వ్యాపకుడు, ఆత్మ స్వరూపుడైన పరమశివుడు ప్రతిబింబమై యున్నాడు. (55) పరాత్పరుడు చిత్ప్రకాశస్వరూపుడు ఐన శివుడొక్కడే సమస్త ప్రాణుల హృదంతరాళముననున్న కమలమును ఆశ్రయించి పరిమితుడై ప్రణశించుచున్నాడు. ఐననుశివుడు సర్వత్ర వ్యాపించి యుంటవలన ప్రభువని పేర్కొనబడుచున్నాడు (35) ఒకే ఒక్కడైన సూర్యుడు తన తేజస్సుతో సమస్తమున వ్యాపించియున్నవాడైనట్లు ప్రకాశించుచున్నాడో అట్లే ఆత్మ స్వరూపుడైన శివుడు ఇచ్ఛాశక్తి- జ్ఞానశక్తి -క్రియాశక్తి- మొదలగుభేదములతో విశ్వ వ్యాపకుడై యున్నాడు (50)

## 45. మహాకాశస్థలం

పిండాండస్థం యథాకాశం నభిన్నం తద్వదాత్మనః
అభిన్నః పరమాత్మేతి మహాకాశస్థలం విదుః ॥ 57 ॥

యథాకన భిన్న మాకాశం ఘటేషు చ మఠేషు చ
తథాకండేషు చ పిండేషు స్థితో హ్యాత్మా న భిద్య తే ॥ 58 ॥

అనిర్దేశ్యమనౌపమ్య మవాఙ్మానస గోచరం
సర్వతో ముఖసంపన్నం సత్తానంద చిదాత్మకం ॥ 59 ॥

కలాతీతం కలాతీతం క్రమయోగాదివర్జితం
స్వానుభూతిప్రమాణస్థం జ్యోతిషా ముదయస్థలం ॥ 60 ॥

శివాఖ్యం పరమం బ్రహ్మ పరమాకాశలక్షణం
లింగమిత్యుచ్యతే సద్భిర్యద్వినా న జగత్థితిః ॥ 61 ॥

పరమాకాశమవ్యక్తం ప్రబోధానందలక్షణం
లింగం జ్యోతిర్మయం ప్రాహుర్లీయంతేయత్రయోగినః ॥ 62 ॥

సంవిదేవ పరాకాష్ఠా పరమానందరూపిణీ
తామాహుః పరమాకాశం మునయో ముక్తసంశయాః ॥ 63 ॥

తరంగాదిర్యథా సింధోః స్వరూపాన్నా తిరిచ్యతే
తథా శివాత్ పరాకాశాద్విశ్వమేతన్న భిద్యతే ॥ 64 ॥

యథా పుష్పపలాశాదిర్వృక్షరూపాన్న భిద్యతే
తథా శివాత్పరాకాశాజ్జగతౌ నాస్తి భిన్నతా || 65 ||

యథా జ్యోతీంషి భాసంతే భూతాకాశే పృథక్ పృథక్
తథా భాంతి పరాకాశే బ్రహ్మాండాని విశేషతః || 66 ||

నిరస్తోపాధిసంబంధం నిర్మలం సంవిదాత్మకం
పరాకాశం జగచ్చిత్ర విలాసాలంబ భిత్తికం || 67 ||

బ్రహ్మాండము మరియు పిండాండములందున్న ఆకాశము ఎట్లు వేరుగా నుండదో, అట్లే శివయోగి యొక్క ఆత్మకంటెను పరమాత్ముడు వేరుగా నుండడు. శివయోగి ఆత్మమరియు పరమాత్మ వీరిద్దరు (ఈ రెండు)ను ఒకటే అయిఉన్నారు. అను అభేదమునే జ్ఞానులు మహాకాశమని చెప్పుదురు (58) ఘటము మరియు మఠమునందున్న ఆకాశము ఎట్లు అవినాభావసంబంధము గలిగి యుండునో, అట్లే బ్రహ్మాండముమరియు పిండాండములందుండిన ఆత్మ వేరే యుండనేరదు (59) చెప్పరానిదిఅనుపమానమైనది వాఙ్మానసములకగోచరమైనది.సర్వోతోముఖము గలదియు, సచ్చిదానంద స్వరూపమైనది కాలాతీతమైనది. అష్టత్రింశత్కలాతీతము, ఉత్పత్త్యాది క్రమయోగ శూన్యమైనది. స్వానుభవ ప్రమాణగమ్యము సూర్యచంద్రాది సమస్త తేజో మయ వస్తువుల ఉత్పత్తికి స్థాన భూతమైనది. పరమాకాశ స్వరూపము ఐన శివాభిధానమగు పరబ్రహ్మము లింగమని చెప్పబడుచున్నది. ఇట్టి లింగమును వీడి చరాచర ప్రపంచము ఉండదు. ఈసమస్త చరాచర ప్రపంచము శివుని యొర్క ఆశ్రయమునందుండి శివ స్వరూపమైయున్నదనియు భావము (60-61-62) యోగిపుంగ్లవులు ఏ పరమాకాశమునందులయలీనమగుచుందురో, అవ్యక్తమగు నా పరమాకాశమును జ్ఞానులు చిదానంద స్వరూపము, జ్యోతిర్మయము ఐన లింగముగా జెప్పుకొందురు.(63) పరమానంద స్వరూపమగు జ్ఞానమే సర్వోత్కృష్టమై యున్నది. సంశయమునుండి దూరమైన మునులు అట్టి జ్ఞానమునే పరమాకాశమని చెప్పుదురు. (64) సముద్రమునుండి బుట్టిన అలలు సముద్ర -స్వరూపముతో ఎట్లు భిన్నముగా నుండవో అట్లే పరమానంద స్వరూపమగు శివుని నుండి యుద్భవించిన ఈ జగత్తు శివ స్వరూపమునుండి భిన్నముగ నుండదు. (65) పత్ర-పుష్ప-శాఖాదులు-వృక్షస్వరూపముతో ఎట్లు వేరుగానుండవో. అట్లే చరాచరాత్మకమైన ఈ జగత్తు పరమానందరూపమైన శివ స్వరూపము చేత వేరుగా నుండదు. చరాచరాత్మకమగు ఈ జగత్తు శివునకు అభిన్నముగా నుండి శివునివలెసత్యముగా నిత్యమైనదని భావము (66) నక్షత్రముల ఆకాశమునందు

ఎట్లు వేర్వేరుగా ప్రకాశించుచుండునో అట్లే అనంత బ్రహ్మాండములు పరాకాశ స్వరూపుడైన శివుని యందు వేర్వేరుగా ప్రకాశించుచున్నవి (67) పరాకాశము ఉపాధి సంబంధము వలన దూరమైనది. నిర్మలమైనది, జ్ఞానస్వరూపమైనది, జగద్రూపమగు విచిత్ర విలాసమునకు ఆధార భూతమగు భిత్తి (గోడ) స్వరూపమైనది.

## 46. క్రియా ప్రకాశ స్థలం

శివస్య పరిపూర్ణస్య పరాకాశ స్వరూపిణః
ఆత్మత్వేనానుసంధానాత్ క్రియాద్యోతనవాన్ యమి ॥ 68 ॥

నిష్కలంకచిదానందగగ నోపమరూపిణః
శివస్య పరిపూర్ణస్య వృత్తిశ్చైతన్యరూపిణః ॥ 69 ॥

నిష్కలంకే నిరాకారే నిత్యే పరమతేజసి
విలీనచిత్తవృత్తస్య తథా శక్తిః క్రియోచ్యతే ॥ 70 ॥

సర్వజ్ఞః సర్వకర్తా చ సర్వగః పరమేశ్వరః
తదైక్య చింతయా యోగీ తాదృశాత్మా ప్రకాశతే ॥ 71 ॥

సర్వేంద్రియాణాం వ్యాపారే విద్యమానే పి సంయమీ
ప్రత్యఙ్ముఖేన మనసా శివం ప్రశ్యన్ ప్రమోదతే ॥ 72 ॥

కూటస్థమచలం ప్రాజ్ఞం గుణాతీతం గుణోత్తరం
శివతత్త్వం స్వరూపేణ పశ్యన్ యోగీ ప్రమోదతే ॥ 73 ॥

మహాకాశ స్వరూపుడైన శివయోగి పరిపూర్ణుడు పరాకాశస్వరూపుడును ఐన శివుడిని ఆత్మ స్వరూపముచేత (ఆతడేనేనను భావనచేత) అను సంధానముగావించుట వలన క్రియా ప్రకాశకుడనబడును. (69) నిష్కలంకుడుచిదానంద స్వరూపుడు పరమాకాశమునకు సమానమగు స్వరూపముగలవాడు. పరిపూర్ణుడు ఐన శివుని వృత్తి జ్ఞానస్వరూపమై యున్నది. క్రియా విశిష్టమైన జ్ఞాన స్వరూపమని భావము (70) నిష్కలంకము, నిరాకారము, నిత్యమైన ఆ పరశివ తేజస్సులో చిత్తవృత్తి విలీనమొనర్చిన శివయోగియొక్క శక్తి యైనను, శివుని శక్తి మాదిరి గానే జ్ఞానవిశిష్ట క్రియా స్వరూపమై యున్నదనియు చెప్పబడును. (71)

వృత్తో ధీతే ప్రతీత్యేతి - ఛందశ్చారిత్రవృత్తిషు (ఇతిమేదినీ)

పరమేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వ సృష్టికర్త, సర్వవ్యాపకుడు ఐ యున్నాడు. శివయోగి గూడాఅంతటి శివుని సామరస్య ధ్యానముచేత ఆ విధమైన శివ స్వరూపుడై ప్రకాశించును (72) శివయోగియందు శ్రోత్రాది సర్వేంద్రియముల వ్యాపారమును గలిగియున్నను ఆతడు అంతర్ముఖమగు మనస్సుచేత శివుడిని సాక్షాత్కరించువాడుగనుక సంతోషించును (73) కూటస్థము కూటవత్‌తిష్ఠతీతి కూటస్థం-అనగా నువర్ణకారుని బునాదిసిలవలె వికారశూన్యమైనది. అథవానిర్వికారము-నిశ్చలము-సర్వజ్ఞత్వము-హేయగుణాతీతము కల్యాణగుణోత్కృష్టము ఐన శివతత్త్వమును శివయోగి స్వస్వరూపముతో జూచువాడై ఆనందించును(73)

## 47. భావ ప్రకాశ స్థలం

తరంగాద్యాయథా సింధోర్న భిద్యంతే తథాత్మనః
భావా బుద్ధ్యాదయః సర్వే యత్త ద్భావప్రకాశనం ॥ 74 ॥

శివ ఏవ జగత్సర్వం శివ ఏవాహమిత్యపి
భావయన్ పరమో యోగీ భవదోషైర్న బాధ్యతే ॥ 75 ॥

శివభావే స్థిరే జాతే నిర్లేపస్య మహాత్మనః
యేయేభావాః సముత్పన్నా స్తే తేశివమయాః స్మృతాః ॥ 76 ॥

అద్వితీయశివాకారభావనాధ్వస్తకర్మణా
న కించిద్భావ్యతే సాక్షాచ్ఛి వాదన్యన్మహాత్మనా ॥ 77 ॥

గలితా జ్ఞాన బంధస్య కేవలాత్మానుభావినః
యత్ర యత్రేంద్రియాసక్తిస్తత్ర తత్ర శివాత్మతా ॥ 78 ॥

రాగద్వేషాదయో భావాః సంసారక్లేశ కారణం
తేషేముపరమో యంత్ర తత్ర భావః శివాత్మకః ॥ 79 ॥

యథా సూర్యసమాక్రాంతా న శక్నోతి తమః సదా
తథా ప్రకాశమాత్మానం నా విద్యా క్రమతిస్వయం ॥ 80 ॥

తరంగాదులు సముద్రము వదలి ఎట్లు వేరుగానుండజాలవో అట్లే బుద్ధి మున్నగు సమస్త భావములు ఆత్మనువీడి భిన్నముగా నుండవు అనునది వ్యవహారములో ఎట్లుండునో అదేభావ ప్రకాశమనబడుతుంది(75) చరాచరాత్మకమైన ఈ సమస్త ప్రపంచము

శివస్వరూపమైయున్నది. నేను గూడ శివ స్వరూపుడినే అని భావించు శివయోగి సాంసారిక దోషముల చేత బాధింపబడ్డు. (76) విషయనిర్లిప్తుడైన శివయోగికి శివభావము దృఢమగుటవలన ఏయే భావములు ఉత్పన్నమగుచున్నవో ఆయా భావములు శివ స్వరూపములైనవే అని చెప్పబడును. (77) అద్వితీయముగ శివభావముతో కర్మములను నశింపజేసినవాడు మహాత్ముడు ఐన శివయోగి శివునకు వేరైన (భిన్నమగు) దానిని దేనిని భావించడు. అతనికి సర్వమును శివ స్వరూపముగానే అగుపడును. (78) అజ్ఞానమునకు దూరముగానుండి కేవలము ఆత్మానుభావియైన శివయోగికి యేయే విషయమున ఇంద్రియ ప్రవృత్తి గలుగునో ఆయాయా విషయమున శివ స్వరూపమే అగుపడుచుండును(79) రాగద్వేషాది భావములు సంసార దుఃఖమునకు మూలకారణీభూతమైయున్నది. ఏ శివయోగి యందు రాగ ద్వేషాదులకు విశ్రాంతి గలుగుచుండునో, ఆ శివయోగి యందుండబడె భావము శివ స్వరూపముగానే యుండును, (80)అంధకారము సూర్యునాక్రమించుటలో ఎల్లప్పుడు ఎట్లు సమర్థముగా నుండదో అట్లే అవిద్య (అజ్ఞానము) స్వయం ప్రకాశముగలవాడు ఆత్మస్వరూపుడైన శివుని శివయోగి నావరించుటలో సమర్థముగా నేరదు (81)

## 48. జ్ఞాన ప్రకాశస్థలం

ముక్తస్య జ్ఞానసంబంధో జ్ఞేయాభావః స్వభావతః
ఉపాధి సహితం జ్ఞానం న భేదమతివర్తతే ॥ 81 ॥

జ్ఞానస్య విషయే తత్త్వే శివాఖ్యే చిత్సుఖాత్మని
అత్మైకత్వాను సంధానం జ్ఞానమిత్యుచ్యతే బుధైః ॥ 82 ॥

అపరిచ్ఛిన్న మానందం సత్తాకారం జగన్మయం
బ్రహ్మేతి లక్షణజ్ఞా బ్రహ్మజ్ఞానమిహోచ్యతే ॥ 83 ॥

బ్రహ్మజ్ఞానే సముత్పన్నే విశ్వశ్వోపాధివివర్జితే
సర్వం సంవిన్మయం భాతి తదన్యన్నై వదృశ్యతే ॥ 84 ॥

తస్మాదద్వైత విజ్ఞానమపవర్గస్య కారణం
భావయన్ సతతం యోగీ సంసారేణ నలిప్యతే ॥ 85 ॥

నిత్యే నిర్మలసత్త్వ యోగిని పరే నిర్వాసనే నిష్కలే
సర్వాతీతపదే చరాచరమయే సత్తాత్మని జ్యోతిషి

సంవిద్వ్యోమ్ని శివే విలీన హృదయస్తద్భేద వైముఖ్యతః
సాక్షాత్సర్వగతో విభాతి విగలద్విశ్వః స్వయంసంయమీ ॥ 86 ॥

ముక్తుడైన శివయోగి జ్ఞాన సంబంధము స్వాభావిక (సహజ)ముగాజ్ఞేయ శూన్యముగా నున్నది. మహాజ్ఞానియగు శివయోగి యొక్క జ్ఞానము ఉపాధిరక్షితమై యుంటవలన జ్ఞేయాదిత్రిపుటి భేద శూన్యమైయున్నదని భావము. ఉపాధివిశిష్టమగు జ్ఞానము ఆత్రిపుటి ఛేదమును, ఉల్లంఘింపదు (82) జ్ఞానమునకు విషయమైనది. చిదానంద స్వరూపమైనది

శివతత్వమునందు ఆత్మైక్యాను సంధానమేజ్ఞానమనబడుననియు జ్ఞానులు చెప్పుచుందురు (83) బ్రహ్మము పరిపూర్ణమైనది, ఆనంద స్వరూపమైనది. సత్తా (శక్తి) స్వరూపమైనది. జగత్స్వరూపమైనది, అనులక్షణజ్ఞానమే బ్రహ్మజ్ఞానమని చెప్పఁబడుచున్నది (84) సమస్తోపాధి శూన్యమగు బ్రహ్మ జ్ఞానము ఉత్పన్నమగుటకు సమస్తము జ్ఞాన స్వరూపముగానె అగుపడును. దానికి భిన్నముగానేది అగు పడదు (85). అందువలన మోక్షమునకు మూలకారణ భూతమగు శివాద్వైత జ్ఞానమును అనుభవించునట్టి శివయోగి ఎల్లప్పుడును జనన మరణ రూపమగు సంసారము చేతలిప్తుడుగా నేరడు (86)

ప్రతినిత్యము శుద్ధ సత్వగుణ విశిష్టుడు, సర్వశ్రేష్ఠుడు, విషయవాసన రహితుడు, హేయకాల శూన్యుడు, సమస్తమునకు శ్రేష్ఠమైన జ్ఞానముగలవాడు, మరియు అత్యున్నత స్థానము గలవాడును, చరాచర ప్రపంచ స్వరూపుడును, పారమార్థిక సత్తారూపుడును, జ్యోతి స్వరూపుడును, చిదాకాశ స్వరూపుడు ఐన ఆపరమ శివునియందు శివేతర జ్ఞాన శూన్యత వలన మనస్సును లయమొనర్చిన విశ్వవ్యాపకుడైన శివయోగి విశ్వభేదమును దూరీకరించిన వాడై తానే తానై ప్రకాశించు చుండును (87)

*ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ లింగస్థలీయ శరణస్థలే*
*దీక్షా పాదోదక స్థలాది ద్వాదశవిధస్థల ప్రసంగోనామ*
*ఏకోన వింశతి పరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణియందు లింగ
స్థలీయమైన శరణ స్థలమున దీక్షా పాదోదకస్థలాది
ద్వాదశ విధ స్థల విచారాత్మకమగు పందొమ్మిదవ
పరిచ్ఛేదము పరిసమాప్తము.

# శ్రీ సిద్ధాంత శిఖామణి

## వింశతితమ పరిచ్ఛేదః

## ఇరవదియవ పరిచ్ఛేదం

అగస్త్య ఉవాచ:-

స్థలభేదాస్త్వయా ప్రోక్తాః శరణస్థల సంశ్రితాః
ఐక్యస్థల గతాన్ బ్రూహి స్థల భేదాన్ గణేంద్ర మే ॥ 1 ॥

శ్రీ రేణుక ఉవాచ:-

స్థలానాం నవకం చైక్యస్థలేఽస్మిన్ పరికీర్త్యతే
తత్స్వీకృత ప్రసాదాఖ్యస్థలమాదౌ ప్రకీర్తితం ॥ 2 ॥

శిష్టాదనస్థలం చాథ చరాచరలయస్థలం
భాండస్థలం తతః ప్రోక్తం భాజనస్థలముత్తమం ॥ 3 ॥

అంగాలేపస్థలం పశ్చాత్ స్వపరాజ్ఞస్థలం తతః
భావాభావవినాశం చ జ్ఞానశూన్యస్థలం తతః
తదేషాం క్రమశో వక్ష్యే శ్రుణు తాపసతలక్షణం ॥ 4 ॥

ఓయీ, గణాధీశ్వరా! శరణ స్థలమునకు సంబంధించిన స్థల భేదములు మీ చేత చక్కగా నుపదేశించబడినది. ఇక ఐక్య స్థలమునకు సంబంధించిన స్థల భేదములను గురించి యుపదేశించుము, అని అగస్త్య మహర్షి ప్రశ్నించగ అందుకు శ్రీరేణుకాచార్యుల వారు ఐక్యస్థలమున స్వీకృత ప్రసాదిస్థలము, శిష్టాదనస్థలము, చరాచర లయ స్థలము భాండస్థలము, భాజన స్థలము. అంగాలేపన స్థలము, స్వపరాజ్ఞ స్థలము. భావా భావలయ స్థలము, జ్ఞాన శూన్య స్థలములని 'తొమ్మిది స్థలములున్నవనియు అనుక్రమముగా వాట క్షణములను వివరిస్తాను; చిత్తగించుమనెను. (1-2-3-4)

### 49. స్వీకృత ప్రసాద స్థలం

మాతృమేయప్రమాణాదివ్యవహార విహారిణీం
సంవిత్సాక్షాత్కృతిం లబ్ధ్వాయోగీ స్వాత్మని తిష్ఠతి ॥ 5 ॥

అద్వైత బోధ నిర్ధూత భేదావేశస్య యోగినః
సాక్షాత్కృతమహాసంవిత్ర్పకాశస్య క్వ బంధనం ॥ 6 ॥

చిదాత్మని శివే న్యస్తం జగతేతచ్చరాచరం
దృశ్యతే తన్మయం సర్వమగ్నౌ కాష్ఠాదికం యథా ॥ 7 ॥

న భాతి పృథ్వీ న జలం న తేజో నైవ మారుతః
వాకాశో నా పరం తత్త్వం శివే దృష్టే చిదాత్మనీ ॥ 8 ॥

జ్యోతిర్లింగే చిదాకారే జ్వలత్యంతర్నిరంతరం
విలీనం నిఖిలం తత్త్వం పశ్యన్ యోగీ నలిప్యతే ॥ 9 ॥

అంతర్ముఖేన మనసా స్వాత్మజ్యోతిషి చిన్మయే
సర్వానప్యర్థ విషయాన్ జుహ్వాద్యోగీ ప్రమోదతే ॥ 10 ॥

సచ్చిదానంద జలధౌ శివే స్వాత్మని నిర్మలః
సమర్ప్య సకలాన్ భుంక్తే విషయాంస్త త్ర్పసాదతః ॥ 11 ॥

శివయోగి ప్రమాతృ - ప్రమాణము, ప్రమేయాదివ్యవహారమును లయమొనర్చెడు బ్రహ్మసాక్షాత్కారమును బొంది. స్వస్వరూపమున నుండును (5) శివాద్వైత జ్ఞానము చేత పరిహరించ (పాగొట్ట) బడిన అంగ - లింగ స్వరూప జీవేశ్వర భేదా భినివేశము గలవాఁడును, ప్రపూర్ణ జ్ఞాన ప్రకాశమును, సాక్షాత్కరింపఁ జేసికొన్న వాడును, ఐన శివయోగికి ఈ సంసార బంధన మెకడుంటుంది? (6) అగ్నిలో బడవైచిన కట్టెలు మున్నగునవి ఎట్లు రూపముగానె అగుపడుచుండునో, అట్లే జ్ఞాన స్వరూపుడైన శివునియందు స్థాపింపఁపబడిన ఈ చరాచరాత్మక మగు జగత్తు శివ స్వరూపముగానె అగుపడును (7) చిత్స్వరూపుడైన శివుడు దర్శించగానే (అగుపడగానె) పృథ్వీ తత్త్వముగాని, జలతత్త్వముగాని, తేజస్తత్త్వముగాని, వాయు తత్త్వముగా, అథవా వేరొండు తత్త్వముగాని, ఏతత్త్వము గూడ అగుపడదు, సమస్తతత్త్వములు పరమశివుని నుండే ఉద్భవించుటవలన సర్వస్వము శివ స్వరూపముగానే అగుపడుచున్న దని భావము (8) జ్ఞాన స్వరూపమైనది, ఎల్లప్పుడు హృదయకమలమునందు ప్రకాశించునట్టి దైనమహా లింగమున సూక్ష్మ రూపముతో లీనమైయున్న పృథివ్యాది సమస్తతత్త్వములను నిరీక్షించునట్టి శివయోగి, సంసారమునుండి లిప్తుడుగానేరడు (9)

శివయోగి అంతర్ముఖమగు మనస్సుతో జ్ఞానరూపముగా స్వప్నరూపాగ్నిలో సమస్త విషయములను హవనమొనర్చినవాడై సంతసించిన వాడగును, శివయోగి విషయ

సుఖమును దూరగించి (పరిత్యజించి) అంతర్ముఖముగ మహానందముతో నుండునని భావము (10) ఆడవాది మలత్రయరహితుడైన శివయోగిసత్ - చిత్ - ఆనందములకు సముద్ర స్వరూపుడయ్యు - స్వప్రకాశరూపు డైయున్న శివునిలో శబ్దాది సమస్త విషయములను సమర్పించి పరిశుద్ధముగవాటిని ప్రసాదరూపముచేత ఉపభోగించును (11)

## 50. శిష్టోదన స్థలం

ప్రకాశతే యా సర్వేషాం మాయా సైవౌదనాకృతిః
లీయతే యత్ర చిల్లింగే శిష్టం తత్పరికీర్తితం ॥ 12 ॥

జగత్యస్మిన్ పరిగ్రస్తే మాయా పాశ విజృంభితే
స్వాత్మజ్యోతిషి బోధేన తదేకమవశిష్యతే ॥ 13 ॥

అఖండసచ్చిదానంద పరబ్రహ్మమస్వరూపిణిః
జీవన్ముక్త స్య ధీరస్య మాయా కైంకర్యనాదినీ ॥ 14 ॥

విశ్వసమ్మోహినీ మాయా బహుశక్తిర్నిరంకుశా
శివైక్యత్వముపేతస్య న పురః స్థాతుమిహతే ॥ 15 ॥

జ్యోతిర్లింగే చిదాకారే నిమగ్నేన మహాత్మనా
భుజ్యమానా యథా యోగం నశ్యంతి విషయాఃస్వతః ॥ 16 ॥

శబ్దాదయోపి విషయా భుజ్యమానాస్తదింద్రియై
ఆత్మన్యేవ విలీయంతే సరితః సాగరే యథా ॥ 17 ॥

అర్థ జాత మశేషం తు గ్రసస్ యోగీ ప్రశామ్యతి
స్వాత్మనీవ స్థితం భానుస్తేజో జాలమశేషతః ॥ 18 ॥

సమస్త మానవులలో ఏదైతె మాయ ప్రకాశించు చుండునో అట్టి మాయనే (ఆశ లేదా విషయవ్యామోహమని అర్థము) ఓదన (అన్నములేదా ఆహార) స్వరూపమైయున్నది - ఇట్టి ఓదన స్వరూపమైనట్టి మాయ ఏ చిచ్ఛక్తి విశిష్టమైన మహాలింగ రూపమున లీనమై యుండునో అట్టి మహాలింగస్వరూపమే. శిష్టోదన మనబడును (12) మాయాపాశబద్ధమగు ఈ జగత్తు జ్ఞా(న)ము చేత నాక్రమించగానె, స్వస్వరూపప్రకాశమునందు ఆ మాయాతత్త్వ మొకటే మిగిలియుండును (13) అఖండసచ్చిదానంద రూపమైన పరబ్రహ్మ స్వరూపుడగు జితేంద్రియ జీవన్ముక్తుడు ఐన శివయోగి విషయమున మాయా ఉదాసీన భావమును

వహించును (14) జగన్మోహకారకమైనది, అనేక విధముల శక్తి గలది, ప్రతిబంధ రహితమైనదినగు మాయ శివునిలో సామరస్యమును బొందిన శివయోగి యెదుట నిలబడుటకు సాధ్యపడదు(15) జ్ఞాన స్వరూపమగు జ్యోతిర్లింగమునందు లీనమైన మనస్సుగల శివయోగి వలన లబ్ధ క్రమమున ఉపయోగించబడు విషయములు స్వతః నశించును (16) శబ్దము- స్పర్శము-రూపము-రసము-గంధములను విషయములు శ్రోత్రము-త్వక్-నేత్రము-జిహ్వా-ఘ్రాణేంద్రియములచే ఉపభోగింపఁబడినను నదులు సాగరమున గల్సిపోయినట్లు చివరికి ఆత్మ స్వరూపమునందే లీనమగును (17) అస్తమానసమయమున కిరణ సమూహమును నిశ్శేషముగ (ఏమియు మిగలకుండ) తనలోనే లీన మొనర్చుకొనే సూర్యుని వలె శివయోగి సమస్త విషయ సమూహమును తనలోనె లీనమొనర్చుకొని ప్రశాంత మనస్కుడగును (18).

## 51. చరాచరలయస్థలం

లింగైక్యేతు సమాపన్నే చరాచరజగల్లయే
నిర్దేహీ చ భవేద్యోగీ చరాచరవినాశకః ॥ 19 ॥

యథా మేఘాః సముద్భూతా విలీయంతే నభఃస్థలే
తథానన ఽఽ త్మ నివిలీయం తే విషయాః స్వానుభావినః ॥ 20 ॥

జాగ్రత్స్వ ప్న సుషుప్తిభ్యః పరావస్థాముపేయుషః
కిం వా ప్రమాణం కిం జ్ఞేయం కిం వా జ్ఞానస్య సాధనం ॥ 21 ॥.

తుర్యాతీత పదం యత్త ద్దూరం ` వాఙ్మనసాధ్వనః
అనుప్రవిశ్య తద్యోగీ న భూమో విశ్వ మీక్షతే ॥ 22 ॥

నాన్యత్పశ్యతి యోగీంద్రో నాన్యజ్జానాతి కించన
నాన్యచ్ఛృణోతి సందృష్టే చిదానందమయే శివే ॥ 23 ॥

శివునిలో సామరస్యమును బొందిన శివయోగియందు చరాచరప్రపంచలయము ప్రాప్తింపగ (సమీపింపగా) ఆ శివయోగి వర్యుడు అకాయుడై (దేహములేనివాడై) చరాచర ప్రపంచ వినాశకుడగును. ఇదే చరాచరలయస్థలమనబడును (19) ఆకాశము నందుత్పన్నము లైన మేఘములు అక్కడే ఎట్లు లీనమగునో అట్లే స్వస్వరూపానుభవియగు శివయోగి యొక్క ఆత్మలో ఉత్పన్నములైన శబ్దాది విషయములు అక్కడే లీనమగుచున్నవి

(20) జాగ్రత్స్వప్న సుషుప్తిలను మూఁడు అవస్థలకంటెను శ్రేష్ఠమైయున్న తురీయావస్థను బొందిన శివయోగికి ప్రమాణమంటే ఏమిటి? జ్ఞేయమనగా నేమి? జ్ఞానముయొక్క సాధనమనగానేమి? ఇవేమియు లేవని భావము (21) ఏదితుర్యాతీతస్థానమో అది స్తుతి ధ్యానములకు దూరముగా నున్నది. శివయోగి అంతటి శ్రేష్ఠమైన స్థానమును బ్రవేశించి పునః ప్రపంచమును చూడలేడు (22) చిదానంద స్వరూపుడైన శివుడు ప్రత్యక్షము కాగా శివయోగీశ్వరుడు తనకితరమైయున్న వస్తువు నెరుగడు. తన కన్యమగు విషయము వినడు. స్వస్వరూపమును వదలి ఇంకదేనిని గురించి యాలోచింపడని భావము (23)

## 52. భాండ స్థలం

బ్రహ్మాండశతకోటీనాం సర్గస్థితిలయాన్ ప్రతి
స్థానభూతో విమర్శో యస్త ద్భాండస్థల ముచ్యతే ॥ 24 ॥

విమర్శాఖ్యా పరాశక్తి ర్విశ్వో ద్భావనకారిణీ
సాక్షిణీ సర్వతత్త్వానాం సమింధే సర్వతో ముఖీ ॥ 25 ॥

విశ్వం యత్ర లయం యాతి విభాత్యాత్మా చిదాకృతిః
సదానందమయః సాక్షాత్ సా విమర్శమయీ కలా ॥ 26 ॥

సరాహంతా సమావేశ పరిపూర్ణ విమర్శవాన్
సర్వజ్ఞః సర్వగః సాక్షీ సర్వకర్తా మహేశ్వరః ॥ 27 ॥

విశ్వాధారం మహాసంవిత్ప్రకాశపరిపూరితం
పరాహంతామయం ప్రాహుర్విమర్శం పరమాత్మనః ॥ 28 ॥

విమర్శ భాండ విన్యస్త విశ్వతత్త్వ విజృంభణః
అనన్య ముఖ సంప్రేక్షీ ముక్తః స్వాత్మని తిష్ఠతి ॥ 29 ॥

అనంతకోటి బ్రహ్మాండముల సృష్టి-స్థితి లయములకు ఆధారభూతమగు ఏ విమర్శనా శక్తి రూపమగు జ్ఞాన విశేషము (విశ్వాత్మకుడైన శివుడే(డిని) నేననుజ్ఞాన విశేషము) గలదో అదే భాండస్థలమని చెప్పబడును (24)విమర్శనా నామకమగు పరాశక్తి సమస్తతత్వములకు సాక్షిభూతమైవిశ్వమును ప్రకాశింపఁజేయునదై యుండి, సర్వతోముఖమై ప్రకాశించు చుండును (25) చరాచరాత్మకమగు నీ ప్రపంచము దేనియందు లీనమగునో సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్ముడు దేనియందు ప్రత్యక్షమై ప్రకాశించునో ఆ విమర్శనా శక్తి చేత

వికసించినవాడై, సర్వజ్ఞుడు, సర్వకర్త, సర్వవ్యాపకుడు సర్వసాక్షిభూతుడు, మహేశ్వరుడగును (27) జగదాధారభూతమగు మహోజ్ఞానప్రకాశపూర్ణమైన పరమాత్ముని విమర్శనామకమగు జ్ఞాన విశేషమును జ్ఞానులు పరాహంత స్వరూపముగా చెప్పుదురు.

"ఓం దేవా హవై స్వర్గంలోకమాయంస్తేరుద్రమపృచ్ఛన్‌కో భవానితి!
సోన్‌బ్రవీదహమేకః ప్రథమమాసంవర్తామి చ భవిష్యామిచనాన్యం

కశ్చిన్మత్తో వ్యతిరిక్త ఇతి - ఇత్యాది వాక్యముల వలన(నుండి) అధర్వ శిరశ్రుతి మున్నగు అనంతశ్రుతులు పరబ్రహ్మము "అహం పదవాచ్యమై యున్నదనియు బోధించుచున్నవి. అహంపదవాచ్యమగుపరబ్రహ్మయొక్క అసాధారణ ధర్మమే "పరాహంతమనబడును(28) విమర్శనా శక్తి రూపజ్ఞానవిశేషమను పాత్రలో సమస్త తత్వములనుంచి ఆనందించుచున్న జీవన్ముక్తుడు తన స్వరూపమును తప్ప వేరొండు స్వరూపమును చూడని వాడై స్వరూపమునందే యుండును (29)

## 53. భాజన స్థలం

సమస్త జగదండానాం సర్గస్థిత్యంత కారణం
విమర్శో భాసతే యత్ర తద్భాజన మిహోచ్యతే ॥ 30 ॥

విమర్శాఖ్యా పరాశక్తి ర్విశ్వవైచిత్ర్య కారిణీ
యస్మిన్ ప్రతిష్ఠితా బ్రహ్మ తదిదం విశ్వ భాజనం ॥ 31 ॥

యథా చంద్రే స్థిరా జోత్స్నా విశ్వ వస్తుప్రకాశినీ
తథా శక్తిర్వి మర్శాఖ్యా ప్రకాశే బ్రహ్మణి స్థిరా ॥ 32 ॥

వృక్షస్థం పత్ర పుష్పాది వటబీజస్థితం యథా
తథా హృదయబీజస్థం విశ్వ మేతత్పరాత్మనః ॥ 33 ॥

ఆకారః శివ ఆఖ్యాతో హంకారః శక్తి రుచ్యతే
శివ శక్తి మయం బ్రహ్మ స్థితమేకమహంపదే ॥ 34 ॥

అహంతాం పరమాం ప్రాప్య శివశక్తిమయీాం స్థిరాం
బ్రహ్మ భూయం గతో యోగీ విశ్వాత్మా ప్రతిభాసతే ॥ 35 ॥

అంతః కరణ రూపేణ జగదంకురరూపతః
యస్మిన్ విభాతి చిచ్ఛక్తి ర్బ్రహ్మభూతః స ఉచ్యతే ॥ 36 ॥

సమస్త భువనాండముల సృష్టి-స్థితి-లయములకు కారణీభూత-మైన విమర్శనా శక్తి రూపమగు జ్ఞాన విశేషము ఏదైతే పరశివబ్రహ్మమున ప్రకాశించుచున్నదో, అట్టి పరశివ బ్రహ్మమే భాజనమనమనియు చెప్పబడుచున్నది. (30) చిత్ర విచిత్రమగు విశ్వ సృష్టిని జనింపజేయు విమర్శనామకమగు పరాశక్తి దేని యందు అవినాభావసంబంధము చేత ప్రతిష్ఠితమై యున్నదో. అట్టి పర బ్రహ్మమే విశ్వ భాజనమనబడును. (31) సమస్త వస్తువులను ప్రకాశింపఁజేయుచంద్రిక చంద్రునివీడి చంద్రికగాని చంద్రికను వదలి చంద్రుడుగాని ఎట్లుండజాలవో అట్లే శివుని వదలిశక్తిగాని శక్తిని వీడి పరమ శివుడు ఉండనేరడనియు శక్తి శివుడితో అవినాభావ సంబంధముతో స్థిరముగానుండునని భావము (32) అత్యంత విశాలమగు మఱ్ఱివృక్షము బీజమునందు ఎట్లు సూక్ష్మముగా నుండునో అదే రీతి చరాచరాత్మకమగునీ సమస్త ప్రపంచము పరమాత్ముని హృదయ(విమర్శశక్తి) రూపమైన బీజమునందు సూక్ష్మరూపమున నున్నది. ఇంద్రియ గోచరమగు స్థూల ప్రపంచము మిథ్యయైనది(అసత్యమైనది) గా కుండ సత్యమైనదిగా నుండునని భావము (33)

"అకారము శివుని సంకేతమనియు చెప్పబడుచున్నది. "హంకారము శక్తికిసంకేత మనియు చెప్పబడుచున్నది. ఇట్లు "అకార-హంకారరూపమగు శివశక్తి స్వరూనమైన పరబ్రహ్మము "అహం అను" శబ్దము (పదము)న నిలిచియున్నది. 'సోఅహం అనగ శివశక్త్యాత్మకమైన పరబ్రహ్మమనిభావము (34) పరబ్రహ్మత్వమును బడసిన (పొందిన) శివయోగి సర్వోత్కృష్టుడు, నిత్యుడు (శాశ్వితుడు)శివశక్త్యాత్మకమైన అహంతిని బొంది సకల చరాచర ప్రపంచ స్వరూపుడై ప్రకాశించును.

"స్యాద్బ్రహ్మభూయంబ్రహ్మత్వం బ్రహ్మసాయుజ్యమిత్యపి!!

"ఇత్యమరః (35) చిచ్ఛక్తివిమలాహంకార రూపముతో సూక్ష్మమగు జగద్రూపముతోడను ఎవని యందు బ్రకాశించు చున్నదో, అట్టి శివయోగె పరబ్రహ్మ స్వరూపుడనియు చెప్పబడును. శివైక్యుడైన శివయోగి పరశివ బ్రహ్మవలె శక్తి వికాసము గలవాడగునని భావము (36)

## 54. అంగాలేపస్థలం

దిక్కాలాద్యనవచ్ఛిన్నం చిదానందమయం మహత్
యస్య రూపమిదంఖ్యాతం సోఽంగాలేప ఇహోచ్యతే ॥ 37 ॥

సమస్త జగదాత్మాపి సంవిద్రూపో మహామతిః
లిప్యతే నైవ సంస్కారైర్యథా ధూమాదిభిర్నభః ॥ 38 ॥

న దేవత్వం న మానుష్యం నతిర్యక్త్వం న చాన్యథా
సర్వాకారత్వ మాఖ్యాతం జీవన్ముక్తస్యయోగినః ॥ 39 ॥

న విధిర్న నిషేధశ్చ న వికల్పో న వాసనా
కేవలం చిత్స్వ రూపస్య గలిత ప్రాకృతాత్మనః ॥ 40 ॥

అనశ్వరమనిర్దేశ్యం యథా వ్యోమ ప్రకాశతే
తథా బ్రహ్మాపి చైతన్యమత్ర వైశేషికీ కలా ॥ 41 ॥

ఘటాదిషు పృథగ్భూతం యథాऽऽ కాశం న భిద్యతే
తథోపాధిగతం బ్రహ్మ నానారూపం న భిద్యతే ॥ 42 ॥

పరబ్రహ్మత్వమును బొందినట్టి శివయోగి యొక్క స్వరూపము దేశకాలాది పరిచ్ఛేదక శూన్యమై, చిదానంద స్వరూపమై మహత్వపూరితమై యుండి ప్రఖ్యాతిగాంచినదో అతడే అంగాలూకుడనియు (శరీరసంబంధకర్మశూన్యుడు) అని చెప్పఁబడును. ఇదియే అంగాలేపనస్థలమనబడును (37) ఆకాశమ్ముదుమ్ముధూళి మున్నగు వాటితో నిండియున్నను ఎట్లు అంటకుండ (మలనముగా కుండ) ఉండునో అట్లే చిత్స్వరూపుడైన శివయోగి సమస్త ప్రపంచ స్వరూపుడైనను సాంసారిక కర్మఫలములచేత లిప్తుడు గాడు(38) జీవన్ముక్తుడైన శివయోగికి పుణ్యకర్మ సిద్ధమైన దేవత్వము ఉండనేరదు. పుణ్యపాపమిశ్రమైన మనుష్యత్వముగూడ ఉండదు. పాపపూరితమైన తిర్యగ్జాతిత్వము సహ ఉండదు. వీటన్నింటి కతీతమైన ఇంకే స్వరూపము ఉండదు. ఆతనికి విశ్వాకారత్వము ఉండునని చెప్పబడినది. (39) ప్రాకృతరూపమునుండి దూరమైనవాడు కేవలము చిత్స్వరూపముగలవాడైన శివయోగికి విధిగాని, నిషేధముగాని, వికల్పముగాని, సంసారవాసనగాని, ఏది ఉండదు(40) ఆకాశమునాశరహితమై అనిర్దేశ్యమై, ఎట్లుగా ప్రకాశించుచుండునో అట్లే నాశరహితము, అనిర్దేశ్యమైన పరబ్రహ్మము ప్రకాశించుచుండును. జడభూతమగు భూతాకాశమునకంటెను చిదాకాశస్వరూపమైన ఈ పరబ్రహ్మములో చైతన్యమే విశేషమైన కళయైయున్నది, వైలక్షణ్యద్యోతకమైయున్నదనిభావము. (41) ఆకాశము ఉపాధి సంబంధమువలన ఘట-మఠాదులందు వేర్వేరుగా అగుపడినను నిజానికి అది ఏ రీతిగా అభిన్నముగా నుండునో, అట్లే పరబ్రహ్మము ఉపాధి సంబంధము వలన దేవదానవమానవాది నానారకాలుగా అగుపడినను వస్తు స్థితిలో ఏకముగానే ఉండును అని భావము (42)

## 55. స్వపరాజ్ఞస్థలం

దిక్కాలాద్యనవచ్ఛిన్న తేజో రూపసమాశ్రయాత్
స్వపరజ్ఞానవిరహాత్ స్వపరాజ్ఞస్థలం విదుః ॥ 43 ॥

అప్రమేయే చిదాకారే బ్రహ్మణ్య ద్వైత వైభవే
విలీనః కిం సుజానాతి స్వాత్మానం పరమేవ వా ॥ 44 ॥

యత్ర నాస్తి భిదా యోగాదహం త్వమితి విభ్రమః
న సంయోగో వియోగశ్చ న జ్ఞేయజ్ఞాతృకల్పనా ॥ 45 ॥

న బంధో న చ ముక్తిశ్చ న దేవాద్యభి మానితా
నసుఖం నైవ దుఃఖం చ నాజ్ఞానం జ్ఞానమేవ వా ॥ 46 ॥

నోత్కృష్టత్వం న హీనత్వం నో పరిష్టాన్న చాప్యథః
న పశ్చాన్నైవ పురతో న బాహ్యంచ న చాంతరం ॥ 47 ॥
సర్వాకారే చిదానందే సత్యరూపిణి శాశ్వతే
పరాకాశమయే తస్మిన్ పరబ్రహ్మణి నిర్మలే ॥ 48 ॥

ఏకభావముపేతానాం యోగినాం పరమాత్మనాం
పరాపరపరిజ్ఞాన పరిహాస కథా కుతః ॥ 49 ॥

శివయోగి దేశకాలాది పరిచ్ఛేదక శూన్యమగు బ్రహ్మతేజస్స్వరూపమును ఆశ్రయించి యుంటవలనను, సర్వము చిత్స్వరూపమగుట చేత తన మరియు తనకన్యమైన పదార్థము యొక్క జ్ఞానములేని వాడగుట చేతను, ఆతడనుభవించదగు ఈ స్థలమును జ్ఞానులు స్వపరాజ్ఞాస్థలమని తెలిసికొందురు (43) అప్రమేయ చిత్స్వ రూపము" ఏకమేవాద్వితీయము బ్రహ్మ అను శ్రుతి వాక్యానుసారముగా అద్వితీయ వైభవముతో గూడిన పరబ్రహ్మము నందు సామరస్యమును బొందిన శివయోగి తనను గాని అథవా తనకన్యమైన పదార్థమునుగాని, వేర్వేరుగాదలచునా? దేనిని ఎరుగడని భావము (44) అద్వైత భావముగల ఏ వస్తువునందును సామరస్య యోగముచేత జీవాత్మునకు భేదముండదో, నేను-నీవను భ్రాంతిగూడుండదో సంయోగముగాని, వియోగముగాని-జ్ఞేయకల్పనముగాని, జాతృకల్పనముగాని, బంధనముగాని, మోక్షముగాని, నేను దేవుడిని, నేమానవుడిని, అనునభిమానముగాని, సుఖముగాని, దుఃఖముగాని జ్ఞానముగాని, అజ్ఞానముగాని, నేను

శ్రేష్ఠుడిని (గొప్పవాడిని) నే కనిష్ఠుడిని అనుభావముగాని, ఊర్ధ్వభాగముగాని, వెలుపలగాని, లోపలగాని, ఉండదో అట్టి చరాచర ప్రపంచస్వరూపము, చిత్స్వ రూపము, ఆనంద స్వరూపము, సత్యస్వరూపము, శాశ్వతము, నిర్మలము పరాకాశ స్వరూపమైన పరబ్రహ్మమునందు సామరస్యమును పరబ్రహ్మస్వరూపుడైన శివయోగులకు, తాము మరియు ఏకేతరమైనవస్తువులనే పరిజ్ఞానము యొక్క పరిహాస ప్రసంగమెక్కడిది? శివయోగులకు స్వపరజ్ఞానమున్నదని చెప్పుటకేవలముహాస్యాస్పదమే అయి ఉన్నదని భావము.

## 56. భావాభావలయస్థలం

ప్రతీయమానౌ విద్యేతే భావాభావౌ న కుత్రచిత్
లింగైక్యే సతి యత్తస్మాద్భావాభావలయస్థలం ॥ 50 ॥

అహంభావస్య శూన్యత్వాదభావస్య తథాత్మనః
భావాభావవినిర్ముక్తో జీవన్ముక్తః ప్రకాశతే ॥ 51 ॥

సుఖదుఃఖాదియోగేషు నాభావోభావ ఏవ వా
విద్యతే చిత్స్వరూపస్య నిర్లేపస్య మహాత్మనః ॥ 52 ॥

త్వంతాऽ హంతా వినిర్ముక్తే నిర్వికల్పే చిదంబరే
ఏకీభూతస్య సిద్ధస్య భావాభావకథా కుతః ॥ 53 ॥

శివయోగి శివునియందు సామరస్యమును బొందుట ఆతనిలో సమస్త జనులలో సాదారణముగా అగుపడుచుండినమనేను ఉన్నాను, అనే భావనగాని, లేననే అభావన ఏ సమయమునందును ఉండజాలదు అందుచేత, ఈ స్థలము బావాభావలయస్థలమని చెప్పబడును (50) జీవన్ముక్తుడైన శివయోగినేను ఉన్నాను అనెడు భావనలో, నేను లేననెడు అభావముతో దూరమైయుంటవలన, ఇతడు భావాభావములతో ముక్తుడై ప్రకాశించు చుండును(51)

చిత్స్వరూపుడు, నిర్లిప్తుడు, మహాత్ముడైన శివయోగికి సుఖదుఃఖాది సంబంధములుండవు, సుఖదుఃఖములునాకున్నవనే భావనగాని- లేవనె భావనగాని, ఏదియుండదు(52) నీవు నేననే భావముతో విముక్తము-నిర్వికల్పము చిదాకాశ స్వరూపముగల శివయోగికి భావాభావముల ప్రసంగమెక్కడిది? అతనికివి రెండును ఉండవని తాత్పర్యము(53)

## 57. జ్ఞాన శూన్య స్థలం

పరస్పర సమాపేక్ష భావా భావవివేచనం
జ్ఞానం బ్రహ్మణి యన్నాస్తి జ్ఞానశూన్యస్థలం విదుః ॥ 54 ॥

సర్వాత్మని పరేతత్త్వే భేద శంకావివర్జితే
జ్ఞాత్రాదివ్యవహారోత్థం కుతో జ్ఞానం విభావ్యతే ॥ 55 ॥

నిర్వికారం నిరాకారం నిత్యం సీమావివర్జితం
వ్యోమవత్పరమం బ్రహ్మ నిర్వికల్పతయా స్థితం ॥ 56 ॥

న పృథ్వ్యాదీని భూతాని న గ్రహా నైవ తారకాః
న దేవా న మనుష్యాశ్చ న తిర్యంచోనచాపరే ॥ 57 ॥

తస్మిన్ కేవల చిన్మాత్రసత్తానందైక లక్షణే
త్వంతాऽ హంతాది సంరూఢం విజ్ఞానం కేన భావ్యతే ॥ 58 ॥

కేవలం సచ్చిదానందప్రకాశాద్వయ లక్షణం
నిర్వికల్పం పరాకాశం పరబ్రహ్మ ప్రకాశతే ॥ 59 ॥

జ్యోతిర్లింగే చిదాకారే స్వప్రకాశే నిరంతరే
ఏకీభావముపేతస్య కథం జ్ఞానస్య సంభవః ॥ 60 ॥

జలే జలమివ న్యస్తం వహ్నౌ వహ్నిరివార్పితః
పరబ్రహ్మణి లీనాత్మా విభాగేన నదృశ్యతే ॥ 61 ॥

ఏతావదుక్త్వా పరమప్రబోధ
మద్వైత మానంద శివప్రకాశం
దేవ్యై పురా భాషిత మీశ్వరేణ
తూష్ణీమభూద్ధ్యానపరో గణేంద్రః ॥ 62 ॥

ఏవముక్త్వా సమాసీనం శివయోగ పరాయణం
రేణుకం తం సమాలోక్య బభాషే ప్రాంజలిర్మునిః ॥ 63 ॥

అగస్త్య ఉవాచ:-

శివయోగ విశేషజ్ఞ శివజ్ఞాన మహోదధే
సమస్త వేదశాస్త్రాదివ్యవహారధురంధర ॥ 64 ॥

ఆలోక మాత్ర నిర్ధూతసర్వ సంసార బంధన
స్వచ్ఛంద చరితో ల్లాస స్వప్రకాశాత్మ వచ్ఛివ ॥ 65 ॥

అవతీర్ణమిదం శాస్త్రమనవద్యం త్వదాననాత్
శ్రుత్వామే మోదతే చిత్తం జ్యోతిః పశ్యచ్ఛివాభిధం ॥ 66 ॥

అద్య మే సఫలం జన్మగతో మే చిత్తవిభ్రమః
సంజాతా పాశ విచ్ఛిత్తి స్తపాంసి ఫలితాని మే ॥ 67 ॥

ఇదానీ మేవ మే జాతం మునిరాజత్వముత్తమం
ఇతః పరం మయా నాస్తి సదృశో భువనత్రయే ॥ 68 ॥

శాస్త్రం తవ ముఖోద్గీర్ణం శివాద్వైతపరం పరం
మాం వినా కస్య లోకేషు శ్రోతుమస్తితపః శుభం ॥ 69 ॥

తపనః పరిపాకేన శంకరస్య ప్రసాదతః
ఆగతస్త్వం మహాభాగ మాం కృతార్థయితుం గిరా ॥ 70 ॥

ఇతిస్తువంతం వినయాదగస్త్యం మునిపుంగవం
ఆలోక్య కరుణాదృష్ట్యా బభాషే స గణేశ్వరః ॥ 71 ॥

పరస్పరాకాంక్షతో గూడియున్న అస్తి-నాస్తిరూపమగు భావాభావములవివేచనమన్న భేద జ్ఞానము పరబ్రహ్మస్వరూపుడైన శివయోగి యందు లేకుండునో అట్టిభేద జ్ఞాన శూన్యత్వమును ప్రతిపాదించె స్థలమును జ్ఞానులు జ్ఞానశూన్య స్థలమని యెఱుంగుదురు. జ్ఞానబంధః" అని శివ సూత్రమునందున్న "జ్ఞాన శూన్యస్థల, పాఠమునకు భేదజ్ఞానశూన్య స్థలమని గుర్తించవలెను. (54) భేద సంవయ వర్జితయా సకల చరాచర ప్రపంచ స్వరూపము పరతత్వమునందు జ్ఞాతృజ్ఞేయాది వ్యవహారముతో నుత్పన్నమైన భేద జ్ఞానము ఎక్కడినుండి భావించబడుతుంది? (55) వికార శూన్యము, హేయకార (జుగుప్స) రహితము, శాశ్వతము, సీమాతీతమైన పరబ్రహ్మఆకాశమువలె భేద శూన్యమై యొప్పుచున్నది (56). అక్కడ స్థూలమగు పృథివ్యాధి భూతములుగాని, సూర్యాదిగ్రహములుగాని, అశ్వన్యాదినక్షత్ర ములుగాని, దేవతలుగాని మనుషులుగాని, పశుపక్షులుగాని అథవా వేరే వస్తువులే గాని ఏవియుండవు (57) కేవలము సచ్చిదానంద స్వరూపమగు ఆ పరశివ బ్రహ్మలో త్వంతాహంతారూపమగు భావాదులతో గూడిన భేదజ్ఞానము ఎవడినుండి భావించబడు తుందో అక్కడనీవు-నేననే భేద భావమే ఉండదని భావము (58) కేవలము సచ్చిదానంద

స్వరూపము అద్వితీయము, నిర్వికల్పము నైన పరశివ బ్రహ్మము మహాకాశ స్వరూపమై ప్రకాశించును (59) జ్యోతిర్లింగ స్వరూపము, చిత్స్వరూపము ఐన స్వప్రకాశమునందు సమరస భావమును బొందిన శివయోగికి భేద జ్ఞానము ఎట్లుగలుగుతుంది? ఏ నాటికి గలుగనేరదని భావము. నీటిలో నీరును గలిపినట్లు, పరశివ బ్రహ్మ స్వరూపమైన మహాలింగమునందు ఆత్మను లీన మొనర్చినశివయోగి, జీవభావమునుండి దూరమై పరశివ బ్రహ్మమునందు సమరస భావమును బొందిన బిదప పరబ్రహ్మస్వరూపమున కంటె భిన్నముగా నగుపడదు. ఇదే శివాద్వైత (లింగాంగ సామరస్యము) సిద్ధాంతము యొక్క రహస్యము. (60)

శ్రీ రేణుక ఉవాచ :-

అగస్త్య మునిశార్దూల తపస్సిద్ధమనోరథ
త్వాం వినా శివ శాస్త్రస్య కః శ్రోతుమధికారవాన్ ॥ 72 ॥

పాత్రం శివ ప్రసాదస్య భవానేకో న చాపరః
ఇతి నిశ్చిత్య కథితం మాయా తే తంత్రామీదృశం ॥ 73 ॥

స్థాప్యతాం సర్వ లోకేషు తంత్రమేతత్త్వ యా మునే
ఈ దృశం శివబోధస్య సాధనం నాస్తి కుత్రచిత్ ॥ 74 ॥

రహస్య మేతత్ సర్వజ్ఞః సర్వానుగ్రాహ కః శివః
అవాదీత్ సర్వలోకానాం సిద్ధయే పార్వతీపతిః ॥ 75 ॥

తదిదం సర్వ సిద్ధాంత సారాణా ముత్తమోత్తమం
వేద వేదాంత సర్వస్వం విద్యాచారప్రకాశకం ॥ 76 ॥

వీర మాహేశ్వర గ్రాహ్యం శివాద్వైత ప్రకాశకం
పరీక్షి తేభ్యో దాతవ్యం శిష్యేభ్యో నాన్యథా క్వచిత్
ఏతచ్ఛ్రవణ మాత్రేణ సర్వేషాం పాపసంక్షయః ॥ 77 ॥

అవతీర్ణం మయా భూమౌ శాస్త్రస్యాస్య ప్రవృత్తయే
ప్రవర్తయ శివాద్వైతం త్వమపి జ్ఞాన మీదృశం ॥ 78 ॥

ఇత్యుక్త్వా పశ్యతస్తస్య పురాస్తాదేవ రేణుకః
అంతర్దధే మహాదేవం చింతయన్నంతరాత్మనా ॥ 79 ॥

అంతర్హితే తదాతస్మిన్ మునిరాశ్చర్యసంకులః
తచ్ఛాస్త్రప్రవణో  భూత్వా సమవర్తత సంయమి ॥ 80 ॥

య ఇదం శివ సిద్ధాంతం వీర శైవ మతాత్మకం
శ్రుణోతి శుద్ధ మనసా సయాతి పరమాం గతిం ॥ 81 ॥

యధాసద్యఃస్యందమానాఃసముద్రే అస్తంగచ్ఛంతి నామరూపం విహాయతథా విద్వాన్ నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతిదివ్యం (3-2-8) అని ముండకోపనిషత్తు అవిభాగేనదృష్టత్వాత్ (4-4-4) అని బ్రహ్మ సూత్రము ఇదే అభిప్రాయమును బోధించుచున్నది (61)

శ్రీ రేణుకగణాదీశ్వరుడు పూర్వము పరమేశ్వరుడు పార్వతీ దేవికి యుపదేశించిన పరమజ్ఞానస్వరూపమగు శివానంద ప్రకాశకమగు, పిండాదిజ్ఞానశూన్యాంతమగు స్థలములతో గూడుకొనిన శివా-ద్వైత (లింగాంగసామరస్యము) సిద్ధాంతమును ఈ విధముగా బోధించి, స్వస్వరూప ధ్యానాసక్తుడై మౌనముద్రను దాల్చెను (వహించెను) (64)

ఈ విధముగా బోధించి, మౌనముద్రతో (భావము)గూర్చుండిన శివయోగి పరాయణుడైన శ్రీ రేణుకగణాధీశ్వరుని అగస్త్యమహర్షి జూచి చేతులు జోడించి (ముకుళిత హస్తుడై) ఇట్లు పలికెను(65)శివయోగరహస్యమును బాగుగా గుర్తించిన వాడు, శివజ్ఞానసముద్రుడు, సమస్తవేద శాస్త్రాది వ్యవహారవిచక్షణుడు, కృపాకటాక్షణవీక్షణ మాత్రముతో సర్వసంసార బంధమును నశింపఁజేయువాడు, స్వేచ్ఛాలీలోల్లాస సంపన్నుడు, స్వప్రకాశస్వరూపము గలవాడును, శివస్వరూపుడైన ఓయీ! శ్రీ రేణుక గణనాథా! నీ ముఖ పద్మమునుండి ఆవిర్భవించిన పరమ పవిత్రమగు ఈ శివాద్వైతమైన వీరశైవమహాశాస్త్రమును శ్రవణమొనర్చి శివప్రకాశమును దిలకించుచున్న నామనస్సు సంతసించినది. నాజన్మమునేటికి సార్థకమైనది. నా చిత్త భ్రాంతినేడు దొలగిపోయినది. నన్నాక్రమించిన సంసారపాశ చ్ఛేదమునేడు తొలిగినది. నా యొక్కపలు విధములైన తపస్సులు నేడు ఫలించినవి నాకత్యుత్తమమైన ముని రాజత్వము ఇప్పుడు సిద్ధించినది. ఇఁకమున్ముందునాకు సాటియైనవాడు ముల్లోకములందును లేడు, నీముఖకమలమునుండి వెలువడిన శివాద్వైతపరమగు శ్రేష్ఠమగు శాస్త్రమును వినుటకు ముల్లోకము లందు ఎవడునులేడు. నీ ముఖకమలము నుండి వెలువడిన శివాద్వైత పరమగు శ్రేష్ఠ శాస్త్రమును వినుటకు ముల్లోకములో నా కంటెను మంగళకరమగు తపస్సుయొక్క పరిపాకము వలన, శివప్రసాద ప్రభావము నుండియు నన్ను వేదాంత వాక్యోపదేశము వలన కృతార్థుని జేయుటకయియే ఇటకు (నాకడకు) విచ్చేసియున్నారు. (66-70)

ఈ ప్రకారముగ అసాధారణమైన భక్తి భావముచేత ప్రదక్షిణ మొనర్చిన మునివర్యుడనే అగస్త్య మహాఋషిని, శ్రీ రేణుక గణాధీశ్వరుడు దన కృపాదృష్టిచేత జూచి ఈ విధముగనుడివెను.(71)

మునిశ్రేష్ఠుడు, తపస్సిద్ధమనోరథుడవైన ఓయీ! అగస్త్య మహర్షి! శివాద్వైత శాస్త్రమును వినుటకైనీవు దప్పమరి ఇంకెవడు అర్హుడు (72) శివానుగ్రహమునకు నీవొక్కడివే తగిన వాడివి(పాత్రుడిని) వేరొక్కడు పాత్రుడుగాడని నిశ్చయించే, నేను నీకు ఈ శాస్త్రమును ఉపదేశించితిని (73) అందుచేత ఓయీ! అగస్త్య మునీశ్వరా!నీవు ఈ వీరశైవ శాస్త్రమును సమస్త ఈ ప్రపంచమున ప్రకాశపరచుము (వ్యాపింపజేయుము). శివజ్ఞానమునకు ఇటువంటిసాధననము మరెక్కడ గూడలేదు. (74) సర్వజ్ఞుడు సర్వానుగ్రహకారకుడు పార్వతీదేవి పతియైన శివుడు ఈ వీరశైవ శాస్త్రరహస్యమును సమస్త జనులమోక్షసిద్ధికై యుపదేశించి యున్నాడు (75) సమస్తసిద్ధాంతములలో ఉత్తమోత్తమమైనది. వేద వేదాంతముల సర్వస్వరూపమైనది. జ్ఞాన-క్రియ సముచ్చయమును ప్రకాశింపజేయునది. వీరమాహేశ్వరగ్రాహ్యమైనదియు, శివాద్వైతప్రకాశకమైనదియు ఈ వీరశైవషట్ స్థలశాస్త్రమును శుద్ధమగు వంశము సద్గుణాదుల పరీక్షింపఁబడిన శిష్యులకు అనుగ్రహించవలయునేగాని అనర్హులకు అనుగ్రహించవలదు. ఈ శాస్త్రరహస్యమును వినినంత మాత్రమున సమస్త జనుల పాపములు నశించి పోవును (76-77) ఈ షట్స్థల ప్రకాశము(ప్రచారము) నకై నేను ఈ భూలోకమున అవతరించితిని,నీవుగూడ ఈ శివాద్వైత సిద్ధాంతమును సర్వత్ర ప్రకాశింప జేయుము. (78) శ్రీరేణుకాధీశ్వరుడు ఇట్లుపదేశించి అంతరాత్మచేత పరమేశ్వరు ధ్యానించుచు అగస్త్య మహర్షి నిరీక్షించుచుండగానే ఆమహర్షియెదుటే అంతర్ధానుడయ్యెను (79) శ్రీ రేణుకగణేశ్వరుడు అంతర్ధానుడవగానే అగస్త్య మహర్షి ఆశ్చర్యాన్వితుడై ఆగణాధీశ్వరునుండి ఉపదిష్టమైన శివాద్వైత శాస్త్రమునందు దృఢమైన ఆసక్తి గలవాడయ్యెను.(80) వీరశైవ మతస్వరూపమగుఈ శివాద్వైత సిద్ధాంతమును శుద్ధమైన మనస్సుచేత వినునతడు మోక్షమును తప్పకుండ బొందును.

*ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ లింగస్థలీ యైక్యస్థలౌ*
*స్వీకృత ప్రసాద స్థలాది నవవిధ స్థల ప్రసంగోనామ*
*వింశతి తమ పరిచ్ఛేదః పరిసమాప్తః*

ఇది సిద్ధాంత శిఖామణి లింగస్థలీయ ఐక్యస్థల
స్వీకృతప్రసాదస్థలాది నవవిధ స్థలవిచారాత్మకమైన
ఇరువదియవ పరిచ్ఛేదము పరిసమాప్తము.

# శ్రీసిద్ధాంత శిఖామణి

## ఏకవింశతితమ పరిచ్ఛేదః

## ఇరవై ఒకటవ పరిచ్ఛేదం

### విభీషణాభీష్ట వరప్రదానం

స్వచ్ఛందాచార రసికః స్వేచ్ఛానిర్మితవిగ్రహః
అపసాద పురీం లంకాం రేణుకో గణనాయకః ॥ 1 ॥

తమాగతం మహాభాగం సర్వాగమ విశారదం
విభీషణః సమాలోక్య సౌధం ప్రావేశయన్నిజం ॥ 2 ॥

భద్రాసనే మహారమ్యే నివేశ్య గణనాయకం
అర్ఘ్యపాద్యాదిభిః సర్వైరుపచారైరపూజయత్ ॥ 3 ॥

పూజితేన ప్రసన్నేన రేణుకేన నిరూపితః
నిషసాద తదభ్యాసే స నిజాననమాశ్రితః ॥ 4 ॥

విభీషణో గణేంద్రం తమాబభాషే కృతాంజలిః
మానుషాకారసంపన్నం సాక్షాచ్ఛివమివాపరం ॥ 5 ॥

రేణుక త్వం గణాధీశ శివజ్ఞానపరాయణ
అవతీర్ణో మహీమేనామితి సమ్యక్ శ్రుతం మయా ॥ 6 ॥

మద్భాగ్య గౌరవాదద్య సమాయాస్త్వం పురీమిమాం
కథం బాగ్య విహీనానాం సులభాః స్యుర్భవాదృశాః ॥ 7 ॥

మత్సమో నాస్తిలోకేషు భాగ్యాతిశయవత్తయా
యస్య సౌధం స్వయం ప్రాప్తో భవాన్ సాక్షాన్మ హేశ్వరః ॥ 8 ॥

కృతార్థామే పురీ హ్యేషా కృతార్థో రాక్షసాన్వయః
జీవితం చ కృతార్థం మే యస్య త్వం దృష్టి గోచరః ॥ 9 ॥

ఇతి బ్రువానం కల్యాణం రాక్షసేంద్రం గణేశ్వరః
బభాషే సస్మితో వాణీం విశ్వోల్లాసకరీం శుభాం ॥ 10 ॥

విభీషణమమాభాగ జానే త్వాం ధర్మకోవిదం
త్వాం వినాకస్య లోకేషు జాయతే భక్తి రీ దృశీ ॥ 11 ॥

సమస్త శాస్త్ర పారజ్ఞం సర్వ ధర్మపరాయణం
అధ్యాత్మ విద్యానిరతమాహుస్త్వాం రాక్షసేశ్వర ॥ 12 ॥

త్వదీయధర్మసంపత్తిం శ్రుత్వాహం విస్మితాశయః
వ్రజన్ కైలాసమచలం త్వదంతిక ముపాగతః ॥ 13 ॥

ప్రీతో<sup></sup>ऽస్మితవ చారిత్రైః శోభ నైర్లోకవిశ్రుతైః
దాస్యామి తే వరం సాక్షాత్ ప్రార్థయస్వ యథేప్సితం ॥ 14 ॥

ఇతి ప్రసాదముఖే భాషమాణే గణేశ్వరే
ప్రణమ్య పరయా ప్రీత్యా వ్యాజహార విభీషణః ॥ 15 ॥

ఆగమాను గ్రహాదేవ భవతః శివయోగినః
దుర్లభాః సర్వలోకానాం సమపద్యంత సంపదః ॥ 16 ॥

తథాపి ప్రార్థనీయం మే కించిదస్తి గణేశ్వర
సుకృతే పరిపక్వే హి స్వయం సిద్ధ్యతి వాంఛితం ॥ 17 ॥

రావణో హి మమ భ్రాతా శివభక్త శిఖామణిః
అదృష్టశత్రుసంబాధం శశాస హి జగత్త్రయం ॥ 18 ॥

యస్య ప్రతాపమతులం సోఢుమక్షమశక్తయః
ఇంద్రాదయఃసురాః సర్వే రాజ్యలక్ష్మ్యా వియోజితాః ॥ 19 ॥

స తు కాలవశేనైవ స్వచారిత్ర విపర్యయాత్
రణే విష్ణ్వవతారేణ రామేణ నిహతో భవత్ ॥ 20 ॥

న తు రామశరావిద్ధః కంఠస్ఖలిత జీవితః
అవశిష్టం సమాలోక్య మామవాదీత్ సుదుఃఖితః ॥ 21 ॥

విభీషణ విశేషజ్ఞ మహాబుద్ధే సు ధార్మిక
అవశిష్టోऽసి వంశస్య రక్షసాం భాగ్య గౌరవాత్ ॥ 22 ॥

వయమజ్ఞానసంపన్నా మహత్సు ద్రోహకారిణః
ఈదృశీం తు గతిం ప్రాప్తా దుస్తారా హి విధిస్థితిః ॥ 23 ॥

నవకం లింగకోటీనాం ప్రతిష్ఠాప్యమిహస్థలే
ఇతి సంకల్పితం పూర్వం మయా తవవశిష్యతే ॥ 24 ॥

కోటిషట్కం తు లింగానాం మయా సాధు ప్రతిష్ఠితం
కోటిత్రయం తు లింగానాం స్థాపనీయమతస్త్వయా ॥ 25 ॥

ఇతి తస్య వచః శ్రుత్వా దీన బుద్ధే ర్మ రిష్యతః
తథా సాధు కరోమీతి ప్రతిజ్ఞాతం మయా తదా ॥ 26 ॥

యుగ వచ్ఛివలింగానాం కోటిత్రయమనుత్తమం
ప్రతిష్ఠాప్యం యథాశాస్త్రమితి మే నిశ్చయోఽ భవత్ ॥ 27 ॥

లింగకోటి త్రయస్యేహ యుగపత్ స్థాపనావిధౌ
అవిదన్నేక మాచార్యమహామేవమవస్థితః ॥ 28 ॥

శివశాస్త్ర విశేషజ్ఞ శివజ్ఞాన నిధిర్భవాన్
ఆచార్యభావమాసాద్యమమ పూరయ వాంఛితం ॥ 29 ॥

తస్యేతి వచనం శ్రుత్వా రాక్షసేంద్రస్య ధీమతః
తథేతి ప్రతిశుశ్రావ సర్వజ్ఞో గణనాయకః ॥ 30 ॥

తత్ర సంతుష్ట చిత్తస్య పౌలస్త్య స్యేష్ట సిద్ధయే
కోటిత్రయం తు లింగానాం యథా శాస్త్రం యథావిధి
త్రికోట్యాచార్య రూపేణ స్థాపితం తేన తత్ క్షణే ॥ 31 ॥

తాదృశం తస్యమాహాత్మ్యం సమాలోక్య విభీషణః
ప్రణనామ ముహుర్భక్త్యా పాదయోస్తస్య విస్మితః ॥ 32 ॥

ప్రణతం వినయోపేతం ప్రహృష్టం రాక్షసేశ్వరం
అనుగృహ్య స్వమాహాత్మ్యా ద్రేణుకోఽంతర్హితోఽ భవత్ ॥ 33 ॥

విభీషణోఽపి హృష్టాత్మా రేణుకస్య ప్రసాదతః
శివభక్తి రసాసక్తః స్థిరం రాజ్యమపాలయత్ ॥ 34 ॥

రేణుకోఽపి మహాతేజాః సంచరన్ క్షితిమండలే
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ పరమాద్వైతభావతః ॥ 35 ॥

కాంశ్చిద్దృష్టినిపాతేన కరుణారసవర్షిణా
అపరానుపదేశేన శివాద్వైతాభిమర్శినా ॥ 36 ॥

అన్యాంశ్చ సహవాసేన సమస్త మలహారిణా
కృతార్థయన్ జనాన్ సర్వాన్ కృతినః పక్వకర్మిణః ॥ 37 ॥

దర్శయిత్వా నిజాధిక్యం శివదర్శనలాలసః
ఖండాయిత్వాదురాచారాన్ పాషండాన్ భిన్నదర్శనాన్ ॥ 38 ॥

యంత్ర మంత్ర కలావిద్వాన్ విమతాన్ సిద్ధ మండలాన్
విజిత్య స్వప్రభావేణ స్థాపయిత్వా శివాగమాన్
అజగామ నిజావాసం కుల్యపాకాభిదస్థలం ॥ 39 ॥

తత్ర సంభావితః సర్వైర్జనైః శివపరాయణైః
సోమనాథాభిధానస్య శివస్య ప్రాప మందిరం ॥ 40 ॥

పశ్యతాం తత్ర సర్వేషాం భక్తానాం శివయోగినాం
తన్వానో విస్మయం భావైస్తుష్టావ పరమేశ్వరం ॥ 41 ॥

దేవ దేవ జగన్నాథ జగత్కారణకారణ
బ్రహ్మవిష్ణుసురాధీశ వంద్యమానపదాంబుజ ॥ 42 ॥

సమస్త వేద వేదాంత పరిబోధిత వైభవ
సంసార వైద్య సర్వజ్ఞ సర్వశక్తి నిరంకుశ ॥ 43 ॥

సచ్చిదానంద సర్వస్వ పరమాకాశ విగ్రహ
సమస్త జగదాధార జ్యోతిర్లింగ విజృంభణ ॥ 44 ॥

గుణత్రయపదాతీత మతత్రయ వినాశన
జగత్రయ విలాసాత్మన్ శ్రుతిత్రయవిలోచన ॥ 45 ॥

పాహిమాం పరమేశాన పాహిమాం పార్వతీపతే
త్వథాజ్ఞయా మయైతావత్కాల మాత్రం మహీతలే
ఆచారి భవ దుక్తానా మాగమానాం ప్రసిద్ధయే ॥ 46 ॥

ఇతః పరం స్వరూపం తే ప్రాప్తుకామోకస్మి శంకర
అంతరం దేహి మే కించిదనుకంపావిశేషతః ॥ 47 ॥

ఇత్యుక్తే గణనాయకేన సహసా లింగాత్తతః శంకరో
వత్సాగచ్ఛమహానుబావ భవతోభక్త్యాప్రసన్నో స్మ్యహం
ఇత్యుచ్ఛైరగదద్వచస్త సుభృతామాశ్చర్య మాసీత్తదా
దివ్యో దుందుభిరాననాద గగనేపుష్పం వవర్షుర్గణాః ॥ 48 ॥ .

శ్రుత్వా లింగాద్వచనముదితం శాంకరం సానుకంపం
సంహృష్టాత్మా గణపతిరథో జ్యోతిషా దీప్యమానః
జాతోత్కం ఠైః శివమనుపరైర్యోగిభిః స్తూయమానో
జ్యోతిర్లింగం పరమమవిశత్ స్వప్రకాశం తదానీం ॥ 49 ॥

లీనే తస్మిన్ శాంకరేస్వప్రకాశే
దిన్యాకారేరేణుకే సిద్ధనాథే
సర్వో లోకో విస్మితోన భూత్తదానీం
శైవీ భక్తిఃస ప్రమాణా బభూవ ॥ 50 ॥

శ్రీ వేదాగమవీర శైవ సరణిం శ్రీ షట్థ్సలోద్యన్మణిం
శ్రీ జీవేశ్వర యోగ పద్మతరణిం శ్రీ గోప్య చింతామణిం
శ్రీ సిద్ధాంత శిఖామణిం లిఖాతియస్తం లేఖ యత్యాదరాత్
శ్రోతా శ్రావయితా స యాతి విమలాం భుక్తిం చ ముక్తిం పరాం ॥ 51 ॥

స్వతంత్రాచార శీలుడు స్వేచ్ఛానిర్మిత దివ్య తేజోమయశరీరము గలవాడు, ప్రమథ పుంగవుడైన శ్రీ రేణుకాచార్యుడు విభీషణుని రాజధానియైన లంకానగరమునకు విచ్చేసెను (1) విభీషణుడు తన సోదరుడైన రావణుని నగరమునకు వేంచేసిన సమస్త శివాగమతత్వజ్ఞుడైన అపుణ్య భగవత్పాదమూర్తిని జూచితన రాజభవనమునకు సముచిత భక్తి ప్రపత్తులతో దోడ్కొళ్లెను (2) విభీషణుడు ఆ ప్రమథ పుంగవుని అత్యంతమనోహరమైన సింహాసనమున గూర్చుండబెట్టి అర్ఘ్య-పాద్య-ఆచమానము. మొదలగు పోడశోపచారములతో బూజించెను (3) ఇట్లు పూజింప బడిన వాడగుట వలన ప్రసన్నుడైన శ్రీ రేణుకాచార్యుని చేత అజ్ఞాపించబడిన విభీషణుడు తన ఆసనముపైన గూర్చున్న వాడై శ్రీ రేణుకాచార్యుని సమీపించిన వాడయ్యెను (4) ప్రత్యక్షముగా ద్వితీయ శివునివలెనున్నవాడు, మానవాకారముతో నున్నవాడు ప్రమథగణాధీశ్వరుడుఐన శ్రీ రేణుకాచార్యుని గురించి విభీషణుడు చేతులు జోడించి ఈ విధముగ నుడివెను (5).

శివజ్ఞాన పరాయణుడు, ప్రమథా ధీశ్వరుండునైన ఓయీ రేణుకాచార్యా! నీవు ఈ భూమండలమునందు సమస్త ప్రాణుల ఉద్ధారమునకై శివుని ఆజ్ఞానుసారముగ అవతరించి యున్నావు అనినే విన్నాను (వింటిని). నీవు ఈ దినమున నా భాగ్యాతిశయమున నా యొక్క లంకాపురమునకు వేంచేసినాడవు. భాగ్యహీనులకు నీలాంటి మహానుభావులు ఎట్లు సులభ సాధ్యులు కాగలరు! (7) ప్రత్యక్షముగా శివస్వరూపుడైన నీవు నారాజభవనమునకు నీవే ఆగమించియున్నావు. అట్టినాకు అదృష్టము కొలది సాటియైన వాడీముల్లోకములోనెవడును లేడు(8) నాకు నీవు ఎట్లు దృష్టిగోచరుండవైతినో నా ఈ లంకాపురి పునీతమైనది. నాయొక్క రాక్షస వంశము కృతార్థమైనది నాజన్మ సార్థకమైనది (9) ఈ విధముగ శుభకర వాక్యములనుచ్చరించుచున్న విభీషణుని గురించి శ్రీ రేణుకా చార్యులవారు చిరునవ్వుతో సంతోషమును గలుగజేయు మంగలమయవాణితో ఇట్లాదేశించెను(10)

ఓయీ! విభీషణా! నేను నిన్ను ధర్మపరాయణుడిగా దెలియుచున్నాను. ఇంతటి భక్తి నీకు దప్ప ఈ లోకముననున్న ఎవడికి తానే సాధ్యపడును (11) ఓయీ! రాక్షస చక్రవర్తి యీ లోకముననున్న సమస్త మానవులు నిన్ను సమస్త శాస్త్రముల రహస్యము నెఱింగిన వాడిగ సమస్త ధర్మాచారపరాయణుడిగా వేదాంతవిద్యాసక్తుడవనియు చెప్పుచున్నారు (12) కైలాస పర్వతమునకు వెళ్ళిన నేను నీ యొక్క ధర్మసంపత్తినివిని ఆశ్చర్యచకితుడనైనీ వద్దకు వచ్చినాడను(13) జగత్ప్రసిద్ధి గాంచిన నీ యొక్క మంగలమయ చరిత్రల వలన సంతసించి యున్నాడను. నీకు బ్రసన్నుండనై వరమును ప్రసాదించెదను. నీకిష్టమైనది వేడుకొనుము (14) ఈ రీతిగా ప్రసన్నముఖముగల శ్రీ రేణుకా చార్యులునుడువగ-అది విని విభీషణుడు అసాధారణమైన భక్తిచేత సాష్టాంగప్రణామంబుగావించి ఈ విధముగా విజ్ఞాపించుకొనియెను ఓయీ! రేణుకాచార్యా! శివయోగివైన నీయాగమనరూపమైన అనుగ్రహముతోనె సమస్త జనులకు దుర్లభమైనట్టి సంపదలు లభించనవి(15)ఐనను నాకు కొద్దిగ మీతో మనవి జేసికొనవలెనని యున్నది. పుణ్యము పరిపక్వమవడముతోనే మనోరథము తనకు తానై వచ్చి వర్తిన్నుంది (17) శివభక్త శిఖామణి యైననాయొక్కజేష్ఠసోదరుడైన రావణబ్రహ్మ మూఁడులోకములను భుజబలముచేత శత్రుజన బాధ శైన్యముగాను, నిష్కంటకముగాను రాజ్యమును పరిపాలించేను, (18) ఎవని అసమానమైన పరాక్రమమును సహించే కొరకు అసమర్థులైన ఇంద్రాది సమస్త దేవతలు తమతమ రాజ్యలక్ష్మిని కోల్పోయిరి. అట్టి గొప్పపరాక్రమశాలియైన రావణుడు కాలవశమునకులోనైతన దుష్టచరిత్రవలన విష్ణువుయొక్క అవతారస్వరూపుడైన రామచంద్రుని చేత రణరంగమునందు చంపఁబడెను. (19-20) రాముని బాణముచేత కొట్టబడిన వాడై కంఠగత ప్రాణముండిన రావణుడు, రాక్షస సమూహమున

చంపబడని వాడై ప్రాణములతో బ్రతికియున్న నన్ను చేరదీసికొని చూస్తు అత్యంత దుఃఖమునకులోనై నాతో నిట్లానతిచ్చెను(21) మహాబుద్ధిశాలివి, ధర్మాచార శీలుడివి, విచక్షణుడివైన ఓ విభీషణా, రాక్షస వంశము యొక్క భాగ్యాతిశయమువలన నీవొక్కడివి మాత్రమే మిగిలియున్నాడవు(22)

అజ్ఞానముతో గూడుకొనిన మనమందరము గొప్పవారి విషయమున ద్రోహమును దలపెట్టిన వారమై ఇంతటి దురవస్థకు పాలుపడితిమి. దైవగతి దాటశక్యముగానిది (23)ఈ లంకాపట్టణమునందు తొమ్మిది కోట్ల శివలింగములను ప్రతిష్ఠింపజేయవలయునని పూర్వమున నేను సంకల్పించి యున్నాను, అయితే అట్టి సంకల్పము అట్లే మిగిలియుండినది (24) ఆరుకోట్ల లింగములను మాత్రమే శాస్త్ర విధిననుసరించి స్థాపించి (ప్రతిష్ఠింపజేసి) యున్నాను. ఇంకనుమిగిలిన మూఁడుకోట్ల లింగములను మాత్రమే నీవు ప్రతిష్ఠింపజేయవలెను (25) సద్యఃమరణోన్ముఖుడు దీన బుద్ధి గలవాడునైన రావణుని ఈ విధమగు వాక్యములను విని అట్లే కానిమ్ము మూఁడుకోట్ల శివలింగములను శాస్త్ర విధిననుసరించి ప్రతిష్ఠింపజేతును అని నేను అప్పుడు ప్రతిజ్ఞ జేసియున్నాడను (26) అత్యంత శ్రేష్టమైన మూడు కోట్ల శివలింగములను ఒకే సమయమందు విధి అను సారముగ స్థాపించవలయునని నిర్ణయించుకొంటిని(27) ఈ భూమండలమున ఒకేసమయంలో మూడు కోట్ల శివలింగములను ప్రతిష్ఠింపఁజేయుటలో సమర్థులైన ఆచార్యుల వారిని గనుగొనలేక నేనింతవరకు నిరాశకులోనైతిని ॥28॥ శివశాస్త్రజ్ఞుడు, శివజ్ఞాన సముద్రుడవైన ఓయీశ్రీ రేణుకాచార్య!నీవు మూడు కోట్ల గురు రూపమును దాల్చి, నా కోరికను పూర్తి జేయుము (29) సర్వజ్ఞుడు ప్రమథాధిపతియైన శ్రీ రేణుకాచార్యులవారు, రాక్షసేశ్వరుడైన విభీషణుని మాటలను విని అట్లే కానిమ్మని ఆజ్ఞాపించెను (30) సంతుష్టమనస్కుడైన విభీషణుని కోరిక మేరకు శ్రీ రేణుకాచార్యులవారు మూడుకోట్ల గురురూపమును దాల్చి ఆలంకాపట్టణములోనే ప్రతిష్ఠింపజేసెను (31) విభీషణుడు ఇట్లు నెరవేర్చిన శ్రీ రేణుకా చార్యుల వారి మహిమాతిశయమును దిలకించి ఆశ్చర్య భరితుడై గురుసార్వభౌముని పాదార విందములకు అసాధారణమైన భక్తితో మాటి మాటికి నమస్కరించెను(32) శ్రీ రేణుకాచార్యులవారు నమనశీలుడు, వినయాన్వితుడు, సంతుష్టుడైన రాక్షస సార్వభౌముడైన విభీషణుని అనుగ్రహించి తన మహిమచేత అంతర్ధానుడయ్యెను (33) శ్రీ రేణుకాచార్యుని అనుగ్రహమువలన సంతుష్టాత్ముడు, శివభక్తి రూపరస స్వీకారనిరతుడు ఐన విభీషణుడు తన సామ్రాజ్యముసుచిరకాలము పరిపాలించెను (34).

ఇక్కడ మహాతేజో స్వరూపుడైన శ్రీ రేణుకా చార్యులు భూమండలమునందు అనేక సంవత్సరములవరకు గుప్తముగాను మరియు ననేక సంవత్సరములవరకు ప్రకటితాకారము తోను శివాద్వైత భావముతో సంచరించిన వాడై కొందరిని శివాద్వైతప్రకాశమైన ఉపదేశము తోడను సమస్తకలాకుశలురు పరిపాక కర్మలును ఐన మిగిలిన సమస్తజనులను ఆణవాదిమలనాశకమగు సహవాసముతోడను కృతకృత్యుడిని గావించెను (25-26-27) శివశాస్త్రాసక్తుడైన శ్రీజగద్గురు శ్రీ రేణుకాచార్యులవారు అనేక రకములైన లీలావైభవములతో తన యొక్క మాహాత్మ్యమును సర్వత్ర ప్రకటింపఁజేసి దుష్టులు-దురాచారులు-నాస్తికవాదులు-దర్శనాసక్తులు ఐన పాఖండులను ఖండించి, యంత్రకళాప్రవీణులు -మంత్ర కళాసిద్ధులు, దుర్మత ప్రవిష్టులు ఐన కుటిల-కుతంత్ర సిద్ధులైన వారిని, తన మహిమచేత జయించిశివ సిద్ధాంతమును వ్యాపింపజేసి(స్థాపించి) తన యొక్క నివాసభూమియైన కుల్యాపాక్తనామక శివక్షేత్రమునకు విచ్చేసెను (38-39) శ్రీరేణుకా చార్యుడు అక్షేత్రముననున్న శివభక్తి పరాయణులైన సమస్త జనులచేత సత్కరించబడినవాడై సోమనాథాభిదానముగల శివమందిరముకువేంచేసెను (40) శ్రీసోమనాథదేవాలయమునందు సమస్త భక్తులు-శివయోగులు చూచుచుండగానె శ్రీ రేణుకాచార్యులవారు లీలావైభవముతోఆశ్చర్యము గలుగురీతిగా పరమేశ్వరుని గురించి ఇటస్తుతిఁచును (41)దేవదేవుడు జగదీశ్వరుడు, జగత్కారణ కారుడు, బ్రహ్మ-విష్ణు-ఇంద్రాదిసమస్త దేవతా సమూహము చేత నమస్కరించబడుచున్న పాదపద్మములు గలవాడును, సమస్త వేదవేదాంతాది శాస్త్రముల చేత వర్ణించబడుచున్న లీలా వైభవము గలవాడును, జనన-మరణ రూపమైన సంసారమను రోగమునకు వైద్యుడి వలెనున్నట్టి సర్వజ్ఞుడు సమస్త శక్తుల చేత ఆప (విఘ్నము) లేనట్టి సత్-చిత్ ఆనందముల-కునిధిస్వరూపుడైన సమస్త ప్రపంచములకు ఆధార భూతుడు జ్యోతిర్లింగ స్వరూపమైయున్నట్టి, ఋగ్యజుస్సామములను మూడువేదములేనేత్రములుగా గలవాడును, పార్వతీ పతియైన ఓయీ!పరమేశ్వరా! నన్నుగాపాడుము - మీ యాజ్ఞానుసారముగానే నింతవరకు భూమండలమునందు నీచేత జెప్పబడిన ఆగమముల (శివాగమముల) ప్రచారముకొరకు బర్యటించితిని. ఓయీ!శంకరా! ఇక మీదటనీ స్వరూపమును బొందుటకు అభిలషించువాడనైయున్నాను. నీకృపావిశేషముతో కొద్ది స్థానమును అనుగ్రహించుము.(42-43-44-45-46-47)ఈ రీతిగా ప్రమథ పుంగవుడైన శ్రీరేణుకా చార్యులవారు ప్రార్థించగా ఆక్షణములోనె శ్రీశంకరుడు ఆ సోమనాథలింగమునుండి మహానుభావుడివైన ఓయీముద్దుబిడ్డా!నీభక్తి చేతనేను బ్రసన్నుండనైతిని, రారమ్ము" అనునీ వాక్యము ఉన్నతమైన స్వర్గముతోనిట్లు బలికెను. అప్పుడున్నట్టి జనులు జూచి ఆశ్చర్య

పరవశులైరి. దేవదుందుభులు మ్రోగినవి. ఆకాశమందున్న దేవగణులు ప్రమథగణములు పుష్పవర్షమును గురిపించిరి (48) సోమనాథ లింగముఖమునుండి కృపాపూర్వకమైన శివసంబంధమైన వాక్యమును విని సంతుష్టాత్ముడైనట్టి తేజోమయ శరీర కాంతి ప్రకాశించుచున్న ప్రమథపుంగవుడు, శివవాక్యశ్రవణముతోడ ఉత్పన్నమైన ఉత్కటేచ్ఛగలవారు శివమంత్ర జపనిరతులు ఐన శివయోగుల చేత స్తోత్రము జేయబడిన శ్రీ రేణుకా చార్య గణేశ్వరుడు ఆసమయమందే సర్వోత్కృష్టము, స్వప్రకాశస్వరూపమైన జ్యోతిర్లింగమునందు బ్రవేశించెను. (49) తేజోయమశరీర ధారియు, సిద్ధకుల చక్రవర్తి యైన శ్రీ రేణుక గణనాథుడు స్వప్రకాశ స్వరూపమగు సోమనాథ లింగమునందు ఐక్యము జెందగానె అది జూచిన సమస్త జనులు ఆశ్చర్య చకితులైరి. అప్పుడు శివభక్తి ప్రమాణము ప్రసిద్ధమయ్యెను (50)

శ్రీమన్నిగమాగమ ప్రసిద్ధమైన వీరశైవతత్త్వము యొక్క పద్ధతియుక్తమైనది, షట్ స్థలములనెడు విలువైన రత్నములు గలది, లింగాంగ సామరస్య రూపమైన కమలమునకు సూర్యునితో సమానమైనది, శివ రహస్యమునకు చింతారత్నము వంటిది, శ్రీ సిద్ధాంత శిఖామణిని యెవడు భక్తి-అభిమానము- గౌరవములతో వ్రాయునో, చదువునో, మరియు అన్యులకు శ్రవణము గావించునో ఆతడు, నిర్మలమగు సుఖమగు భోగమును శ్రేష్ఠమగు మోక్షమును బొందును(51)

*ఇతి శ్రీ సిద్ధాంత శిఖామణౌ విభీషణాభీష్ట వర ప్రదాన*
*ప్రసంగోనామ ఏకవింశతి తమ పరిచ్ఛేదః పరిసమాప్తః*

**శ్రీ సిద్ధాంత శిఖామణిః సమాప్తః**

ఇది శ్రీ సిద్ధాంత శిఖామణిలో విభీషణా భీష్ట
వర ప్రదాన విచారాత్మకమగు ఇరువది
యొకటవ పరిచ్ఛేదము పరిసమాప్తము

**శ్రీ సిద్ధాంత శిఖామణీ పరిసమాప్తము**

**శివంభూయాత్**


కన్నడమునకు తెలుగువ్యాఖ్యాన కర్త
పం॥ పెద్దమఠం రాచవీరదేవర "తీర్థ" M.O.L
3-3-139, కాచిగూడ,
హైదరాబాదు-500027(A.P)